# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

## శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

స చి త్ర ము

పదమూడవ భాగము



సంపాదకుడు

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధ న కు ధ రం వ ర దా చా ర్యు లు



ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

పదమూడవ భాగము

మొదటి ముద్రణము

వేయి ప్రతులు

శ్రీముఖ - జ్యేష్ఠము

మే 1993

రామానుజ శకము ౯౭౭

మూల్యము :-

నలుబదియైదు రూపాయలు

ముద్రణము :-
శ్రీనివాస ప్రింటింగ్ ప్రెస్
కొత్తపేట, గుంటూరు - 1.

[This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams under this Scheme Aid to publish religious books]

# సమాలోచనసమితి

♦ ♦ ♦

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M. A
విశాఖపట్టణము

*

న్యాయవిద్యాప్రవీణ
డాక్టర్ : యస్. బి. రఘునాథాచార్యులు, M.A , Ph.D
సంస్కృత శాఖాధ్యక్షులు - శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
తిరుపతి

*

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు, M A , B.Ed.
లెక్చరర్ , ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జునసాగర్ - విజయపురి సౌత్

*

డాక్టర్ : శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A., Ph.D.
ప్రిన్సిపాల్ శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్యకళాశాల
పాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు
సాహిత్య వికాస మండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

డాక్టరు . చింతాపట్టణం శ్రీరంగాచార్యులు, M A., Ph.D.
ఆంధ్రోపన్యాసకులు . ప్రభుత్వ ఆర్ట్సు & సైన్సు కళాశాల
ఆర్మూరు

మహోపాధ్యాయ - ఉభయ వేదాంత శిరోమణి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, M A., B.O L.
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్థినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవితార్కిక కేసరి - ఉభయ వేదాంత విద్వాన్
శ్రీమాన్ సల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, B.O.L.
వరంగల్

*

విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయ వేదాంత శిరోమణి
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M.A.
రిటైర్డు ప్రిన్సిపాల్ · వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సాహిత్యవిద్యాప్రవీణ
డాక్టర్ . తట్టా విజయ రాఘవాచార్యులు. M.A , Ph.D.
ఉపన్యాసకులు : విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి

*

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ . సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు.
M A , Ph.D.
సంస్కృతోపన్యాసకులు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము
కొవ్వూరు



# ప్రముఖులు - ప్రశంసలు

**తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు** — **రాజమండ్రి**

చిరంజీవి రామచంద్రాచార్యులు - 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' 12 వ భాగమును తెప్పించినాడు. చాల బాగుగా నున్నది. త్వరలో తక్కిన 4 భాగములను శ్రీమన్నారాయణుడు పూర్తి చేయించి, లోకమునకు మీ శ్రీహస్తముల ద్వారా అందజేయవలెనని ప్రార్థించుచున్నాను

**కె. టి. యల్. నరసింహాచార్యులు** — **మునునూరు**

శ్రీ రామానుజ కీర్తికౌముది పండ్రెండవ భాగ మందినది నేత్రోత్సవ మైనది. అమందానంద మందితిని గ్రంథ విన్నిపిథములుగాను - సర్వాంగ సుందరముగా నలరారుచున్నది దీనికై తా మెంతో శ్రమించి, మాదృశులకై మీ హస్తములతో పంచిపెట్టుట - శిర మాశ్చర్యకరము గ్రంథాంతమున రచయితల పరిచయము - ఉభయ తారకము. ఇంత చక్కని గ్రంథరాజమును వెలువరించిన మీకు నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

**డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు** — **ఆర్మూరు**

తమరు దయతో పంపించిన శ్రీ రామానుజ కీర్తి కౌముది పండ్రెండవ భాగమును పరికించి మహానందభరితుడ నైతిని ఇది శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము గదా! అందునను - విశేషించి శ్రీమద్రామానుజ యతి సార్వభౌములు ప్రసాదించిన నవ నిధు-వంటి నవ గ్రంథములలోని శ్రీవైష్ణవ సిద్ధాంత మహా విశేషములు, భాగవతాచార్య మహోదయు లైన పెద్దలు విశదీకరించి సాయించిన దివ్య మధురోక్తుల రూపమున దమామృత ధారలై, ఇందు ప్రవహించుచున్నవి. లోకోపకార పరాయణు లగు సంపాదక మహోదయుల పటుతర దీక్ష, నిర్విరామ కృషి ఫలితముగ, ముముక్షు జన హృదయానంద సంధాయక మగు 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - షోడశ కళా శోభితమై వెల్లివిరియగల దని సంభావించుచున్నాడను.

ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు                హైదరాబాదు

'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - ఒక బ్రహ్మాండమైన ఆస్తిక సారస్వత శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ గ్రంథమాల ఈ గ్రంథమాల సంపాదకులు శ్రీ రామానుజ ప్రభావమును గూర్చియు, శ్రీ వైష్ణవ మత వైశిష్ట్యమును గూర్చియు 16 సంపుటములు 16 సుధాకర జ్యోతుల వలె వెలిగింపవలె నని సంకల్పించి యున్నారు. జగన్నిర్మాణ శిక్షదక్షమైన ఆ సర్వాంతర్యామి - శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదక మహాశయులకు సంపూర్ణాయురారోగ్యముల నొసగి, వారు సంకల్పించిన ఈ మహా సంకల్పమును సఫలీకృత మొనరింపవలెనని మాశుభాకాంక్ష.

డాక్టరు శ్రీరంగాచార్యులు, M.A.Ph.D. శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల ప్రిన్సిపాల్                పాలెమ్

శ్రీ రామానుజ కీర్తి కౌముది ప్రతి సంపుటము - విభిన్న విషయ శోభితమై అలరారుచున్నది ఎంతో ఉపయోగకారిగా నున్నది. విశిష్టాద్వైత సిద్ధాంత - సాహిత్యములకు శ్రీ రామానుజ కీర్తి కౌముది సంపుటములు శాశ్వత విజ్ఞాన సర్వస్వము లుగా నుండగలవు

A V. DESIKACHARYA (Rajaguru)                *MYSORE*

(1)

నా తమ్ముడు శ్రీ గోపాలకృష్ణమాచార్యులు హోసపేట నుండి ఇక్కడికి వచ్చి, నావద్ద వారం రోజులుండినాడు అతడు - ధర్మ శ్రద్ధ, కర్మ శ్రద్ధ కలవాడు. ఇక్కడ నా వద్ద వున్న శ్రీ రామానుజ కీర్తి కౌముదీ పుస్తకాలను చూచి ఆకర్షితుడైనాడు. కోర్టుకు సెలవు కాబట్టి, ఈ నెలాఖరు వరకు బెంగుళూరులో గడిపి, స్వస్థానం చేరుకుంటాడు. శ్రీ రామానుజ కీర్తి కౌముది (Full Set) 12 భాగాలను ఈ క్రింది వ్రాసిన అతని అడ్రసుకు V.P గా పంపగలరు

# (2)

దేవరవారి శ్రీముఖం చేరింది నా తమ్ముడు గోపాలకృష్ణుడు Senier Lower వని ఎక్కువ. వార్ధక్యం కూడా. నేను అతనికి జాబు వ్రాసినాను. నిన్ననే వృత్తి రీత్యా బొంబాయికి వెళ్ళినాడట అక్కడ కూతురు కూడా వుంది ఈ నెలా ఖరుకు స్వస్థానం చేరుతాడు. అతనికి మరల జాబు వ్రాస్తాను

నేను ఆ ప్రాంతం వచ్చినప్పుడు తప్పక దేవరవారిని సందర్శించి, తమ ఆశ్రమంలో ఒక రోజుంటాను తమని ప్రతిష్ఠింప జేసిన తమ తండ్రిగారు - పూజ్యులు, ధన్యులు వారికి నా నమోవాకములు.

ఆ ప్రాంతంలో తమ వంటి పండితులు, ధీరుల వల్ల ఇంత కాలంగా రామానుజ సిద్ధాంతం ప్రచారంలో వుంది కొన్ని శతాబ్దాల క్రిందటి ద్రావిడ దేశం నుండి ఆంధ్ర ప్రాంతంలోనూ, రాయలసీమ ప్రాంతంలోనూ మనవారు స్థిరపడి, 'రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతాం' అన్నట్లు ప్రచారం చేసిరి వా రందరికీ మనం కృతజ్ఞులము.

ఇక్కడ శ్రీవైష్ణవులకు వాడుక భాష తమిళం (దాసుని ఇంట్లో కూడా ఆదే.) చదువు, వ్రాత మాత్రం కన్నడం. తెనుగు తెలిసినవారు తక్కువ. నేను బళ్ళారి ప్రాంతంవాడిని కాబట్టి, నాకు తెలుగు కొంత రూఢిలో వుంది. నాది - తిరుమల తాతాచార్యుల ఆశ్వయం

ఈ ప్రాంతంలో మనవారు పండితులు కొల్లగా ఉన్నారు. అంతా - కన్నడం, ఇంగ్లీషు. తెనుగు రాదు. ఈ ప్రాంతంలో నా దృష్టిలో - ఉత్తమ పండిత శేఖరులు ఇద్దరు. ఒకరు Dr. N S. అనంత రంగాచార్యులు, బెంగుళూరు వీరు - శ్రీభాష్యం కన్నడంలో వ్రాసినారు. ఇంకొకరు - Dr K S నారాయణాచార్యులు (Prof in English, Karnataka university, Dharwad) వీరు చిన్నప్పుడు వేదాధ్యయనం చేసి, సంస్కృతంలో మంచి పాండిత్యం సంపాదించినవారు. అహోబిల యతీంద్రుల వద్ద శ్రీభాష్యాది గ్రంథ కాలక్షేపం చేసినవారు. వీరు - 'వేద సంస్కృతి పరిచయ' అని 10 vols. గ్రంథాలను వ్రాసినారు. శ్రీమద్రామాయణ ప్రవచన దురీ

-లు, మంచి వక్తలు ఆంగ్లంలో - 'తత్త్వమసి' 'నేతి నేతి' - Basic Concept of Visistadwaita - Ramanuja's philosophy vindicated' - వ్రాసినారు. తత్త్వమసిలో - అద్వైత ద్వైతాలలోని విశిష్టతను చూపెట్టినారు. వీరు నా స్నేహితులు. వీరలకు తెలుగు వచ్చియుంటే, రామానుజ కీర్తి కౌముదికి వ్యాసాలను వ్రాయుమని చెప్ప వచ్చుగావుండెను

శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ గారు తెలుగువారు వారుకూడా నాకు చిరపరిచితులు. పెంటపాడు - శ్రీవైష్ణవ పత్రికా ప్రతిష్ఠాపకులు శ్రీ మత్తిరుకుల వీరరాఘవాచార్యులుగారు గుంటూరులో స్వయంగా వేదాంత ముద్రాక్షరశాలను స్థాపించి, శ్రీభాష్యాది సంప్రదాయ గ్రంథాలు ప్రచురించినారు కందాడ శేషాచార్యులుగారు. వీరువంటి మహానుభావులు ఎందరో ! అందరికీ నమస్సులు.

తాము ఈ ప్రాంతం వేంచేయండి. 'పెరియ పెరుమాళ్', తిరునారాయణపురం, శ్రీరంగ పట్టణం మున్నగు క్షేత్రాలను సేవించవచ్చు సకుటుంబంగా వేంచేయవలె నని దాసుని విజ్ఞాపనా పూర్వక ఆహ్వానము.

P. కృష్ణమాచార్యులు బృందావనము

దేవరవారు కృప చేసిన శ్రీముఖ పత్రమును శిరసావహించితిని. చాలా ప్రార్థించుచు మాచీపత్రమును ఆమూలచూడము పరిశీలించితిని. చాలా ఆనందమైనది శ్రీ రామానుజ కీర్తి కౌముదీ ప్రకాశన వ్యాజంలో - తద్భక్తుల ముఖ కమలములకు ప్రకాశమును వెలిగించుచున్న దేవరవారికి ప్రపన్న జన సముదాయము లాభాద్వితి మయి, కృతార్థతను తెలుపవలసియుంటుంది దేవరవారు - సంప్రదాయాభివృద్ధికి చేస్తూన్న ఈ కృత్యము - అసాధారణము, లోకోత్తరమున్నూ



# పత్రికలు - ప్రశంసలు

**శ్రీ సాధన పత్రిక** **అనంతపురము**

జాతి కుల లింగ వయో భేదము లేకుండ, సర్వ మానవులకు మోక్ష సాధక మైన మహా మంత్రమును - తనకు నిరయమైనా లోక క్షేమమునకు వెదజల్లి న మహామనీషి శ్రీమద్రామానుజులు

ఈ విశాల కాల ప్రవాహములో ఎందరో పుట్టి గిట్టినవారు "వా రేరి సిరి మూట గట్టుకొని పోవంజాలిరే! యుర్విపై పేరైనన్ గలదే?" కాని, లోకోప కారానికి జీవితమును వెచ్చపెట్టిన మహామహులు కీర్తికాయులై, ఆచంద్రార్కము విరాజిల్లుచుందురు.

శ్రీమద్రామానుజుల సమకాలీనులనే గాక, భావితరాల, వారికినీ భవ బంధ విచ్ఛేదనకు, దివ్య వైకుంఠ ప్రాప్తికి రాచ బాట వేసి, కుసుమ పేశలము జేసి, తమ కీర్తి చంద్రికలను కలకాలము ప్రకాశింపజేయుటకు నవ నిధుల వంటి నవ గ్రంథములను లోకానికి ప్రకాశింపజేసిన పుణ్య పురుషులు.

అది ఒక మెత్తు, ఆ గ్రంథములలోని సారమును సువర్ణ మయ షోడశ సంపుటములలో నింపి, నేటి పారమార్థికపరుల పంచకేయ సంకల్పించిన శ్రీ భవకు ధిరం వరదాచార్యుల వారి సంకల్ప ప్రయత్నములు మరి యొక మెత్తు

శ్రీమద్రామానుజ కీర్తి చంద్రికలను చంద్ర కళల వలె 16 భాగములుగా సంతరించుటకు చేయు ప్రయత్నములు ప్రశంసనీయములు.

ఈ 12 వ సంపుటమున గద్య త్రియము యథా తథ మందించుటయేగాక, వానిలోని భావ గాంభీర్యమును పేరుమోసిన పండిత ప్రకాండులతో వెలువరింప జేసినారు. ఈ గ్రంథమాలా సంపాదకులు అంతియే గాక, వారు స్వయముగ సులలిత

భాషలో ఆస్తిక నాస్తిక దర్శనముల స్వరూప స్వభావములను విశదీకరించినారు. రామానుజ నవ రత్నహారమని, రామానుజ ప్రశంసాపరమైన పూర్వుల పద్యములను పొందుపరచినారు. 'రామానుజులు - వర్ణాశ్రమ ధర్మములు' అన్న శీర్షికలో గీతా ప్రతిపాదిత ధర్మములనే గాక, అనేక విశేషములను పొందుపరచినారు

ఈ రచయితల పుట్టు పూర్వోత్తరాలు, వారి వారి వృత్తి ప్రవృత్తులు, విద్యా వివేకములు, రచనా కుశలతలను గూడ గ్రంథాంతమున వారి వారి ఫోటోలతోబాటు ప్రదర్శించి, రచయితలు పరస్పర పరిచితి గలిగించుకొనుటకు కవకాశము గల్గించినారు.

శ్రీమాన్ వరదాచార్యులవారు మిగిలిన సంపుటములనుగూడ వెలువరించి, రామానుజుల యశఃపతాకను సుప్రతిష్ఠిత మొనర్తురు గాక!



# శ్రీ లక్ష్మీ నారాయణ స్తోత్ర మణిమాల

## (అనుబంధము)



-: ఇందులో :-





# 1. అంజలి

" క్షీరాంభోనిధి రత్న మండప మహా సౌవర్ణ పీఠోన్నతం
వామాంక స్థితయా ప్రసన్న వదన శ్రీకాంత యాలింగితమ్
దోర్దండాంకిత శంఖ పంకజ గదా చక్రైరుదారం శ్రియం
త్వా మిత్థం కలయామి జన్మ విబుధం లక్ష్మీశ నారాయణమ్. "

పాల సముద్రములో - రత్నములచే అలంకృతమైన మండపమున, బంగారు పసమిగు పీఠమునందు - ఎడమ వైపున ప్రసన్న వదనముతో గల లక్ష్మీదేవితో ఆలింగితుడై నట్టియు, నాలుగు కరములందు - శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించినట్టియు, సృష్టికి మూలకారకుడు నైన లక్ష్మీనారాయణస్వామిని గుణింప నమస్కరించుచున్నాను

## 2. శ్రీ లక్ష్మీనారాయణ సుప్రభాతము

" కౌసల్యా సుప్రజారామ ! పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల ! కర్తవ్యం దైవ మాహ్నికమ్. "



ఉత్తిష్ఠా౽శేషలోకేశ ! ఉత్తిష్ఠ కరుణోదధే !
ఉత్తిష్ఠ విశ్వక్షేమాయ, లక్ష్మీనారాయణ ప్రభో !

సకల లోకములకు నాయకుఁడవు - కరుణా రసమునకు సముద్రుఁడవు నైన లక్ష్మీనారాయణస్వామీ ! ప్రపంచమునకు మేలు గూర్చుటకు లెమ్ము.

హే శ్రీ ర్జగ జ్జనని ! మంగదేవతే౽మ్బ
క్షీరాంబురాశ్యుదర పుణ్య ఫలావతారే !
నారాయణాపరిమితోజ్జ్వల భాగ్యహేతో !
కారుణ్యవేశ్మ హృదయే ! తవ సుప్రభాతమ్.

లోకములకు తల్లివి. మంగళములకు అధిదేవతవు. పాల కడలి పున్నెప పంటవు. నారాయణుని అపరమిత భాగ్యమునకు కారణభూతురాలవు. కరుణ వాలవు. అమ్మా ! లక్ష్మీదేవీ ! నీకు సుప్రభాతము.

దుష్ట ధ్వంస ప్రణత జన సంత్రాణ దక్షో౽ప్యమోఘా
త్సంకల్పా త్స్వా త్సహచరణ బాంధవ్య హృద్యార్పణా ద్వై
భక్తా నానందయితు మసకృ ల్లీలయా లబ్ధ జన్మన్
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

లక్ష్మీనారాయణస్వామీ ! అమోఘమైన (ఏ) సంకల్పముచేతనే దు సంహరించుటయందును, శిష్టులఁ బ్రోచుటయందును సమర్థుఁడవైనను, తోటి గుట - సంబంధము చేసికొనుట - వరము లిచ్చుట మొదలగు కార్యముల

భక్తులను సంతోషపెట్టుటకు స్వేచ్ఛతో (పలు) జన్మముల నొందుచుందెదవు. అట్టి
ా స్వామివైన నీకు సుప్రభాతము.

ధర్మత్రాణ ప్రవణ మనసా భర్తురీచ్ఛానుసారాత్
నానాప్రాణి ష్వవతరతి సత్యంబ తత్ర తనూభృత్
ప్రాదుర్భూత్వా సహసరసఃఖుం త్వస్య చేష్టా శ్శరీరి
ష్వాగో విద్ధే ష్వపి చ కమలేమ్యాసి తే సుప్రభాతమ్.

అమ్మా ! లక్ష్మీదేవీ ! నాథుడైన నారాయణుడు ధర్మ సంరక్షణార్థమై ఆన
ఇచ్ఛానుసారముగా అనేక ప్రాణులం దవతరించుచుండ, నీవును ఆ యా దేహము
లను ధరించుచు, కోడనే యవతరించి, నారాయణుని చర్యలను అపరాధవంతులైన
చేతనులయందు సైతము - వాత్సల్య రస విశిష్టములుగాం జేయుచున్న దానవు.
ఆసుక, మాకు తల్లివి. నీకు సుప్రభాతము.

రక్షఃవాశావ్భృతి వివశీభూత వేదోద్ధి ధీర్ఘా
క్ష్ణప్త శ్రీమత్స్యమపతివపు శ్శాలినే కల్పకాలే
చ్ఛన్దోదాన ప్రముదితవిధి స్తోత్రజ ప్రీతియోఽలం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్

సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణస్వామీ దుష్ట దానవుఁడు అపహరించి
టచే పరాధీనములైన వేదముల నుద్ధరించవలెనన్న తలంపుతో శ్రీమంతమైన
మత్స్యమూర్తియొక్క తనువునుఁ దాల్చినవాఁడవు. రాక్షసుని సంహరించి, వేదము
లను తెచ్చి యీయఁగా సంతసముతో బ్రహ్మదేవుఁడు చేసిన స్తోత్రమునకు ప్రీతిఁ
జెందినవాడవు అట్టి నీకు సుప్రభాతము.

పీయూషా ప్త్యుత్సుకసురారాతి నిర్మథ్యమానా
బ్ధ్యన్త ర్మజ్జ న్మధన కుధరోద్ధారి కూర్మస్వరూప !
రక్షో మోహామరపతిసుధా ప్రాపణ శ్లాఘ్యకీర్తే !
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

అమృతమును పొందగోరిన దేవ దానవులచే మథింపఁబడు సముద్రములో మునుఁగుచుండెడి సుందర పర్వతమును మూపున దాల్చి, పైకెత్తుటకై, కూర్మ రూపము దాల్చినవాఁడవు. రాక్షసులను వంచించి, దేవతలకు అమృతమును పంచి పెట్టుటచే శ్లాఘింపఁదగిన కీర్తి గలవాఁడవై, సర్వేశ్వరుఁడవై యొప్పుచున్న లక్ష్మీ నారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

క్షోణీమండ ల్యపహృతి మహా ఘోరకార్య ప్రసక్త
స్వర్ణాక్షాఖ్య ప్రబల దనుజో న్మాథ హేలా విహర్త్రీ
ధాత్రీ ముస్తాంచితి రద లస ల్లోత్ర రోత్తుంగ మూర్తి ధ స్త్రే)
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

భూ మండలము నపహరించుట యను ఘోర కార్యము నొనర్చిన హిర ణ్యాక్షుఁడను బలవంతుఁడైన రాక్షసుని సంహరించి, విలాసముగా విహరించుచున్న వాఁడవు. భూగోళ మనెడు తుంగ ముస్తెతో పొందఁబడిన కోర గల వరాహ వం ర్యాము దాల్చిన లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

ప్రహ్లాదాస్తే యది మధురిపు స్సర్వతో దర్శయాత్ర
స్తంభే చేతి ప్రసభ మసురో త్తాడిత స్తంభ గర్భాత్
సద్యో భూత్వా నృహరి వపుసా సంహరం స్తం సురారిం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

ప్రహ్లాదా ! విష్ణువు అంతటను ఉండెనేని, ఈ స్తంభమున జూపుమని రాక్షసు డైన హిరణ్యకశిపునిచే పరిహాసముగా తన్నఁబడిన స్తంభము నుండి వెంటనే నృసింహ రూపముతో వెలువడి, ఆ హిరణ్యకశిపుని సంహరించిన సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము.

యజ్ఞాగారే త్రిపదమితకాం క్షోణిం బలిం యాచయిత్వా
దిక్షు స్ఫీత్వా త్రిభి రథ పదై స్త్రీన్ సమాక్రమ్య లోకాన్
శక్రా కారిం తం కపట వటయే ప్రాపశాయోహి లోకం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

బలిచక్రవర్తిని మూఁ డడుగుల నేల నడిగి, దిక్కులయందంతటను వ్యాపించి, మూఁ డడుగులతో మూఁడు లోకముల నాక్రమించి, ఇంద్ర శత్రువగు బలిచక్రవర్తిని పాతాళమునకు ద్రొక్కినవాఁడవై, వామనావతారము ధరించి విరాజిల్లిన సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము

పాణిక్రీడ త్వరశు నిహత క్షుద్ర భూపాలజాత
ప్రోద్య ద్రక్త ప్రవాద కృత పిత్రుస్తోమ సంతర్పణాయ
శ్రీమాన్ శ్రీమ ద్భృగుముని శశాంకాన్వయ శ్రీ విధాత్రే
లక్ష్మీనారాయణ భగవతే! నాథ! తే సుప్రభాతమ్.

చేతిలో నాడుమందు గండ్రగొడ్డలిచే వ్రేయబడిన దుష్ట క్షత్రియ సమూహము నుండి కాలువారుచున్న రక్తపు మడుగులతో పితృతర్పణము జేసిన పరశురాముఁడవై, శ్రీమంతమైన భృగుమహాముని వంశమునకు వన్నె తెకూర్చినవాఁడవై సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము

లంకాధీశా ద్యఖిల ఖల రక్షఃకుల క్రూరవీర్య
వ్యాజ గ్రీష్మ ప్రశమన పయోద ద్రఘూత్తంస రూప
లోకక్షేమ క్షమ బహువిధాకారధారిన్ మహాత్మన్
లక్ష్మీనారాయణ భగవతే! నాథ! తే సుప్రభాతమ్.

రావణుడు మొదలుగాఁ గల ఖలు లయిన సకల రాక్షస సంఘముల యొక్క భయంకర వీర్య మనెడు వేండ్రము తగ్గుటకు వారిదమైన శ్రీరామచంద్రుని రూపము ధరించినవాఁడవై, పరమాత్మవై, సర్వేశ్వరుఁడవైన లక్ష్మీనారాయణ స్వామీ! నీకు సుప్రభాతము

యస్య క్రీడా స్పృహా యదుపతేః కేళిభి స్సంవిశిష్టాః
నానా వ్యస్తై రివ తనుభృతాం తన్వతే భావుకాని
తాదృక్ సంకర్షణ తనుభృతే లోక కళ్యాణహేతోః
లక్ష్మీనారాయణ భగవతే! నాథ! తే సుప్రభాతమ్

ఏ బలరాముని యొక్క క్రీడలు శ్రీకృష్ణుని క్రీడలతోఁ గూడినవై అన్నము లతో గూడిన జలములవలె ప్రాణధారులకు క్షేమము గల్గించుచున్నవో, లోక కల్యాణమునకై అట్టి బలరామ రూపమును ధరించినట్టి సర్వేశ్వరుఁడ వగు శ్రీ లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

శ్రీమద్గోవర్ధనగిరివరోద్ధార గోప్యాళిరాస
క్రీడా కంసాదికవధవిధా రంజితాశేషలోక
నక్షత్రేశాన్వయ జలధిరాట్చంద్రమః కృష్ణమూర్తే !
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

శ్రీమంతమైన గోవర్ధన పర్వత మెత్తుట, గోపికలతో క్రీడలు సలుపుట, కంసుడు మొదలగు దుష్ట రాక్షసులను సంహరించుట మున్నగు ఘనకార్యములచే లోకమును సంతుష్టి పఱచినవాఁడవు - చంద్రవంశ మనెడు క్షీర సముద్రమునకు చంద్రునివంటి శ్రీకృష్ణరూపము ధరించినవాఁడవు - సర్వేశ్వరుడఁ వగు లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము

తుచ్ఛమ్లేచ్ఛ ప్రచయక బృహత్కంటకానోకహాళీ
సన్నోచ్ఛేదం జగతి విరచయ్యాసిధారాం గృహీత్వా
ధర్మా మర్త్యద్రుమ వన సముత్పాది కల్క్యాత్మనే తే
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్

కత్తిని చేపట్టి, పాపాత్ములైన మ్లేచ్ఛ సమూహము లనెడు పెద్ద ముళ్ళచెట్ల తోఁ గూడిన వన సమూహమును ఛేదించి, లోకములో ధర్మ మనెడు కల్ప వృక్ష వనమును నెలకొల్పునట్టి కల్కి రూపమును ధరించిన సర్వేశ్వరుఁడవగు లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

నిత్యై ర్ముక్తైః పరమ గగనే క్షీరసింధౌ పున స్తై
ర్దేవై శ్చాధో హృదయ కమలే యోగిభి ర్జ్ఞాన దృగ్భిః
అర్చామూర్త్యా విహ సహ నరై శ్చాపి తై స్సేవ్య సమ్యక్
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

పరమ పదమునందు నిత్యులచేతను, ముక్తులచేతను, పాలకడలియందు ఆ నిత్య ముక్తుల చేతను (కడమ) దేవతలచేతను, హృదయ పద్మమునందు యోగుల చేతను, జ్ఞానచక్షువులచేతను ఈ యర్చాబింబమునందు మానవులతోటి ఆ యందర చేతను చక్కగ సేవింపఁదగిన నా స్వామియైన లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము.

ఆమ్నాయా న్తే మృదు పటదళే మౌనిహృ ద్వారిజాతే
లక్ష్మీతుంగ స్తనగిరితటే వాతభు గ్వర్యభోగే
శ్రీవైకుంఠే కలశ జలధౌ నిత్య సంస క్త హర్షిన్
లక్ష్మీనారాయణ భగవతే! నాథ! తే సుప్రభాగమ్

వేదాంతమునందును, మృదువైన మఱ్ఱియాకునందును, యోగుల హృదయ కమలములందును, లక్ష్మీదేవియొక్క ఉన్నతములైన స్తనపర్వతములయందును, ఆదిశేషుని శరీరమునందును, శ్రీవైకుంఠమునందును, క్షీరసముద్రమునందును నిరంతరము వసించి సంతసించు సర్వేశ్వరా! శ్రీ లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము.

ప్రాతః ఫుల్లాంబుజ వన వనీ పుష్పసౌగంధ్య భారం
బిభ్ర ద్బాలా దిన మకుదయం మంద మాయాతి భోగిన్
రజ్య త్కాంతా కర చలిత స త్తాళవృంతానిలా భో
లక్ష్మీనారాయణ భగవతే! నాథ! తే సుప్రభాతమ్

ఉషఃకాలమునందు వికసించిన కమల వనములయొక్కయు, వనమునందు గల పుష్పములయొక్కయు, అపరిమితమైన పరిమళమును వహించుచు, ఆ పరిమళముయొక్క భారమునలననో యనునట్లు - వనమందు అనురక్తురాలైనట్టియు యువతి - చేతిలో వీచుచుండెడి మేలైన విసనకఱ్ఱ నుండి వెలువడు గాలివలె మనోహరముగ, మెల్లగ వీచుచున్నాఁడు. సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణస్వామీ! నీకు సుప్రభాతము.

పూష్ణి శ్రీమ త్యుదయగిరిరా జ్మూర్ధ్ని సందృశ్యమానే
నష్టే స్సద్యో జగతి తమసాం సంచయః క్వాపి లిల్యే
త్వ త్కారుణ్యే సతి తనుభృతీ వాఖిలాప త్తిరాశిః
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

తనువు దాల్చినవారియందు నీ కారుణ్యము గలుగుచుండఁగా - ఆపదల సమూహము లన్నియు పటాపంచలైనట్లు, శ్రీ సహితుఁడైన సూర్యుఁడు ఉదయగిరి యందు కనిపింప, జగమునందలి దట్టమైన చీకటి వెంటనే నశించి, యెచ్చటకో లయ మొందినది సర్వేశ్వరుఁడఁవగు లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము

పక్షిబ్రహ్మణ్యధ్యయన నినదాః పత్త్రి కోలాహల శ్చ
ప్రోచ్చై ర్దధ్నో మథన నినదా శ్చాసి సంభూయ భూయః
ఆశాంతేషు ప్రతివిదధతే స్పర్ధమానా స్వనీకం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

బ్రహ్మచారులు ఉచ్చైస్స్వరముతోఁ జేయు వేదాధ్యయనపు ధ్వనులు, పక్షుల కలకలారావములు, వనితల పెరుగుచిలుకు మోతలు కలిసికొని పోటీ పడుచు, దిగంతములలో తగవు లాడుకొనుచున్నవి (కనుక తెల్లవారినది) లక్ష్మీనారాయణ స్వామీ ! నీకు సుప్రభాతము

ప్రాచీనాద్రే రుదయతి రవిః పద్మినీ కంధరాయాం
తంతుం మాంగల్యక మివ నిధి ష్యన్వరో భద్రవీరాః
విశ్వం విశ్వేన చ కలభృతం బాన్ధవానాం ఖగానాం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

పెండ్లికొడుకు పద్మినీ కన్యయొక్క మెడయందు మంగళసూత్రములు కట్టుట కొఱకుగాను పెండ్లిపీటనుండి లేచు రీతి, సూర్యుఁడు కమలినియొక్క కంఠమునందు మంగళసూత్రమును కట్టుటకుగాను ఉదయగిరి నుండి ఉదయించుచున్నాఁడు బంధువుల ఆనంద సుందర ధ్వనులతోఁ గూడిన పెండ్లి యిల్లువలె, ప్రపంచము పక్షి తల్లజముల హాళితములచేత నిండినది, లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

శ్రీమాన్ భక్తప్రియ నరహరే ! శ్రీహరే ! శేషశాయిన్ !
కంసధ్వంసిన్ ! కమలనయనానన్త ! శౌరే ! మురారే !
ఇత్థం కీరా మధుర మధురం పంజరే వ్యాచ్చరంతి
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! సుప్రభాతమ్.

లక్ష్మీవల్లభా ! భక్తవత్సలా ! నృసింహా ! శ్రీహరీ ! శేషశయనా ! కంస సంహారకా ! కమల నయనా ! అనంతా ! శౌరీ ! మురారీ ! అని పంజరములలోఁగల చిలుకలు మిగుల మధురముగాఁ బల్కుచున్నవి. లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

శ్రీమ త్పీతాంబర మధురిపో ! దేవ ! కారుణ్యసింధో !
విష్ణో! జిష్ణో! రసుజ! భగవన్ ! వాసుదేవాఽఖలేశ !
స్వామిన్ ! దామోదర ! గిరిధర ! శ్రీపతే ! భక్తబంధో !
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

శ్రీయుక్తమైన పచ్చని వలువగలవాఁడా ! లోకపీడాకరుడైన మధుదానవుని వధించినవాఁడా ! దేవా ! కృపాసాగరా ! విశ్వమం దంతటను నిండియుండువాఁడా ! ఉపేంద్రా ! జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనఁబడు షడ్గుణైశ్వర్య సంపత్తిగలవాడా ! వాసుదేవా ! సర్వేశ్వరా ! స్వామీ ! దామోదర ! అతివృష్టిబాధనుండి ఆశ్రితులనుఁ గాచునిమిత్తము కొండ నెత్తినవాఁడా ! శ్రీవల్లభా ! భక్తబాంధవా ! లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము

తత్ప్రే భర్తు ర్నఖముఖ పరీలేఖనై రాహసంత్యా
వ్యాప్యస్య త్తన్వ్యా వదన శశభృ న్మండలీవ త్తటాకే
సు శ్రీః ఫుల్లా దినకర కర స్పర్శనైః పద్మినీంధే
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

సరస్సునందలి పద్మము సూర్యకిరణములు సోకగా - వికసించినదై, పడక యందు భర్తయొక్క గోటి కొనల గీరుడుల (చక్కిలిగింతల) చేత పకపక నగు

యుండు ప్రేమించిన తన్వియొక్క చంద్రబింబమువంటి ముఖమండలములవలె మంచి కాంతి కలిగి వెలుఁగుచున్నది. లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము

సర్వే దేవా స్సురపతివనా త్పారిజాతాని భక్త్యా
సప్తర్షీంద్రా గగన సరితో పారిజాతాని చాపి
త్వ త్పాదార్చా విధికృతే సంప్రసన్నా గృహీత్వా
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

దేవత లందఱును - దేవేంద్రుని నందన వనమునుండి పారిజాతములు గైకొని, నీ పాదములను భక్తితో పూజించుటకు సిద్ధముగా నున్నారు. లక్ష్మీనారాయణస్వామీ ! నీకు సుప్రభాతము.

జాతీ మల్లీ కమల తులసీ ముఖ్యపుష్పైః కరండాన్
ఏలేందు శ్రీ స్సహిత సలిలం స్వర్ణ కుంభాం శ్చ ధృత్వా
సంతి ద్వారే విహిత విధయో వైష్ణవాః పూజితుం త్వాం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

శ్రీవైష్ణవులు అహ్నికములను నెరవేర్చి, జాజిపూలు - మల్లెపూలు, తులసీ దళములు నింపిన బుట్టలను, ఏలకికాయలు - పచ్చకర్పూరము మున్నగు సుగంధ ద్రవ్యములతోఁగూడిన నీరములు గల బంగారు కలశములను ధరించి, నిన్ను పూజించు నిమిత్తము వాకిట నిలచియున్నారు. సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనారాయణ స్వామీ ! నీకు సుప్రభాతము.

కాసారాంతే కమల వనికే వోదయం లోకబన్ధోః
ద్వారప్రాంతే బహుజనతతి ర్దర్శనం తే ప్రభాతే
కాంక్ష్యం తాస్తే కమల విమలై ర్దర్శనై స్తోషయేనాం
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

వేకువ జామున సరస్సులో కమలముల సమూహము సూర్యోదయమున కాంక్షపడునట్లు, దేవాలయ ద్వారమున అనంతమైన జన సమూహము నీ దర్శ

నార్థమై వేచియున్నది. కమలములవలె ప్రసన్నమువైన చల్లని చూపులను ప్ర
రింపఁజేసి, ఈ జన సంకటిని సంతసింపఁజేయుము. సర్వేశ్వరుఁడ వగు లక్ష్మీనా
యణస్వామీ ! నీకు సుప్రభాతము.

నిద్రా నా స్తీశ్వర ! తవ సదా యద్యపి స్వాపభాజ
త్వ య్యుత్ప్రాతం జనయతి వపు ర్ధారిణాం భూతజాతమ్
జాగ్ర ద్యోగ స్వపన మనుభృ చ్ఛర్మణే త ద్విధత్సే
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

సర్వేశ్వరా ! లక్ష్మీనారాయణస్వామీ ! ఆలోచింపఁగా - నీ కెప్పుడును
ఁయే లేదు. నీవు నిదురించితివేని, భూత సమూహము దేహధారులకు నాశ
గల్గించును. కనుక, చేతనుల క్షేమము కొఱకు మేలుకొనియున్నవాడవై, యో
నిద్రతో మాత్రమే తృప్తిఁజెందుచున్నావు. దానిని కూడ ఇక వదలుము
సుప్రభాతము.

త్యక్త్వా తల్పం పరమ కృపయా భద్రపీఠే నిషణ్ణః
పూజాం సర్వాం ప్రియమతికృతాం దేవలక్ష్మ్యా గృహీత
భక్తా నేతా నఖిల భువనా న్య ప్యహో పాలయ శ్రీ
లక్ష్మీనారాయణ భగవతే ! నాథ ! తే సుప్రభాతమ్.

సర్వేశ్వరా ! లక్ష్మీనారాయణస్వామీ ! పడకను వీడి, పరమ కరుణతో
దేవీ సహితుఁడవై, భద్రపీఠమం దాసీనుఁడవై, భక్తి భావముతో మే మొనరి
పూజలను స్వీకరించి, ఈ దాసులను, సకల లోకములను సంరక్షింపుము !
సుప్రభాతము

ఆర్య శ్రీమ ద్ధనకుధర రామానుజార్త ప్రతిష్ఠ !
త త్పుత్ర శ్రీ వరదగురుపర్యాప్త కైంకర్య తుష్ట !
శ్రీ విశాల ప్రణుత కుల శేషార్యసూక్త స్తుతిష్ట !
లక్ష్మీనారాయణ పురపతే ! నాథ ! తే సుప్రభాతమ్.

పూజ్యులైన శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యులవారిచే ప్రతిష్ఠింపబడిన వాఁడవు - వారి తనయుఁడైన వరదాచార్యులవారిచే పొందబడిన కైంకర్యములచే సంతసించువాఁడవు - ప్రశస్తమైన శ్రీ విక్రాల వంశోద్భవుఁ డగు శేషాచార్యుఁ డానర్చిన స్తోత్రములందు ప్రీతి గలవాఁడవై వెలసిన సర్వేశ్వరా! నీకు సుప్రభాతము

## 3. శ్రీ లక్ష్మీనారాయణ ప్రపత్తి

విశ్వస్య మాతర ముపేయతమాం శరణ్యా
ముద్వేల యంతు కరణేఽ ప్యమిత క్షమాఢ్యాం
ఇష్టాధికాభ్యుదయ దానపరాం చ లక్ష్మీం
నారాయణస్య మహిషీం శరణం ప్రపద్యే.

లోకమునకు తల్లి కనుక, మితి లేని అపచారములు చేసినను, అపరిమితమైన ఓర్పు కలదియు - రక్షణ సమర్థురాలు గనుక, తప్పక ఆశ్రయింపఁదగినదియు - కోర్కెలను మించిన అభ్యుదయముల నిచ్చునదియు - నారాయణుని పట్టపు దేవియునైన లక్ష్మీదేవిని నేను శరణు జొచ్చుచున్నాను.

సద్యో జగత్త్రితయమాన మహా ప్రవీణౌ
శ్రుత్యంత వర్ణిత లస న్మహిమ ప్రశంసౌ
యోగీంద్ర హృత్కమల సన్నిహితౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

పద్యస్కాలమున మూఁడు లోకములను కొలుచుటయందు కడు సమర్థములును, వేదాంతములలో వర్ణింపఁబడిన విధమున గొప్ప ప్రభావము కలిగి ప్రశస్తమైనవియు, యోగివర్యుల హృదయ పద్మముల యందు ఉంచబడినవియునైన లక్ష్మీనారాయణస్వామివారి పాదములను నేను శరణుజొచ్చుచున్నాను.

పుష్పప్రసక్త నవకల్పక పల్లవశ్రీ
సర్వస్వహృత్ప్రథిమ మంజిమ సౌకుమార్యౌ
సుస్పర్శ సౌరభ జితాంబురహౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

పుష్పములతోఁ గూడుకొనిన కల్పవృక్షముల క్రొత్తచిగుళ్ళయొక్క కాంతి సర్వస్వమును మించిన మనుపు, అందము, మెత్తఁదనము కలవియు - సుఖకరమైన స్పర్శముచేతను-పద్మములను మించినవియునైన లక్ష్మీనారాయణస్వామివారి పాదములను నేను శరణు జొచ్చుచున్నాను

నమ్రేంద్రముఖ్య సురరాజ కిరీట రత్న
కోటి చ్ఛటా జయి నఖాంశు శుభాంగుళీకౌ
వస్త్వంతరేక్షణ రుచిఘ్న రుచౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

ప్రణమిల్లెడు ఇంద్రుఁడు మున్నుగాఁ గల సురరాజుల కిరీటములలోని రత్న కాంతిపుంజములను మించిన గోళ్ళ కాంతులు గలిగి, అందములైన వ్రేళ్ళు కలవి[illegible] [illegible]టి వస్తువులనుఁ జూచుటకు ఆసక్తి గల్గింపని లక్ష్మీనారాయణస్వామివారి పాదములను శరణుజొచ్చుచున్నాను

ఆచుంబితౌ తనయ వత్సలయా తు గోప్యా
సంవాహితౌ ప్రణయతో మృదు భీష్మపుత్ర్యా
భక్త్యార్చితౌ వథ యుధిష్ఠిరత శ్చ లక్ష్మీ
నారాయణస్య చరశౌ శరణం ప్రపద్యే.

యశోదచేత పుత్రవాత్సల్యముతో ముద్దుపెట్టుకొనఁబడినవియు, రుక్మిణీదేవిచేత ప్రేమతో మెల్లగా నొత్తఁబడినవియు, తదుపరి ధర్మరాజుచేత భక్తితో పూజింపఁ బడినవియునైన లక్ష్మీనారాయణస్వామివారి పాదములను శరణు జొచ్చుచున్నాను.

కైకేయికా తను భువా హ్యభిషేక భాగ్యాం
సాకేతపాలయితృకౌ నిజపాదుకాభ్యాం
విశ్వంభరా సముదయ ప్రభవౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

భరతునిచే పట్టాభిషిక్తములైన తన పాదుకలచేత కోసలదేశమును పాలింపఁ జేసినవియు, సమస్తమును గ్రహించునట్టి భూమి పుట్టువునకు కారణములైనవియు నైన లక్ష్మీనారాయణస్వామివారి పాదములను నేను శరణు జొచ్చుచున్నాను

దివ్య న్నఖాంశుత లప ద్రుచిభి స్త్రివేణీ
సంభేద విభ్రమకరౌ మలనాశశౌండౌ
తాపాపనోదన మహాప్రథితౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

మకిలను (పాపములను, ఒంటి మురికిని) పోనాడుటయందు సమర్థములు, తాపములను (ఎండ వేంద్రమును, ఆధ్యాత్మిక - ఆదిభౌతిక - ఆధిదైవికము లనెడు తాపత్రయమును) నశింపఁజేయుటలో మిక్కిలి పేరు వడసినవియునై వెలుఁగుచుండు (తెల్లని) నఖ [గోళ్ళ] కాంతుల చేతను (ఎఱ్ఱని) అరకాళ్ళ కాంతులచేతను, (నల్లని) మీఁగాళ్ళ కాంతులచేతను తెల్లని, ఎఱ్ఱని, నల్లనివైన గంగా సరస్వతీ యమునా నదుల కూటమి యనెడు భ్రాంతినిఁ గల్గించుచుండు లక్ష్మీనారాయణస్వామి వారి పాదములను నేను శరణుఁజొచ్చుచున్నాను.

ఛత్రామరద్రుమ సుదర్శన పాంచజన్య
పీయూష కుంభముఖ మంగళ రేఖికాభిః
పూర్ణోజ్జ్వల త్పదతలౌ లలితౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

ఛత్రము, కల్పతరువు, చక్రము, శంఖము, అమృత కలశము మున్నగాఁ గల వానియొక్క శుభకరములైన రేఖలతో నిండిన, సుందరములైన అఱకాళ్ళు గల లక్ష్మీనారాయణస్వామి వారి పాదములను నేను శరణు జొచ్చుచున్నాను

ఆత్మైక యోగ్య బహుసుందర దివ్యరత్న
మంజీర మంజిమభరం పరివర్ధయంతౌ
అత్యంత సుందర సుగంధ చణౌ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

తమకే (ఆ పాదములకే) తగినవనియు, మిగుల సుందరములైన దివ్య రత్నములు కలవియునైన అందెల అందమును మిక్కిలి పెంచుచున్నవియు, కడు మనోహరములు - సౌరభము కలవియునైన లక్ష్మీనారాయణస్వామివారి పాదములను నేను శరణు జొచ్చుచున్నాను.

ఆధ్యాయతా మభయదా యమతో౽న్యశంకం
సాధారణే సుర సురార్యధిదైవతే చ
దృష్టౌ రతృప్తిద విశేష రుచీ చ లక్ష్మీ
నారాయణస్య చరణౌ శరణం ప్రపద్యే.

తమను (పాదములను) ధ్యానించువారికి సందియము లేకుండ, యముని నుండి కూడ అభయము నొసంగుననియు, దేవతలకును - దానవులకును దైవ మైనవియు, చూపులకు తనివి తీరని విశేషమైన సౌందర్య శోభ కలవియు నగు లక్ష్మీనారాయణస్వామివారి పాదములను నేను శరణు జొచ్చుచున్నాను.

## 4. శ్రీ లక్ష్మీనారాయణ స్తవము

కన త్కనక చార్వంగీ మహా నీలాభ విగ్రహా
లక్ష్మీనారాయణౌ వందే లోకరక్షా ధురంధరా.

మెఱుగు పెట్టిగా నిగ నిగ మెఱయుచున్న బంగారువంటి అందమైన అవయవములు, ఇంద్రనీలములవంటి కాంతి గల శరీరము గలవారును, జగద్రక్షణ దీక్షితులు నయిన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను.

ఉత్ఫుల్లోత్ఫుల్ల పత్రాక్షీ పద్మపత్రాయతేక్షణౌ
లక్ష్మీనారాయణౌ వందే లోకరక్షా ధురంధరౌ.

పూచిన కలువ రేకులవంటి కన్నులును, తామర రేకులవంటి కన్నులును గల జగద్రక్షకులైన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను.

మత్తహంస వధూయానా మత్త ద్విరద సంచరౌ
లక్ష్మీనారాయణౌ వందే జగద్రక్షా ధురంధరౌ.

మత్తహంసాంగనవంటి నడకయు - మదపుటేనుఁగువంటి నడకయు గలిగిన వారును, జగద్రక్షాధురంధరులైన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను.

అన్యోన్య సదృశాకారౌ త్రైలోక్య గృహదంపతీ
లక్ష్మీనారాయణౌ వందే జగద్రక్షా ధురంధరౌ.

ఒండొరులకు తగిన రూపురేఖలు గలవారును, ముల్లోకములు ఇల్లుగాఁగల దంపతులును, లోక శరణ్యులునైన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను

పరస్పర కటాక్షాభ్యాం అన్యోన్యేక్షణ హర్షిణౌ
లక్ష్మీనారాయణౌ వందే లోకరక్షా ధురంధరౌ.

ఒకరి నొకరు క్రేగన్నులఁ జూచుకొనుచు ఉప్పొంగుచుండువారును, లోక రక్షకులైన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను.

ప్రపంచ మాతా పితరౌ ప్రాంచౌ జాయాపతీ ప్రభూ
లక్ష్మీనారాయణౌ వందే లోకరక్షా ధురంధరౌ.

ప్రపంచమునకు తలిదండ్రులు - పురాణ దంపతులు - విశ్వమునకు ప్రభువులు - లోకమును రక్షించువారునైన లక్ష్మీనారాయణులను నమస్కరించుచున్నాను.

# 5. శ్రీ లక్ష్మీనారాయణ కరాలంబ స్తోత్రము

శ్రీమ ద్రామానుజ స్తోత్ర స్ఫీతా య త్కీర్తి కౌముదీ
యతిరాట్ ప్రోక్త మద్వైతం య ద్విశిష్ట పదాంచితమ్
స్రోత స్యేకా స్థిరం చాన్యత్ సేవేతే తవ వైభవం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

శ్రీమ ద్రామానుజులవారి స్తోత్రముచేత ఏ కీర్తి కౌముది విస్తరించుచున్నదో, ఆ యతిరాజులచేత ఏ అద్వైతము విశిష్ట పద సంపన్నమై, ప్రతిష్ఠ నొందియున్నదో- ఆ రెండును నీ వైభవమునే సేవించుచున్నవి. ఒకటి ప్రవాహ రూపమున పరి వస్యగా ప్రవహింపగా, రెండవది సుస్థిరమై, ప్రతిష్ఠ చేకూర్చుచున్నది. ఓ స్వామీ ! లక్ష్మీనారాయణ ప్రభూ ! అట్టి సేవలతో అలరారుచున్న నీవు నాకు చేయూత నందింపుము.

సూర్యోదయ ఇవాభాతి తవ కంఠస్థ కౌస్తుభం
ప్రపన్నజన హృత్పద్మ కోరకాని వికాసయత్
ఆస్మాకీయ ప్రభాజాలై రాపూరయతి రోదసీం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ప్రభూ ! లక్ష్మీనారాయణదేవా ! నీ కంఠమునం దున్న కౌస్తుభము ప్రపన్నులైన భక్తుల హృదయ పద్మ కోరకములను వికసింపచేయుచు, తన కాంతి సంతతులచేత భూమికి, ఆకాశమునకు గల నడిమి ప్రదేశము నంతయు నింపుచు, సూర్యోదయము వలె భాసించుచున్నది నాకు నీ చేతిని అలంబనముగా అనుగ్రహింపుము స్వామీ !

సత్యం సత్యం త్రిసత్యం తత్ లక్ష్మీ స్త్వ దనపాయినీ
నకుసీన కటాక్షేఽపి నూనం హి భవతా భృతా
తథైవ నామధేయేఽపి ప్రసక్తం ప్రథమం పదం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

లక్ష్మీనారాయణదేవా ! లక్ష్మీదేవి నిన్నెడబాసి యుండదన్న విషయము ఎప్పటికి సత్యము ఆమెను నీవు నీ వక్షస్థలమునందు ధరించినట్లే, కటాక్షము నందుము ధరించియున్నావు అంతే కాదు, నీ పేరులో కూడా ప్రథమస్థానమును ఆమెకే ప్రదానము చేసి, లక్ష్మీనారాయణుడవైతివి ప్రభూ ! ఊతగా నీ చేతిని నా కందజేయుము.

వ్యోమ త్వ మేవ భూమి స్త్వం జలం త్వ మనలో౽నిలః
జంగమ స్థావరం సర్వం లోకాలోకా త్వమే వచ
కశ్చి త్కాంచి చ్ఛ కించి చ్ఛ బుతే త్వాం న సమీక్ష్యతే
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ప్రభూ ! నీవే ఆకాశము. నీవే భూమి నీవే జలము. నీవే అగ్ని నీవే వాయువు - చరములు, స్థావరములు కూడ నీవే. లోకము నీవే. అలోకము నీవే ఈ సృష్టిలో - పురుషుడు కాని, స్త్రీ కాని, జడము కాని నీవు కాని దేదియు గోచరము కాదు లక్ష్మీనారాయణదేవా ! నాకు నీ చేతిని ఊతగా అందింపుము

పరమాత్మా భవా నేవ సర్వా స్తే౽గాని దేవతాః
పరమాత్మా భవా నేవ విశ్వ మేత త్తవాకృతిః
పరమాత్మా భవా నేవ నాన్యో జీవ స్త్వమేవ చ
ప్రదేహి కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

దేవా ! నీవే పరమాత్మవు. దేవత లందరును నీకు అవయవములు నీవే పరమాత్మవు. ఈ విశ్వము నీ రూపమే. నీవే పరమాత్మవు జీవుడు కూడ నీవాడే కాని, ఇతరుడు కాడు. లక్ష్మీనారాయణస్వామీ ! నాకు నీ కరావలంబము నందింపుము

భవ ద్రూపం పరం ధ్యాయాం వీక్షితుం న హి శక్యతే
మందదృగ్భి శ్చ మాదృగ్భిః కింతు హే కరుణానిధే !
అర్చావతాం సతాం భాగ్యం యథా దేదీప్యతే పురః
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

పర మని, వ్యూహ మని చెప్పదగిన నీ రూపములను మంద దృష్టి గల మావంటివారు చూడలేరు. కనులకు నిధివైన నీవు మాకొరకే, మా భాగ్యమో అన్నట్లుగా, అర్చనయం దాసక్తి గల మాకు - అర్చారూపములో - మా యెదుటనే ప్రకాశించుచున్నావు నీ కరాలంబము నా కందింపుము లక్ష్మీనారాయణ ప్రభూ !

ప్రదాతు మేవ భక్తేభ్యః పరితోషం విశేషతః
ధత్సే బహూని రూపాణి చావతార చ్ఛవేన హి
నో చేత్ కథం లభన్తే శ్రితాః సంభాషణాదికం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

అవతార మనెడి మిషతో, భక్తులకు విశేషమైన సంతోషమును కలిగించుటకై నీవు అనేక రూపములను ధరించుచున్నావు. అట్లు కానియెడల, నిన్నే నమ్ముకొని యున్న నీ భక్తులకు - సందర్శన, సంస్పర్శన, సంభాషణరూపమైన ఆనందము కలుగుట యెట్లు ? లక్ష్మీనారాయణస్వామీ ! భక్తసులభుడవైన నీవు నీ కరము ఆలంబనముగా నందింపుము.

ఇతీయ ద్వాచకోల్లంఘీ నామ రూప ద్వయాతిగః
త్వ మసి త్రిగుణాతీత స్తథాఽపి కరుణావశాత్
భక్తాభీష్ట ప్రమాణేవ పురస్తా ద్వర్తసే సదా
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఇంత యని కాని, ఈ విషయముగా నని కాని చెప్పుటకు వీలుకానివాడవు. నామ రూపములు రెండింటికి అతీతుడవు. సత్త్వ రజ స్తమోగుణములు మూటిని దాటినవాడవు. అయినప్పటికిని అనుగ్రహ విశేషముచేత భక్తుల యొక్క అభీష్టములకు తగిన పరిమాణముతో, వారి అభీష్టములను యథార్థము చేయుటకై ఎల్లప్పుడును ఎట్ట యెదుట కనులకు కన్పట్టుచున్నావు. లక్ష్మీనారాయణదేవా ! నాకు నీ కరాలంబము నందింపుము.

త్వ త్పాద దర్శనానందాత్ శతానందో భవే జ్జనః
పున స్సేవా సమర్చాభ్యాం కిం భవే దితి కో తదేత్ ?
త్వ త్పాద పరిచర్యార్థం కృపయానుగృహాణ మాం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

నీ పాదములను దర్శించినంతలో కలిగిన ఆనందమువలన మనుష్యుడు శతానందు డగును. ఇంక ఆతనికి సేవ చేసికొను భాగ్యమును, పూజించుకొను భాగ్యమును కలిగిన యెడల, ఏ మగునో - ఎంతవా డగునో ఎవరు చెప్పగలరు ? దయచేసి, నీ పాద పరిచర్యాభాగ్యము ననుగ్రహింపుము. దేవాదిదేవా ! నీ కరము నాలంబముగా అందింపుము స్వామీ !

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి విష్టపే
తదా తదా త్వ మాత్మానం సృజసీమా పునః పునః
కో మాతుం తవ కారుణ్యం ? కదా నృణ్యం ప్రజే జ్జగత్ ?
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

లక్ష్మీనారాయణప్రభూ ! ధర్మమునకు లోకమునందు ఎప్పుడు ఎప్పుడు గ్లాని కలుగుచున్నదో, అప్పుడు నీవు నిన్ను మరల మరల సృజించుకొనుచున్నావు. యుగమునకొక్క పర్యాయమే యని కాని, రెండు పర్యాయములే యనికాని లేకుండ అవతరించుచున్నావు నీ కారుణ్యమును కొలచి చెప్పగల వా రెవరు ? ఈ లోకము నీ ఋణమును ఎప్పటికి తీర్చుకొనగలదు ? ప్రభూ ! నీ కరాలంబము ననుగ్రహింపుము.

భవాన్ స్వామీ ! య దాహం స్వ మాశ్రితో౽హం య దాశ్రయః
భర్తా భవా నహం భృత్యః పుత్రో౽హం చ పితా భవాన్
యది నాథ స్సనాథో౽హం మాం హాతుం జాతు నార్హసి
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

లక్ష్మీనారాయణదేవా ! నీవు స్వామి వైనప్పుడు నేను నీ సొమ్మును నీ వాశ్రయమైనప్పుడు ఆశ్రితుడను నేను నీవు భరించు భర్తవైనప్పుడు - నేను భృత్యు

డను. నేను పుత్రుడ నైనప్పుడు - నీవు నా తండ్రివి. నీవు నాథుడ వైనప్పుడు నేను సనాథుడను. ఇన్ని విధముల నున్న నన్ను నీ వెన్నటికిని వదలుట తగదు స్వామీ! నాకు నీ చేయూత నిమ్ము.

నమో వాఙ్మనసాతీత! అణుతశ్చాప్యణీయసే
నమో వాఙ్మనసప్రాప్య! మహతోఽపి మహీయసే
నమస్తే జగతాం నాథ! భూయో భూయో నమోనమః
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో!

మాటలకు, మనస్సునకు అతీతమైన దేవా! అణువు కంటె అణువైన నీకు నమస్కారము. మాటల చేతను, మనస్సు చేతను పొందదగిన ప్రభూ! గొప్పవైన, అన్నింటికంటె గొప్పవాడవైన నీకు నమస్కారము సర్వ లోకములకు నాథుడవైన లక్ష్మీనారాయణదేవా! నీకు మరల మరల నమస్కరించుచున్నాను నాకు నీ చేయూతనిమ్ము స్వామీ!

ప్రపన్నానాం విపన్నానాం చరణౌ తే వినిర్దిశన్
పాదాక్రాంతాన్ జనాం స్తాం స్తాన్ సముద్ధరతి య త్కరః
తం వందేఽహం సహోత్సాహం స్మారం స్మారం ముదాకరం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో!

ప్రపత్తి చేయువారికి, ఆపత్తి నొందినవారికి - నీ పాదములను నిర్దేశించుచు, పాదాక్రాంతులయిన ఆ యా శరణార్థులను ఏ యే కర ముద్దేశించుచున్నదో, ఆనందమున కాశ్రయమైన ఆ కరమును ఎంతో ఉత్సాహముతో స్మరించుచు నమస్కరించుచున్నాను శ్రీమన్నారాయణదేవా! నాకు నీ చేయూత ననుగ్రహింపుము.

సేవే శ్రీరంగ ధామానం స్వామినం రంగశాయినం
అముక్తమాల్యదా గోదా యస్య సంకీర్తన ప్రియా
కామం గొదా యువా మేవ సేవే భావేఽవిభాజితౌ
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో!

లక్ష్మీనారాయణప్రభూ ! 'ఆముక్తమాల్యద' యన్న ప్రసిద్ధి వడసిన గోదాదేవి ఎవరికి సంకీర్తన ప్రియయో, ఆ రంగశాయి యైన ప్రభువును - శ్రీరంగ నిలయుని సేవించెదను. నా భావమునందు అవినాభావము పొందియున్న మీ యిరువురిని తప్పక - 'గోద' యన్న ఏక నామముతోనే స్మరించి సేవించెదను స్వామీ ! ఊతగా నీ చేతిని నా కందింపుము.

అభయాదాయకోత్థేన తవ హస్తేన సంభవం
క్వణ క్వణ త్కంకిణీకం మంజు కంకణ శింజితమ్
ఆర్తో యథా శాంతి మంత్రం నిశమ్య హృది శామ్యతి
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

అభయము నిచ్చుటకై యెత్తిన నీ చేతినుండి పుట్టిన క్వణ క్వణ మను మువ్వల సవ్వడిని, మంజుల మగు కంకణశింజితమును - ఆర్తుడైన మానవుని శాంతి మంత్రమును విన్నట్లుగా విని, హృదయమునందు శాంతిని పొందుచున్నాడు లక్ష్మీనారాయణప్రభూ ! నాకు నీ కరము నాలంబముగా ననుగ్రహింపుము.

శ్రవణౌ త్వత్కథాలాపే రసనా త్వన్నామ కీర్తనే
నేత్రే తే రూప సౌందర్యే హస్తౌ తావక సేవనే
అంగాని సకలానీయు స్తథా మమ కృతార్థతాం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఓ లక్ష్మీనారాయణప్రభూ ! నా చెవులు నీ కథలు వినుటయందును, నా నాలుక నీ నామమును సంకీర్తించుటయందును, నా కన్నులు నీ సౌందర్యమును సందర్శించుట యందును నా చేతులు నీకు సేవలు చేయుటయందును - ఈ విధముగా నా యింద్రియము లన్నియు చరితార్థతను పొందును గాక ! ప్రభూ ! నాకు నీ చేయూత నిమ్ము.

మూర్తి ర్యస్య చ భక్తానాం నిక్షేపాలోకనాంజనం
కారుణ్యం చ ప్రపన్నానాం మనసాం హి రసాయనమ్
తం దేవం త్వాం సదా వందే పరభక్తి ప్రపత్తిభిః
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఎవరి యాకారము భక్తుల పాలిటి విశేష దర్శనమునకైన అంజనమో, ఎవరి కారుణ్యము ప్రపన్నుల మనస్సుల పాలిటిరసాయనమో, ఆ దేవుడవైన నీకు - అనన్య భక్తి యుక్తుడనై, ప్రపత్తితో అహర్నిశము ప్రణామము గావింతును. లక్ష్మీనారాయణదేవా ! ఊతగా నీ చేతిని నా కందింపుము.

యస్యోపరి కటాక్షాంశు స్తే సకృత్ పతతీహ వై
న తు కామం నిరీహ స్స్యాత్ సర్వైశ్వర్య ధురంధరః
కదాపి తస్య నోభీతి స్సదాపి ప్రీతి రేవ చ
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఎవరి మీద నీ కటాక్ష కిరణము ప్రసరించునో, అతడు నిశ్చయముగా సర్వ సంపన్నుడై, నిరీహు డగును. అతని కెప్పటికిని భయము కలుగనే కలుగదు. ఎల్లప్పుడు ఆతనికి ప్రేమయే అనుభవములో నుండును. లక్ష్మీనారాయణప్రభూ ! నాకు నీ కరము నాలంబముగా ననుగ్రహింపుము.

చతుష్టయే చ వేదానాం ధర్మశాస్త్ర కదంబకే
అష్టాదశ పురాణేషు మహాకావ్యేతిహాసయోః
దివ్యసూరి ప్రబంధేషు భవా నేవ ప్రకీర్తితః
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఓ లక్ష్మీనారాయణ ప్రభూ ! నాలుగు వేదములందును, అనేకములైన ధర్మశాస్త్రములందును, అష్టాదశ పురాణములందును, మహాకావ్యమైన రామాయణమునందును, మహేతిహాసమయిన భారతమునందును, దివ్యసూరి ప్రబంధములందును నీవే కీర్తింపబడితివి స్వామీ ! నాకు నీ కరము నాలంబనముగా ననుగ్రహింపుము.

వాల్మీకి రస్తు స వ్యాసః కాళిదాసోఽస్తు భారవిః
మాఘోఽస్తు భోజరాజోఽస్తు జయదేవోఽస్తు దేశికః
కో వా కవిః సుప్రసిద్ధో న కృత్వా తవ వర్ణనం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

శ్రీమ న్నారాయణ దేవా ! వాల్మీకి కానిమ్ము, వ్యాసుడు కానిమ్ము, కాళిదాసు కానిమ్ము, భారవి కానిమ్ము, మాఘుడు కానిమ్ము, భోజుడు కానిమ్ము, జయదేవుడు కానిమ్ము, వేదాంతదేశికుడు కానిమ్ము - నిన్ను వర్ణింపనిదే ఏ కవియు సుప్రసిద్ధుడు కాలేదు ప్రభూ ! నాకు నీ హస్తము నాలంబముగా నిమ్ము.

త్వ త్పాదాబ్జా సంగ భృంగా ఆంధ్రభాషా కవిత్రయం
శ్రీనాథః పోతనామాత్యః శ్రీకృష్ణ వసుధాధిపః
అన్నమార్య స్త్యాగరాజో రాజా విజయరాఘవః
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

తెలుగు భాషలో కవిత్రయ మైన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనయు, శ్రీనాథుడు, పోతనామాత్యుడు, శ్రీకృష్ణదేవరాయలు, అన్నమాచార్యులు, త్యాగరాజు, విజయ రాఘవ నాయకుడు - ఈ మొదలయినవా రందరును నీ పాదపద్మములందు ఆసక్తిని పొంది, ఆ మరందము నాస్వాదించిన తుమ్మెదలే స్వామీ ! నాకు నీ కరము నాధారముగా దయచేయుము

దేశ దేశాంతర వ్యాప్తం సర్వ విశ్వైక పాలకం
త్వాం సామీప్య కృతా ప్యాయో దేవ సేవే, క్షమస్వ మాం
లక్ష్మీనారాయణపురీ నివాసీ త్యభిధాయకం
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

లక్ష్మీనారాయణదేవా ! నీవు దేశ దేశాంతరములలో వ్యాపించియున్న వాడవు. సర్వ విశ్వమునకును ఏకైక పాలకుడవు నీవు సామీప్యము వలన లభిం చెడి ఆప్యాయము నాశించినవాడనై 'లక్ష్మీనారాయణపురీ నివాసి' అని నిన్ను పిలుచు చున్నాను. మన్నింపుము స్వామీ ! నీ చేయూత చేతన న్ననుగ్రహింపుము ప్రభూ !

శరణం శరణం విష్ణో ! కరుణాపరమావధే !
రక్ష రక్ష జగన్నాథ ! హే మహా మహిమోదధే !
జయ హే విశ్వకల్యాణ విధే ! చైతన్య శేవధే !
ప్రదేహి మే కరాలంబం లక్ష్మీనారాయణ ప్రభో !

ఓ విష్ణుదేవా ! కరుణాపరమావధీ ! శరణు శరణు ఓ జగన్నాథా ! మహా మహిమార్ణవా ! నన్ను రక్షింపుము. విశ్వ కల్యాణ విధాయకా ! చైతన్యఖనీ ! నీకు జయ మగుగాక ! ఓ లక్ష్మీనారాయణ ప్రభూ ! నాకు నీ కరము నాలంబనముగా నందింపుము.

సీతారామానుజాచార్య కాంక్షితం య త్త్వయా స్వయం
అత్ర రామానుజాచార్య ప్రతిష్ఠేన ప్రభాషితమ్
స్ఫూర్తిశ్రీ లిఖితం స్తోత్రం లక్ష్మీశ ! వరద ప్రియ !
త్వ త్కరాలంబపాత్రం స్యాత్ తద్ధి శృణ్వన్ పఠ న్నరః.

ఓ లక్ష్మీపతీ ! వరద ప్రియా ! సీతారామానుజాచార్యులు కోరినదియు, రామానుజాచార్య ప్రతిష్ఠితుడవైన నీచేతనే స్వయముగా చెప్పబడినదియు, స్ఫూర్తిశ్రీ చేత వ్రాయబడినదియునైన యీ స్తోత్రమును వినినవారును, చదివినవారును నిశ్చయముగా నీ కరాలంబనమునకు పాత్రు లగుదురుగాక !

## 6. లక్ష్మీనారాయణ హృదయము

శ్రీ లక్ష్మీ హృదయము .

హస్త ద్వయేన కమలే ధారయంతీం స్వ లీలయా
హార నూపుర సంయుక్తాం మహా లక్ష్మీం విచింతయేత్.

హస్తములయందు విలాసార్థముగా కమలములను ధరించుచున్నదియు, ముత్యాల హారములతోడను, అందెల తోడను ప్రకాశించుచున్నట్టియు నగు శ్రీ మహాలక్ష్మి భక్తు లగువారు ధ్యానింపవలయును.

కౌ శేయ పీత వసనా మరవింద నేత్రాం
పద్మద్వయాభయ దరోద్యత పద్మ హస్తామ్
ఉద్యచ్ఛతార్క సదృశం పరమాంక సంస్థాం
ధ్యాయే ద్విధీశ నత పాద యుగాం జనిత్రీమ్.

పట్టు పీతాంబరమును ధరించుచున్నదియు, కమలముల వంటి నేత్రములచే ప్రకాశించుచున్నదియు, అభయ వరప్రదానముల కొఱకు ఎత్తబడిన కమలముల వంటి హస్తములు గలిగినదియు, నూఱుగురు సూర్యులు ప్రకాశించునట్టి ప్రకాశముతో శ్రీ మహా విష్ణువు యొక్క తొడయందు కూర్చుండియున్నట్టిదియు, బ్రహ్మ రుద్రులచే నమస్కరింపబడుచున్నటువంటి చరణ ద్వంద్వము కలిగినదియు, సమస్త లోకములకు తల్లియు నైన లక్ష్మీదేవిని భక్తు డయినవారు ధ్యానింపవలయును.

వందే లక్ష్మీం పరశివమయీం శుద్ధ జాంబూన దాభామ్
తేజో రూపాం కనక వసనాం సర్వ భూషోజ్వలాంగీమ్
బీజాపూరం కనక కటకం హేమ పద్మం దధానా
మాద్యాం శక్తిం సకల జననీం సర్వ మాంగల్య యుక్తామ్.

సర్వోత్తమ మగు మంగళ స్వరూపిణియు, నిర్మల మగు బంగారపు కాంతి వంటి కాంతి గలిగినదియు, తేజ స్వరూపిణియు, బంగారు మయము లగు కటకములను ధరించినదియు, సర్వాభరణములచే ప్రకాశించుచుండు దేహము గలిగినదియు, బీజాంకుర రూపము లగు కర్ణభూషణములను, బంగారు కలశమును, బంగారు కమలమును ధరించినదియు, ముఖ్యురాలై నదియు, శక్తి స్వరూపిణియును, సమస్త శుభములతో ప్రకాశించుచున్నదియు నైన నిన్ను గురించి నమస్కరించుచున్నాను.

శ్రీమ త్సౌభాగ్య జననీం స్తౌమి లక్ష్మీం సనాతనీమ్
సర్వ కామ ఫలావ్యాప్తి సాధనైక సుఖావహామ్.

సంపత్తు కలిగినదియు, సంపత్తును కలుగజేయునదియు, సనాతనురాలయినదియు, భక్తులచే కోరబడినవి యెల్లను పొందుటకుసాధన మయిన పుణ్య రూప సుఖమును కలుగజేయునట్టి లక్ష్మీదేవిని గురించి నమస్కరించుచున్నాను.

సమస్త సంపత్సుఖదాం మహాశ్రియం
సమస్త కల్యాణకరీం మహాశ్రియమ్
సమస్త సౌభాగ్యకరీం మహాశ్రియం
భజామ్యహం జ్ఞానకరీం మహాశ్రియమ్

సమస్త సంపదలను ప్రసాదించునదియు, విశేషమైన ఐశ్వర్యము కలిగినదియు, సమస్తమైన సౌభాగ్యములను చేయునదియు, అధికమైన సౌందర్య సంపత్తి కలిగినదియు, విశేషమైన లావణ్యము కలిగినదియునైన లక్ష్మీదేవిని భజించుచున్నాను

విష్ణుస్తుతిపరాం లక్ష్మీం స్వర్ణ సర్ణ స్తుతి ప్రియామ్
వరదాభయదాం దేవీం వందే త్వాం కమలేక్షణే !

కమలములవంటి నేత్రములు గలిగిన ఓ లక్ష్మీదేవీ ! శ్రీమన్నారాయణుని యొక్క స్తోత్రమునందు ఆసక్తి కలిగినట్టియు, స్వర్ణ వర్ణము కలిగిన స్తోత్రమునందు ప్రీతి గలిగినట్టియు, వరముల నిచ్చునట్టియు, అభయ దానము చేయునట్టియు, దేవి స్వరూపిణివి నైన నిన్ను గురించి నమస్కరించుచున్నాను

సుతీవ్ర దారిద్ర్య తమోపహర్త్రై
నమోఽస్తు తే సర్వ భయాపహన్త్రై
శ్రీవిష్ణు వక్షస్థల సంస్థితాయై
నమో నమో సర్వ విభూతిదాయై.

ఉగ్రమయిన దారిద్ర్య మనెడు అంధకారమును నశింపజేయునదియు, సమస్త భయములను పోగొట్టునదియు, విష్ణువు యొక్క వక్షస్థలములో నివసించునదియు, సకలైశ్వర్యములను ఇచ్చునదియునైన లక్ష్మీదేవికి నమస్కారము.

యస్యాః కలాయాః కమలోద్భవాద్యాః
రుద్రాశ్చ శక్ర ప్రముఖాశ్చ దేవాః
జీవంతి సర్వేఽపి న శక్తయంతే
ప్రభుత్వ మాప్తాః పరమాయుషస్తే.

లక్ష్మీదేవి యొక్క ఒక కళ వలననే బ్రహ్మాది దేవతలును, ఏకాదశ రుద్రులను, ఇంద్రుడు మొదలుగా గల సమస్త మయిన దేవతలును - నానావిధ సామర్థ్యములతో గూడుకొనినవారలయి, ప్రభుత్వమును బొందినవార లయి జీవించుచున్నారు

కలయా తే యథా దేవి ! జీవంతి సచరాచరాః
తథా సంపత్కరీ లక్ష్మీః సర్వదా సంప్రసీద మే.

ఓ లక్ష్మీదేవీ ! నీ యొక్క ఒక కళచేత స్థావరజంగమములతో గూడిన లోకము జీవించుచున్నట్లే, ఆలోకములను కటాక్షముచేత వీక్షించుచున్నదియు, దేవతాస్వరూపిణియునైన నీవు సర్వదా నన్ననుగ్రహింపుము.

నారాయణ హృదయము ..

ఉద్య దాదిత్య సంకాశం పీత వస్త్రం చతు ర్భుజమ్
శంఖ చక్ర గదా పాణిం ధ్యాయే ల్లక్ష్మీపతిం హరిమ్.

ఉదయించుచుండు సూర్యుని కాంతి వంటి కాంతి గలవాడును, పీతాంబరమును ధరించినవాడును, నాలుగు భుజములు గలవాడును, శంఖము - చక్రము - గద మొదలయినవి హస్తములయందు గలవాడును లక్ష్మీపతియునైన శ్రీమన్నారాయణుని ధ్యానింపవలెను.

త్రైలోక్యాధారచక్రం తదుపరి కమఠః తత్రచానంత భోగీ
త న్మధ్యే భూమి పద్మాంం కులశిఖర దళం కర్ణికాభూత మేరుమ్
తత్ర స్థం శాంతమూర్తిం మణి మయ మకుటం కుండలో
ద్భాసితాంగం
లక్ష్మీనారాయణాఖ్యం సరసిజ నయనం సంతతం చింతయామి.

త్రిలోకములకు ఆధార శక్తియు, ఆ శక్తికి పైన ఆదికూర్మము, అందు ఆది శేషుడును, ఆ యాదిశేషుని శిరస్సునందు గల పర్వతము లనెడి రేకులు గలదియు, నడిమి మిద్దెమయిన మేరు పర్వతము గల భూమి యనెడి పద్మమునందు నివసించు వాడును, శాంత స్వరూపుడును, రత్నమయ మయిన కిరీటము, మకరకుండలముల చేత ప్రకాశింపజేయబడిన దేహము గలవాడును, పద్మములవంటి నేత్రములు గల వాడును, లక్ష్మీకాంతుడు నగు నారాయణ నను పేరు గల శ్రీమహావిష్ణువును నే నెల్లప్పుడు ధ్యానించుచున్నాను

నారాయణః పరంజ్యోతి రాత్మా నారాయణః పరః
నారాయణః పరంబ్రహ్మ నారాయణ ! నమోఽస్తు తే.

శ్రేష్ఠ మయిన తేజస్సు నారాయణుడు. శ్రేష్ఠ మయిన ఆత్మ స్వరూపము (అనగా - పరమాత్మ) నారాయణుడు. సర్వోత్తమ మయిన బ్రహ్మము అనగా బ్రహ్మ పదార్థము నారాయణుడు ఓ నారాయణా ! నీకు నమస్కారము

నారాయణః పరంధామ ధ్యానం నారాయణః పరః
నారాయణపరో ధర్మో నారాయణ ! నమోఽస్తు తే.

శ్రేష్ఠ మయిన స్థానము నారాయణుడు శ్రేష్ఠ మయిన ధ్యానము నారాయణుడు. శ్రేష్ఠ మయిన ధర్మము నారాయణుడు.

నారాయణః పరో వేద్యః విద్యా నారాయణః పరా
విశ్వం నారాయణ స్సాక్షాత్ నారాయణ ! నమోఽస్తు తే.

శ్రేష్ఠ మయిన తెలియదగినవాడు, నారాయణుడు. శ్రేష్ఠ మయిన విద్య నారాయణుడు. ప్రత్యక్షముగా ప్రపంచము నారాయణుడు. అట్టి నారాయణా ! నీకు నమస్కారము.

నారాయణా ద్విధి ర్జాతో జాతో నారాయణా ద్భవః
జాతో నారాయణా దింద్రో నారాయణం నమోఽస్తుతే.

నారాయణుని వలన బ్రహ్మ పుట్టెను. నారాయణుని వలన శివుడు పుట్టెను. నారాయణుని వలన ఇంద్రుడు పుట్టెను అట్టి నారాయణా ! నీకు నమస్కారము.

రవి ర్నారాయణ స్తేజః చంద్రో నారాయణో మహః
వహ్ని ర్నారాయణ స్సాక్షాత్ నారాయణ నమోఽస్తు తే.

సూర్యు డనెడి తేజస్సు నారాయణుడు చంద్రు డనెడి తేజస్సు నారాయణుడు. అగ్ని ప్రత్యక్షముగా నారాయణుడు. అట్టి నారాయణ నీకు నమస్కారము.

నారాయణ ఉపాస్య స్స్యాత్ గురుః నారాయణః పరః
నారాయణః పరో బోధో నారాయణ ! నమోఽస్తు తే.

ఉపాసన చేయదగిన దేవత నారాయణుడు శ్రేష్ఠ మయిన ఆచార్యుడు నారాయణుడు. శ్రేష్ఠమైన బోధము నారాయణుడే. అట్టి నారాయణా ! నీకు నమస్కారము.

నారాయణ ఫలం ముఖ్యం సిద్ధి ర్నారాయణ స్సుఖమ్
సేవ్యో నారాయణ శ్శుద్ధం నారాయణ ! నమోఽస్తు తే.

ముఖ్యమైన ఫలము నారాయణుడు సుఖము నారాయణుడే. శుద్ధు డయిన సేవింపదగినవాడు నారాయణుడే. అట్టి నీకు నమస్కారము

## 7. శ్రీ లక్ష్మీనారాయణ అష్టోత్తర శత నామ స్తోత్రము

శ్రీ ర్విష్ణుః కమలా శార్ఙ్గీ లక్ష్మీ ర్వైకుంఠ నాయకః
పద్మాలయా చతు ర్బాహుః క్షీరబ్ధి తనయాచ్యుతః
ఇందిరా పుండరీకాక్షో రమా గరు డవాహనః
భార్గవీ శేషపర్యంకో విశాలాక్షీ జనార్దనః
స్వర్ణాంగీ వరదో దేవీ హరి రిందుముఖీ ప్రభుః
సుందరీ నరక ధ్వంసీ లోకమాతా మురాంతకః
భక్తప్రియా దానవారిః అంబికా మధుసూదనః
వైష్ణవీ దేవకీపుత్రో రుక్మిణీ కేశిమర్దనః
వరలక్ష్మీ ర్జగన్నాథః కీరవాణీ హలాయుధః
నిత్యా దృఢవ్రతో గౌరీ శౌరిః కాంతా సురేశ్వరః
నారాయణీ హృషీకేశః పద్మహస్తా త్రివిక్రమః
మాధవీ పద్మనాభ శ్చ స్వర్ణవర్ణా నిరీశ్వరః
సతీ పీతాంబరః శాంతా వనమాలీ క్షమాఽనఘః
జయప్రదా బలిధ్వంసీ వసుధా పురుషోత్తమః
రాజ్యప్రదాఽఖిలాధారో మాయా కంస విదారణః
మహేశ్వరీ మహాదేవో పరమా పుణ్యవిగ్రహః
రమా ముకుంద స్సుముఖీ ముచికుంద వరప్రదః
వేద వేదాబ్ధి జామాతా సురూపాఽర్కేందులోచనః
పుణ్యాంగనా పుణ్యపాదో పావనీ పుణ్యకీర్తనః
విశ్వప్రియా విశ్వనాథో వాగ్రూపీ వాసవానుజః
సరస్వతీ స్వర్ణగర్భో గాయత్రీ గోపికా ప్రియః

యజ్ఞరూపా యజ్ఞభోక్తా భక్తాభీష్ట ప్రదా గురుః
స్తోత్ర ప్రియా స్తోత్రకారః సుకుమారీ సుపర్ణగః
మానినీ మందర ధరో సావిత్రీ జన్మ వర్ణశః
మంత్ర గోప్త్రి మహేష్వాసో యోగినీ యోగి వల్లభః
జయప్రదా జయకరః రక్షిత్రీ సర్వ రక్షకః
అష్టోత్తర శతం నామ్నాం లక్ష్మ్యా నారాయణస్య చ
యః పఠేత్ ప్రాత రుత్థాయ సర్వదా విజయా భవేత్.

## 8. శ్రీ లక్ష్మీనారాయణ మంగళాశాసనము

జనన్యై సర్వ లోకానాం రమణ్యై శార్ఙ్గధన్వినః
మంగళానా మధీశిత్రై శ్రియై స్తా న్నిత్యమంగళమ్.

సకల లోకములకు తల్లియు - నారాయణునకు దేవేరియు, శుభముల కధిపతియునైన లక్ష్మిదేవికి నిత్యమంగళము [అగుగాక !]

ఇచ్ఛా గృహీ తాభిమత బహు విగ్రహ శాలినే
లక్ష్మీనారాయణా యాస్తు స్వామినే మమ మంగళమ్.

ఇచ్ఛతో స్వీకరింపబడిన అనేక దేహములతో నొప్పుచున్నట్టియు - నా స్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

భక్తలోక మనోభీష్ట రూప విభ్రమశాలినే
లక్ష్మీనారాయణా యాస్తు స్వామినే మమ మంగళమ్.

భక్తుల మనోభీష్టములైన అర్చామూర్తులచేతను, విలాసముచేతను, నా స్వామియైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

కృపాద్యఖిల కల్యాణ గుణ రత్నైకరాశయే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

కరుణ మున్నగాఁగల సకల కల్యాణ గుణము లనెడు రత్నములకు ముఖ్య నిధి యైనవాఁడును, నాస్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

సర్వేశ్వరరాయ సర్వాంతరాత్మనే పరమాత్మనే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

విశ్వమునకు నాయకుడును - విశ్వములోన నుండువాఁడును, పరమాత్మయు, నా స్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

స్వేచ్ఛాధీన జగత్సర్గ స్థేమ ప్రళయకేళయే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

తన వశములో నుండు జగత్తునకు సంబంధించిన సృష్టి స్థితి సంహారములు గలవాఁడును, నా స్వామియునైన లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

వ్యాప్తజ్ఞానాఖిల బహి రంతరాత్మ ప్రవృత్తయే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

సమస్త లోకములో - లోపల, వెలుపల, అంతటను వ్యాపించి యుండువాఁడును, చేతనుల ప్రవృత్తులను చూచుచుండువాఁడును, నా స్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

సర్వోత్కృష్ట స్వానురూప భూషణాయుధశాలినే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

అన్నింటికంటెను శ్రేష్ఠమైనట్టియు, తనకు తగినట్టియునైన విభూషణములను, ఆయుధములను ధరించి ప్రకాశించు నా స్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక !

భూలోకే భక్త రక్షార్థం ప్రత్యక్ష మవభాసతే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

భూలోకమునందు భక్తులను పాలించునిమిత్తము ప్రత్యక్షముగ ప్రకాశించుచు అవతరించు వాఁడును, నా స్వామియునైన లక్ష్మీనారాయణస్వామికి మంగళ మగుగాక!

దేశ కాలాఽపరిచ్ఛేద్య స్థిత్యైశ్వర్యాదిశాలినే
లక్ష్మీనారాయణాయాస్తు స్వామినే మమ మంగళమ్.

దేశముచేతను, కాలముచేతను కొలత వేయుటకు శక్యముగాని మహోన్నత స్థితితో - ఐశ్వర్యాదులతో నొప్పారునట్టియు, నా స్వామియునైన శ్రీ లక్ష్మీనారాయణునకు మంగళ మగుగాక!

* * *

మంగళాశాసనపరైః మదాచార్య పురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్.



శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః



# రహస్య గ్రంథములు

## ( సంపాదకీయము )

" లక్ష్మీనాథ సమారంభాం నాథ యామున మధ్యమామ్
అస్మదాచార్య పర్యన్తాం వందే గురుపరంపరామ్. "

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతము మన భారత దేశమున చిర కాలము నుండియు ప్రచలిత మగుచున్నది. ఐనదో - ఇందుకు సంబంధించిన సంస్కృత ద్రావిడ వేదాంతములు రెండును నాథమునుల నుండియే బహుళ ప్రచారమునకు వచ్చినట్లు స్పష్ట మగుచున్నది. అటులనే, శ్రీవైష్ణవ దర్శన రహస్య గ్రంథ రచనా విధానముకూడ నాథమునుల నుండియే ఆరంభమైనట్లు కానవచ్చును.

బాదరాయణ, బోధాయన, టంక, గుహదేవ, భారుచి, భర్తృమిత్ర, భర్తృప్రపంచ, ద్రవిడాచార్యాదులచే ప్రవర్తింపజేయబడిన సంస్కృత వేదాంత సమూహము - పరాంకుశ, పరకాలాదులచే ప్రవర్తింపజేయబడిన ద్రావిడ వేదాంతామృతము - ఈ రెండును ఒక ప్రవాహ రూపమున రూపొంది, 'నాథమునులు' అను పర్వతము నుండి ప్రవహించి, యామునాచార్యులద్వారా 'శ్రీ రామానుజులు, అను సరస్సులోనికి వచ్చి చేరినవి. నాథమునులు ప్రాచీనమైన శ్రీవైష్ణవ దర్శనమును పునరుద్ధరింపజేయుటేగాక, న్యాయదర్శనము- యోగ దర్శనము - పురుష నిర్ణయము - అను మూడు రహస్య

గ్రంథములను కూడ రచించిరి. అదియునుగాక, ఈ రహస్య సంప్రదాయమును ఆ మహనీయులు యోగ మార్గముతో మేళవించి, తామనుష్ఠించి, భగవంతుని సాక్షాత్కార భాగ్యమును పొంది, ఆ యనుభవ విశేషములను 'కురుకావలప్పన్' అను తన శిష్యున కుపదేశించి, తమ పౌత్రు లగు యామునాచార్యుల కుపదేశింపవలసిన దని ఆయనను ఆజ్ఞాపించిరి. కావున, ఈ రహస్య సంప్రదాయము నాథమునుల నుండియే వచ్చినట్లు స్పష్ట మగును. కాని, నాథమునుల రహస్య గ్రంథములందలి కొన్ని యంశములను మాత్రము వారి పౌత్రు లగు యామునాచార్యులు - 'ఆగమ ప్రామాణ్యము' మున్నగు తమ గ్రంథములలో - సందర్భోచితముగా అట నట ఉటంకించుట మాత్రమే తప్ప, మహనీయు లగు నాథమునుల గ్రంథములు యథాతథముగ నేటివఱకును లభింపకుండుట - మన యభాగ్య మనియే భావింపవచ్చును.

యామునాచార్యుల యనంతరము భగవద్రామానుజులు - గద్యత్రయాది గ్రంథములను రచించుట మూలముననే గాక, ఉపదేశ పరంపరల మూలముననుగూడ ఈ రహస్య సంప్రదాయమును సుప్రతిష్ఠిత మొనర్చిరి.

వారి పంచాచార్యులలో నొక రగు 'గోష్ఠీపూర్ణులు' కొన్ని రహస్యములను రచించియున్నారు. అవ్వి 'తిరుక్కోట్టియూర్ నంబి రహస్యములు' అని వ్యవహరింపబడుచున్నవి.

శ్రీమద్రామానుజుల అంతరంగిక శిష్యు లగు కూరత్తాళ్వారుల కుమారులైన పరాశరభట్టరును - ఎనిమిది (౮) శ్లోకములలో - రహస్య త్రయమును విపులముగా వెల్లడించియున్నారు. ఆ శ్లోకములు - 'అష్ట శ్లోకి' యనుపేర సుప్రసిద్ధమై యున్నవి. అదియును గాక, ఈ పరాశర భట్టరు - శ్రీగుణ రత్నకోశము, శ్రీరంగ రాజస్తవము, భగవద్గుణ దర్పణము, తత్త్వ రత్నాకరము - మున్నగు గ్రంథములను సైతము రచించుచు, ఆ గ్రంథములందును మఱికొన్ని రహస్యములను నిక్షిప్తము గావించియున్నారు.

పరాశరభట్టరు వారి శిష్యు లగు 'వేదాంతి' యనబడు 'నంజీయరు'వారును - కొన్ని ద్రావిడ దివ్యప్రబంధములకు వ్యాఖ్యానములు రచించుచు, వానిలో - అట నట కొన్ని రహస్యము లను బోధించియున్నారు.

పెరియవాచ్చాం పిళ్ళై, ఆచ్చాన్ పిళ్ళై - మొదలగువారు - నిగమన ప్పడి, పరంద రహస్యమ్ - మొదలగు గ్రంథములను రచించుచు, ఆ యా గ్రంథములలో - అనేక రహస్యములను ఉపదేశించి యున్నారు. వస్తు తత్త్వమునుబట్టి, ద్రావిడ వేద మనబడు ఆళ్వారుల దివ్య ప్రబంధములును, ఆ ప్రబంధ వ్యాఖ్యానములును ఈ రహస్య సంప్రదాయమున కే చేరియున్నను, 'రహస్యములు' అను నానుడితో గ్రంథావతరణము నాథమునుల నద్దనుండియే వచ్చియున్న దనుట స్పష్టము.

ఈ రీతిగా చిర కాలము నుండియు సంస్కృత, ద్రావిడ భాష లలో వచ్చిన రహస్య విషయముల నన్నిటిని క్రోడీకరించి, మథించి, ఆ రహస్యములలోని సారము నంతటిని, సంస్కృత ద్రావిడ భాషా ద్వయ సమ్మిళితమైన సరళ మధుర మగు మణిప్రవాళ భాషలో - అగుమంత్రార్థము, శ్రీవచన భూషణము మొదలగు పదునెనిమిది (18) గ్రంథములలో పిళ్ళలోకాచార్యులవారు నిబంధించి, 'విశద వాక్ శిఖామణి' యను బిరుదమును పొందియున్నారు. అయ్యవియే 'అష్టాదశ రహస్యములు' అని ప్రసిద్ధి గాంచియున్నవి. ఈ రహస్య ములలోని సారాంశమును గ్రహింపగల్గినవారు - పరమ ధన్యులు.



# విషయానుక్రమణిక



తిరుమంత్ర వివరణము
ఓంకార స్వరూప వివరణము
'నమః' శబ్దార్థ వివరణము
నారాయణ శబ్దార్థ వివరణము
ద్వయ మంత్ర వివరణము
చరమశ్లోక వివరణము
తత్త్వ త్రయము
అర్థ పంచకము
అర్చిరాది
ప్రపన్న పరిత్రాణము
ప్రమేయ శేఖరము
నవ విధ సంబంధము
నవ రత్న మాల
సంసార సామ్రాజ్యము
శ్రీవచన భూషణము
ఉపసంహారము






శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేఽర్థినామ్

# శ్రీనివాస స్తవ రాజము

'భగవత్కవి'

శ్రీమాన్ ఓంజమూరి గోపాలకృష్ణమాచార్యులు,

బి.ఏ., బి యల్.



శ్రీ శేష శైలాగ్ర శృంగవీర విహార !
విలసిత రత్న గ్రైవేయ హార !
శ్రీవత్స కౌస్తుభ శ్రీ భూ లస ద్వక్ష !
సత్కృపా నిష్యంద సారసాక్ష !
శంఖ చక్ర ప్రభా జ్వలితోర్ధ్వ కరపద్మ !
ఆనంద నిలయ విమాన పద్మ !
ధృతోర్ధ్వపుండ్ర సందీపితోజ్జ్వల ఫాల !
సామగాన విలోల చారు శీల !

విజిత శతకోటి మన్మథ వేంకటేశ !
దివ్య మహిమాద్భుత చరిత్ర తిరుమలేశ !
చిదచిదీశ్వర ! గోవింద ! చిద్విలాస !
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

దండంబు శేష భూ ధర మస్తక నివాస !
సన్నుతి వేంకట శైలవాస !
కైమోడ్పు లివె నీకు గరుడాచల నివాస !
నతులయ్య నారాయణగిరి వాస !

అంజలి ఘటియింతు నంజనాచలవాస !
వందనమ్ములు వృషభాద్రివాస !
శిరసా నమస్కృతుల్ తిరుమల స్థిరవాస !
ప్రణతులు సర్వప్రపంచవాస !
పిలచినం బల్కుచుండెడి వేల్పు వనుచు
ధరను కలియుగ ప్రత్యక్ష దైవ మనుచు
పేరు గన్నట్టి సామి ! జోహారు నీకు
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

స్మరియించు మాత్రాన సకల పాపక్షయం
కరమైన యట్టి బంగారుకొండ !
దర్శించు మాత్రాన ధర్మార్థ కామ మో
క్షమ్ముల నొసగు బంగారుకొండ !
ప్రాపించు మాత్రాన భవ బంధముల నూడ్చి
కైవల్య మొసగు బంగారుకొండ,
బ్రహ్మ రుద్రేంద్రాది బహుకోటి సురవరుల్ !
కడు భక్తి గొల్చు బంగారుకొండ !
ఆదిశేషుని రూపాన నవతరించి
యిలను వైకుంఠముగ జేసి వెలయు కొండ.
గరుణ నిండంగ గొల్చు బంగారుకొండ !
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

'వేం' శబ్దమునకు కిల్బిష మంచు నర్థంబు
'కట' శబ్ద మరయ గొల్చుటను దెలుపు
పాప దాహక శక్తి బరగు శైలముగాన
'వేంకటాద్రి' యటంచు వినుతి కెక్కె

'వేం' అమృత స్మాన వే రొక్క యర్థంబు
'కట' మన్న నైశ్వర్య గరిమ యంద్రు
ఇహ పర సంపద లిచ్చు శైలము గాన
'వేంకటాద్రి' యటంచు వినుతి కెక్కె

పాప దాహక శక్తి నైశ్వర్య దాన
పటిమ నెసగుట వేంకట పతి వటంద్రు
సార్థ కాహ్వాయ ప్రభు వీవు సారసాక్ష !
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

ధర్మమ్ము నాల్గు పాదమ్ముల జరియించు
కృత యుగమ్మున వృషగిరి లనంగ
త్రేతా యుగమ్మున వాతాత్మజుడు పుట్టు
కతమున నంజనాద్రం బనంగ
ద్వాపరమ్మున దొంటి పాపరేనిం బట్టి
ఆహ్వాయ మ్మగును శేషాద్రి యనగ
పాప దాహక క్రియా పాటవమ్మున కలి
యుగమందు వేంకట నగ మనంగ

నాల్గు యుగముల నాలుగు నామములను
వాసి గాంచిన గోత్రమ్ముపైన వెలసి
కోర్కె లొసగెడి బంగారు కొండ వీవు
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

బదరికాశ్రమమందు స్వాంశ సంభూతుడౌ
నరునకు తిరుమంత్ర సారము నిచ్చి
శ్రీ వైకుంఠ పురాన శ్రీదేవి కనుసన్నత్తి
ద్వయ మంత్ర రాజ ప్రదాన మిచ్చి
కురుభూమి పార్థున కరదంబునం దుండి
చరమ సుశ్లోకమ్ము గరుణ నిచ్చి
శ్రీ రహస్యత్రయ పారమ్యమును జాటి
ముక్తి మంటప మార్గమును రచించి

పరమ కరుణార్ద్రి మానసాంతర మునందు
చేతనోజ్జీవ నాకాంక్ష భూతి యొప్ప
నిలను తిరుమల గిరిపైన వెలసి తీవు
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

త్ర్యక్షర కూటస్థా ప్రణవ మనన్యార్హ
శేషత్వమును చాటి చెప్పు నంట
'నమః' పద ముద్ఘాటనమ్ము సేయు ననన్య
శరణత్వ తత్త్వంపు గరిమ నంట
'నారాయణ' యనలగ జాలు ననన్య
భోగ్యత్వ సౌభాగ్య భూతి నంట
మహిత మష్టాక్షరీ మంత్రమ్ము 'ఓం నమో
నారాయణాయ' యనంగ నొప్పు

ఇట్టి నీ తిరుమంత్ర రహస్య మెరుగ
మాదృశుం డెట్లు నేర్చునో మంగళాంగ !
దయను నన్నేలి దయ చేయు దానవహ !
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

శ్రవణమ్ము కీర్తన స్మరణమ్ము పాదసే
వన మర్చనమ్ము వందన మటంగ
దాస్యమ్ము సఖ్య మాత్మ నివేదన మ్మన
నెలయు తొమ్మిది విధమ్ములను భక్తి
వర పరీక్షిత్తు నా సురమౌని ప్రహ్లాద
భార్గవ పృథు లను భాగవతులు
సక్రూర వైనతే యార్జున బలిచక్ర
వర్తులు చేసిరి వరుస నగ్రము

భక్తి హీనుడు నజ్ఞాన వశుడ నయ్యు
వారి వలె భక్తి సేయంగ నేర నయ్యు
కరుణ మార్జాల కైశోర సరణి నేలు
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

జ్ఞానమ్ము బలము నైశ్వర్యమ్ము వీర్యమ్ము
శక్తి తేజముల కాశ్రయుడ వగుచు
సంపూర్ణ షడ్గుణైశ్వర్య సంపన్నుడా
భగవంతుడవు నీవు భవ్యచరిత !

కుటిలంపు కామమ్ము క్రోధమ్ము లోభమ్ము
మోహమున్ మద మత్సరాహిరూప
సకలారి షడ్వర్గ సందష్టుడ, విషయ
లంపటుడను, భోగ లాలసుడను

నీకు నా కెట్లు పొసగునో నీరజాక్ష !
సరస నిర్హేతుక కటాక్ష జాయమాన
కృపకు పాత్రుని జేసి సంప్రీతి నేలు
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

సంపూర్ణ షడ్గుణైశ్వర్య సంపన్నత
బరవాసుదేవాఖ్య వరలు నీవు
జ్ఞానమ్ము బలము యుష్మద్గుణమ్ములు గాగ
సంకర్షణాఖ్యతో జనుదు వీవు
ఐశ్వర్య వీర్యమ్ము లధి గుణమ్ములు గాగ
ప్రద్యుమ్న నామాన బరగు దీవు
శక్తి తేజస్సు లాశ్రయ గుణమ్ములు గాగ
వనిరుద్ధు డను పేర దనరు దీవు

పాలకడలిని నాల్గు వ్యూహాల బొలిచి
విశ్వ చక్రమ్ము ద్రిప్పెదు విశ్వరూప !
అండ జేరితి గరుణ గైదండ నీవె
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

'కేశవా !' యని నిన్ను కీర్తించినంతనే
పాపౌఘములు పటాపంచ లగును
'నారాయణా !' యన్న నామమ్ము బఠియింప
దురిత జాలమ్ములు దూర మగును
'మాధవా !' యని నిన్ను మదిని స్మరించిన
మంగళానీక ముమ్మడిగ జేరు
'గోవింద' యని నిన్ను కూర్మితో బిలువంగ
సకల శోభనములు సరస జేరు

'విష్ణు' నామమ్ము నోరార వినుతి సేయ
కర్మ బంధాలు విడివడి కడచి చనును
స్వామి ! నీ నామ వైభవ మ్మేమి జెప్ప !
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

'మధుసూదనా !' యంచు మది దలంచిన కొంత
బహు పాశములు ద్రెళ్ళిపడునుగాదె !
'హే త్రివిక్రమ !' యంచు నింపుమీరగ బాడ
భవ పాశములు ద్రెళ్ళి పడును గాదె !
'వామనా !' యని నిన్ను వాయార బాడంగ
మోహ పాశము ద్రెళ్ళిపోవుగాదె
'శ్రీధరా !' యని నిన్ను చిత్త మారగ బాడి
కర్మ పాశము ద్రెళ్ళి కడచు గాదె !

వర 'హృషీకేశ !' 'పద్మనాభా !' యటంచు
రక్తిమీరగ 'దామోదరా !' యటంచు
నోరు నొవ్వంగ బాడంగ జేరు సిరులు
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

స్వస్వరూపమ్ము పర స్వరూపము పురు
షార్థ స్వరూపమ్ము లనగ మూడు
నాపై నుపాయ స్వరూప విరోధి స్వ
రూపమ్ము లన రెండు దీపితమ్ము
లర్థ పంచక మంచు రందు రవ్వానిని
శ్రీవైష్ణవాచార్య శ్రేష్ఠు లర్థి
చేతనోజ్జీవన శ్రీకరమ్ములు వీని
జ్ఞాన లబ్ధియె మోక్ష కారకమ్ము

ననుచు వచియింత్రు తత్త్వజ్ఞులైన బుధులు
వాని దెలియంగ నాఁబోంటివాని కగునె ?
నీదు నిర్వ్యాజ కృప నన్ను చేదుకొనవె
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

'గోవింద !' యని నిన్ను కోరి పిల్చిన యంత
నో యంచు బల్కుచునోయి నీవు
నిను నమ్మినట్టివానిని యెట్టిడైనను
కంటి రెప్పను బోలె కాతు వీవు
ఇడుము లందున నీకు ముడుపులం గట్టంగ
వెతల బోఁజూపెడి చతురు డీవు
దయయే స్వరూపమై ధరలో నెలసె నంచు
తత్త్వవేత్తలు చెప్పు తత్త్వ మీవు

పాపముల గోటి చేసిన పాపి నైన,
నీకు శరణాగతుం డంచు నెగడ నేని
పాప రహితుని జేసి కాపాడు దీవు
శేషశైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

కను లున్న ఫల మేమి ? కరవు దీరంగ నిన్ను
కాంచగా గల్గెడి కలిమి లేక
చెవు లున్న ఫల మేమి ? చవులూరు నీ దివ్య
గాధలన్ వినెడి భాగ్యమ్ము లేక
కరముల ఫల మేమి ? నిరతమ్ము నీ పాద
పూజనమ్ములు సల్పు భ్రాంతి లేక
పదముల ఫల మేమి ? పలుమారు నీ క్షేత్ర
యాత్రలం జేయంగ నాస్థ లేక

రసన గల్గిన ఫల మేమి ? రమణ ! నీదు
దివ్య నామామృతాస్వాదన వ్యసన వి
లోల గాకున్న శ్రీ రమా లోల ! శ్రీశ !
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

స్వర్లోక వాహినీ స్వచ్ఛాంబుపూర సం
క్షాళిత పదపద్మ ! శరణు శరణు
లక్ష్మీ లలిత పాద లాక్షా రసా సిక్త
తరళ మహోరస్క ! శరణు శరణు
శంఖ చక్ర ప్రభా జాజ్వల్య మాన హ
స్తాంబురుహ ద్వయ శరణు శరణు
కస్తూరి లేఖాలత ఘనసార ముక్తి వి
శాలోర్ధ్వపుండ్రాంక ! శరణు శరణు

శరణ మాశ్రిత వత్సల ! శరణు శరణు
శరణ మాపన్న సంత్రాణ ! శరణు శరణు
శరణు భవ బంధ విచ్ఛేద ! శరణు శరణు
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !

మంగళం బలమేలు మంగా లసద్దివ్య
మహిత వక్షోవీర ! మంగళంబు
జయ మంగళము నీకు జన్మ దుఃఖాబ్ధిని
ర్మగ్న సంతారక ! మంగళంబు
శుభమంగళలు నీకు నుభయ విభూత్యేక
మహనీయ నాయక ! మంగళంబు
నిత్యమంగళము నీ కత్యంత కరుణా త
రంగితాంత స్సార మంగళంబు

మహిత మంగళ మాద్యంత రహిత ! నీకు
సకల కల్యాణ గుణ గణ సార్వభౌమ !
వరద ! శ్రీనాథ ! మన్నాథ ! భద్ర మస్తు
శేష శైలేశ ! జగదీశ ! శ్రీనివాస !



# అర్చావతార వైభవము

' సాహిత్య విద్యా ప్రవీణ '

డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు,

ఎం.ఏ., పిహెచ్.డి.



## ఉపక్రమము

సమస్త జగత్తులయొక్క సృష్టి - స్థితి - లయములకు కారణమైనవాడును, అపార సౌందర్యమునకును, అనంత కల్యాణ గుణములకును నిధి యైన వాడును జ్ఞానము - శక్తి - బలము - ఐశ్వర్యము - వీర్యము - తేజస్సు అను ఆరు గుణములు కలిగి, భగవాన్ అను శబ్దముచే వ్యవహరింపదగువాడును, జ్ఞానానందములే స్వరూపముగను, గుణములుగను కలవాడును, ఆర్తుడు - జిజ్ఞాసువు - అర్థార్థి - జ్ఞాని అను నాల్గు విధములుగా నున్న భక్తులచే ఆశ్రయింపబడువాడును, తన నాల్గు భుజములచేతను ధర్మము - అర్థము - కామము - మోక్షము అను నాలుగు పురుషార్థములను అనుగ్రహించువాడును. దేవతలు మనుష్యులు మున్నగు జీవు లందరికు నేత్రానందమును కలిగించునట్టిదియు, ప్రకృతి సంబంధ మెంతమాత్రము లేనట్టిదియు నగు దివ్య మంగళ విగ్రహముతో కూడి, పరమపద మని పిలువబడు శ్రీవైకుంఠమునందు - అనంతుడు, గరుడుడు, విష్వక్సేనుడు మున్నగు పరిజనముచే నిత్యము సేవింపబడువాడును, శ్రీ - భూ - నీళ లను దివ్య మహిషులకు నాయకుడును అయిన శ్రీమన్నారాయణుడు - ఐదు విధము లగు రూపములతో కూడినవాడై లోకముల ననుగ్రహించు

చుండును అని ఆగమములు నుడువుచున్నవి. ఆ యైదు రూపములును - పర రూపము, వ్యూహ రూపము, విభవ రూపము, అంతర్యామి రూపము, అర్చా రూపము అని వ్యవహరింపబడుచున్నవి.

## పర రూపము

పైని పేర్కొనబడిన జ్ఞానము, శక్తి మున్నగు ఆరు గుణములతో కూడియుండి, కేవలము మోక్షమును పొందిన ముక్త జనులకు మాత్రమే భోగింపదగినదై యున్న అప్రాకృత దివ్య రూపము కలది పర రూపము. ఆనంద మయముగా శ్రీవైకుంఠమున అనంత - గరుడ - విష్వక్సేనాదులచే నిత్యము సేవింపబడుచుండునది ఈ పర రూపమే.

" త ద్విష్ణోః పరమం పదం । సదా పశ్యంతి సూరయః "

ఇత్యాది శ్రుతి వచనములందు - సూరులచే దర్శింపబడునదిగా చెప్ప బడినది. ఈ పర రూపము - శేష పర్యంకమున సుఖముగ వేంచేసి యుండి, నాల్గు భుజములతో, పద్మ పత్రముల వలె విశాలములైన నేత్రములతో ఉజ్జ్వల మగు కిరీటముతో, కటక - కుండల - హార - కేయూర - నూపురాది దివ్యాభరణములతో, కౌస్తుభ మణితో, శ్రీవత్స లాంఛనముతో, పీతాంబరాలంకృత దేహముతో కూడిన శ్రీమన్నారాయణ మూర్తియే ఈ పర మూర్తియే 'పరవాసుదేవ' నామముతో కూడ పిలువబడుచుండును.

## వ్యూహ రూపము

ఈ పరవాసుదేవ భగవానుచే - వాసుదేవ, సంకర్షణ ప్రద్యుమ్న, అనిరుద్ధ నామములతో గూడిన నాలుగు రూపములను ధరించి, జగత్తుయొక్క సృష్టి - స్థితి - లయముల నెరవేర్చుచుండును. ఈ వ్యూహ రూపములు కూడ ఈ నాలుగుమాత్రమే కాక, అనేకములు కల వని ఆగమములు వాకొనుచున్నవి.

## విభవ రూపము

" యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహమ్. "

ఎప్పు డెప్పుడు ధర్మమునకు పీడ కలిగి, అధర్మము విజృంభించుచుండునో - అప్పుడు నన్ను నేను సృజించుకొందు' నని గీతలో చెప్పినట్లు, భగవానుడు తన ప్రకృతిని అధిష్ఠించి, తన మాయతో లోకమున నావిర్భవించునట్టి రూపములే విభవ రూపము లని వ్యవహరింపబడుచున్నవి. ఈ విభవ రూపములు అనబడు అవతారములును అసంఖ్యాకములే యైనను - దశావతారములతో కలసి - పద్మనాభుడు, ధ్రువుడు, అనంతుడు, శక్తీశుడు, మధుసూదనుడు మున్నగు నవి 39 కల వని 'లక్ష్మీ తంత్ర' మను పాంచరాత్రాగమగ్రంథము నుడువుచున్నది. (110 - శ్లో 19 - 25)

ఈ విధముగ భగవానుని వ్యూహ రూపములును, విభవ రూపములును అనంతములే యని ఆగమములు నిర్దేశించుచున్నవి.

## అంతర్యామి రూపము

ఉపాసకుల హృదయ పద్మములందు వేంచేసియున్న భగవద్రూపమే అంతర్యామి రూపము, ఇది హార్ద రూప మనియు వ్యవహరింపబడుచున్నది. గీతలో -

" ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వ భూతాని యంత్రారూఢాని మాయయా "

సమస్త ప్రాణుల హృదయ దేశము లందు కొలువుండి, తన మాయచే సర్వ భూతములను త్రిప్పునట్టి ఈశ్వరుడే అంతర్యామి' అని చెప్పబడుచున్నది.

అంతః హృదయమునందుండి, యమయతి = సర్వభూతములను నియమించువాడు కనుక, అంతర్యామి. హృదయమునందున్న రూపము కనుక, ఇదియే 'హార్దము.'

## అర్చావతారము

ఈ పర - వ్యూహ - విభవ - అంతర్యామి రూపములు సర్వ జనులకు కానవచ్చునవి కావు, పర రూపము కేవల వైకుంఠ వాసులకు మాత్రమే అనుభవమున గోచర మగును, వాసుదేవాది వ్యూహ రూపములును ఆ యా యుగములలో కొందరకు మాత్రమే కనుపించి ప్రీతిని కల్గించినవి. ధర్మవిగ్రహుడగు శ్రీరామచంద్రుని పురుష మోహన మగు రూపమును అయోధ్యావాసులే అనుభవింపగల్గిరి పూర్ణబ్రహ్మ మగు శ్రీకృష్ణభగవానుని ముగ్ధ మోహన మగు రూపము సహితము గోప - గోపీజనమున కనుభవ గోచరమైనను, ఇతరులకు కాజాల దయ్యెను. కురుక్షేత్రమున - అజ్ఞానమున నేర్పడిన స్నేహ కార్పణ్యములచే ధర్మాధర్మ సందిగ్ధుడై, శరణాగతుడైన పార్థునకు భగవానుడు - అతి గుహ్య మగు తన రూపమును సాక్షాత్కరింపజేసి ఇట్లనినాడు :-

" సుదుర్లభ మిదం రూపం దృష్టవా నసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః "

ఇచ్చట భగవానునిచే చూపబడిన విరాట్ స్వరూపము సామాన్యులకు చర్మచక్షు ర్గోచరము కాదు కదా !

ఇక ప్రతి ప్రాణియొక్క హృదయమున నిరంతరము అంతర్యామిగా భగవానుడు సన్నిహితుడే యయ్యును, యోగులు యోగ

కొఱకే - హృదయ కమలమును వికసింపజేసి, తమ యిచ్ఛను తీర్చినట్లు, తమ కర్మిమతమైన భగవద్రూపమును దర్శింపగల్గుదురు.

భక్తులు - ప్రేమ మను కాటుకచే కూడిన భక్తి నయనములతో ముగ్ధ మనోహర మగు భగవద్రూపమును తమ హృదయములందు దర్శింపజాలుదురు. కాని, చంచల మగు మనస్సును విషయముల నుండి మరల్చి, కదలకుండగా నిలిపి, హృదయవాసి యగు పరమాత్మను దర్శించుటకు కావలసిన యోగముగాని, భక్తికాని సులభ సాధ్యములు కావు. కావున, యోగాభ్యాస సమర్థత లేనివారిని, భక్తిహీనులు కాజాలనివారిని సహితము అనుగ్రహింపవలయు నని, అవ్యాజ కృపా పరవశుడైన భగవానుడు 'అర్చమూర్తి'గ - సర్వ కాలములందును, సర్వ దేశములందును - స్వయంవ్యక్త రూపముగను, ప్రతిష్ఠిత రూపములుగను అవతరించుచున్నాడు.

## అర్చావతార సౌలభ్యము

పరాది రూపముల కంటెను ఈ అర్చారూపమే సర్వులకును సులభముగ సేవింపదగి యున్నది. "అర్చా పూజా ప్రతిమ యోః" అను నిఘంటు వచనమునుబట్టి, అర్చా శబ్దమునకు - 'ప్రతిమ' యని అర్థము.

## వ్యక్తోపాసనమే సులభతమము

భగవానునకు వ్యక్తావ్యక్త రూపములు రెండు కల వనియు, వీనిలో అవ్యక్త రూపోపాసనము క్లిష్టము కావున, వ్యక్తోపాసనమే సులభతమ మగు భగవ ప్రాప్త్యుపాయ మనియు శ్రీ గీతా చార్యుడు ఈ క్రింది విధముగ పేర్కొని యున్నారు :—

" క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. "

అవ్యక్త రూపమందు మనసు నిలిపిన క్లేశము అధికము. అవ్యక్తమైన మార్గము దేహాభిమానులచే అతి క్లిష్టముగనే పొందబడుచున్నది కనుక, భగవానుని వ్యక్తి రూపమే సర్వ జనులకు ఉపాసింపదగినదని, శ్రుతి - స్మృతి - పురాణేతిహాసములు, ఆగమములు ఉద్ఘోషించుచున్నవి.

## పురాణములు వ్యక్తోపాసన ప్రతిపాదకములు

విష్ణు ధర్మోత్తర మహా పురాణము భగవానునకు ప్రకృతి వికృతు లను రెండు రూపములు కల వనియు, వానిలో ప్రకృతి రూపము కన్నుల కగుపింప దనియు, ఆకారముతో కూడిన వికృతి రూపమే దృగ్గోచర మనియు చెప్పుచున్నది.

" ప్రకృతి ర్వికృతి స్తస్య ద్వే రూపే పరమాత్మనః
అలక్ష్యం తస్య తద్రూపం ప్రకృతి స్సా ప్రకీర్తితా ।
సాకారా వికృతి ర్జ్ఞేయా తస్య సర్వం జగత్ స్మృతమ్
... ... ... ... ...
పూజా ధ్యానాదికం కర్తుం సాకార స్యైవ శక్యతే "

— (24 - వ అధ్యాయము)

" ప్రకృతి, వికృతి యని పరమాత్మకు రెండు రూపము లున్నవి. కంటితో దర్శింప నలవికాని రూపమే ప్రకృతి రూప మని చెప్పబడినది. ఆకారముతో కూడినదే వికృతి రూపము. ఈ సమస్త ప్రపంచము భగవానుని వికృతి రూపమే. పూజ, ధ్యానము మున్నగు నవి చేయుటకు ఆకారముతో కూడిన రూపమునకే సాధ్య మగును.

వాస్తవముగ ఆకారముతో కూడిన భగవద్రూపమే విధి పురస్సరముగా అర్చింపదగి యున్నది. భగవానునిచే స్వేచ్ఛగ పుడమిపై ఆవిర్భవించినపుడు ఏ ఆకారములు స్వీకరింపబడినవో, ఆ యాకారములనే దేవత లర్చింతురు. అవ్యక్తమైన మార్గమును దేహ ధారులు పొందజాలరు. ”

సకల పురాణములలోను మూర్ధన్యముగా, సర్వ ప్రమాణముగా - పూర్వాచార్యులచేతను, భగవద్రామానుజులచేతను తత్త్వమును నిర్ణయించుటలో ఏక కంఠముగ గ్రహింపబడినదియు, పరాశర ప్రోక్తమును అగు శ్రీవిష్ణుపురాణముకూడ - మూర్త రూపమే సర్వులకు ఉపాసింపదగిన దని చెప్పుచున్నది.

“ ద్వే రూపే బ్రహ్మణ స్తస్య మూర్తం చామూర్త మేవ చ
.... .... ... .. ”

— (శ్రీవిష్ణు పురాణము , ప్రథమాంశము · 12వ అధ్యాయము.
56వ శ్లోకము నుండి 76 శ్లోకము వరకు.)

ఈ శ్లోకముల అభిప్రాయ మిది :-

పరబ్రహ్మమునకు రెండు రూపము లున్నవి వీనికి - క్షర రూపము, అక్షర రూపము అని కూడ పేరు. పరబ్రహ్మము అక్షర రూపము. ఈ సమస్త జగత్తు - భగవానుని క్షర స్వరూపము. ఈ సమస్త జీవకోటిని భగవానుడు కౌస్తుభ మణిగా వక్షః స్థలమున ధరించుచున్నాడు. ప్రధానము - లేక, ప్రకృతియే శ్రీవత్స చిహ్నము. భూతాది, ఇంద్రియాది - అని రెండు విధములుగా నున్న అహంకార

మును శంఖముగను, శార్ఙ్గ మును ధనుస్సుగను భగవానుడు ధరించు చున్నాడు. మనస్సే చక్రము బుద్ధి - గద భగవానుని వక్షః స్థల మున వ్రేలాడుచున్న వైజయంతిమాల - పంచభూతములు.

పై విష్ణు పురాణమునందలి వస్తువు - భగవానుని స్వరూప విగ్ర హాము ఈ సమస్త జగత్తుకు ప్రతీక మని నిర్దేశించు చున్నవి. శ్రీ వేదాంతదేశికులు ఈ క్రింది శ్లో॥ మున విష్ణు పురాణ తాత్పర్యము నంతటిని సంగ్రహించిరి :-

" చేత శ్చక్రతి, చేతనాసి రమతి స్త త్సంవృతి శ్శార్ఙ్గికా
ధాతాని, స్సగుణై రహంకృతియుగం శంఖేన శార్ఙ్గాయతే ।
బాణాః వాని వశాని, కౌస్తుభమణి ర్జీవః, ప్రధానం పునః
శ్రీవత్సం కమలాపతే ! తవ గదా వనమా ర్మహా న్తం గదామ్ "

ఈ విధముగ వ్యక్తము - లేక - మూర్తము అయిన ఈ సమస్త జడ జగత్తు (అచిత్తు) జీవ తత్త్వముతో (చిత్తుతో) కలిసి, భగవాను నికి శరీరముగా అమరి యున్నది. ఈ జీవ జడాత్మక మగు సమస్త జగత్తున ఏ యంశము లున్నవో - అవి యన్నియు భగవానుని శరీర మున నమరియున్న భూషణాయుధాది సముదాయముగను, ఇట్టి భూషణాయుధాదులతో కూడిన మూర్త విగ్రహమే భగవానుని పర రూపమునుండి అర్చామూర్తి వరకు అనుగతమై యున్నది. కాని, ఈ రూపము 'అర్చామూర్తి'లో సర్వ జనులకు దర్శన యోగ్యముగా సులభమై యున్నది. ఆగమములు విష్ణు పురాణముచే ప్రతిపాదింప బడిన మూర్త రూపముచే అర్చావతారమున నన్వయించి నిరూపించు చున్నవి.

## అర్చావతార వైశిష్ట్యము

శ్రీమల్లోకాచార్యులవారు తమ తత్త్వత్రయమున అర్చావతారమును గురించి ఇట్లు పేర్కొనిరి :-

" ప్రతిమామూర్తిగ అవతరించిన భగవానుడు - ఈ రూపమును భక్తానుగ్రహార్థమై గ్రహించును. ఈ అర్చామూర్తిలో - స్వామి, భక్త పరాధీనుడు. భక్తుడు తన శక్తి ననుసరించి బంగారము, వెండి మున్నగు లోహములచేగాని, మట్టి, చెక్క మున్నగువానిచేగాని భగవానుని ప్రతిమను నిర్మించి అర్చించునప్పుడు - భగవానుడు ఆ ప్రతిమయందు వేంచేసియుండును. ఇట్లు వేంచేసియున్న భగవానుడు - అయోధ్య, మధుర మున్నగు దేశమును గాని, కాలమునుగాని, అధికారి నియమమునుగాని పరిగణింపకయే, ఉపాసకుల అపరాధములను గూడ లెక్కింపక, స్నానాదులయందు అర్చక పరాధీనుడై దేవాలయములందును, గృహములందును వేంచేసియుండి, అనుగ్రహించుచుండును. "

" రుచిజనకత్వం, శుభాశ్రయత్వమ్, అశేషలోక శరణ్యత్వమ్, అనుభావ్యత్వం సర్వ మర్చాయా మేవ పరిపూర్ణమ్. "

ప్రీతిని గొల్పుట, మంగళాస్పదు డగుట, సమస్త లోకములకు ఆశ్రయింపదగినవా డగుట, సులభముగ అనుభవింపదగినవా డగుట మున్నగున దంతయు అర్చామూర్తియందే సంపూర్ణముగ నున్నవి. "

— (తత్త్వత్రయము - ఈశ్వర తత్త్వ నిరూపణము)

## స్మృతి పురాణములలో అర్చావతార వైభవము

స్మృతి పురాణాదులు అర్చావతార సౌలభ్యమును, వైభవమును అనేక విధములుగా నిరూపించియున్నది.

అర్చావతారమున భగవానుడు స్వస్వామి భావమును (తన యందు గల స్వామిత్వమును, జీవులయందు గల స్వత్వమును) తారుమారు చేసి, ఏమియు నెరుగనివానివలె, అశక్తునివలె, అస్వతంత్రునివలె కన్పట్టుచు, అపార కారుణ్య పరవశుడై, కావలసినవాని నన్నిటిని అనుగ్రహించును. ఇదియే ఇట్లు చెప్పబడినది:

" అర్చావతార స్సర్వేషాం బాంధవో భక్తవత్సలః ।
స్వత్వ మాత్మని సంజాతం, స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్ "

వృద్ధహారీతస్మృతికూడ భక్తత్రాణమునకై భగవానుడు స్వయముగ పరిగ్రహించిన ప్రాదుర్భావమూర్తులలో దేనినైనను అర్చింప వలయునని స్పష్టపరచుచున్నది.

" పరిత్రాణాయ భక్తానాం ప్రాదుర్భావః కృతో మయా
ప్రాదుర్భావాకృతీః కాచిత్ అర్చయే త్తాం యుధిష్ఠిర ! "

అని పద్మోత్తర ఖండమున - పరమ శివుడు పార్వతితో శ్రీహరి యొక్క ఆవిర్భావమును పేర్కొనుచు

" యస్మిన్ సన్నిహితో విష్ణుః స్వయ మేవ నృణాం భువి
పాషాణ దార్వో రాత్మేశః స్వయం వ్యక్తం హి తత్ స్మృతమ్,
దుర్లభత్వాత్ స్వరూపం వ్యక్తి మూర్తేః శ్రీవైష్ణవోత్తమః
యథావిధి ప్రతిష్ఠాప్య స్థాపితాం మూర్తి మర్చయేత్॥ "

భగవానుడు స్వయముగ ఏ పాషాణ - దారువులయందు ఆవిర్భవించియుండునో, అది స్వయం వ్యక్త మూర్తి. అది దుర్లభము కావున, భగవన్మూర్తిని నిర్మించి ప్రతిష్ఠచేసి ఆరాధింపవలె నని చెప్పినాడు.

'బ్రహ్మాండ పురాణము'న భగవానుడు స్వయముగ తన అర్చామూర్తి వైభవము నుట్టంకించినాడు.

" సులభం మోక్ష సిద్ధ్యేచ భవామ్యర్చా స్వరూపవాన్
పర వ్యూహాదయ శ్చేమే క్లేశాదివతి మోక్షదాః
ఏవ మత్యన్త సౌలభ్య మర్చాయా మేవ వర్తతే
తస్మా దర్చావతారేణ లోకాన్ సంరక్షయా మ్యహమ్ "

సులభముగ మోక్షము సిద్ధించుటకొరకు, నేను అర్చామూర్తిని ధరింతును. పర - వ్యూహాది రూపములు క్లేశముల బడిన వాస యందుమాత్రమే మోక్షప్రదము లగుచున్నవి. ఈ విధముగ మిక్కిలి సౌలభ్యము అర్చామూర్తియందే కలదు. కావున, అర్చావతారముచే లోకముల రక్షించుచుందును. "

## ఆగమములో అర్చావతార వైభవము

అర్చామూర్తియొక్క ఆవిర్భావమునుగురించి శ్రీప్రశ్న సంహిత ఒక గాథను ఇట్లు నుడువుచున్నది :-

శ్రీదేవి - అర్చామూర్తి వైభవమును గురించి భగవానుని ప్రశ్నించినది. అప్పుడు భగవానుడు ఇట్లు చెప్పినాడు :-

" పరమేష్ఠి మున్నగు దేవతలు భూలోకమున అలయ నిర్మాణమును, పరమాత్మయొక్క అర్చామూర్తిని దర్శించి, మానవులకు మాత్రమే సులభమును, దేవతలకు దుర్లభమును అయిన అర్చామూర్తిని పొందగోరిరి. ఇట్లు నిశ్చయించి, శ్వేతద్వీపమున చేరి, దేవతలు వేయి సంవత్సరములు ఘోరతపస్సు చేసిరి. వారి హృదయాభిప్రాయము నెరిగిన పరమాత్మ ప్రాకారాంతర్ముఖము కూడినదియు, విమానాంతర్గతము నగు నా శుభ మూర్తిని చూపింతు' నని నిశ్చ

యించి, శంఖ చక్రాదులతో కూడినదియు, ఐశ్వర్య సంపన్న మగు తన రూపమును దర్శింపజేసెను వారి మనోరథ మేమియో తెలిసి కొననోరి ప్రశ్నించినాడు. బ్రహ్మాదులు జితంతాది స్తోత్రములతో భగవానుని స్తుతించినారు. ప్రసన్నుడైన భగవానుని ఇట్లు - ప్రార్థించి నారు. "స్వామీ! నీవు మాపట్ల సంప్రీతుడ వైనచో, నీ వివ్వుడీ విధాయమున సాక్షాత్కరించినట్లే, బింబ రూపమున నిత్యము ఉండ వలయును. పూజాదిప్రియులకు సంబంధించిన శాస్త్రమునుగూడ ఉప దేశింపవలయును." అని - (శ్రీప్రశ్నసంహిత . 18 అ. 8, 9 శ్లో.)

బ్రహ్మాదుల ప్రార్థనము ననుసరించి బింబ రూపమున అవిర్భ వించినవాడై భగవానుడు, శాస్త్రము నుపదేశించినాడు. దీనినిబట్టి దేవతలుకూడ భగవానుని అర్చామూర్తియొక్క వైభవము ననుభ వించినారని స్పష్ట మగుచున్నది కనుక నే -

" సర్వాతిశాయి షాడ్గుణ్యం సంస్థితం సంత్ర బింబయోః
తేనార్చ్యే భగవాన్ సాక్షాత్ నోపచారధియా క్వచిత్ "

వైకుంఠవాసి యగు పరమాత్ముడేవునియందు - జ్ఞాన, శక్తి, బ, లైశ్వర్య, వీర్య, తేజస్సు లను ఆరు గుణములు పూర్ణత కలదో, అది మంత్రమందును, భగవద్విగ్రహమునందును కలదు. కనుక, ప్రతిమా రూపమున గల భగవానుని ఉపచార బుద్ధితో - (అనగా - ఇది కేవ లము ప్రతిమా మాత్రమే అనుబుద్ధితో) అర్చింపరాదని తాత్పర్యము.

కనుకనే, తన మనసుకు నచ్చిన సుందరమగు భగవన్మూర్తిని స్వర్ణ రజితాది లోహములతోగాని, మృద్దారువులలోగాని నిర్మించి, దాని నర్చించుచు, ధ్యానించుచున్నచో, అవిద్య వలన కలిగిన దోషములన్నియు తొలగి, తుదకు ఆ బ్రహ్మరూపిణియగు మూర్తి

యందే ఉపాసకుడు సాన్నిధ్యమును పొందునని, యీ క్రింది శౌనకీయ వచనము స్పష్టపరచుచున్నది.

" సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్న వదనేక్షణామ్
కృత్వాత్మనః ప్రీతికరం సువర్ణ రజతాదిభిః
తా మర్చయేత్, తాం ప్రణమేత్, తాం యజేత్ తాం విచింతయేత్
విశ త్యపాస్త దోషస్తు తా మేవ బ్రహ్మ రూపిణీమ్. "

ఇట్టి యీ అర్చామూర్తియొక్క సందర్శన మెంతటి ప్రయో జనమును చేకూర్చునో, శ్రీ పౌష్కర వచన మిట్లు ఘోషించు చున్నది :-

" సందర్శనాదకస్మా చ్చ పుంసాం సమ్మూఢ చేతసామ్
కువాసనా, కుబుద్ధి శ్చ, కుతర్క శ్చ, కునిశ్చయః
కుహేతు శ్చ, కుభావ శ్చ, నాస్తికత్వం లయం వ్రజేత్. "

సుందర మగు భగవన్మూర్తిని ఒక్కసారిగ (అకస్మాత్తుగ) చూచినప్పుడు, అనాదిసిద్ధ మగు అవిద్యచే సమ్మూఢ మగు చిత్తము సహితము అనిర్వాచ్య మగు సుఖానుభవమును పొంది, చూచువారి లకు సంసారము, కుదృష్టి, విపరీత నిర్ణయము, కుతర్కము, దుష్ట భావము మున్నగు భగవదనుభవమునకు విరోధు లగు దుర్లక్షణముల నశించి, వారి నాస్తిక్య భావన తొలగి, హృదయము ప్రసన్న మగును.

దేవాయతనమున ప్రతిష్ఠిత మగు అర్చామూర్తియొక్క వైభవ మును మన ప్రాచీనాచార్యులు స్వయముగ తాము అనుభవించుటయే గాక, పరులకు సహితము అట్టి అనుభవమును కల్గించి ఉద్ధరించుట ఇతిహాస ప్రసిద్ధమే. తన ప్రియురాలి కన్నులకన్నా మిన్నయైన

కన్నులు లేవని అజ్ఞానముచే భ్రమించి, భగవన్మూర్తియొక్క మాధుర్యమును గ్రోలజాలని ధనుర్దాసుని పిలిపించి, శ్రీరంగమున వేంచేసియున్న ఇక్ష్వాకు కులధన మగు శ్రీరంగనాథుని విశాల సుందర నయనముల చూపించి, వాని యజ్ఞానమును పోగొట్టి ఉద్ధరించిన భగవద్రామానుజ వైభవము - ప్రపన్న జనులు మరువలేనిదేకదా ! కలియుగ ప్రత్యక్ష దైవమగు శ్రీనివాసుని దివ్య మంగళ విగ్రహమును దర్శించి, పులకించనివా రుండ రనుట - తిరుగు లేని మాట.

## మూర్త్యర్చన ప్రాచీనత

ఆగమములును, పురాణములును, మూర్త్యర్చన వైశిష్ట్యమును గురించి వేనవేల స్పష్టము గావించియున్నవి. ఐనను, దాని ప్రాచీనతా విషయమున కొందరికి సందేహ ముండవచ్చును. కనుక, దీని ప్రాచీనతను గురించి ఇచట వివరింపవలసి యున్నది ..

" దేవానా మేవ ఆయతనే యజతే "

అను తైత్తిరీయ సంహితా వచనము - దేవాలయములం దొనర్చెడి మూర్త్యర్చనమునే నిర్దేశించుచున్నది. ఈ కారణముచేతనే దేవాయతన నిర్మాణము భారత దేశమున అతి ప్రాచీనకాలమునుండియే కలదు. శ్రీమద్రామాయణమున శ్రీరామచంద్రుని పట్టాభిషేక ముహూర్తమునకు పూర్వము రాత్రి సమయమున శ్రీమన్నారాయణార్చనము నొనర్చి, దేవాయతనమున శయనించినట్లు - ఈ క్రింది శ్లోకము స్పష్టీకరించుచున్నది :-

" వాగ్యత స్సహ వైదేహ్యా భూత్వా నియత మానసః
శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః "
— (అయోధ్యాకాండ . 6 - 4)

వాఙ్మయమును పఠించుచున్నవాఁడై, మనస్సు నరికట్టి, జానకీదేవితోపాటుగ శ్రీమన్నారాయణుని అల సుమాన శ్రీరామచంద్రుడు శయనించినాఁడు అని పెద్ద తాత్పర్యము.

## శ్రీమద్భాగవతములో సాత్త్వతార్చనా విధానము

శ్రీ భాగవతము ఏకాదశ స్కంధములోని 36 - అధ్యాయమున, సాత్త్వత విధానము ననుసరించి భగవదారాధనము చేయు విధానము లెస్సగా వర్ణింపబడినది.

చిత్త ప్రసాదకము, సర్వ ఫలప్రదమును అయిన సాంగ భాగవతార్చనమును సాత్త్వతు లొనర్చు విధానము ననుసరించి వివరించుమని ఉద్ధవుడు భగవానుని కోరగా - అపుడు భగవానుడు -

" వైదికస్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః
త్రయాణా మీప్సితే నైవ విధినా మాం సమర్చయేత్ "

అని యారంభించి, విస్తారముగ వివరించియున్నాడు. ఆ వివరణ మిది :-

వైదికము, తాంత్రికము, మిశ్రము - అని, భగవదర్చనము మూఁడు విధములుగా నున్నది. ఈ మూఁటిలో ఏది ఉపాసకుని కిష్టమో, ఆ విధానము ననుసరించి భగవదర్చనము నొనరింపవలెను.

"తన వేద శాఖకు విహితములైన సంస్కారములను పొంది, ద్విజత్వమును సంపాదించిన జనుఁడు నన్నెట్లు భక్తితో అర్చింపవలయునో దానిని చెప్పుచున్నాను. శ్రద్ధతో దానిని తెలిసికొనుము.

అర్చామూర్తియందుగాని, స్థండిలమునందుగాని, అగ్నియందుగాని, హృదయముపగాని, ద్విజునియందుగాని భక్తి కలిగినవాడై, ద్రవ్యములో తనకు గురువు నైన నన్ను ఎట్టి కపటము లేక అర్చింపవలయును. శిలతో చేసినదియు, చెక్కతో చెక్కినదియు, స్వర్ణ-రజత-తామ్రాది ధాతువులతో నిర్మించినదియు, మట్టి, చందనము మున్నగువానితో నిర్మించినదియు, రేఖా రూపముగ పటమున గీచినదియు, మనస్సులో కల్పించుకొనినదియు, మణితో నిర్మింపబడినదియు నని నా ప్రతిమ ఎని మిది విధములుగా నున్నది. చలము, అచలము అనియు మూర్తి ద్వివిధముగా నున్నది. ఈ విధముగా పేర్కొనబడిన ప్రతిమయే భగవన్మందిరము. మాయా నెరుగని నా భక్తునకు ప్రతిమాదులయందు - వానికి లభించిన ద్రవ్యముచేతను, అవి లభింపనపుడు - మనస్సులో కల్పింపబడిన ద్రవ్యములచేతను, అనగా - భావనా మాత్రముగను నా యర్చనము జరుగును. ప్రతిమయందే, స్నానము, అలంకారము మున్నగునవి ప్రశస్తములు. నా భక్తునిచే శ్రద్ధతో తేబడిన జలమైనను శ్రేష్ఠమే. గంధము, ధూపము, దీపము, అన్నాదికము విషయమున ఇక చెప్పవలసిన దేమున్నది ? శుచిగా - కావలసిన సామాగ్రి నంతటిని సమకూర్చుకొని, ముందుగ దర్భలతో ఆసనము నేర్పరచుకొన్నవాడై, ప్రాఙ్ముఖముగాగాని, ఉదఙ్ముఖముగాగాని భగవన్మూర్తికి ఎదురుగా కూర్చుండి, ఆరాధన మొనర్చవలయును' అని, విశేషముగ మూర్త్యారాధనము చెప్పబడినది.

అర్చామూర్తుల యందు ఎవ్వరు ఎచ్చట శ్రద్ధ కలుగునో, ఆయా డచ్చట అర్చన మొనర్చవలయు ననియు, సర్వభూతముల

యందును పరమాత్మ అంతర్యామిగా నున్నా డని భావింపవలయు ననియు శ్రీమన్నాభాగవత స్కాందపురాణము ప్రబోధించుచున్నది.

## మూర్తి ప్రతిష్ఠా వైశిష్ట్యము

ఈ విధముగ మూర్త్యుపాసన వైశిష్ట్యమును గురించి విశేషముగ పేర్కొనుటయేగాక, శ్రీ భాగవతము - మూర్తి ప్రతిష్ఠా వైశిష్ట్య మను వర్ణించియు విశేషముగ వివరించియున్నది :-

" మ దర్చాం సంప్రతిష్ఠాప్య మందిరం కారయే ద్దృఢమ్
పుష్పోద్యానాని రమ్యాణి పూజా యాత్రోత్సవాశ్రితాన్. "

నా ప్రతిమను (అర్చామూర్తిని) నిర్మించి, ప్రతిష్ఠించి, దృఢ మగు మందిరమును నిర్మాణము చేయవలయును. అందమైన ఉద్యానవన ములు నిర్మించియు, పూజా యాత్రోత్సవ సంబంధముగ పూజాదులు అవిచ్ఛిన్నముగా సాగుటకై పర్వ సందర్భమున క్షేత్రములను (మాన్య ములను), ఆపణములను, గ్రామములను దానము చేసినవో, నా 'సార్ష్టి' (నాతో సమాన మగు ఐశ్వర్యమును) పొందును. నా విగ్రహ మును ప్రతిష్ఠించి సార్వభౌమ స్థితిని, దేవాలయ నిర్మాణముచే మూడు లోకములను, పూజాదికముల నొనర్చుటచే బ్రహ్మలోకమును పొంద గల్గును. ఈ మూడింటిని (అనగా - మూర్తి ప్రతిష్ఠ, దేవాలయ నిర్మా ణము, నిత్యార్చనము అను ఈ మూడింటిని) చేయువాడు - నా సామ్యమునే పొందును' - అని భగవానుడు స్వయముగ చెప్పినాడు.

విష్ణుధర్మోత్తర పురాణము కూడ మూర్తి ప్రతిష్ఠాది మాహా త్మ్యమును ఇట్లు పేర్కొనుచున్నది :-

" ఇష్టాపూర్తేన లభ్యంతే యే లోకా స్తాన్ బుభూషతా
దేవానా మాలయః కార్యః ద్వయమ ప్యత్ర దృశ్యతే
విశేషేణ కలౌ కాలే కర్తవ్యం దేవతా గృహమ్ "

యాగాది శ్రౌత కర్మల చేతను, తటాకాది స్మార్త కర్మముల చేతను కలిగెడి ఉత్తమ లోకముల పొందగోరువారు దేవాలయమును నిర్మించవలె ననియు, దీనివలన ఈ రెండు ఫలములు కలుగు ననియు, విశేషించి యీ కలి కాలమున దేవాలయ నిర్మాణము తప్పక చేయ దగిన దనియు ఉద్ఘోషించుచున్నది.

## దైవ ప్రదేశ భేదములు

ఈ బహు మహిమాన్విత మగు భగవ దర్చామూర్తిని ఎవ్వరైనను అధికారి తారతమ్య మేమాత్రము లేకనే, వారి వారి గృహము లలో అర్చించుకొనవచ్చును. అప్పు డీ అర్చామూర్తి ఆ కుటుంబమునకు అనుగ్రాహకమై యుండును. గ్రామ జను లందరు అర్చించుకొనుటకు వీలుగా దేవాలయ నిర్మాణము ద్వారా గ్రామమున ప్రతిష్ఠితమై నప్పుడు - ఈ అర్చామూర్తి గ్రామమునకు శుభముల కల్గించును. స్వయంవ్యక్త స్థలములందలి అర్చామూర్తి - సర్వ లోకములకును అనుగ్రాహకమై యుండు నని పురాణాగమాదు లుద్ఘోషించుచున్నవి.

భగవ దర్చా ప్రతిమ దేవతలచే ప్రతిష్ఠింపబడినపుడు, ఆ స్థలము - 'దైవ' మనియు, ఋషులచే ప్రతిష్ఠింపబడినపుడు 'ఆర్ష' మనియు, పురాణ ప్రసిద్ధమైనపుడు - 'పౌరాణ' మనియు, మనుష్యులచే ప్రతిష్ఠింపబడినపుడు - 'మానుష' మనియు - భగవానుడు

స్వయముగ లోకానుగ్రహార్థమై, పాషాణ - దారువుల యందు అభివ్యక్తిని పొందినపుడు - 'స్వయం వ్యక్త' మనియు పంచ విధములుగ వైన ప్రదేశము పేర్కొనబడుచున్నది.

" దైవం చాపి, తథైవార్షం, పౌరాణం, మానుషం తథా
స్వయంవ్యక్తం చ పంచైతే స్థానాని పృథివీతలే. "

అని ఆగమశాస్త్ర ప్రమాణము. ఈ స్థానము లన్నియు సమాన వైభవములే యైనను, స్వయంవ్యక్త స్థానము సర్వశ్రేష్ఠ మను సంప్రదాయము.

## గృహార్చనా వైశిష్ట్యము

గృహస్థుని నిత్యకృత్యములలో - భగవదారాధనము సర్వ ప్రధానమైనదని పూర్వము నిర్దేశించిన శ్రీ భాగవతవచనములచే మాత్రమే కాక, అనేక పురాణాగమ వచనములచేగూడ సిద్ధించు చున్నది కనుక, బహుదోష కలుషితమై, నిరంతరము సాంసారిక ప్రవృత్తిలో క్షణము తీరికలేక, క్షోభ ననుభవించుచున్న అశాంత మహాసాగర మగు మానవ చిత్తమునకు ప్రశాంతతను చేకూర్చునది భగవదారాధనమే తప్ప, వేరు కాదు. లక్క వలె కఠోరమైన ఈ మనస్సు కరుగవలె నన్న, భగవద్గుణకీర్తన, శ్రవణాదులతో కూడిన అర్చనమే శరణ్యము. కావున, తన శక్తికి తగినట్లు, తన కిష్టమైన భగవన్మూర్తిని లోహముచే నిర్మించుకొనిగాని, పటమునగాని అర్చింపవచ్చును. విగ్రహములు లేనిదే ఆరాధనము కాదనికాని, విగ్రహములనర్చించినవారికే ఫలమధికమనిగాని భావింపనక్కరలేదు. ఏ రూపముననైనను భగవన్మూర్తిభావనతో, చిత్తశుద్ధితో అర్చించినపుడు - నిశ్శ్రేయసము అనివార్యము. తన గృహమున నిత్యము

దేవతార్చన మొనర్చు నరునకు - తనకు తాను తరింపజేసికొనుటయే గాక, యాగాదులకు పొందరాని దగు మోక్షమును సహితము కలుగు నని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి.

" నైకం స్వవంశం తు నరః తారయ త్యఖిలం జగత్
అర్చయా మీప్సితం న్యాణాం ఫలం యాగాది దుర్లభమ్. "

ఇత్యాది శాస్త్ర వాక్యములు - ఈ యంశమును ధృవీకరించుచున్నవి.

## పూర్వాచార్యుల దృష్టిలో అర్చా వైభవము

భగవ దర్చా వైభవమును మన పూర్వాచార్యు లెందరో ఉపశ్లోకించినారు. ఆళ్వారుల దివ్య ప్రబంధములలో - శ్రీరంగనాథుని అర్చా వైభవమును గురించి విస్తారముగ సంకీర్తన మున్నది. శ్రీరంగ గద్యమున-'శ్రీరంగ శాయినమ్' ఇత్యాదిగ భగవ ద్రామానుజులును కీర్తించినారు. ఏ రూపమున నున్నను, అనన్య భావనతో సేవించిన వారికి శ్రియఃపతి - వారి వారి మనో భావనకు తగినట్లు భాసించుచుండు నని శ్రీవత్స చిహ్నమిశ్రులు వరదరాజ స్తవములోని ఈ క్రింద శ్లోకమున పేర్కొని యున్నారు:-

" పరోవా, వ్యూహోవా, విభవ ఉతవార్చావతరణో
భవ న్నన్తర్యామీ వర వరద ! యో యో భవసి వై
స నత్వం నన్త్వైకాన్ పరగుణ గణాన్ బిభ్ర దఖిలాన్
భజద్భ్యో భాస్యేవం, సతత మితరేభ్య స్త్వితరథా. "

ఓ వరదరాజా ! నీవు పరరూపుడవైనను, వాసుదేవ - సంకర్షణాది వ్యూహ రూపుడ వైనను, రామ కృష్ణాది విభవ రూపముల

దాల్చినవాడ వైనను, అంతర్యామిగా హృదయమం దున్నను, అర్చా మూర్తిగా ప్రపన్న గృహములందును, దేవాలయములందును వేంచేసి యున్నను, ఏ యే రూపమున నుంటివో - ఆ యా రూపముతో ఒప్పుచున్నవాడవై, నిన్ను సేవించుచున్న వారికి - వా రే రూపముతో భజించిన, ఆ రూపముతో సాక్షాత్తు పూర్ణుడవై అనుగ్రహించుచున్నావు. ఇక, ఇతరులకు వేరుగనే అనుభవ గోచరుడ వగుచున్నావు' అని తాత్పర్యము.

ఈ యభిప్రాయమునే గీతలో భగవానుడు -

" యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్య తస్యాచలా శ్రద్ధాం త మేవ విదధా మ్యహమ్ " (7-21)

అను శ్లోకములో పేర్కొనియున్నాడు. పైని పేర్కొనబడిన రూపములేకాక, ఇంద్రాది రూపములు కూడ భగవానునకు చెందినవే. సామాన్యులైన ఉపాసకులు - ఇతర దేవతా విగ్రహములు కూడ శ్రీహరి తనువులే నని తెలియకున్నను, వానియందు శ్రద్ధాళువులై యుపాసించుచున్నప్పుడు - వారికి వా రుపాసించెడు మూర్తియందే శ్రద్ధను కలుగజేసి, ఆ మూర్తిద్వారమున తానే ఉపాసింపబడి, తన చేతనే సృజింపబడిన కామములను వా రనుభవించునట్లు చేయును. ఇట్లు ఎరుగక చేసిన అర్చనమే ఫలవంత మైనపుడు, తెలిసి చేసిన అర్చనము సర్వథా సర్వఫలప్రద మని వేరుగ చెప్పనక్కరలేదుకదా !

ఈ విధముగ భగవ దర్చనేవ సర్వ సులభ మని స్పష్ట మగుచున్నదికదా ? కనుక -

" పరేవా, వ్యూహేవా మహితవిభవే, హార్ద వపుషి
త్వమే నార్చా మూర్తే, సతత ముహితః పాలయసి నో ।
న చైవాస్తే తేషా మనుభవ మహత్వే తు నితరాం
భిదా, కిం త్వర్చాయాం నను భవతి సౌలభ్య మతులమ్. "

అను ఆ వైకుంఠనాథ స్తవములోని అర్చా వైభవమును కీర్తించు శ్లోకముతో ఈ రచన ముగింపబడుచున్నది.



# భగవద్రామానుజులు - నిత్యగ్రంథము

'ఉభయ వేదాంత శిరోమణి'

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, ఎం. ఏ.



## గ్రంథ పరిచయము

శ్రీ భగవద్రామానుజ విరచితములైన నవ నిధుల వంటి తొమ్మిది గ్రంథములలో - 'నిత్యగ్రంథ' మొకటి. ఇందు - పరమై కాంతి ప్రతి దినము కావింపవలసిన భగవ దారాధనా విధానము చక్కగ వివరింపబడినది. ఇయ్యది - పాంచరాత్రాగమము ననుసరించి రూపొందింపబడినది.

## భగవ దుపాసనము

పరవాసుదేవుని సేవ ము క్త్యనంతరము మాత్రమే లభించును. క్షీరాబ్ధినాథుని సేవ - త త్సమకాలికులైన భాగ్యశాలురకు మాత్రమే సాధ్యము. మరి ఇట్టి దశలో - నిత్య సంసారులమైన అస్మదాదులము భగవంతుని సేవించి, కైంకర్యము చేయు అవకాశమే లేదా? అనినచో - లేకేమి? అందులకేగదా అర్చావతారము!

" నానా భూతోపాస్య లక్ష్యం తవత్వ మేక ఏవాఽతః
అర్చోపాసాం విదధతి - వైఖానస పాంచరాత్రాద్యాః "

అను రీతిని - అర్చావతారోపాసన దేశ కాల పరిచ్ఛేదము లేక, సర్వ దేశ - సర్వకాల - సర్వావస్థలయందును మన అభిమతానుసారము

సులభముగ ఆచరింపదగియున్నది. ఇది కాయికముగ 'గద్యత్రయము' ను అనుసంధించినపుడును, కాయికముగ భగవంతుని ఆరాధించునపుడును మనస్సును భగవంతునియందు లగ్న మొనర్చవలయును. ఇట్లు చేయుట వలన, కరణ త్రయముచేతను భగవంతునకు సేవ చేసినట్లు అగును.

## అర్చారాధనా ప్రాముఖ్యము

అర్చావతారమునందలి సౌలభ్యమును గుర్తించినవారు ఆళ్వారులు. కావుననే వారు - అర్చామూర్తులయందే పరత్వాదులను దర్శించి కీర్తించినారు :-

" పిన్నానార్ వణంగుం శోది తిరుమూళి క్కళత్తానాయ్ ముదలానాయే. "

రామకృష్ణాది విభవావతారములను దర్శింప నవకాశము లేనివారును దర్శించి తరించుటకు వీలుగా - 'తిరుమూళిక్కళం' అను దివ్య క్షేత్రమున వెలుగొందుచున్నవాడవై, జగన్మూలమగుచున్న "ఓ పరంజ్యోతీ !" అనుచు తిరుమంగైయాళ్వారులు అర్చామూర్తిని ప్రస్తుతించినారు. ఇచట జగన్మూలకందమైన ముకుందుడే రామకృష్ణాది రూపముల నవతరించినాడు. అతడే 'తిరుమూళిక్కళం' అను క్షేత్రమునందు అర్చా రూపమున వెలసియున్నాడు (ఇది ఇతర దివ్య క్షేత్రములకును ఉపలక్షణము) ఏ రూపమున నున్నను, పరంజ్యోతిగానే భాసించును' అనుటచేత, అర్చామూర్తి సన్నిధిని చేయు కైంకర్యము పరవాసుదేవుని సన్నిధిని చేయు కైంకర్యమే అని స్పష్ట మగుచున్నది.

" ఓం పూర్ణమదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే । పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే । సర్వం పూర్ణం సహోమ్. "

అను శ్రుతి - అర్చావతారము నందలి గుణ పూర్తిని ఉగ్గడించుచున్నదిగదా ! భగవంతుని కల్యాణ గుణములలో - పరత్వ సౌలభ్యములు ఆద్యంత సీమలు కేవలం పరత్వము గాని, కేవల సౌలభ్యము గాని కార్యకరము కాజాలదు. కావున, పరత్వ సౌలభ్యములు రెండును కలవాడే భగవంతుడు. భగవంతుని పరత్వాది గుణములు ఆశ్రిత కార్యాపాదకములు కాగా, సౌలభ్యాది గుణములు ఆశ్రయణ సౌకర్యాపాదకములు. ఇట్టి సౌలభ్య గుణమును శ్రీకృష్ణావతారమున ననుభవింపవచ్చును. గోవింద - దామోదర - గోపాలకాది దివ్య నామములు ఆతని సౌలభ్యమును చాటునవే గదా ! అర్చావతారము ఈ సౌలభ్య గుణమునకు నిధానము. ఈ విషయమును శ్రీ పరాశర భట్టారకులు శ్రీరంగరాజ స్తవమున -

" ఆస్తాం తే గుణరాశివ ద్గుణపరీ వాహాత్మనాం జన్మనాం
సంఖ్యా భౌమనికేతనే ష్వపి కుటీ కుంతేషు రంగేశ్వర !
అర్చ్యః స్సర్వ సహిష్ణు రర్చక పరాధీనా ఖిలాత్మస్థితిః
ప్రీణీషే హృదయాళుభి స్తవ తత శ్శీలా జ్జడీభూయతే. "

— (2 - 74)

శ్రీరంగనాథ ! నీ అనంత కల్యాణ గుణ రాశి వలె అవి రూపు దాల్చిన నీ అనంతావతారములను అటుండనిమ్ము. మా ఇండ్లలోను, గుడిసెలలోను అర్చా రూపము దాల్చి, మేముచేయు అపచారముల నన్నింటిని సహించుచు, నీ స్థితి గతుల నన్నింటిని మా వశమున నుంచి ఆనందించుచుంటివే స్వామీ ! ఇట్టి నీ శీల గుణమును దర్శించి, హృదయము ద్రవించిన మా ఆళ్వారులు, ఆచార్యులును ఆశ్చర్య చకితు లగుచున్నారు' - అని ప్రస్తుతించినారు అర్చావతారమున సౌలభ్యమును వలె పరత్వమును కూడ దర్శించి, కీర్తించినారు నమ్మాళ్వారులు

" తిరుక్కురుగూరదనుళ్ పొలిన్దు నిన్ఱ పిరాన్ కణ్డీర్ ఒన్ఱుం పొయ్యిల్లై పోత్తుమినే. "

అన్నది వారి శ్రీసూక్తి. (తిరుక్కుర్గూర్ అను దివ్య క్షేత్రమున వేంచేసియుండు 'పొలిన్దు నిన్ఱ పిరాన్' అను పేరుగల శ్రియఃపతియే బ్రహ్మ రుద్రేంద్రాదులకును జనకుడుసుడీ ! ఇందు ఏ మాత్రము అసత్యము లేదు. అతనిని ఆరాధింపుడు. ఈ రీతిని అర్చారాధనా ప్రాముఖ్యము శ్రీవైష్ణవ సంప్రదాయమునందు ఏర్పడి యున్నది.

## విగ్రహారాధనము - శాస్త్రీయము

దేవతలకు రూపము లేదన్నాడు జైమిని మహర్షి. ఉన్నదన్నాడు బాదరాయణ మహర్షి. నిర్గుణ బ్రహ్మవాదియైన శ్రీ శంకరులును -

" స్యాద్రూపం పరమేశ్వరస్య ఉపాసకానుగ్రహార్థం. "

ఉపాసకులను అనుగ్రహించుటకై పరమేశ్వరునకు రూప ముండును' అన్నారు.

" న తే రూపం న చాకారో నాయుధాని నచాస్పదమ్

తథాఽపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే. "

భగవాన్ ! నీ రూపము, ఆకారము, ఆయుధములు, స్థానము - ఇవి నీ కొఱకు గాదు. భక్తులమైన మా కొరకు' అని అనుచున్నది పాంచరాత్రము.

" తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ "

అను చు శ్రుతి - భగవంతుని నేత్ర సౌందర్యమును వర్ణించినది. కావున, భగవంతునకు విగ్రహము (శరీరము) కలదు. దానిని మనము

మంత్ర శక్తిచే బింబాదులయందు ఆవహింపజేసి ప్రతిష్ఠిత మొనర్చి ఆరాధింపవచ్చును. ఇట్లు అర్చామూర్తియందు ఆవాహితుడైన భగవానుడు మన సమీపమున నుండి మన కోర్కెల నీడేర్చుచు, మనలను రక్షించును. అర్చామూర్తి నారాధించి తరించినవా రెందరో మహనీయులు గలరు.

గత శతాబ్దమున శ్రీ దయానంద సరస్వతి (ఆర్య సమాజ స్థాపకులు) విగ్రహారాధనమును తీవ్రముగా ప్రతిఘటించినారు. ఇందులకు కారణము - క్రైస్తవ మహమ్మదీయ మతముల సెమరొకానగోరి, ఆయన ఇట్టి అనేక విషయములందు వారినే అనుకరించినారు కాని, శ్రీ రామకృష్ణ పరమహంస - విగ్రహారాధన మూఢ విశ్వాసము కాదని నిరూపించి చూపినారు. స్వామి శ్రీ వివేకానందులవారు ఈ తత్త్వమును ప్రపంచము నలుమూలల చాటినారు. కొందరు విగ్రహారాధన కేవలము పామరుల కొరకే. జ్ఞానుల కొరకు కాదని తలంతురు.

" ప్రతిమాస్వప్రబుద్ధానాం. "

అను శ్లోక పదమును శ్రీ యామున మునీంద్రులు పామరులకును -

" అప్రబుద్ధానా మపి. "

విగ్రహమున దైవ సాక్షాత్కారము కలుగును' అని వ్యాఖ్యానించి ఈ వాదమును నిరసించినారు. సర్వత్ర వ్యాప్తమైన ఆ భగవత్తత్త్వము విగ్రహమున నుండదా ? జ్ఞానికిని ఉపాస్యము కాదా ? ఇట్టి అర్చామూర్తిని ఆరాధించు విధానమును తెలుపునది భగవద్రామానుజుల

నిత్య గ్రంథము. దీని వెనుక మరి కొన్ని ఆరాధనా విధాన బోధక గ్రంథములు ఏర్పడినవి. ప్రకృత మనుసరామః.

## నిత్యగ్రంథ ప్రమేయము

పరమైకాంతి గావింపవలసిన భగవదారాధన పద్ధతిని చెప్పుచున్నాను. ప్రపన్నుడు భగవత్కైంకర్యమునందే లగ్న చిత్తుడై,

" భగవానేవ స్వ శేషభూతేన మయా స్వీయైరేవ కల్యాణతమైః ఔపచారిక సాంస్పర్శిక ఆభ్యవహారికైః భోగైః అఖిల పరిజన పరిచ్ఛదాన్వితం స్వాత్మానం ప్రీతం కారయితుం ఉపక్రమతే "

తనకు శేషభూతుడనైన నా చేత తనవియు, అత్యంత శుభప్రదములును అయిన ఔపచారిక - సాంస్పర్శిక - ఆభ్యవహారిక భోగములతో, అఖిల పరిజన పరిచ్ఛద సమేతుడైన తనను సంప్రీతుని గావించుకొనుటకు భగవంతుడు తానే స్వయముగ ఉపక్రమించుచున్నాడు' అని అనుసంధించుకొని, నదీ తీరమున కేగి, పరిశుద్ధమైన రేవులో పాదములను శోధించుకొని, ఆచమన మొనర్చి, గటును తీర్థముతో శోధించి, పవిత్రమైన ప్రదేశమునుండి మృత్తికను మూలమంత్రము (నారాయణాష్టాక్షరి)తో స్వీకరించి, దానిని రెండు భాగములుగ విభజించి, శోధించిన గట్టు మీద నుంచవలయును. అందొక భాగమును తీసుకొని, శరీరమునకు అందుకొని, మురికిని తొలగించుకొని, స్నాన మొనర్చి, ఆచమనము గావించి, కూర్చొని, పదాను పర్యాయములు ప్రాణాయామము గావింపవలయును. అనంతరము భగవంతుని ధ్యానించుచు, రెండవ మృత్తికా భాగమును తీసికొని, ఎడమచేత నుంచుకొని, మూడు భాగములుగ దానిని విభజించి,

ప్రత్యేక ప్రత్యేకములుగ వానిని ప్రోక్షించి, అభిమంత్రించి, అందొకదానితో అస్త్ర మంత్రమును అనుసంధించుచు దిగ్బంధనము గావించవలయును. రెండవ దానితో స్నానీయ తీర్థమునకు పీఠమును కల్పించవలయును. మూడవ దానిని శరీరమునకు రాసికొనవలయును.

పిదప పాదములను శోధించుకొని, స్నానీయ తీర్థమునకు ఉదకాంజలిని అర్పించి, పరికల్పిత తీర్థ పీఠమున, భగవంతుని వామ పాదాంగుష్ఠమునుండి వెలువడుచున్న గంగాతీర్థమును ఆవహింపచేసి, ఆ గంగా తీర్థమునకు అర్ఘ్యము నొసంగి, ఆ తీర్థమును మూల మంత్రముతో అభిమంత్రించి, అంజలితో ఆ తీర్థమును గ్రహించి, ఏడు పర్యాయములు దానిని అభిమంత్రించి, తన శిరస్సున మూడు, అయిదు లేక - ఏడు పర్యాయములు జల్లుకొనవలయును. అటు పిమ్మట, కుడిచేతితో తీర్థమును తీసికొని అభిమంత్రించి, దానిని త్రాగి, ఆచమనము గావించి, ప్రోక్షించుకొని, పరిషేకించుకొని, తీర్థమున మునిగి, భగవంతుని పాదారవిందములయందు తన శిరము నుంచుకొన్నట్లు భావించుకొనుచు, యథాశక్తిగ మూల మంత్రమును జపింపవలయును. పిమ్మట, గట్టుకు చేరి, పరిశుద్ధమైన వస్త్రమును, ఉత్తరీయమును ధరించి, ఆచమించి, ఆ యా మంత్రములతో ఊర్ధ్వ పుండ్రధారణ గావించి, భగవంతుని ధ్యానించుచు, భగవద్వాచకములైన ఆ యా మంత్రములతోను, మూలమంత్రములతోను తీర్థమును పుచ్చుకొని, ఆచమించి, ప్రోక్షించుకొని, పరిషేకించుకొని, భగవంతుని పాదారవిందములయందు అంజలితో ఉదకములను సమర్పింపవలయును. ఆ పైన ప్రాణాయామ మొనర్చి, భగవంతుని ధ్యానించుచు - నూట ఎనిమిది పర్యాయములు మూల మంత్రమును జపించి, లేచి నమస్కరించి, ఆధారశక్తి మొదలుకొని పృథివి వరకు గల దేవత

లకు తర్పణము గావించి, శ్రీవైకుంఠము మొదలుకొని పారిషదుల వరకు గలవారికిని తర్పణ మొనర్చి, దేవతలను, ఋషులను, పితృ దేవతలను భగవదాత్మకులనుగ భావించి, వారికి తర్పణము జేసి, తడి వస్త్రమును పరిశుద్ధమైన స్థలమునందు పిండి, ఆచమన మొనర్చి, ఆవాహితమైన తీర్థమును తనయందు ఉపసంహరించుకొని, తనలో చేరినట్లు భావించి, పూజా మందిరమునకు చేరవలయును.

హస్తములను, పాదములను చక్కగా శోధించుకొని, ఆచమన మొనర్చి, మిక్కిలి మనోహరము, నిశ్శబ్దము అయిన పవిత్ర ప్రదేశము నుండి మృత్తికను స్వీకరించి, దానిని దాహన శోషణ ప్లావనాదులతో శుద్ధి జేసి, గురుపరంపరను అనుసంధించుకొనుచు, పరము గురు వైన భగవంతుని సమీపించి, అతడే తనకు ప్రాప్యుడు, ప్రాపకుడు, అనిష్ట నివారకుడు, ఇష్ట ప్రాపకుడును అని భావించి, అతని స్వరూప రూప గుణ విభూతి లీలోపకరణములను యథా తథమున ధ్యానించి -

" అఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణైకతాన .. .. అనన్య శరణః త్వ త్పాదారవింద యుగళం శరణ మహం ప్రపద్యే "

అని శరణాగతి గద్యలోని వాక్యములను అనుసంధించుకొనుచు, ఆ భగవంతుని అనుగ్రహముతో నిండిన మనస్సు గలవాడై, సర్వేశ్వ రేశ్వరు డగు ఆ భగవంతునే తనకు స్వామిగ అనుసంధించుకొని, అత్యంత ము ప్రియము, సుస్పష్టము, ప్రత్యక్ష సమానాకారము అయిన నిరంతర ధ్యానముతో ఉపాసింపవలయును.

అనంతరము భగవ చ్చింతనానుభవ జనిత మైన ప్రీతస్తితిశయ ముతో పరిపూర్ణ కైంకర్య రూపమైన పూజను ప్రారంభింపవలయును.

" భగవా నేవ స్వ నియామ్య స్వరూప స్థితి ప్రవృత్తి స్వశేషతైక రసేన అనేన ఆత్మనా స్వకీయై శ్చ దేహేంద్రియాంతః కరణైః స్వకీయ కల్యాణ తమ ద్రవ్యమయాన్ ఔపచారిక సాంస్పర్శిక అభ్యవహారికాది సమస్త భోగాన్ అతి ప్రభూతాన్ అతి సమగ్రాన్ అతి ప్రియతమా అత్యంత భక్తి కృతాన్ అఖిల పరిజన పరిచ్ఛదాన్వితాయ స్వస్మై స్వయ మేవ ప్ర ప్రీత యే ప్రతిపాదయితుం ఉప క్రమం "

తన సంకల్పాధీనములైన స్వరూప స్థితి ప్రవృత్తులు గలవాడును తనకు అత్యంత శేషభూతుడు అయిన ఈ ఆత్మ ద్వారా తన వైన (తన సంకల్పాధీనములైన) దేహ - ఇంద్రియ - అంతఃకరణములతో తనవై మంగళప్రదములైన ద్రవ్యములచేనిర్వర్తింపదగిన ఔపచారిక-సాంస్పర్శిక - అభ్యవహారికాది సమస్త భోగములను అత్యధికముగను, సమగ్రముగను, అత్యంత ప్రియములుగను, అత్యంత భక్తి కృతములు గను భగవంతుడు తన కొరకు తానే స్వయముగ కావించుకొను చున్నాను" అని అనుసంధించుకొని, తన దేహమునందు పంచోప నిషన్మంత్రములను సంహార క్రమమున భావించి, ప్రాణాయామము గావించుచు, దక్షిణ హస్తముతో నాభీ దేశమున మూల మంత్రమును భావించి, ఆ మంత్రమునుండి ఏర్పడిన ప్రచండ వాయువుతో వృద్ధి జెందిన, నాభీదేశ స్థితమైన వాయువుతో శరీరమున నంతట లోపల వెలుపల గల తత్త్వములను శోషింపచేయవలయును. పిమ్మట ప్రాణా యామము గావించి, హృదయ స్థానమున మూలమంత్ర న్యాసము గావించి, ఆ మంత్రమునుండి ఏర్పడిన చక్రాగ్ని జ్వాలలతో పరివర్థిత మైన జఠరాగ్నిచే దహింపబడి, ఆ యా మూల తత్త్వములయందు విలయము జెందిన పృథివ్యాది సకల తత్త్వములు, సర్వ విధ పాప

ములు, సకల విధ అజ్ఞానములు, వానికిని మూలములైన సమస్త వాసనలును గలవాడై, భగవంతుని దక్షిణపాదాంగుష్ఠమున ఆత్మను మూల మంత్రముతో ప్రవేశింపజేయవలయును. మరి యొక ప్రాణాయామము గావించి, తనను భగవ దనుగ్రహముచే భగవ త్కైంకర్య యోగ్యునిగ భావించి, అం దుండి భగవ ద్వామపాదాంగుష్ఠము క్రిందికి ఆత్మను మూలమంత్రముతో చేర్చవలయును. అచట భగవంతుని వామ పాదాంగుష్ఠము యొక్క నఖ మనెడి చంద్రమండలము నుండి వెలువడు విద్యామృత రసముతో స్నానము గావించి, భగవ దనుగ్రహముచే అమృతమయము, సర్వ కైంకర్య యోగ్యము, అత్యంత మనోహరము అయిన దివ్య శరీరమును పొందినట్లు భావించి, అందు పంచోపనిష న్మంత్రన్యాసము గావించుకొనవలయును.

" ఓం షాం నమః పరాయ పరమేష్ఠ్యాత్మనే నమః "

అనుచు తన శిరమును స్పృశింపవలయును.

" ఓం యాం నమః పరాయ పురుషాత్మనే నమః "

అనుచు నాసాగ్రమున -

" ఓం రాం నమః పరాయ విశ్వాత్మనే నమః "

అని హృదయమున -

" ఓం వాం నమః పరాయ నివృత్త్యాత్మనే నమః "

అని గుహ్య దేశమున -

" ఓం లాం నమః పరాయ సర్వాత్మనే నమః "

అనుచు పాదములను స్పృశింపవలయును. ఇట్లు పంచోపనిష న్మంత్ర న్యాసము గావించుకొని, పంచోపనిష న్మయమైన అప్రాకృత దేహము ఏర్పడినట్లు భావింపవలయును. మరల ప్రాణాయామము గావించి,

భగవంతుని వామ పాదాంగుష్ఠమునుండి వెలువడిన అమృత ధారతో స్నాన మొనర్చి, తులసీ రుద్రాక్ష దామములను దాల్చి, ఊర్ధ్వ పుండ్రములను ధరించి, భగవ ద్యాగమును (పూజను) ఆరంభింప వలయును.

" భగవా నేవ సర్వం కారణం. "

అనుచు ముందువలె ధ్యానించి, మానస యాగము గావించి (మానసి కముగ తొలుత భగవ దారాధన గావించి), పూజా సామగ్రిని చేకూర్చుకొని, తన ఎడమ వైపున నుండు కలశమున తీర్థమును నింపి, అందు సుగంధ ద్రవ్యములను (ఏలకుల పొడివంటి పరిమళ ద్రవ్యము లను, పుష్పములను ఉంచి, ఏడు పర్యాయములు అభిమంత్రించి, శోషణ దాహనములను భావించి, అమృత తీర్థముగ ధ్యానించి, అస్త్ర మంత్రముతో రక్ష గావించి, సురభి ముద్రను ప్రదర్శించి, తక్కిన పూజా ద్రవ్యములను తన కుడి వైపున నుంచుకొని, తన ముందు దర్భాదులను పరచియున్న స్థానమున క్రమముగ ఆగ్నేయాది కోణ ములయందు అర్ఘ్య - పాద్య - ఆచమనీయ - స్నానీయ పాత్రల నుంచి, మూల మంత్రముతో శోధించి, శోషణాదులతో సంస్కరించి, ఇంతకు మున్ను సంస్కరించియున్న కలశ తీర్థముతో పాత్రములను నింపి, అర్ఘ్య పాత్రమున పుష్పములను, కుశాగ్రములను, అక్షతలను ఉంచవలయును. పాద్య పాత్రమున గరికను, విష్ణుపర్ణమును (నేల ప్రసిరికను) శ్యామాకమును, (చామలను) పద్మమును ఉంచవలయును. ఆచమనీయ పాత్రమున ఏలకులు, లవంగములను, పుష్పములను ఉంచవలయును. స్నానీయ తీర్థమున సిద్ధార్థకాదుల నుంచి, మరి యొక పాత్రమున సర్వార్థ తోయమును (శుద్ధోదకమును) ఉంచవలయును.

పిమ్మట అర్ఘ్య తీర్థమును చేతితో స్పృశించి, మూల మంత్రముతో అభిమంత్రించి,

" ఓం నమో భగవతే అర్ఘ్యం పరికల్పయామి. "

అనుచు అర్ఘ్య తీర్థమును -

" ఓం నమో భగవతే పాద్యం పరికల్పయామి "

అనుచు పాద్య తీర్థమును -

" ఓం నమో భగవతే ఆచమనీయం పరికల్పయామి. "

అనుచు ఆచమనీయ తీర్థమును -

" ఓం నమో భగవతే స్నానీయం పరికల్పయామి. "

అనుచు స్నానీయమును -

" ఓం నమో భగవతే శుద్ధోదకం పరికల్పయామి. "

అని శుద్ధోదకమును సిద్ధము జేసికొనవలయును. ఆ పైన మరి యొక పాత్రతో అర్ఘ్య తీర్థమును తీసికొని, యాగ భూమిని (ఆరాధనా ప్రదేశమును), పూజా ద్రవ్యములను, తనను ప్రోక్షించుకొన వలయును.

" (1) ఓం ఆధారశక్త్యై నమః (2) ఓం మూలప్రకృత్యై నమః (3) ఓం అఖిల జగదాధారాయ కూర్మ రూపిణే నారాయణాయ నమః (4) ఓం భగవతే అనంతాయ నాగరాజాయ నమః (5) ఓం భూ భూమ్యై నమః. "

అని అనుసంధించుచు, ఆధారశక్త్యాదులను ఒకరి పైన ఒకరుగా పైపైకి ధ్యానించి, నమస్కరించవలయును.

" ఓం శ్రీవైకుంఠాయ దివ్య లోకాయ నమః. "

అని వైకుంఠ లోకమునకు ప్రణమిల్లి.

" శ్రీవైకుంఠాయ దివ్య జనపదాయ నమః "

అని దివ్య జనపదమునకును -

" శ్రీవైకుంఠాయ దివ్య నగరాయ నమః "

అని దివ్య నగరమునకును -

" ఓం వైకుంఠాయ దివ్య విమానాయ నమః. "

అని దివ్య విమానమునకును -

" ఓం ఆనంద మయాయ మండప రత్నాయ నమః. "

అని రత్న మండపమును ప్రణమిల్లి, అందు గల ఆస్తరణమును (తివాచీని)

" అనంతాయ నాగరాజాయ నమః. "

అని ప్రణమిల్లి, దానిపైన ఆగ్నేయమున -

" ధర్మాయ నమః "

అనుచు పాదమును (కోడును) భావించి, నిరుఋతియందు -

" జ్ఞానాయ నమః.

వాయవ్యమున -

" వైరాగ్యాయ నమః. "

ఈశాన్యమున -

" ఐశ్వర్యాయ నమః. "

అనుచు పాదములను ధ్యానించి, తూర్పున -

" అధర్మాయ నమః. "

దక్షిణమున -

" అజ్ఞానాయ నమః. "

పశ్చిమమున -

" అవైరాగ్యాయ నమః. "

ఉత్తరమున -

" అనైశ్వర్యాయ నమః. "

అనుచు గాత్రమును (పీఠ శరీరమును) అనంతునిగ భావించి, పిమ్మట - కాహోర్ధ్వన్ముఖుడై యున్న అనంతుని -

" ఓం అనంతాయ నమః. "

అని ధ్యానించి, ఆ పైన -

" పద్మాయ నమః. "

అనుచు పద్మమును భావించి, దాని తూర్పు వైపు దళమున -

" ఓం విమలాయై చామర హస్తాయ నమః. "

అనుచు చామరమును చేత దాల్చిన విమలను, ఇట్లే క్రమముగ దిగ్విదిక్కులయందలి దళములయందు -

" ఓం ఉత్కర్షిణ్యై చామరహస్తాయై నమః ఓం జ్ఞానాయై చామర హస్తాయై నమః - ఓం క్రియాయై చామర హస్తాయై నమః - ఓం యోగాయై చామర హస్తాయై నమః - ఓం ప్రహ్వ్యై చామర హస్తాయై నమః - ఓం సత్యాయై చామర హస్తాయై నమః - ఓం ఈశానాయై చామర హస్తాయై నమః. "

అనుచు ఉత్కర్షిణ్యాది శక్తులను ధ్యానించి, కర్ణికా (తామర దుద్దు) పూర్వ భాగమున -

" ఓం అనుగ్రహాయై చామర హస్తాయై నమః. "

అనుచు చామర హస్తయైన అనుగ్రహమును భావించి,

" ఓం జగత్ప్రకృతయై యోగ పీఠాయ నమః. "

అని యోగ పీఠమును -

" ఓం దివ్యయోగ పీఠ పర్యంకాయ నమః. "

అని యోగ పీఠ పర్యంకమును, అందు వేయి పడగలు గల అనంతుని

" ఓం అనంతాయ నాగరాజాయ నమః. "

అని ధ్యానింపవలయును

" ఓం అనంతాయ నమః "

అని పాదపీఠమును ధ్యానించి, ఈ ఆధారశక్తి మొదలుగా గల పీఠ తత్త్వమును ప్రత్యేక ప్రత్యేకముగ గంధ పుష్ప ధూప దీపాదులతో ఆరాధించవలయును. పరివార దేవతల కందరకును వారి వారి స్థానములయందు పద్మాసనములను, అనంత గరుడ విష్వక్సేనులకు పీఠముతో గూడిన పద్మములను కల్పించి, అంతట - పుష్పములు, అక్షతలు మొదలగు వానిని చల్లవలయును. అటు పిమ్మట యోగ పీఠమునకు పశ్చిమోత్తర దిక్కున (ఈశాన్యమున) -

" ఓం అస్మ ద్గురుభ్యో నమః. "

అనుచు తమ ఆచార్యులను గంధ పుష్ప ధూప దీపాదులతో ఆరాధించి ప్రణమిల్లి, వారి అనుమతి గైకొని, భగవ దారాధనమును ప్రారంభింపవలయును.

శేషతల్పమున ఆసీనుడు - పుండరీకాక్షుడు - కిరీట మకుట కేయూర హార కటకాది సర్వ భూషణ భూషితుడు - తన దక్షిణ చరణమును కుంచించి వామ పాదమును క్రిందికి చాచి దక్షిణ హస్తమును మోకాలి మీదను వామ హస్తమును శేష తల్పమునను ఉంచుకొని, తక్కిన రెండు చేతులతో శంఖ చక్రములను ధరించిన వాడు - సర్వ జగ త్సృష్టి సంహార కారకుడు - నీల వర్ణుడు -

అపూర్వము - అవాఙ్మానస గోచరము నగు పంచశక్తిమయ విగ్రహము కలవాడునయిన భగవన్నారాయణుని పంచోపనిషన్మంత్రములతో ధ్యానించి,

" ఆరాధనాభిముఖో భవ. "

(నేను గావించు ఆరాధనకు అభిముఖుడవు కమ్ము) అని ప్రార్థించి, మూలమంత్రము నుచ్చరించుచు, సాష్టాంగముగ ప్రణమిల్లి లేచి, స్వాగతమును పలికి, ఆరాధన పూర్తి యగునంతవరకును ఇచట సన్నిహితుడై యుండవలయు నని అర్థించవలయును. తనకు అభిమతమైన మరి యొక ప్రదేశమునం దైన దో -

" మంత్రయోగ స్సమాహ్వానం పుష్పేవ దర్శనమ్
బింబోపవేశను దైవ యోగ విగ్రహ చింతనమ్
ప్రణామశ్చ సముత్థానం స్వాగతం పుష్ప మేవ చ
సాన్నిధ్యయానం చేతి తత్రాహ్వానస్య సత్క్రియాః. "

అను రీతిని - మంత్ర ధ్యానము, దేవతాహ్వానము, స్వాగత ముద్రాదర్శనము, బింబనమున ప్రవేశింపజేయుట, పంచోపనిష్మయ విగ్రహ ధ్యానము, ప్రణామము, స్వాగత వచనము, పుష్ప సమర్పణము, సాన్నిధ్య ప్రార్థన - అను క్రమమున దేవత నాహ్వానింపవలయును.

అనంతరము భగవంతునకు నమస్కరించి, ఆతని కుడి నైపున -

" ఓం శ్రీం శ్రియై నమః. "

అనుచు శ్రీదేవిని ఆహ్వానించి నమస్కరించి ఎడమ నైపున -

" ఓం భూం భూమ్యై నమః. "

అనుచు భూదేవిని, అచటనే -

" ఓం నీం నీలాయై నమః. "

అనుచు నీళాదేవిని ఆవాహన జేసి, నమస్కరింపవలయును.

" కిరీటాయ మకుటాధిపతయే నమః "

అని భగవంతుని శిరో భాగమున - వెనుక వైపుగా నాలుగు బాహువులు, నాలుగు ముఖములు గలిగి, చేతులు జోడించుకొని, భగవంతుని కిరీటమును తల దాల్చి, కిరీట మను పేరు గల దివ్య పురుషుని ధ్యానించి నమస్కరించి -

" కిరీట మాల్యాయ ఆపీడకాత్మనే నమః "

అనుచు శిరో మాల్యమునకు ప్రణమిల్లి,

" ఓం దక్షిణ కుండలాయ మకరాత్మనే నమః "

అనుచు దక్షిణ కర్ణ కుండలమును -

" ఓం వామకుండలాయ మకరాత్మనే నమః. "

అనుచు వామ కర్ణ కుండలమును -

" ఓం వై జయన్త్యైవ నమాలాయైనమః. "

అనుచు వక్షఃస్థలమున గల వనమాలను -

" ఓం శ్రీ తులస్యై నమః "

అనుచు తులసీ మాలను -

" ఓం శ్రీ వత్సాయ శ్రీనివాసాయ నమః "

అనుచు శ్రీవత్స లాంఛనములను -

" ఓం హారాయ సర్వాభరణాధిపతయే నమః "

అనుచు హారాధి దేవతలను -

" ఓం శ్రీకౌస్తుభాయ సర్వరత్నాఢ్యై నమః "

అనుచు శ్రీ కౌస్తుభమును -

" ఓం కాంతేగణోజ్జ్వలాయ పీతాంబరాయ నమః "

అనుచు దివ్య పీతాంబరములను -

" ఓం సర్వేభ్యః భగవద్భూషణేభ్యః నమః "

అనుచు సర్వాభరణములను -

" ఓం సుదర్శనాయ హేతిరాజాయ నమః "

అనుచు ఎఱుపు రంగు గలిగి, ఎఱ్ఱని నేత్రములతో, నాలుగు చేతులు గలిగి అంజలితో నున్న భగవంతుని సేవించుచు - ఆనంద పరవశుడై, శిరమున భగవంతుని చక్రాయుధమును ధరించియున్న శ్రీ సుదర్శన మూర్తిని దక్షిణ వైపున -

" ఓం నందకాయ ఖడ్గాధిపతయే నమః "

అనుచు (ఆవైపుననే) నందక మను పేరు గల భగవత్ ఖడ్గమును శిరమున ధరించియున్న నందకమును -

ఓం పద్మాయ నమః "

అనుచు పద్మమును -

" ఓం పాంచజన్యాయ శంఖాత్మనే నమః "

అనుచు శిరమున శంఖమును ధరించి, తెల్లని రంగు గలిగి రెండు చేతులతో భగవంతునకు నమస్కరించు చున్న శ్రీ పాంచజన్యమూర్తిని ఎడమ వైపునను -

" ఓం కౌమోదక్యై గదాధిపతయే నమః "

అనుచు శ్రీశార్‌ఙ్గ మూర్తిని

" ఓం సర్వేభ్యః భగవ దాయుధేభ్యః నమః "

అని సర్వాయుధములకును నమస్కరింపవలయును. ఇట్లే

" ఓం సర్వాభ్యో భగవ త్పాదారవింద సంవాహినీభ్యో నమః"

అనుచు భగవ త్పాదారవింద సంవాహికలను -

" ఓం అనంతాయ నాగరాజాయ నమః "

అనుచు - నాలుగు చేతులు కలిగి, హలమును (నాగలిని), ముస లమును (రోకలిని) ధరించి బద్ధాంజలియై, వేయి పడగలతో నొప్పుచు, భగవంతుని తదేక దీక్షగ దర్శించి, పరమానంద తుందిలు డగు చున్న నాగరాజైన అనంతుని ధ్యానించి నమస్కరించి -

" సర్వేభ్యః భగవ త్పరిజనేభ్యః నమః "

అనుచు తక్కిన లెక్కకు మిక్కిలిగ ఉన్న భగవ త్పరిజనులను (పరి చారకులను) నమస్కరించి -

" ఓం భగవత్పాదుకాభ్యాం నమః "

అని భగవంతుని పాదుకలకు నమస్కరించి -

" ఓం సర్వేభ్యో భగవ త్పరిచ్ఛదేభ్యో నమః "

అని భగవంతుని సకల దివ్యాంబర భూషణాదులను, ఇతర ఉప కరణములను -

" ఓం వైనతేయాయ నమః "

అనుచు ముందు వైపు కూర్చొని, రెండు చేతులతో నమస్కరించు చుండు గరుత్మంతుని ధ్యానించి ప్రణమిల్ల వలయును.

" ఓం నమో భగవతే విష్వక్సేనాయ "

అనుచు భగవంతునకు ప్రాగుత్తర పార్శ్వమున (ఈశాన్య దిక్కున) దక్షిణ దిక్కుగ కూర్చొని, శంఖ చక్రములను ధరించి, తక్కిన రెండు చేతులతో నమస్కరించుచున్న నీలమేఘ శ్యాములు డైన విష్వక్సేనుని ధ్యానించి, ప్రణమిల్లి -

" ఓం గం గజాననాయ నమః - ఓం జం జయత్సేనాయ నమః - ఓం హం హరి వక్త్రాయ నమః - ఓం కం కాల ప్రకృతి సంజ్ఞాయ నమః - ఓం సర్వేభ్యః భగవద్విష్వక్సేన పరిజనేభ్యో నమః. "

అనుచు విష్వక్సేనుని పరిజనులకు ప్రణమిల్లి -

" ఓం చండాయ ద్వారపాలాయ నమః - ఓం ప్రచండాయ ద్వారపాలాయ నమః. "

అనుచు తూర్పు ద్వారమున కిరు వైపుల గల ద్వారపాలకులకు నమస్కరించి -

" ఓం భద్రాయ ద్వారపాలాయ నమః - ఓం సుభద్రాయ ద్వారపాలాయ నమః. "

అనుచు దక్షిణ ద్వార పార్శ్వము లందు గల ద్వారపాలకులను -

" ఓం జయాయ ద్వారపాలాయ నమః - ఓం విజయాయ ద్వారపాలాయ నమః.

అనుచు పశ్చిమ ద్వారమున గల ద్వారపాలకులకును -

" ఓం ధాత్రే ద్వారపాలాయ నమః - ఓం విధాత్రే ద్వారపాలాయ నమః. "

అనుచు ఉత్తర ద్వారమునగల ద్వారపాలకులకును నమస్కరింప వలయును. ద్వారపాలకుల నందరిని శంఖ చక్ర గదా ధరులుగను, ఆజ్ఞా ముద్రా ధారులుగను (తర్జనీ ముద్రను ధరించినవారుగను) భావించి ధ్యానింపవలయును.

" ఓం సర్వేభ్యో భగవద్ద్వారపాలేభ్యో నమః "

అని సర్వ ద్వారపాలకులకును నమస్కరించి, తూర్పున -

" ఓం కుముదాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః "

అని వారిపద శ్రేష్ఠుడైన కుముదుని ప్రణమిల్లి ఆగ్నేయమున -

" ఓం కుముదాక్షాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః "

అనుచు కుముదాక్షుని, దక్షిణమున -

" ఓం పుండరీకాక్షాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః "

అని పుండరీకాక్షుని, నైరృతియందు -

" ఓం వామనాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయుధాయ నమః. "

అని వామనుని, పడమట -

" ఓం శంకుకర్ణాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః. "

అని శంకుకర్ణుని, వాయవ్యమున -

" ఓం సర్ప నేత్రాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః. "

అని సర్పనేత్రుని, ఉత్తరమున -

" ఓం సుముఖాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః "

అని సుముఖుని, ఈశాన్యమున -

" ఓం సుప్రతిష్ఠితాయ గణాధిపతయే సవాహన పరివార ప్రహరణాయ నమః "

అని సుప్రతిష్ఠితుని నమస్కరింపవలయును.

" ఓం సర్వేభ్యో భగవత్పారిషదేభ్యో నమః "

అని వెలుపల నుండి భగవత్పారిషదుల కందరకు నమస్కరింపవలయును.

ఇతరత్ర ఆవాహన జేసి పూజించు పక్షమున ఆరాధకుడు తన అభిమతానుసారము శ్రీవైకుంఠ - క్షీరసముద్ర ఆదిత్య మండల - హృదయకోశములనుండిగాని, మధురా - ద్వారకా - గోకుల - అయోధ్యాది అవతార స్థానములనుండిగాని, పౌరాణికములైన శ్రీరంగాది అర్చామూర్తులనుగాని భగవంతుని ఆవాహన జేసికొనవలయును. ఈ రీతిగా, దీపి - భూషణ - ఆయుధ - పరిజన - పరిచ్ఛద - ద్వారపాల - పారిషదులచే సేవింపబడుచు, త్రివిధములైన కర్మ సంసర్గాది దోష గంధ రహితుడై, సహజములై, నిరవధికాతిశయములై (సాటి లేని), సంఖ్యాతీతములైన కల్యాణ గుణములకు పెన్నిధియనై యున్న భగవంతుని - నారాయణుని ధ్యానించి నమస్కరించి, మూల మంత్రముతో తనను భగవంతునకు నివేదించుకొని, మరల నమస్కరించి, అనుమతిని గైకొని, భగవదారాధనమును ఆరంభింపవలయును.

చిన్ని పాత్రతో (ఉద్ధరిణితో) ముందు సిద్ధము చేసికొనిన అర్ఘ్య పాత్రనుండి తీర్థముకు తీసికొని, హస్తములతో భగవన్ముఖారవిందము నొద్దకు గొనిపోయి -

" భగవన్ ! ఇదం ప్రతిగృహ్ణీష్వ "

(భగవానుడా ! దీనిని స్వీకరింపుము) అని ధ్యానించుచు, భగవంతునకు దర్శింపజేసి, భగవంతుని దక్షిణ హస్తమున కొంచెము తీర్థము నుంచి, తక్కిన తీర్థమును ప్రతిగ్రహ పాత్రమున నుంచవలయును. హస్తమును శోధించిన పిదప పాదములయందు పుష్పములను సమ

ర్పించి, పాద్య పాత్రనుండి పాద్య తీర్థమును తీసికొని పాదముల యొద్దకు గొనిపోయి, మనస్సున శ్రీపాదములను శోధించినట్లు భావించి (పాద్య), ప్రతిగ్రహ పాత్రమున (పడిగ్రహ పాత్రలో) ఉంచవల యును. (ప్లోత) వస్త్రముతో శ్రీపాదములను తుడిచి, గంధము ను, పుష్పములను సమర్పించి, ఆచమనీయ పాత్ర నుండి ఆచమనీయ తీర్థ మును స్వీకరించి, భగవంతుని దక్షిణ శ్రీహస్తమున కొంచెము ఉంచి (ఆచమనీయ) ప్రతిగ్రహ పాత్రమున నుంచవలయును. పిమ్మట, గంధ - పుష్ప - ధూప - దీప - ఆచమనములను, సుగంధ ద్రవ్య ములతో గూడిన తాంబూలమును సమర్పించి (నివేదించు) నమస్క రించి -

" భగవన్ ! ఆత్మానం ఆత్మీయం చ సర్వం నిత్యకింకరత్వాయ స్వీకురు. "

(భగవానుడా ! నన్ను, నా వానిని అన్నిటిని నీ సన్నిధిలో నిత్యకైంకర్యమునకై స్వీకరింపుము) అని ప్రార్థించి, భగవంతునకు సమర్పింపవలయును.

అనంతరము భగవంతునికి స్నానమునకై (తిరుమంజనమునకై) స్నానపీఠమును గొనివచ్చి, గంధాదులతో పూజించి, నమస్కరించి, అనుమతి గైకొని, పాదుకలను శ్రీపాదములకు చేర్చి, భగవంతుడు స్నాన పీఠకయందు ఉపవిష్టుడైనంతనే, మాల్య - భూషణ - వస్త్రాదులను తీసి విష్వక్సేనులకు సమర్పించి, స్నాన శాటికను (అంగ వస్త్రమును) సమర్పించి, పాద్యమును, ఆచమనీయమును, పాద పీఠమును (పాదముల నుంచుకొను కాలిపీట) ఒసంగి, దంత కాష్ఠ - జిహ్వా నిర్లేఖన - గండూష - ముఖ ప్రక్షాళన - ఆచమన - ఆదర్శ - హస్త ప్రక్షాళనములను - సుగంధ ద్రవ్యములతో గూడిన

తాంబూలమును సమర్పించి, తైలముతో అభ్యంగనము గావించి, నలుగు బెట్టి, ఆమలక (ఉసిరిక) తీర్థమును సమర్పించి, (దువ్వెనతో) దువ్వి, ప్లోత వస్త్రముతో దివ్య మంగళ విగ్రహమును తుడిచి, శాటికను (అంగవస్త్రమును) సమర్పించి, పసుపు పూసి, అభిషేకించి, దివ్య పీతాంబరమును, ఉత్తరీయమును, యజ్ఞోపవీతమును సమర్పించి, గంధ - పుష్ప - ధూప - దీప ఆచమన - నృత్త - గీత - వాద్యాది సర్వ మంగళ ఉపచారములతో అభిషేకించి, నీరాజన - ఆచమన - దేహ శోధన - ప్లోత వస్త్ర - ఉత్తరీయ - యజ్ఞోపవీత ఆచమనము లను ఒసంగి, కూర్చను ఉంచవలయును. (ఇది శుద్ధ స్నానము) సహస్ర ధారాభిషేక - నీరాజన - ఆచమన - దేహ శోధన - ప్లోత వస్త్ర - ఉత్తరీయ - యజ్ఞోపవీత - ఆచమనములను సమర్పించి, పిమ్మట - అలంకారాసనమును అర్చించి నమస్కరించి, అనుమతి గైకొని, పాదుకలను శ్రీపాదములకు జోడించి, అలంకారాసనమున భగవంతుడు ఉపవిష్టుడైనంతనే ముందు వలె (స్నానోపయుక్త - ఉపచారములను మినహాయించి) అర్ఘ్య - పాద్య - ఆచమనీయము లను ఆ యా మంత్రములతో సమర్పించి, సుగంధ ద్రవ్య చూర్ణ ముతో - భగవద్దివ్య మంగళ విగ్రహమును సుగంధితము గావించి, వస్త్ర - ఉత్తరీయ - భూషణ - ఉపవీత - అర్ఘ్య - పాద్య - ఆచమ నీయములను సమర్పించి, భగవత్పరివార దేవతలకును స్నాన వస్త్ర భూషణాదులను, గంధ పుష్ప ధూప దీపాదులను ప్రత్యేక ప్రత్యేక ముగ సమర్పింపవలయును. అవకాశము లేనిచో - పరివార దేవతలకు గంధాదికమును మాత్రమే సమర్పించునది.

అటు పిమ్మట భగవంతుని గంధ పుష్ప ప్రదాన అలంకార అంజన (కాటుక) - ఊర్ధ్వపుండ్ర - ఆదర్శ (అద్దము) - ధూప -

దీప - ఆచమన - ధ్వజ - ఛత్ర - చామర - వాహన - శంఖ చిహ్న - కాహల - భేర్యాది సకల విధ నృత్య గీత వాద్యాదులతో ఆరాధించి, మూల మంత్రముతో పుష్పమును సమర్పించి, మూల మంత్రమునందలి ఒక్కొక్క అక్షరములోను పుష్పములను సమర్పించి, ద్వాదశాక్షర మంత్రముతోను. విష్ణు షడక్షర మంత్రముతోను, విష్ణుగాయత్రీ మంత్రముతోను, పంచోపనిషణ్మంత్రములతోను, పురుష సూక్తముతోను, ఇతర భగవన్మంత్రములతోను పుష్పములను సమర్పింపవలయును. శక్తి యున్నచో, శ్రీదేవి మొదలగు, సకల పారిషదులకును వారివారి మంత్రములతో పుష్పములను సమర్పింపవలయును.

తదనంతరము ప్రణమిల్లి, ప్రదక్షిణముగ ప్రతి దిక్కున నమస్కరించుచు, భగవంతునకు పుష్పాంజలిని సమర్పించి, నమస్కరించి, కర్ణ పేయములైన స్తోత్రములతో స్తుతించి, తనను భగవత్సన్నిధిని నిత్య కింకరునిగా నివేదించుకొని, అట్లే ధ్యానించి, యథా శక్తిగా మూలమంత్రమును జపించి, సర్వ భోగములను పూరించగల మాత్రా దానము (ఆచార్యునకు భోజన సంభారాదికమును సమర్పించుట) గావించి, సుగంధ ద్రవ్యములతో తాంబూలము సర్పించి, అర్ఘ్యము నొసంగి, అనంతరము భోజ్యాసనమును అర్చించి, నమస్కరించి, అనుమతి గైకొని, పాదుకల నొసంగి, భగవంతుడు భోజ్యాసనమున కూర్చొనినంతనే, పాద్య - ఆచమనీయ - అర్హణీయము (సుఖోష్ణమైన సుగంధ తీర్థము) లను సమర్పించి, బెల్లము - తేనె - పెరుగు - క్షీరము - వీనిని ఒక పాత్రలో నుంచి, శోషణాదులతో శోధించి, అర్ఘ్య తీర్థముతో ప్రోక్షించి, అ మధుపర్కమును శిరమును వంచి

ఆనందము నేత్రములలో తొణికి లాడగా - సంతుష్ట మనస్కుడై, సమర్పించి, ఆచమనీయము నొసంగవలయును. భగవంతునికి సమర్పించు ప్రతి పదార్థమును శోషణాదులతో శోధించి, అర్ఘ్య జలముతో ప్రోక్షించి సమర్పింపవలయును.

పిమ్మట - గోవును, సువర్ణ రత్నాదికములను యథా శక్తి సమర్పింపవలయును. అటు పిమ్మట - నేతితో నిండియున్న పక్వాన్నమును, పాలు - పెరుగు - తేనెలను, ఫలములు, మూలములతో (దుంపలతో) చేయబడిన వ్యంజనములను, ఇడ్డెనలు మొదలైన పిండి వంటలను, లోకమున అందరికి ఇష్టమైనవి, ప్రత్యేకించి - తనకు ఇష్టములైనవి, శాస్త్ర నిషిద్ధములు కానివి, అగు భోజ్య పదార్థములను శోషణాదులతో శోధించి, అర్ఘ్య తీర్థముతో ప్రోక్షించి, అస్త్ర మంత్రముతో రక్ష గావించి, సురభి ముద్రను ప్రదర్శించి, అర్ఘ్యాణ తీర్థము నొసంగి, నివేదన గావింపవలయును.

(అత్యధికము, అత్యంత సమగ్రము, మిక్కిలి ప్రియమైనది, అత్యంత భక్తితో సంపాదితమైనది అయిన ఈ భోజ్య పదార్థమును స్వీకరింపుము) అని.

" అత్యధికం అతి సమగ్రం, అతి ప్రియతమం, అత్యంత భక్తి కృతం ఇదం స్వీకురు. "

అనుచు ప్రణమిల్లి, లజ్జా వినయములతో నివేదన చేయవలయును. (తగినంతగా పదార్థములను సంపాదింపలేకపోతినే అని లజ్జ) - పైన అనుపానమును (పానకమును) తర్పణార్థ (సంతృప్తిని కలిగించు) తీర్థము నొసంగి, హస్తప్రక్షాళన - మార్జన - చందన - ముఖవాస తాంబూలాదులను సమర్పించి, భగవంతుడు మంత్రాసనమున ఉప

విష్ణుడైనంగ నే మాల్యాదులను తీసి విష్వక్సేనులకు సమర్పించి, గంధ - పుష్ప - ధూప - దీప - ఆచమన - ముఖవాస తాంబూలములను సమర్పించి, నృత్త - గీత - వాద్యాదులతో ఆనంది-పజేసి, ప్రద క్షిణము గావించి, సాష్టాంగముగ ప్రణమిల్లి, పర్యంకాసనమును అర్పించి, అనుమతి గైకొని, పాదుకల నొసంగి, ఆ ఆసనమున భగ వంతుడు కూర్చొనినంతనే, పాద్య - ఆచముల నొసంగి, మాల్య - భూషణ - వస్త్రాదులను తీసి, విష్వక్సేనునికి సమర్పించి, గంధ పుష్ప ధూప దీప ఆచనములను, ముఖవాస తాంబూలములను సమర్పించి, చెవుల కింపైన స్తోత్రముతో స్తుతించి -

" భగవానేవ స్వనియామ్య స్వరూప స్థితి ప్రవృత్తి స్వశేషతైక రసేన అనేన ఆత్మనా, స్వకీయై శ్చ - దేహ - ఇంద్రియ - అంతఃకరణైః స్వకీయ కల్యాణతమ ద్రవ్యమయాన్ ఔపచారిక - సాంస్పర్శిక - అభ్యవహారిక - ఆది సమస్త భోగాన్ అతి ప్రభూతాన్ అతి సమగ్రాన్ అతి ప్రియతమాన్ అత్యంత భక్తికృతాన్ అఖిల పరిజన పరిచ్ఛదాన్వితాయ స్వస్మై స్వప్రీతయే స్వయమేవ ప్రతి పాదితవాన్ "

అని అనుసంధించుకొని, భగవంతుని అనుమతి గైకొని, భగవంతునికి నివేదితమైన హవిస్సును (భోజ్య పదార్థములను) విష్వక్సేనులకై కొంచెము తీసియుంచి, తక్కిన దంతయు తమ ఆచార్యులు మొదలుగా గల శ్రీవైష్ణవులకు ఒసంగి, భగవదారాధనోయుక్త శేషములైన పదార్థములతో విష్వక్సేనులను ఆరాధించి, ముందు తీసియుంచిన హవిస్సును సమర్పించి, విష్వక్సేనారాధన పూర్తి గావించి, సాష్టాం గముగ భగవంతునికి నమస్కరించి, శరణు పొందవలయును.

" మనో బుద్ధ్యభిమానేన సహ న్యస్య ధరాతలే
కూర్మవ చ్చతురః పాదాన్ శిర స్తత్రైవ పంచమమ్
ప్రదక్షిణ సమేతేన త్వేవం రూపేణ సర్వదా
అష్టాంగేన నమస్కృత్య హ్యుపవిశ్యాగ్రతః ప్రభోః. "

మనస్సు, బుద్ధి, అహంకారము, రెండు చేతులు, రెండు పాదములు, శిరస్సు - వీనిని నేల తాకునట్లు నమస్కరింపవలయును. దీనికి - 'అష్టాంగ నమస్కారము' అని పేరు. శరణాగతి చేయు విధానము శరణాగతి గద్యయందు వివరింపబడినది. ఆపైన అర్ఘ్యము నొసంగి, భగవంతుని అనుజ్ఞ గైకొని, పూజను పూర్తి చేయవలయును.

ఇదియే భగవద్రామానుజుల 'నిత్యగ్రంథము' లోని సారాంశము.



# శ్రీమద్రామానుజులు - శ్రీభాష్యవం

## (చతుర్థాయ - పూర్వార్ధము)

న్యాయ విద్వాన్ - వేదాంత విద్వాన్
సాహిత్య విద్యాప్రవీణ - సాహిత్యరత్న
ప్రవచన వాచస్పతి - మహోపన్యాసక - విశిష్టాద్వైతామణి - పౌరాణికకేసరి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, ఎం.ఏ. బి.ఓ.యల్



## చతుర్థాధ్యాయము - ప్రథమ పాదము

### శ్రీభాష్యఫలము

## 1. ఆవృత్త్యధికరణము

ఉపనిషద్వాక్యార్థ నిర్ణయ మునరించుచు బాదరాయణుడు ప్రవచించినవి బ్రహ్మసూత్రములు. ఇవి నాలుగు అధ్యాయములుగా విభజింపబడియున్నవి. ప్రతి అధ్యాయము నాలుగు పాదములుగా విభజింపబడినది. ఈ బ్రహ్మసూత్రములకు భగవద్రామానుజులు అనుగ్రహించిన బృహత్తర వ్యాఖ్యానమునకు 'శ్రీభాష్య' మని పేరు. నాలుగధ్యాయములకును ప్రతిపాద్య విషయమునుబట్టి, సమన్వయ - అవిరోధ - ఉపాసన - ఫలాధ్యాయము లని వరుసగా వ్యవహారము కలదు. చివరిది అగు ఫలాధ్యాయమునసంబంధించినకు విషయములే ఈ వ్యాసమున వివరింపబడును. అందువలన ఈ వ్యాసమునకు - 'శ్రీభాష్యఫలము' అను శీర్షిక సార్థకమైయున్నది.

ఈ ఫలాధ్యాయముకూడ - ఆవృత్తి పాదము, ఉత్క్రాంతి పాదము, గతి పాదము, ముక్తి పాదము అను పేరలు గల నాలుగు పాదములుగా విభజింపబడియున్నది. వీనిలో మొదటిది అగు ఆవృత్తి పాదములో పదునొకండు అధికరణములు చేరి యున్నవి వీనిలో - మొదటి అధికరణమునకు ఆవృత్త్యధికరణ మనియే పేరు మూడవ అధ్యాయమునకు ఉపాసనాధ్యాయ మని పేరు. అందులో - మోక్ష సాధనములకు, ఉపాసనలకు సంబంధించిన వివిధ విశేషములు విచారింపబడినవి. ఆయుపాసనల ఫలితమును వివరించువది యగుట వలననే ఈ నాల్గవ అధ్యాయమునకు ఫలాధ్యాయమునకు ఫలాధ్యాయ మని పేరు కలిగినది. ఇట్లు తృతీయ - చతుర్థాయ ప్రతిపాద్య విషయములకు హేతు - హేతుమద్భావ మున్నందున, తృతీయాధ్యాయ నిరూపణానంతరము - చతుర్థాధ్యాయ నిరూపణములో - కార్యకరణ భావము సంగతిగా గమనింపవచ్చును.

తృతీయాధ్యాయమునందలి చివరి యధికరణము ముక్తి ఫలాధికరణము. కర్మము చేసిన వెంటనే ఉపాసనము నిష్పన్నము కావలయునను నియమ మేమియు లేదని నిర్ణయింపబడినది ఐనదో - ఈ నిర్ణయము కర్మలకు ఉపాసనా నిష్పాదకత్వము నంగీకరించి చేయబడినది కదా ! వాస్తవమునకు ఉపాసన నిష్పన్న మగుటకు కర్మల అపేక్షయే లేదు అని ఒక ఆశంక ఏర్పడవచ్చును "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మజ్ఞానము కలిగిన చాలును - బ్రహ్మ స్వరూప ప్రాప్తి రూప మగు ముక్తి యేర్పడును అని కదా శాస్త్రముపదేశించుచున్నది ! ఈ బ్రహ్మజ్ఞానమే ఉపాసనము. ఇది ఒక సారి కలిగిన చాలును - ముక్తిని సాధించియిచ్చును. ఇక దీని తరువాత చేయు యజ్ఞ దానాది కర్మలు దీనికి కారణములు అగుటకు

అవకాశము లేదు కదా ! అందువలన, ఉపాసనకు కర్మలు కారణములు కావు, ఉపాసన కర్మజన్యము కానియెడల - కర్మల వెనువెంటనే ఉపాసన ఏర్పడునా ? విలంబముగా ఏర్పడునా ? అని సంశయమే కుదురదు కనుక, ముక్తి ఫలాధికరణమే అనుపపన్నము అను ఆక్షేప మేర్పడవచ్చును. ఈ శ్వపరిహారార్థము ఈ యధికరణముతో నాల్గవ అధ్యాయ మారంభింపబడుచున్నది

బ్రహ్మవేదన రూప మగు ఉపాసనము ఒకసారి కలిగిన చాలునా ? అనేక పర్యాయములు కలుగవలయునా ? ఒకసారి కలిగిన చో చాలు ననుకొనుటయే శాస్త్ర సమ్మత మైన చో - ఉపాసనము కర్మజన్యము కావలసిన పని లేదు. అప్పుడు ముక్తి ఫలాధికరణము సంగతము కాదు. కాని, అనేక పర్యాయములు ఆవృత్త మైన బ్రహ్మవేదనమే ఉపాసన రూప మని శాస్త్రి ముపదేశించు పక్షమున, ఉపాసన - కర్మ నిష్పాద్య మని అంగీకరింపవలసియుండును అప్పుడు ముక్తి ఫలాధికరణము చక్కగా ఉపపన్న మై తీరును. ఈ ఆవృత్త్యధికరణములో అనేక పర్యాయములు ఆవృత్త మైన బ్రహ్మ వేదనమే ఉపాసనము ముక్తినాయకము అని సిద్ధాంతము చేయబడుచున్నది. కనుక, ఈ అధికరణము పూర్వాధికరణమునకు ప్రయోజనముగా నున్న దనవచ్చును. అందువలన, పూర్వాధికరణములో ఈ యధికరణమునకు ప్రయోజ్య ప్రయోజక భావ రూప సంగతి కల దని తలంపవచ్చును.

" బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి " ఇత్యాది వాక్యములు - ఈ యధికరణమునకు విషయ వాక్యములు. వీనిలో - బ్రహ్మవేదనము ముక్తి సాధనముగా ఉపదేశింపబడుచున్నది. బ్రహ్మవేద మనగా - బ్రహ్మను తెలిసి కొనుట ఈ బ్రహ్మ జ్ఞానము ఒకసారి కలిగి నంతనే

ముక్తిని సాధించి పెట్టునా ? లేక - నిరంతరము ధారారూపముగ పలుమారులు కలిగిననే ముక్తిని సాధించియిచ్చునా ? అని సంశయ మేర్పడును. పలుమారులు ఆవృత్తి చేసిననే బ్రహ్మజ్ఞానము ముక్తిని సాధించి యిచ్చు ననుటలో ప్రమాణములేదు కనుకను "బ్రహ్మవేద" అని వేదన మాత్రమే విహితమై యున్నందునను - ఒకసారి కలిగిన బ్రహ్మజ్ఞానమే ముక్తి సాధన మని పూర్వపక్షము కలుగవచ్చును. ఐనదో - ఈ పూర్వపక్షమును ఆక్షేపించే విధానము కూడ ఉన్నది. ఆ ఆక్షేప స్వరూప మిట్లుండును .. "వ్రీహీనవహన్తి" ధాన్యమును దంచవలెను' అను విధి యొకటి యున్నది. ఒకసారి దంచినచో - ఆ విధి ననుష్ఠించిన వారము కాగలమా ? పొట్టు పోవునంతవరకు దంచ వలె ననియు, అట్లు దంచిననే ఆ శాస్త్రార్థము ననుష్ఠించినవారము కాగల మనియు తెలియనచ్చును గదా ! అట్లే, ఇచట - "బ్రహ్మ వేద" అని విధించబడిన బ్రహ్మజ్ఞానము ఒకసారి కలిగినంత మాత్ర మున, బ్రహ్మప్రాప్తి రూప మగు మోక్షము కలుగనందున, బ్రహ్మ ప్రాప్తి పర్యంతము బ్రహ్మవేదనము నిరంతరము పలుమారులు కలుగ చుండవలయునని స్ఫురింపక మానదు కనుక, ఒకేసారి కలిగిన బ్రహ్మవేదనము ముక్తి సాధన మను పూర్వపక్షము సరికాదు అను నది ఆక్షేపము.

ఈ ఆక్షేపము సరియైనది కాదనును పూర్వపక్షి. ఏమనగా - ఇచట దంచుట కాని, పొల్లు పోవుట కాని - ఇవి రెండును మనకు కానవచ్చునవి కనుక, దృష్టము లగును. వీనిలో - దంచుట - కార కము. పొల్లు పోవుట - అనునది ప్రయోజనము. అందువలన, ఇది దృష్ట ప్రయోజనముగల స్థలము. అట్టి స్థితిలో - బ్రహ్మప్రాప్తి రూప మగు ముక్తి - దృష్ట ప్రయోజనము కాదు గదా ! అది అదృష్టము.

అదృష్టమునకు దృష్టమును నిదర్శనముగా చెప్పుట సమంజసముకాదు. స్వర్గ రూపఫలము అదృష్టము. దానికి కారణము జ్యోతిష్టోమ యాగము. ఈ యాగ మొకసారి చేసిన చాలునా ? స్వర్గ ము గలుగు నంతవరకును చేయవలెనా ? ఒక్కసారి చేసినచో చాలుననియే గదా మనకు శాస్త్ర ముపదేశించుచున్నది ! అట్లే, బ్రహ్మవేదనముకూడ అదృష్ట ప్రయోజనకము కనుక, ఒకసారి చేసిన చాలునని పూర్వ పక్షము. ఆక్షేపరహితముగా సమర్థించుకొనవచ్చును.

ఈ పూర్వపక్షమును నిరసించుచు బాదరాయణుడు - " ఆవృత్తి రసకృదుపదేశాత్ " అని సూత్రీకరించినాడు. దీని తాత్పర్య మేమనగా :- 'బ్రహ్మజ్ఞానము అనేక పర్యాయములు కలిగి ననే ముక్తి' అని. ఎందుచే ఇట్లు నిర్ణయించి రనగా - "ఉపదేశాత్" ఉపదేశమువలన' అనుచున్నాడు సూత్రకారుడు. బ్రహ్మవేదనము ముక్తి సాధన మని చెప్పిన ఉపనిషత్తులే అది చాలసారులు ఆవృత్త మైనపుడే ముక్తి సాధన మగు నని ఉపదేశించి యున్నందున, అని అనుచున్నాడు. ఉపనిషత్తు లనేకములలో విభజింపబడిన ముక్తి సాధన మగు జ్ఞానము వేదన మనియు, ధ్యాన మనియు, ఉపాసన మనియు, పర్యాయ పదములచేత చెప్పబడుచున్నది. ధ్యాన మనినను, ఉపాసన మనినను - నిరంతర స్మృతి సంతతి యని యర్థము. అందువలన, ముక్తి సాధన మగు బ్రహ్మవేదనము బ్రహ్మోపాసన రూపమైనందున, అసకృదావృత్తమేకాని, ఒకేసారి అనుష్ఠించవలసినదికాదు "తత్రతాప ప్రత్యయే చైకా సంతతి శ్చాన్యనిస్పృహా" ఇత్యాది స్మృతి వాక్య ములు కూడ 'బ్రహ్మజ్ఞానము స్మృతి సంతతి రూపమే' అని ప్రవ చించుచున్నవి. కావున, అసకృదావృత్త బ్రహ్మజ్ఞానమే ముక్తి సాధన

మని సిద్ధాంతము. దీనితో నిత్యులకు కర్మలకు ఇట్టి ఉపాసన నిష్ప్రాగ కత్వము ఉండవచ్చును. కనుక, పూర్వపు ముక్తి ఫలాధికరణముకూడ ఉపపన్న మగు చున్నది.

## 2. ఆత్మత్వోపాసనాధికరణము

పై యధికరణము ముక్తి సాధన మగు విద్య యొక్క స్వరూపమును అసకృదావృత్తి రూప విశేష బోధన ద్వారా శోధించినది. ఈ యధికరణముకూడ ఆ విద్య యొక్క స్వరూపముచే మరి యొక విశేషమును బోధించుట ద్వారా శోధించుచున్నది. కనుక, పై యధికరణముతో ఈ యధికరణమునకు ఏక కార్య కారిత్వ మను సంగతి చెప్పవచ్చును. "బ్రహ్మవేద" "బ్రహ్మను పొందవలెను" ఇత్యాది వాక్యములలో విధించబడిన ఉపాసనమే ఈ యధికరణమునకును విషయము. ఇచట ధ్యానించునపుడు పరమాత్మను తనకంటె వేరైన వానినిగా ధ్యానించువలెనా? లేక - తనకు ఆత్మయైన వానినిగా ధ్యానింప వలెనా? అనునది సంశయము. "అనేకం తు భేదనిర్దేశాత్" "నేతరోఽనుపపత్తేః" ఇత్యాది సూత్రములయందు పరమాత్మ జీవుని కంటె భిన్నుడని స్పష్టముగా ఉపదేశించబడినదిగదా! అందువలన, పరమాత్మ జీవునికంటె భిన్నమైన వానుగనే తలచి ధ్యానింపవలె నని తోచుచున్నది అన్లో - "యోఽన్యాం దేవతా ముపాస్తే అన్యోఽసా అన్యోఽహమస్మీతి నవేద అకృత్స్నో హ్యేషః ఆత్మేత్యేవ ఉపాసీత" మొదలగు శ్రుతివాక్యములు పరమాత్మను తనకు ఆత్మవలెనే ఉపాసింపవలెనని బోధించుచున్నవి. అందువలన, ఆత్మవలెనే పరమాత్మను ఉపాసింపవలె నని స్పష్ట మగు చున్నది. కనుక, ఉపాసన చేయవలసిన విధానమున సంశయము మేర్పడుచున్నది

పరమాత్మ జీవునికంటెను భిన్నమైనవాడు కనుక, నాకంటెను పరమాత్మ వేరు అనియే ధ్యానింపవలె నని పూర్వపక్షము. వాస్తవిక స్థితి ననుసరించి ఉపాసన ఉండవలెను. వాస్తవిక స్థితి పరమాత్మ జీవునికంటెను వేరుగా నుండుట యట్టిదే కదా! అందువలన, 'నాకంటెను పరమాత్మ వేరు' అని కాని, 'నేనును, పరమాత్మయు పరస్పరము వేరైన వారము' అని కాని, 'మొత్తము మీద - పరమాత్మయు, జీవుడును ఒకటియే' అనెడు అభేదజ్ఞానము కలుగుటకు అవకాశ మీయని రీతిలో ఉపాసనము జరుగవలెను. అదియే వాస్తవిక స్థితి కనుక, ఈ రీతికంటెను భిన్నముగా ఉపాసనచేయుట వాస్తవిక స్థితికి దూర మగుట కాగలదు. మరి ఇట్లు ఉపాసన - వస్తుస్థితికి దూరమైనచో - బ్రహ్మప్రాప్తియు వస్తుస్థితికి దూరము కాగలదు. "యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" ఈ లోకమున ఎట్టి ఉపాసన చేయునో - అట్టి ఫలమునే తరువాత పొందు నని కదా శాస్త్ర మ్ముపదేశించుచున్నది' అందువలన, వాస్తవిక స్థితికి అనుగుణముగ - తనకంటెను పరమాత్మ వేరైనవాడు ఇత్యాది రూపముగా ఉపాసన ఉండవలయు నని పూర్వపక్షము యొక్క సారాంశము.

దీనికి సమాధానముగా సూత్రకారుడు - "ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ" అని సూత్రీకరించినాడు. తనకు ఆత్మ వలెనే పరమాత్మను ఉపాసన చేయవలె నని ప్రాచీనులు అంగీకరించు చున్నారు. శాస్త్రములును అట్లే ఉపదేశించుచున్నవి అని ఆ సూత్ర తాత్పర్యము. ఇచట ఒక విషయమును మనము అవగాహన చేసికొన వలసియున్నది. 'పరమాత్మ తనకంటెను వేరు' అను రీతిలో ధ్యానించి నను, 'పరమాత్మ తనకు ఆత్మ' అను రీతిలో ధ్యానించినను - అంతగా

వ్యత్యాసము కానవచ్చుటలేదు. రెండు రీతులయందును పరమాత్మ జీవునకంటెను భిన్నమైనవాడుగనే కదా భావించబడుచున్నాడు! అట్టిచో - 'వస్తు స్థితికి రెండు రీతులును అనుగుణములుగనే ఉన్నవి' అనవలసియున్నది. కాని వీనిలో ఒక రీతి - పూర్వపక్షము, మఱియొక రీతి సిద్ధాంతము - అని ఎట్లు చెప్పుకొనవలసియున్నది? అని ఆశంక కలుగవచ్చును. దీనిపై పర్యాలోచన చేయగా - ఒక విషయము స్పష్టమగును.

'పరమాత్మ తనకు ఆత్మ' అను ఉపాసనలో - తనకును, పరమాత్మకును భేదము లేదను జ్ఞానము కలిగించు పద ప్రయోగము చేయువలసియుండును. భేదము లేకపోవుట వాస్తవము కాదు కదా! వాస్తవికము కాని దాని జ్ఞానమును 'భ్రమ' అని వ్యవహరింతురు. ప్రకృతములో వాస్తవము కానిది జీవాత్మకు, పరమాత్మకును భేదము లేకపోవుట. అనగా - అభేదము. ఇట్టి అభేదము యొక్క భ్రమ కలిగించునట్టి అవకాశము నిచ్చునది "అహంబ్రహ్మాఽస్మి" అనునట్టి రీతిలోనుండు పదప్రయోగము. "అహంబ్రహ్మ అస్మి" అనగా - 'నేను బ్రహ్మను ఉన్నాను' అను అర్థము. సాధారణ వ్యుత్పత్తి గలవారలకు తెలియుచుండును 'నేను బ్రహ్మను' అన్నంతనె, జీవాత్మ పరమాత్మలకు భేదము లేదను భ్రమ కలుగుటకు అవకాశము కలదు కదా! ఇట్లు జీవాత్మ పరమాత్మలకు అభేద భ్రమకు అవకాశ మొసగు పదప్రయోగము - "అహం బ్రహ్మ అస్మి" అను రీతిలోని పదప్రయోగము. అట్టిచో - పరమాత్మను తనకు ఆత్మగనే ఉపాసన చేయు నపుడు ఇట్టి పదప్రయోగముచేతనే ఆ ఉపాసనము చెప్పబడుచుండును. పరమాత్మను తనకంటె వేరుగనే ఉపాసన చేసి నపుడు అభేద భ్రమకు అవకాశ మొసగు "అహం బ్రహ్మాఽస్మి" అను

రీతిలో పదప్రయోగ ముండదు. 'తన కంటెను పరమాత్మ వేరు' ఇత్యాది రీతిలోనే పదప్రయోగ ముండును. కనుక, పరమాత్మను తనకంటె వేరైన వానిగా చేయు ఉపాసనమునకును తనకు ఆత్మయైన వానిగా చేయు ఉపాసనమునకును ఇంతటి వ్యత్యాసము గలదని గ్రహింపవలెను.

మరి యొక మాట - ఈ యధికరణము పరమాత్మను తనకు ఆత్మగనే ఉపాసనము చేయ వలె నని సిద్ధాంతము చేయు చున్నది కదా! ఇట్టి తనకు పరమాత్మను ఆత్మగనే ఉపాసనము చేయుట అనగా - " అహంబ్రహ్మా అస్మి " అను రీతిలోనే కదా ఉపాసనము చేయువలెననుచుంటి రేల ? 'నాకు పరమాత్మ ఆత్మ' ఇత్యాది రీతిలో అభేద భ్రమ కలుగుటకు అవకాశము లేని రీతిలో ఉపాసనము చేయ వచ్చునే అని మనకు అనిపింపవచ్చును. అందువలన, సూత్రకారుడు న " ఉపగచ్ఛంతి " అని, పై సూత్రములో చెప్పియున్నాడు. " ఉప గచ్ఛంతి " యనగా - 'అంగీకరించుచున్నారు' అని అర్థము. పరిపక్వ మైన వేదాంత విజ్ఞానము కలవారు వామదేవాదులు - తాము ఉపా సించిన రీతిని పదములలో ప్రతిపాదించినపుడు - " త్వం వా అహ మస్మి భగవో దేవతే అహం వా త్వ మసి " ఇత్యాది రీతిగా - పర మాత్మకు, తనకును అభేద జ్ఞానము కలిగించు రీతిగనే పదప్రయోగము చేసియున్నారు. కనుక, పరమాత్మను తనకు ఆత్మగా ఉపాసనము చేయు రీతి - " అహంబ్రహ్మాఽస్మి " అనునదిగనే ఉండవలెనుకాని, 'పరమాత్మ నాకు ఆత్మ' అను రీతి పదప్రయోగము చేయుటకు అర్హముగా నుండకూడదు. అంతే కాదు -

పై సిద్ధాంత సూత్రములో - " గ్రాహయంతి చ " అనియు, సూత్రకారుడు ఉపదేశించు చున్నాడు. " గ్రాహయంతి చ "

అనగా - 'శాస్త్రముకూడ పరమాత్మను ఆత్మగా ఉపాసన చేయు పద్ధతి' - " అహంబ్రహ్మాఽస్మి " అను రీతిలోనే ఉండవలెనని తెలియుచున్నవి అని తాత్పర్యము. " అథయోఽన్యాం దేవతా ముపాస్తే అన్యోఽసా అన్యోఽహమస్మీతి న సవేద ... ఆత్మేత్యేవ ఉపాసీత " అని బృహదారణ్యకోపనిషత్తు - తాను వేరు పరమాత్మ వేరు' అను రీతిలో ఉపాసన కూడదు, పరమాత్మను తనకు ఆత్మగనే ఉపాసన చేయవలెనని కదా ఉపదేశించుచున్నది! అందువలన, పరమాత్మను ఆత్మగా ఉపాసించునపుడు - తనకును, పరమాత్మకును అభేద జ్ఞానమును కలిగించు అవకాశముగల " అహం బ్రహ్మాఽస్మి " ఇత్యాది రీతిగానే ఉపాసన ఉండవలెనని ఈ యధికరణములోని సిద్ధాంతము.

ఐనచో - అవాస్తవిక మగు అభేదముయొక్క జ్ఞానమును కలిగించు అవకాశ మొసంగెడు రీతిలోని ఈ " అహంబ్రహ్మాఽస్మి " అను రీతి ఉపాసనమే ఎందులకు? అని శాస్త్రము వక్కాణించుచున్నది. కావున, ఈ యంశమును గురించి ఆలోచింతము. " అహం బ్రహ్మ అస్మి " అనునది అభేదమును బోధించుచున్నది. అభేదము లోకములో రెండు విధములుగా నున్నది ఒకటి - స్వరూపమునుబట్టి ఏర్పడునట్టిది. 'నల్లనికుండ' అని నపుడు రెండు పదము లున్నవి కదా! 'నల్లని' అని యొకటి, 'కుండ' అని మఱి యొకటి. వీనిలో - 'నల్లని' అనగా - నలుపు రూపము గలది యనియు, 'కుండ' అనగా - 'ఘటము' అనియు పదార్థములుకూడ రెండు చెప్పబడుచున్నవి. ఐనచో - రెండు పదార్థములును స్వరూపమునుబట్టి, ఇచట వేరు వేరు కావు. ఏదే మనగా - ప్రకృతములో ఏది నలుపు రూపము కలది యను చుంటిమో, అది కడవయే. అందువలన, ఈ రెండు పదార్థము లకును

ఇచట స్వరూపమునుబట్టి, అభేదము చెప్పబడుచున్న దనవచ్చును. ఇట్లు ఒక విధ మగు అభేద స్వరూప మిట్లున్నది.

ఇక మరొక విధ మగు అభేదమును పరిశీలింతము :- ఇయ్యది శరీరాత్మ భావమునుబట్టి వ్యవహరింపబడు అభేదము. "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులు ప్రపంచము పరమాత్మకంటెను వేరు కాదని చెప్పుచున్నవి. "ఐతదాత్మ్య మిదం సర్వం" "తత్సత్యం" "స ఆత్మా" ఇత్యాది శ్రుతులు పరమాత్మయే ఈ చేతనా చేతనము లందును ప్రవేశించి యునికిం చునట్టి ఆత్మ యని చెప్పుచున్నవి. "యస్య పృథివీ శరీరం" "యస్య సర్వాణి భూతాని శరీరం" ఇత్యాది శ్రుతులు ఈచేతనాచేతనము లన్నియు పరమాత్మను శరీరము లని చెప్పుచున్నవి. ఇట్లు ఈ జీవులకును - పరమాత్మకును శరీరాత్మ భావ రూప సంబంధ మున్నది ఈ సంబంధము పృథక్‌స్థితి అనర్హతను సూచించును. జాతి గుణాదులకును ద్రవ్యములలో నిట్టి పృథక్ స్థిత్యనర్హ సంబంధమే యున్నది. ఇట్టి పృథక్‌స్థితికి యోగ్యములు కాని వానిని వ్యవహరించునపుడుకూడ అభేదజ్ఞానము కలిగించునట్లే పదప్రయోగము చేయబడుచున్నది. గోవు నడచుచున్నది' అని మనము వ్యవహరించుచున్నాము కదా ! గోవు అనునది జాతి వాచక మగు శబ్ద మని శాస్త్రకారులు పేర్కొనుచున్నారు. 'గోవు' అనగా - 'గోత్వజాతి' యని యర్థము. జాతికి - 'నడచుట' యను క్రియ కుదురదు కదా ! అందువలన, 'గోవు' అనగా - 'గోత్వజాతి కలది' అను అర్థమును చెప్పుకొందురు. ఇట్లు విశేషణ వాచక శబ్దముచేతనే విశేష్యమును చెప్పికొనుట పృథక్ స్థిత్యనర్హ విశేషణములు కల చోట చూచుచున్నాము.

ఇట్లే 'గోవునల్లది' అనుచోట - 'గోవు' అనగా - పైకి కాను పించు గోశరీర మనియే అర్థముగా జెప్పుకొనవచ్చును. కాని, 'గోవు మరణించినది' అని నపుడు - గోశరీరము అని మాత్రమే అర్థముజెప్పి కొనలేము కదా ! ఏలననగా - గోశరీర మున్నపుడే 'గోవు మరణించి నది' అను చున్నాము. కనుక, 'గోవు' అనగా - 'గోశరీర విశిష్ట మగు ఆత్మ' అని యని అర్థము. జాతి వ్యక్తుల వలెనే శరీరాత్మలును పృథక్ స్థిత్యనర్హ సంబంధము కలవి కదా ! కనుక, గోశబ్దమునకు గోశరీర విశిష్ట జీవుడు, మనుష్యుడు అనగా - మనుష్య శరీర విశిష్ట జీవుడు అని అర్థములు చెప్పి కొనవలసియుండును - అని ఇతర శాస్త్ర కర్తలు మనకు చెప్పుచుందురు.

కాని, వేదాంత విజ్ఞానము కలవారు మాత్రము అంతవఱకే కాక, ప్రతి శబ్దమునకు పరమాత్మ పర్యంతము అర్థమును చెప్పుచుం దురు. దేవాది శరీరములలోనుండి నియమించు జీవాత్మ పర్యంతము దేవాది శబ్దములు బోధించునట్లే జీవులకును లోన ప్రవేశించి, జీవు లనుకూడ నియమించువాడుకదా పరమాత్మ ! కనుక, దేవాది శరీ రములకు ఆయా శరీరములలోని జీవులు ఆత్మలైనట్లు, జీవులకును, అచేతనములకును పరమాత్మయే ఆత్మ యగు చున్నాడు. “ అంతః ప్రవిష్టః శాస్తా జనానాం సర్వాత్మా ” ఇత్యాది శ్రుతులు - 'లోన ప్రవేశించి నియమించువాడే ఆత్మ' యని కదా ! చెప్పుచున్నవి.

సర్వేశ్వరుడు అందఱిలోన ప్రవేశించి నియమించువాడు కనుక, అందఱికిని ఆత్మ యని చెప్పబడు చున్నాడు. ఇందువలన, దేవాది శబ్దములు దేవశరీర విశిష్ట జీవుని మాత్రమే చెప్పక, ఆ జీవునికిని, ఆ జీవునకు ఆత్మగా నున్న పరమాత్మ పర్యంతము చెప్పును. ఇట్లు చేతనాచేతనముల శరీరములు. పరమాత్మ వారికి ఆత్మ. వానిని విడచి

ఉండజాలని చేతనాచేతనములు వానికి విశేషణములు. కావున, ఇట్లు విడచి ఉండజాలని విశేషణములను ప్రతిపాదించు శబ్దము లన్నియు - విశేష్య పర్యంతము చెప్పుటయే వేదాంత శాస్త్రమువలన కలుగవలసిన విజ్ఞానము. ఈ కారణముచే, ప్రకృతములో - 'అహం' 'నేను' అనగా - 'అహం పదార్థమును శరీరముగా కలిగియున్న పరమాత్మ' అని అర్థమేర్పడును. కనుక, అహం పదార్థమునకును, బ్రహ్మ పదార్థమునకును అభేదమును చెప్పికొనుచున్నాము. ఇది శరీరాత్మభావముచేత ఏర్పడిన అభేదము. గుణవాచక మగు నీలపదముయొక్క అర్థమునకును ద్రవ్య వాచక మగు ఘటపదముయొక్క అర్థమునకును గుణ గుణి భావము చేత ఏర్పడిన అభేదము వ్యవహరింపబడుచున్నది కదా ! ఇట్లే, జాతి వాచక మగు మనుష్య పదముయొక్క అర్థమునకును వ్యక్తి వాచక మగు దేవదత్తాది పదముల అర్థమునకును జాతి వ్యక్తి భావముచే ఏర్పడిన అభేదముకదా వ్యవహరింపబడుచున్నది ! అట్లే, దేవాది శరీరవాచక శబ్దముల అర్థమునకును, ఆత్మవాచక జీవాదిపదముల అర్థమునకును అభేదము - 'శరీరాత్మభావముచేత' అనియే చెప్ప వలెను. కనుక, " సర్వం ఖల్విదం బ్రహ్మ " ఇత్యాది స్థలముల యందు - చేతనాచేతనరూప ప్రపంచమును చెప్పు సర్వశబ్దము యొక్క అర్థమునకును పరమాత్మను చెప్పు బ్రహ్మ పదముయొక్క అర్థము నకును శరీరాత్మ భావముచేత ఏర్పడిన అభేదమునే కదా చెప్పవలసి యుండును !

ఇట్లే, " అహం బ్రహ్మాఽస్మి " యనగా - అహం పదార్థము నకును, బ్రహ్మ పదార్థమునకును శరీరాత్మభావమునుబట్టి ఏర్పడు అభేదము చెప్పికొనవలయును. కనుక, పరమాత్మను తనకు ఆత్మగా

భావించి చేయు ఉపాసన స్వరూపము - "అహం బ్రహ్మాఽస్మి" అను రూపములోనే ఉండవలసియుండును. ఈ శరీరాత్మభావ నిబంధమైన అభేదము వాస్తవికము. ఆత్మను విడచిన శరీరమున కెట్లు శరీర భావము అన్వయింపదో, పరమాత్మను విడచిన తనకును గల వేదకు దీనభావము ఈ యుపాసనలో కానవచ్చును. ఈ భావము ప్రీతిని అతిశయింపజేయును. దానితో దర్శన సమానాకారమై, ఈ ఉపాసనము చరమసీమను చేరును కనుక, "అహం బ్రహ్మాఽస్మి" యను రీతిలోని ఈ ఉపాసనము స్వరూపాభేదభ్రమను కలిగించు అవకాశమును కల్పించునదియే యైనను, శరీరాత్మ భావస్ఫోరకమై, ఉపాసకునకు దినదినము ప్రీత్యతిశయావహమై, పరమాత్మను దర్శింపజేయగలదియై యున్నందున, పరమాత్మను "అహం బ్రహ్మాఽస్మి" యను రీతిలోనే తనకు ఆత్మగనే ఉపాసింపవలయు నని ఈ యధికరణము సిద్ధాంతము చేయుచున్నది.

## 3. ప్రతీకాధికరణము

పూర్వాధికరణమున పరమాత్మను ఆత్మగనే ఉపాసన చేయవలయునని సిద్ధాంతింపబడినది. ఉపాసన సామాన్యమును బట్టి, వెంటనే ప్రతీకోపాసనము కూడ స్ఫురణకు వచ్చినది. ఈ ప్రతీకోపాసనమందును బ్రహ్మను ఆత్మగనే ఉపాసన చేయవలయునేమో! అని సంశయము కలుగవచ్చును. కనుక, తన్నివారణ నిమిత్తము ఈ యధికరణ మారంభింపవలసి వచ్చినది. స్ఫురణకు వచ్చిన అంశము నుపేక్షింపరాని దైనపుడు-పై అంశముతో ప్రకృత నిరూపణీయాంశమునకు గల సంబంధమును ప్రసంగ సంగతిగా భావింతురు. అందువలన, ప్రసంగ సంగతితో ఈ యధికరణము ఉత్థితమైన దని తెలిసికొనవలయును. ప్రతీక మనగా - శరీరము లేక - విశిష్ట వస్తువుయొక్క ఏక

దేశము అని అర్థము. ఇట్లు బ్రహ్మ శరీరమునందు - చేతనాచేతన విశిష్ట వస్తు వగు బ్రహ్మయొక్క ఏకదేశమునందు బ్రహ్మ దృష్టిని ఉంచి చేయు ఉపాసనమునకు ప్రతీకోపాసన వని స్వరూపము. ఇయ్యది బ్రహ్మను విషయీకరించిన ప్రతీకోపాసనము పరిచయము. బ్రహ్మను విషయీకరించిన ప్రతీకోపాసనలుకూడ నున్నవి. అవి ప్రతీక మాత్రోపాసనలు. వానిలో - బ్రహ్మ విశేషణములుగగాని, విశేష్యముగగాని ప్రతీకగను విషయము కాదు. అట్టి ఉపాసన లిప్పుడు స్మృతములై నిరూపింపబడుటలేదు. బ్రహ్మ విషయక ప్రతీకోపాసనములే ఇచట ప్రసంగ సంగతితో ప్రస్తుతము లైనవి. బ్రహ్మనే కదా ఆత్మగా ఉపాసన చేయుట పూర్వాధికరణములో నిరూపింపబడినది! కనుక, ఈ యధికరణమున, బ్రహ్మ విషయక ప్రతీకోపాసనలను ప్రతిపాదించు వాక్యములు విషయ వాక్యము లనవలెను.

" మనో బ్రహ్మేత్యుపాసీత " " సయోనామ బ్రహ్మేత్యుపాస్తే " ఇత్యాది వాక్య విహితము లగు ఉపాసనలు బ్రహ్మ విష విషయక ప్రతీకోపాసనలు. వీని యందును పరమాత్మను తనకు ఆత్మగా ఉపాసన చేయవలయునా ? లేదా ? అనునది సంశయము. ఇవియు బ్రహ్మోపాసనలే గనుక, బ్రహ్మ ఉపాసకునకు ఆత్మయే కనుక, బ్రహ్మను తనకు ఆత్మగా ఈ ఉపాసనలందును అను సంధించుకొనవలెనని పూర్వపక్షము ఏర్పడును. దీనికి సమాధానముగ - " న ప్రతీకే నహి సః " అని సూత్రీకరించినారు బాదరాయణులు. ప్రతీకోపాసనలయందు ఆత్మగా అనుసంధానము చేయశక్యము లేదు. ఏ మనగా - ప్రతీకముకదా ఇచట ఉపాసన చేయబడుచున్నది ! ఆ ప్రతీకము ఉపాసకునకు ఆత్మ కాదు " మనో బ్రహ్మేత్యుపాసీత " అనగా - మనస్సును బ్రహ్మ యని ఉపాసింపవలె నని అర్థము. కనుక,

ఇచట ఉపాసన చేయబడునది మనస్సు. దాని యందు బ్రహ్మ దృష్టిని ప్రసరింపచేయవలెనని చెప్పబడుచున్నది. కనుక, ఇచట బ్రహ్మ దృష్టికి విశేషణముగా చేర్కొనబడినదే తప్ప, ఉపాసన చేయవలసినదిగా విహితమైనది కాదు. ప్రతీకోపాసన మనస్సే బ్రహ్మ కాదు దానిని బ్రహ్మ యని ఉపాసించుట యని కదా తెలంచినాము!

ఐనచో - మనస్సుకంటెను గొప్పది కదా! గొప్ప దాని యుపాసన చేయుటే భావ్యము కనుక, అచేతనములగు వాక్కును, మనస్సులను ఉపాసించుట కాక, ప్రతీకోపాసనలందును బ్రహ్మనే ఉపాసన చేయుట సమంజసముగా నుండును. బ్రహ్మయందు వాక్కుగనో, మనస్సుగనో దృష్టినుంచి చేయు ఉపాసనలే ప్రతీకోపాసనలు అని భావింపవచ్చును కదా! అను ఆశంక ఏర్పడవచ్చును. దానికి బాదరాయణుడు బదులు చెప్పుచు - "బ్రహ్మ దృష్టి రుత్కర్షాత్" అని సూత్రీకరించినాడు. అపకృష్టమునందు ఉత్కృష్ట దృష్టి అభ్యుదయావహము కాగలదు. భృత్యునికి రాజుగా చూచిన యతడు సంతసించి, అర్థించిన దాని నీయగలడు. కాని, ఉత్కృష్టునియందు అపకృష్ట దృష్టి అభ్యుదయప్రదము కాదు. రాజును భృత్యునిగా చూచినచో, అభ్యుదయమునకు బదులు - అనర్థమేర్పడును కదా! అందువలన, ప్రతీకోపాసనలలో మనస్సు మొదలగు ప్రతీకములను బ్రహ్మగా భావించి, ఉపాసనము చేయుటయే అభ్యుదయావహమైనందున, ప్రతీకములయందు బ్రహ్మ దృష్టియే భావ్యము తప్ప, బ్రహ్మయందు మనస్సు మొదలగు వాని దృష్టి - సమంజసము కాదని తాత్పర్యము. ఇంతకును ప్రతీకోపాసనలలో బ్రహ్మను ఉపాసించుటయే లేదు కనుక, బ్రహ్మను ఆత్మగా అనుసంధానము చేయవలయునను పూర్వపక్షముకూడ సమంజసము కాదని స్పష్టము. ప్రతీకోపాసన

లలో పరమాత్మను ఆత్మగా భావించి ఉపాసించు ప్రసక్తి లేదని సిద్ధాంతము.

## 4. ఆదిత్యాది మత్యధికరణము

బ్రహ్మోపాసన ప్రకరణములో బ్రహ్మ విషయక ప్రతీకోపాసనముపలెనే ప్రతీకోపాసన సామాన్యమునుబట్టి, బ్రహ్మ విషయక ప్రతీకోపాసనముకూడ స్మృత మైనది. అందువను, కొన్ని విశేషము లు చెప్పవలసి యున్నవి. అందువలన, ప్రసంగ సంగతి తోడనే ఈ యధికరణ మారంభింపబడుచున్న దనవలెను. బ్రహ్మ విషయక ప్రతీకోపాసనకు సంబంధించిన విశేషములే అందు చర్చింపబడు విషయములు. " య ఏవా సీతపతి తముద్గీథ ముపాసీత " ఇత్యాది వాక్యములు కర్మాంగాశ్రితము లగు కొన్ని ఉపాసనలను విధించుచున్నవి. ఉద్గీథ మనునది ఒక కర్మాంగము. దాని ఉపాసనము పై వాక్యముచేత విధించబడుచున్నది. ఐనచో - ఇందులో ఆదిత్యుని యందు ఉద్గీథ దృష్టినుంచి ఉపాసింపవలెనా ? లేక - ఉద్గీథమునందే ఆదిత్య దృష్టినుంచి ఉపాసింపవలెనా ? అని సంశయ మేర్పడును ఆదిత్యునియందే ఉద్గీథ దృష్టినుంచి ఉపాసింపవలెనని పూర్వపక్షము. ఏ మనగా - పై యధికరణములో నికృష్టమునందు ఉత్కృష్ట దృష్టి ఉచిత మని యన్నారు కదా ! ప్రస్తుతము ఫలములేని ఆదిత్యుని కంటెను ఫల సాధన మగు కర్మకు అంగ మగు ఉద్గిథ మే ఫలము కలది కనుక, ఉత్కృష్టము కదా ! అందువలన, ఆదిత్యునియందు ఉద్గీథ దృష్టియే భావ్య మని పూర్వపక్షము. దీనికి సమాధానముగ - " ఆదిత్యాది మత యశ్చాంగ ఉపపత్తేః " అని సూత్రించినారు. ఉద్గీథాది కర్మాంగమునందే ఆదిత్యాది దృష్టి భావ్య మని తాత్పర్యము. కారణ మేమనగా - కర్మాంగమునకంటె ఆదిత్యాది దేవతలే ఉత్కర్ష ముప

పన్న మగు నను భావము దేవత కర్మలచేత ఆరాధింపబడుచున్నది. కనుక, దేవత ప్రధానము. కర్మ అప్రధానము. ప్రస్తుతము కర్మలో ఆదిత్యుడు దేవత కాకున్నను, దేవత యైనందున సర్వపు ఉత్కర్షము ఆతనికి కుదురవచ్చును. ఏ దేశపు రాజయినను మఱియొక రాజ భటునికంటె ఉత్కృష్టుడే కదా! కనుక, ఉద్గీథమునందే ఆదిత్య దృష్టి నుంచి, ఉపాసించుటే న్యాయ మని సిద్ధాంతము.

## 5. ఆసీనాధికరణము

ఉపాసనలకు సంబంధించిన మఱియొక్క విశేషము స్మృతిపై చెప్పవలసినదిగనే ఉన్నందున, ప్రసంగ సంగతి తోడనే ఈ యధికరణము ఆరంభింపబడుచున్నవి. అందువలన, ఉపాసనయే ఈ యధికరణమునకును విషయము. ఈ ఉపాసనము కూరుచుండియే చేయవలె నని నియమ మేదేని కలదా? లేక - యథేచ్ఛగా నిలుచుచుండి కాని, పరుండి కాని, నడచుచు కాని చేయవచ్చునా? అని సంశయము. నియమ మేదియు చెప్పబడనందున, యథేచ్ఛగా చేయవచ్చునని పూర్వపక్షము. కాని, కూరుచుండి ఉపాసించుటయే యుక్తమనును సూత్రకారుడు. నడచుటకాని, నిలుచుండుటకాని ప్రయత్న సాధ్యములు కనుక, ఆ స్థితిలో చిత్తమునకు ఏకాగ్రత సిద్ధింపదు. పరుండినచో నిదుర రావచ్చును. ఉపాసనము చిత్తమునకు ఏకాగ్రత యున్నపుడే సాధ్యము కదా! కనుక, నియతముగ కూరుచుండియే ఉపాసన చేయవలెను. అందునను - వెనుక వైపుకు పడకుండగ, చూచుకొనుటతో ఏకాగ్రత భగ్నము కావచ్చును. కనుక, ఆనుకొనుటకు వెనుక వైపున దిండువంటిది (బాలీసు) ఉండుట మంచి దందురు శ్రీభాష్యకారులు. "ధ్యాయతీవ పృథివీ" పృథివి

ధ్యానించుచున్నట్లు ఉన్నది' అనుట - కదలక ఉండుటవలననే కదా ! అందువలన, ఉపాసనలో నిశ్చలత్వము ఏకాగ్రతకై కూరుచుండుటే ప్రాధాన్యము. "ఉప విశ్యాసనే యుంజ్యాత్" అని భగవద్గీతకూడ ఆసనమునందు కూరుచుండియే ధ్యానింప వలెనని చెప్పుచున్నది కదా ! ఐనచో - ఏ పర్వతాది గుహాంతర్భాగములలోనే చేయవలె నను నియమము చెప్పవచ్చునా ? శ్వేతాశ్వతరోపనిషత్తులో - "గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్" అని ఉన్నది కదా ! అనగా - అట్టి దేశ నియమ మేమియు లేదు. ఆ ఉపనిషత్తులో అచ్చటనే - "మనోనుకూలే" అని చెప్పబడినది కదా ! కనుక, మనస్సునకు ఏకాగ్రత ఎచ్చట లభించు అవకాశము కలదో - అచ్చటనే కూరుచుండి ఉపాసింప వలెనే కాని, దేశ నియమ మేమియు లేదని సిద్ధాంతము.

## 6. ఆప్రయాణాధికరణము

ఉపాసనమునకు సంబంధించిన మరియొక విశేషమును వివరించుటకు ప్రసంగ సంగతితోడనే ఈ యధికరణము ప్రారంభింపబడు చున్నది. దీని విషయముకూడ ఉపాసనమే. ఈ ఉపాసనముచే ఉపాస్య వస్తువు కానవచ్చినట్లు కావలసియుండును గదా ! ఏనాడు ఉపాసించు బ్రహ్మ దర్శన సమానాకార మగునో, ఆనాటి వరకే ఉపాసన చేసిన చాలునా ? యావజ్జీవము ప్రతినిత్యము చేయవలయునని నియమ మేదేని కలదా ? అని సంశయము. బ్రహ్మ దర్శనమే ప్రయోజనము కావున, ఉపాసనము బ్రహ్మ దర్శనమున కలుగు ఆనందమును ఆశించిన వారైనచో - వారు యథేష్టముగ తరువాత కూడ, వారికి ఇష్టము కలిగిన దినములలో ఉపాసింపవచ్చును. అంత

మాత్రమేకాని, యావజ్జీవము ఈ ఉపాసన చేయవలయు నని నియమ మేమియు లేదని పూర్వపక్షము. ఇది సరికాదు. " సఖల్వేవం వర్త యన్ యావదాయుషం " అని శ్రుతి - యావజ్జీవము ఈ యుపాసన ఉండవలయు నని ఉపదేశించుచున్నందున, ఉపాసన మారంభించి నప్పటినుండి మరణ పర్యంతము ప్రతినిత్యము ఉపాసనము ఉండవలసి నదే యని సిద్ధాంతము.

## 7. తదధిగమాధికరణము

పైన పేర్కొనబడిన ఆఱు అధికరణములందును ఉపాసన స్వరూపము శోధింపబడినది. కనుక, అవి ఆఱు అధికరణములుకూడ ఒక పేటిక అని యందురు. ఇక ఆ ఉపాసన వలన కలుగునట్టి ఫల మును చర్చించుట జరుగును. ఇందువలన, పై యధికరణమునకును, ఈ యధికరణమునకును కార్య కారణ భావ రూప మగు సంగతిని చెప్పికొనవచ్చును.

యావజ్జీవము ఆవర్తించవలసిన ఉపాసనమే ఉపాయ మని నిర్ణ యించబడినది. ఇట్టి ఉపాసన నిష్పన్నమైన వ్యక్తికి ఆగామి పాపము లంట వనియు, ప్రాచీన పాపములు నశించు ననియు శ్రుతులు చెప్పు చున్నవి. " తద్యథా పుష్కర పలాశ ఆపోనశ్లిష్యంతే ఏవ మేనం విది పాపం కర్మ నశ్లిష్యతే " తామరాకునకు నీరు అంటని రీతిగా - ఉపాసకునకు పాపము లంటవు. " తద్య థేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవ మేవం హాస్య సర్వే పాపానః ప్రదూయంతే " నిప్పులో వేసిన దూదివలె ఉపాసకునియందలి పాపము లన్నియు నశించును. ఇట్లు ఛాందోగ్య - బృహదారణ్యకాది వాక్యము లుప దేశించుచున్నవి. ఈ వాక్యముల యర్థమే ఈ యధికరణమునకు

విషయము. ఉత్తరాఘముల అశ్లేషము పూర్వాఘముల వినాశము అనునది ఉపాసనకు ఫలము కావచ్చునా ? లేదా ? అని సంశయము. ఏ మనగా - ఉపాసనమునకు మోక్షము కదా ఫల మని చెప్పబడు చున్నది ! మఱి - పై వాక్యములలో ఉపాసనమునకు ఫలముగా సర్వ పాపనాశము చెప్పబడుచున్నది. కనుక, సంశయము కలుగుటకు అవ కాశ మేర్పడినది.

ఈ పాపముల అశ్లేష వినాశములు ఉపాసనకు ఫలములుగా చెప్పుటకు అవకాశం లేదని పూర్వపక్ష మేర్పడవచ్చును. కారణ మే మనగా - " నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి " ఎన్ని కల్పములు గడచినను అనుభవింపజేయనిదే, పాప రూప కర్మ నశించదు' ఇత్యాదిగా బ్రహ్మ వైవర్త పురాణాదులలో కానవచ్చు చున్నది. ఉపాసనవలన కర్మ నశించు పక్షమున అనుభవింపక నశిం పదు' అని చెప్పు వాక్యములు - ఉపాసనను ప్రశంసించు అర్థవాద వాక్యము లనవలయును. పాప నాశఫలకముగా ప్రాయశ్చిత్తమును విధించునట్లు, ఉపాసనము విధించబడలేదు. " బ్రహ్మ విదాప్నోతి పరం " ఇత్యాదివలన, ఉపాసనము ముక్తి కొఱకే విధింపబడినది కాని, పాప ప్రణాశము నుద్దేశించి విధించబడలేదు. - అందువలన, ఆగామి కర్మాశ్లేషముకాని, ప్రాచీన పాప వినాశముకాని ఉపాసనము నకు ఫలము కాజాలదు అని పూర్వపక్షసారము.

ఉపాసనము నిష్పన్నమైన పిమ్మట ఏర్పడు పాపములు అంట కుండుట అనునదికాని, ఉపాసనా నిష్పత్తికి పూర్వ మొనరించిన పాపములు నశించుట అనునదికాని - ఉపాసనకు ఫలమే అని సిద్ధాం

తము. " ఏవ మేవం విది పాపం కర్మ న శ్లిష్యతే " " ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే " ఇత్యాది వాక్యములు స్పష్టముగ ఆ విషయమును తెలుపుచున్నవి కదా ! ఐనచో అనుభవింపకే యనిదే కర్మ నశించదు' అను శాస్త్రార్థముతో విరోధ మేర్పడునే అని శంకించుకొనవలసిన యవసరము లేదు. విషయము సమాన మైనపుడే విరోధము ప్రసక్తము కావచ్చును. కాని, విషయము వేరైనపుడు విరోధము ఉండదు. అగ్నికి ఉష్ణత్వ ముండును. జలమునకు తన్ని వారణ సామర్థ్య ముండును. అనినచో - పరస్పర విరోధ మేమియు లేదు కదా ! అట్లే, కర్మలకు అనుభవింపజేయగల శక్తి యుండును' అని ఒక శాస్త్రము చెప్పుచున్నది. ఉపాసనమునకు పాప కర్మ శక్తిని నశింపజేయు శక్తి కలదని వేరొక శాస్త్రము చెప్పుచున్నది. కనుక, విరోధ ప్రసక్తి లేదు. కానిచో - సామాన్య విశేష న్యాయముచేత కర్మ సామాన్యమునకును అనుభవింపజేయు శక్తి సామర్థ్యములు చెప్పిన శాస్త్రమును ఉపాసకేతరుని కర్మలకు సంబంధించినదిగా సంకోచింపజేయుట జరుగవచ్చును. పుణ్య కర్మలకు తమ ఫలముచు అనుభవింపజేయు శక్తి యనగా - ఆ యా కర్మలచేత ఆరాధించబడిన పరమ పురుషుని ప్రీతి యని యర్థము. పాపకర్మల శక్తి యనగా - ఆ యా నిషిద్ధ కర్మలచేత ఆగ్రహించిన పరమ పురుషుని అప్రీతి యని అర్థము. ప్రియతమ మగు భగవంతుని ఉపాసనము స్వయముగా ప్రీతిరూపాపన్నమై యుండుటవలన, భగవంతునకును ప్రీతి గలిగించును. దీనితో ఇంతవఱకును నిషిద్ధ కర్మలచేత కలిగిన అప్రీతి నశించును. ఇదియే పూర్వాఘముల వినాశము. ఇక ఉపాసనము జరుగుచునే ఉన్నందున, భగవంతునకు ప్రీతియే తప్ప, అప్రీతి కలుగు అవకాశమే లేదు. ఉపాసనలో నున్న వాడు - దుశ్చరితములను మానుకొనవలసిన వాడే కనుక, పాప కర్మ లెవ్వియును చేయలేడు. ఐనచో-

ఉత్తరాఘములు అంటవని చెప్పు టేల యనగా - ఉపాసకునకు తెలి యక గాని, పొరపాటువలనగాని కొన్ని పాప కర్మలు వాటిల్లినయెడల, వానివలన పరమాత్మకు అప్రీతి కలుగదని తాత్పర్యము. ఇంతకును సారాంశము - ఉత్తరాఘముల అశ్లేషము పూర్వాఘముల వినాశము అనునవి ఉపాసనకు ఫలములు కావచ్చునని సిద్ధాంతము చేయబడినది.

## 8. ఇతరాధికరణము

పుణ్యముకూడ పాపమువలె ముక్తి ప్రతిబంధకమే. ఇట్లు పాప సామ్యమునుబట్టి స్మృతమైన పుణ్యముయొక్క అశ్లేష వినాశము లీ యధికరణమునందు ప్రసంగ సంగతితో నిరూపించబడుచున్నవి పుణ్యముయొక్క అశ్లేష వినాశములే ఈ యధికరణమునను చర్చించ బడు విషయములు. ఇవియు ఉపాసనకు ఫలములు కావచ్చునా? లేదా? అనునది సంశయము. పుణ్యఫల మెల్లఅకును ఇష్టమే కనుక, యావజ్జీవము ఆవర్తించబడిన యుపాసనమున కుపయుక్తము లగు అన్న పానాదులు - పుణ్యము నశించిన లభించజాలవు కనుక, ఉపాసన వలన పుణ్యముకూడ నశించునని అను కొనరాదు. ఇక, ముక్తిని మాత్రమే అభిలషించు ఉపాసకుడు - ఇతర ఫలములను కలిగించు యాగాది కామ్య కర్మలు చేయు ప్రసక్తియే లేనందున, ముందు చేయు పుణ్య కర్మల ఫలముయొక్క అశ్లేషముకూడ అనుకొనవలసిన ప్రసక్తియే లేదు అందువలన, పుణ్యముయొక్క అశ్లేష వినాశములు ఉపాసన ఫలములు కావని పూర్వపక్ష మేర్పడును.

ఐనను - ముక్తి ప్రతిబంధక సామ్యమునుబట్టి, పాపమువంటిదే పుణ్యము కనుక, పాపనాశమువలె ఉపాసనకు ఫలమే అని సిద్ధాంతము. "నైనం సేతు మహోరాత్రే తరతః" ఇత్యాది వాక్యము పాప

శబ్దముతో సుకృతమునుకూడ కలిపి, అన్ని పాపములును నశించునని చెప్పుచున్నది కదా ! "సర్వేపాప్మానోఽతో నివర్తంతే" అని. ఇట్లు పాపనాశమువలె పుణ్యనాశముకూడ ఉపాసనా ఫలముగ శాస్త్రమున ఉపదేశింపబడుచున్నందున, పుణ్యనాశముకూడ ఉపాసన ఫలముగా స్వీకరించవలసినదే. ఐనచో - శరీర మున్నంతవఱకును ఉపాసన కుపయుక్తమగు అన్నపానాదికము ననుగ్రహించు పుణ్యమావశ్యకమై యున్నందున, పుణ్యనాశము శరీర పాతానంతరమే సంభవింపవలయును. ఇట్లు పుణ్యనాశముకూడ ఉపాసనా ఫలమనియే సిద్ధాంతము.

## 9. అనారబ్ధ కార్యాధికరణము

ఉపాసన నివృత్తికి ప్రాచీనములైన పుణ్యపాపములు నశించగల వని పై యధికరణములలో నిరూపింపబడినది. ఈ ప్రాచీన కర్మనాశమునకు సంబంధించిన విశేష విషయ మొకటి ప్రసంగ సంగతి ననుసరించి ఈ యధికరణమున నిరూపింపబడుచున్నది. కర్మలు - ఆరబ్ధకార్యములు, అనారబ్ధకార్యములు అని రెండు విధములుగా నున్నవి ఏ కర్మలు ఫలము ననుభవింపజేయుట కారంభించినవో - వానిని ఆరబ్ధకార్యము లని యందురు. ఇట్టి కర్మ సముదాయమునకే 'ప్రారబ్ధము' అని వ్యవహార మున్నది. ఇంకను ఫల మనుభవింప జేయుట మొదలుగాని కర్మలు - అనారబ్ధ కార్యములు. వీనికి సంచిత మను వ్యవహార మున్నది ఇపు డీ కర్మనాశమున సంశయ మేమనగా - ఉపాసనకు పూర్వ భావి యగు సంచితము మాత్రమే నశించునా ? లేక - ప్రారబ్ధము, సంచితము మొత్తము కర్మ నశించునా ? అని. "సర్వేపాప్మానః ప్రమూయంతే" సకల పాపములు నశించు నని

శాస్త్రము చెప్పుచున్నందున, సర్వ కర్మ క్షయమే న్యాయ మని పూర్వపక్ష మేర్పడును. ఐనచో - అనంతరము శరీర స్థితి కుదురదని శంకించ నక్కర లేదు. దండముతో కొంత వఱకు త్రిప్పి, పిదప దండము తీసి వేసినను కులాల చక్రము దాని పూర్వ సంస్కారముతో కొంతకాలము వఱకు తిరుగుచుండును కదా ! అట్లే, కర్మలు నశించి నను పూర్వ సంస్కారముతో కొంతకాలము శరీరము ఉండవచ్చును అని పూర్వపక్షము తాత్పర్యము.

కాని, ప్రారబ్ధము మాత్రము నశించదు. సంచితము లగు పుణ్య పాప కర్మలే నశించు నని సిద్ధాంతము. ఏ మనగా ఛాందో గ్యము - "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సం పత్స్యే" అని, ప్రారబ్ధ మున్నంత వఱకు ముక్తి లేదని చెప్పుచున్నది. ముక్తికి శరీరపాత మే ఆలస్య మని చెప్పుచున్నందున, ప్రారబ్ధ మను భవించి తీరవలయు నని యేర్పడుచున్నది కదా ! ప్రారబ్ధ కర్మకూడ నశించుననుకొనిన చో - 'ఉపాసకునకు మోక్షము కలుగుటలో ఆల స్యము లేదు కనుక, వెంటనే మోక్షము కలుగవలసి యుండెడిది. అందువలన, ప్రారబ్ధము నశించదని అంగీకరించవలయును. ప్రారబ్ధము నశించినను, సంస్కారముతో శరీర ముండవచ్చు ననుటలో ప్రమాణ వాక్య మేమియు కానవచ్చుట లేదు. అందునలన, ఉపాసన నిష్పత్తికి పూర్వ భావి యగు సంచిత కర్మ మాత్రమే ఉపాసనవలన నశించు నని సిద్ధాంతము.

## 10. అగ్ని హోత్రాద్యధికరణము

ఉపాసనా నిష్పత్తి తరువాతి కర్మల ఫలము అంట దనియు పై యధికరణములలో నిరూపింపబడినది. ఈ తరువాతి కర్మలు పాప

రూపములైనవో - అవి చేయవలసిన ప్రసక్తియే లేదు. ప్రామాణికములైనవో - వాని ఫల మంటదు అని యున్నాము. ఇక పుణ్య రూప కర్మలైనవో చేయవచ్చునా ? అనగా - వాని ఫలముకూడ అంట దనినారు కనుక, అవియు చేయవలసిన యవసరము లేదని స్పష్టమగు చున్నది. ఆశ్రమ ధర్మము లగు అగ్నిహోత్రాదులు పుణ్య కర్మలలోనే లెక్కించబడుచున్నవి. ఇవి ప్రసంగ సంగతితో ఈ యధికరణమున చర్చించబడుచున్నవి. వీని విషయమున సంశయ మేమనగా - ఉపాసకుడు ఆశ్రమ ధర్మము లగు అగ్నిహోత్రాదులు అనుష్ఠించవలెనా ? అవసరము లేదా ? అని ఒకవేళ అనుష్ఠించినను వాని ఫల మేమియు అంటదు కనుక, అనుష్ఠించవలసిన యవసరము లేదని పూర్వపక్ష మేర్పడును.

ఐనవో - అగ్నిహోత్రాది ఆశ్రమ ధర్మములు అనుష్ఠించి తీరవలయు ననియే సిద్ధాంతము చేయబడుచున్నది. ఇవి ఉపాసనము నకు ఉపయోగపడుచున్నవి. ఉపాసనము యావజ్జీవము ప్రతినిత్యము చేయవలసినదని కదా ఆప్రయాణాధికరణములో నిర్ణయించబడినది ! ప్రతినిత్యము చేయవలసిన ఉపాసనమునకు ప్రతినిత్యము చేయవలసినదిగా శ్రూయమాణము లగు అగ్నిహోత్రాది పుణ్యకర్మలు ఉపయోగపడు ననియు శాస్త్రము చెప్పుచున్నది. " త మేవం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన " అని, అగ్నిహోత్రాదు లనుష్ఠించని యెడల, అంతఃకరణము దూషితమై, ఉపాసనము అనాడు నిష్పన్నము కాకపోవచ్చును. కనుక, విద్యోపయోగి అగ్నిహోత్రాది ఆశ్రమ ధర్మానుష్ఠానము అవశ్య కర్తవ్య మనియే సిద్ధాంతము.

ప్రాచీన సుకృతము నశించిపోయినది. ఉపాసనానంతర సుకృతము విద్యోపయోగిగా నున్నది. ఇక మిగిలిన సుకృత మేమియు ఉపాసకునకు లేదనియే స్పష్ట మగు చున్నది అట్టిచో - 'పుణ్యమును మిత్రులు పంచుకొందురు' "సుహృదస్సాధు కృత్యాం" అను శాస్త్రమునకు విషయమే లేదే? అని శంకించ నక్కరలేదు. ఏమనగా - ఏదియో యొక కారణముచే ఫలము ప్రతిబంధించబడిన పుణ్య కర్మలు కొన్ని ఉండవచ్చును "యదేవ విద్యయా కరోతి" అను వాక్యము ఇట్టి కర్మలు కొన్ని ఉండవచ్చునని ఉపదేశించుచున్నది కదా! ఎట్లనగా - ఈ వాక్యము ఉద్గీథ విద్యకు ఫలమును చెప్పుచున్నది ఫల మేమి? అనగా - అనుష్ఠించిన యాగము ఫలమును కలిగించుటలో - ప్రతిబంధము లేకుండుటయే అని. కనుక దీని వలన యాగాది ఫలము ప్రతిబద్ధ మగు అవకాశముకూడ కలిగిన కదా తెలియుచున్నది! ఇట్లు బలవత్తర ప్రతిబంధకముచేత ప్రతిబంధించబడినందున, ఉపాసకునిచేత అనుభవించబడని పుణ్య కర్మలు సుహృత్తులకు పంచిపెట్టబడునని తాత్పర్యము. అందువలన, ఆశ్రమ ధర్మాదులను అగ్నిహోత్రాదులు అవశ్యము అనుష్ఠేయములే యనునది సిద్ధాంతము.

## 11. ఇతర క్షపణాధికరణము

అనారబ్ధ కార్యాధికరణములో విద్యా మాహాత్మ్యమువల నశించునవి - సంచిత పుణ్య పాప రూప కర్మలే కాని, ప్రారబ్ధము నశించని దని నిర్ణయింపబడినది. ఇట్లు ఉపాసకుని ప్రాచీన కర్మ

వినాశమునకు సంబంధించిన విశేషమును వినిన వెంటనే శరీరపాతి కర్మల అశ్లేషమునకు సంబంధించి ఒక జిజ్ఞాస ఏర్పడినది. ఉపాసన నిష్పన్నమైన తరువాత చేయు పుణ్యకర్మలు అంటవు కదా ! అట్టిచో ఉపాసకుడు అగ్నిహోత్రాది పుణ్యకర్మలు ఏల చేయవలె ? అను నదియే ఆ జిజ్ఞాస. తరువాతిది అగు అగ్నిహోత్రాధికరణము ఆ జిజ్ఞాసా శాంతిని కలిగించినది. ఇట్లు మధ్యలో కలిగిన జిజ్ఞాసను తొలగించిన తరువాత అవశ్య కర్తవ్యమగు అంశము తెలుపుటకు ఈ యధికరణ మేర్పడినది. కనుక, ఇది అవసర సంగతితో ఆరంభించబడినదనవచ్చును. జిజ్ఞాసా నివృత్తి యనంతరము అవశ్య వ్యక్తవ్యత్వమే అవసర సంగతి కదా ! ప్రారబ్ధ పుణ్యపాప కర్మ - ఈ యధికరణము నకు విషయము.

ప్రారబ్ధము అనుభవించిననేగాని నశించదని వారు, ఏ శరీరములో నున్నపుడు ఉపాసన నిష్పన్నమైనదో, ఆ శరీరముతో అనుభవించిన చాలునా ? మరెన్నియో శరీరములలో అనుభవించవలసియుండునా ? అని సంశయ మేర్పడును. అపుడు - " తస్య తావదేవ చిరం ' ఇత్యాది వాక్యములు ఉపాసకునకు ఈ దేహము నశించినంతనే ముక్తి లభించునని చెప్పుచున్నందున, ప్రారబ్ధము ఈ శరీరముతో అనుభవించిన చాలును అని పూర్వపక్ష మేర్పడును. దీనికి సూత్రకారులు - " భోగేన త్వితరే క్షపయిత్వా అథ సంపద్యతే " అని చెప్పుచున్నారు. తాత్పర్య మే మనగా - ఈ శరీరముతో మాత్రమే అనికాని, మఱి కొన్ని శరీరములతోనే అనికాని నియమమేమియు చేయరాదు. ప్రారబ్ధ పుణ్య పాపములు ఈ ఒక్క శరీర

ముతో అనుభవించినంత మాత్రమున నశించెనేని, ఈ ఒక్క శరీరము నశించినంతనే ముక్తి లేక, మఱి కొన్ని శరీరములతో దానిని అనుభవించిన యనంతరమే ముక్తి. ప్రారబ్ధమును పరిపూర్ణముగా అనుభవించి తీరవలసియున్నది. దానికై ఎన్ని శరీరములు అవసర మగునో - అన్ని శరీరములతోను అనుభవింపవలె ననియే సిద్ధాంతము అని ఇట్లు ఈ పాదము ఉపాసన స్వరూపమునకు సంబంధించిన కొన్ని విశేషములను తెలిపి, ఉపాసనకు సంచిత కర్మ వినాశము, అగామి ప్రామాణిక పాప కర్మాశ్లేషము కూడ ఫల మని నిర్ణయించుచున్నది.

ఇట్లు ఫలాధ్యాయములోని అవృత్తిపాదము సమాప్తము.



# చతుర్థాధ్యాయము - ద్వితీయ పాదము

## 1. వాగధికరణము

శ్రీ భాష్యము నాల్గవ అధ్యాయములోని రెండవ పాదమునకు ఉత్క్రాంతి పాద మని పేరు. శరీరమునుండి జీవుడు వెలుపలకు వచ్చుటను 'ఉత్క్రాంతి' యని వ్యవహరింతురు. ఈ రెండవ పాదములో జీవుడు పరమాత్మ నద్దకు పయనించుటకు ముందు జరుగు ప్రయత్నము - లేక క్రియా కలాపము చర్చించబడును. ఇందుననను పదునొకండు అధికరణము లున్నవి. వీనిలో మొదటి అధికరణమునకు వాగధికరణ మని పేరు. ఈ యధికరణములో - వాగాది ఇంద్రియములు మనస్సుతో సంశ్లేషించు విధానము సూచింపబడుచున్నది. పూర్వ పాదమున బ్రహ్మవిద్యాపాదమును గురించిన విచార మారంభించబడినది. దానిలో - బ్రహ్మోపాసన మొనరించిన వాని పుణ్య పాపములను గురించిన జిజ్ఞాస నివర్తించబడినది. ఇక తరువాత - ఉత్క్రాంత్యాదులు వరుసగా నిరూపించవలసి యున్నవి. కనుక, అవసర సంగతిని బట్టి ఈ పాదము - ఈ యధికరణము కూడ ఆరంభించబడుచున్న దని గమనించవలెను.

ఈ శరీరము నుండి నిష్క్రమించునప్పుడు - వాక్కు మనస్సులో చేరు నని ఛాందోగ్యములోని సద్విద్యా వాక్య మొకటి చెప్పుచున్నది. "అస్యసోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే" అను నదియే ఆ వాక్యము. ఇదియే ఈ అధికరణమునకు విషయవాక్యము. వాక్కు అనునది ఒక కర్మేంద్రియము. మాట లాడుట దాని వ్యాపారము. వాక్కు మనస్సులో చేరు నను వాక్యము కొంత సందేహమునకు అవకాశము కల్పించుచున్నది. ఆ దేమనగా - వాక్కు

యొక్క వ్యాపారము మనస్సులో చేరునా ? లేక - వాక్కు యొక్క స్వరూపమే మనస్సులో చేరునా ? అను నది ఏదేని కార్యము తన కారణము లో చేరు ననగా - కార్యము యొక్క స్వరూపమే కారణములో లయము చెందును అని తాత్పర్యము. కుండ మట్టిలో చేరు ననగా - ముక్కలై, చూర్ణమై మట్టితో ఐక్యము చెందు నని కదా తాత్పర్యము ! అట్లే, వాక్కు మనస్సులో చేరు ననగా - మనస్సుతో ఐక్యము చెందు నని అర్థము చెప్పరాదు. ఏ మనగా - వాక్కు మనస్సుకు కారణము కాదు గదా ! అందువలన, వాక్కు యొక్క వ్యాపారమే మనస్సుతో చేరు ననవలెను. ఐన నో - దేని వ్యాపారము దానియందే లయము చెందునే కాని, ఒక దాని వ్యాపారము మరియొక దాని యందు లయము చెందు టెట్లు ? అను ఆశంక ఏర్పడ వచ్చును. ఈ శంకను ఒక విధముగా వారించుకొనవచ్చు నను పూర్వపక్షి వాక్కునకు స్వతంత్రమైన వ్యాపార ముండదను. మనస్సే ఆ యా ఇంద్రియములకు ఆ యా వ్యాపారములు కలుగునట్లు చేయు నది. అందువలన, వాగ్వ్యాపారము మనస్సులో లయించు ననగా - వాగ్వ్యాపారమునకు హేతువైన మనో వ్యాపారము మనస్సులో లయించు నని చెప్పికొని, పై ఆశంకను వారించు కొనవచ్చును. ఇపుడు వాక్కు మనస్సులో చేరు ననగా - వాగ్వ్యాపారము మనస్సులో లయించు ననియే చెప్పికొనవలయు నని పూర్వపక్ష మేర్పడి నట్లైనది.

ఈ పూర్వ పక్షమును కాదని సూత్రకారులు - వాగింద్రియమే మనస్సులో చేరు నని చెప్పుచున్నారు. ఉపనిషద్వాక్యములోని " సంపద్యతే " అను పదమునకు - చేరు నని అర్థము. చేరుట అనగా - కలిసియుండుట అని కాని, లయించుట అని కాని అర్థము చెప్పి కొనవచ్చును. ప్రకృతములో - 'లయించుట' అని అర్థము

చెప్పి కొనుట కుదురదు. వాగింద్రియము మనస్సులో లయించుటకు వీలు లేదు కదా ! ఇక వాక్కు యొక్క వ్యాపారమునకు కారణమైన మనస్సు యొక్క వ్యాపారము లయించును కదా అని అనగా - అంతటి అర్థ విశేషమును చెప్పుటకు లక్షణావృత్తిని ఆశ్రయించవలసి యుండును అది క్లిష్ట కల్పన అని యందురు. కనుక, ప్రకృతములో లక్షణ అవసరము లేకనే అర్థమును చెప్పికొనుటకు ప్రయత్నించ వచ్చును. అది "సంపద్యతే" అనగా - సంశ్లేషించును, కలిసి యుండును - అని అర్థము నాశ్రయించిన, కుదురును ఇపుడు వాగింద్రియము జిహ్వా యందు గాక, మనస్సు ఉన్న తావునకు చేరబడు నని తాత్పర్య మేర్పడును. వాక్కు పడిపోయినను - మనస్సు పని చేయ వచ్చును. కనుక, మనస్సు ప్రధాన మైనది. కనుక, వాక్కు మన స్సులో చేరు ననిరే కాని, మనస్సు వాక్కులో చేరు ననలేదు. శబ్దము కూడ వాక్కు చేరు ననియే ఉన్నది కాని, వాక్కు యొక్క వ్యాపా రము చేరు నని లేదు కదా ! ఐనచో - మనస్సు వాగింద్రియమునకు కారణము కాదు కదా ! అట్టిచో - వాక్కుయొక్క స్వరూపమే మనస్సులో చేరుట ఎట్లు కుదురును ? అని శంక ఇపుడు కలుగదు. ఏల ననగా - చేరుట యన, లయించుట అని మనము చెప్పికొనలేదు. కలిసి యుండుట యనియే యర్థము. వాక్కు మనస్సుతో కలిసి యుండుట యనుటలో విప్రతి పత్తి యేమియు లేదు కదా ! ఒక్క వా గింద్రియమే కాదు - మిగిలిన ఇంద్రియము లన్నియు మనస్సుతో చేరి యుండునని - " ఇంద్రియైర్మనసి సంపద్యమానైః " అను ప్రశ్నోప నిషద్వాక్యము కూడ చెప్పుచున్నది కనుక, శరీరము నుండి నిష్క్ర మించు జీవుని వాగాది ఇంద్రియములు మనస్సు ఉన్న తావుకు చేర బడునని యే అర్థము చెప్పికొనవలె నని సిద్ధాంతము. ఎనితో ఉత్క్రాంతి

అను నది వాగాది ఇంద్రియముల యొక్క మన స్సంశ్లేషముతో ఆరంభమగు నని ప్రకృతార్థము ప్రవచింపబడి నట్లైనది.

## 2. మనోఽధికరణము

అవశ్య కర్తవ్యత్వ రూప మగు అనంతర సంగతి తోడనే ఈ యధికరణముకూడ ఆరంభింపబడినది. వాక్కు మనస్సులో చేరు నను దోటచే మనస్సు ప్రాణములో చేరు నని ("మనః ప్రాణే") చెప్పబడినది. కొన్ని ఇంద్రియములతో కలిసిన మనస్సు ప్రాణముతో సంశ్లేషించు నని తాత్పర్యము. వాక్కు మనస్సు వలన ఏర్పడినది కానందున, 'లయించుట' అను అర్థము అనుపపన్నము. కాని, మనస్సు ప్రాణములో చేరు ననిన - 'లయించుట' అని చెప్పికొనవచ్చును కదా! అని వాగధికరణమున చేయరాని ఒక ఆశంక ఇచ్చట కలుగవచ్చును. అందువలన, వేరుగా ఈ యధికరణ మారంభింప వలసి వచ్చినది. మనస్సు ప్రాణములో లయించు ననుటకు ప్రాణము పరంపరయా మనస్సుకు కారణ మగుటచే సిదాన మనును పూర్వపక్షి. ప్రాణము మనస్సునకు కారణ మనుటకు పూర్వపక్షి ఈ విధముగా ఉపపాదించుచున్నాడు :- "అన్నమయం హి సోమ్య మనః" అను వాక్యము - మనస్సు అన్నము అనగా - పృథివి వలన ఏర్పడుచున్న దని తెలుపుచున్నది "తా అన్న మసృజన్త" అను వాక్యము - పృథివి జలము వలన ఏర్పడిన దని తెలుపుచున్నది కదా! ఇక, "ఆపోమయః ప్రాణః" అను వాక్యము - ప్రాణమునకు కారణము జల మని స్పష్టపరచుచున్నది. అందువలన, మనస్సు అను పృథివి కార్యము ప్రాణము అనగా - ప్రాణము కారణ మగు జలమున లయించుట కుదురవచ్చును కార్యమునకు కారణమున లయము

సర్వ సమ్మతమే కదా! ఇది పూర్వపక్షి చేయు అనికాశంకా సారము.

కాని, మనస్సుకూడ ప్రాణమునందు సంశ్లేషించు నని చే "మనః ప్రాణే" అను వాక్యము చెప్పుచున్నది అని సూత్రకారుని సిద్ధాంతము. మనస్సునకు ప్రాణములో లయము చెప్పవచ్చు నని పూర్వపక్షి ప్రతిపాదించిన రీతి సరియైనది కాదని తాత్పర్యము. ఏ మనగా - మనస్సునకు అన్నము ఆప్యాయకము (పోషకరించునది) అని మాత్రమే ఉపనిషద్వాక్యము తెలుపుచున్నది కాని, కారణమని కాదు. మనస్సు అహంకారము వలన ఏర్పడినదే తప్ప, పృథివి వలన కాదు కదా! అట్లే, ప్రాణమునకు జలము ఆప్యాయకమే కాని, కారణము కాదు ప్రాణ మనగా వాయువు అట్టి వాయువు ఆకాశము వలన కలిగినది కాని, జలము వలన కాదు. ఇట్లు మనఃప్రాణములకు కార్యకారణ భావమే లేనందున, మనస్సు ప్రాణములో లయించునని చెప్పుట సరికా దని సిద్ధాంత భావము.

ఇట్లు ఈ యధికరణమునకు - "మనఃప్రాణే" అనునది విషయ వాక్యము. మనస్సు ప్రాణములో లయించునని యర్థమా? మనో వ్యాపారమే ప్రాణములో చేరునని యర్థమా? అనునది సంశయము. మనస్సు ప్రాణమున లయించ వచ్చును కదా! అనిపూర్వ పక్షము మనస్సు అహంకారము వలన ఏర్పడినదే కాని, ప్రాణము వలన ఏర్పడినది కానందున, ప్రాణమున లయించరాదని సమాధానము అందువలన, సర్వేంద్రియ సంయుక్తమైన మనస్సు - ప్రాణముతో సంశ్లేషించునే కాని, లయింప దని సిద్ధాంతము.

## 3. అధ్యక్షాధికరణము

ప్రకృత మగు ఉత్క్రాంతికి సంబంధించి చెప్పవలసిన విషయమే కనుక, ఈ యధికరణము కూడ అనంతర సంగతి తోడనే ఆరంభించ బడు చున్నది అన వచ్చును. మనస్సు ప్రాణములో చేరునని యున్నట్లు ప్రాణము తేజస్సున చేరునని "ప్రాణస్తేజసి" అను వాక్యము చెప్పు చున్నది. ఈ "ప్రాణస్తేజసి" అను నది ఈ యధికరణమునకు విషయ వాక్యము. ప్రాణము జీవుని చేరునని బృహదారణ్యములో కొక చోట చెప్ప బడియున్నది "ఏవమే వేమ మాత్మానం అంత కాలే సర్వే ప్రాణా అభిసమాయంతి" అంత కాలములో అన్ని ప్రాణ ములు ఈ జీవుని చేరుచున్నవి అని ఈ వాక్యము యొక్క అర్థము. అట్లే, "తముత్క్రామంతం ప్రాణో నూత్క్రామతి" అని, ప్రాణము జీవుని వెంట ఉత్క్రమించు ననియు చెప్పబడి యున్నది కనుక, ఇచట ప్రాణము తేజస్సున చేరు ననగా - జీవునితో కలిసిన ప్రాణము తేజస్సున చేరు నని చెప్ప వలెనా? లేక, ప్రాణమే తేజస్సున చేరు నని చెప్ప వలెనా? అని సందేహ మేర్పడును. "ప్రాణస్తేజసి" అని మాత్రమే ఉన్నందున, కేవల ప్రాణమే తేజస్సున చేరు నని పూర్వ పక్ష మేర్పడును. దీనికి సమాధానముగా - "సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః" అని బాదరాయణుడు సూత్రించినాడు. ప్రాణము జీవునితో సమాగమము, జీవుని తోడనే ఉత్క్రాంతి, జీవుని తోడనే ప్రతిష్ఠయు ఇతర ఉపనిషత్తులలో చెప్పబడియున్నది. కనుక, ఇచట "ప్రాణము" అనగా - 'జీవునితో చేరిన ప్రాణము' అనియే అర్థము చెప్పికొనవలెనని సిద్ధాంతము. అట్లైన ప్రాణము అని మాత్రమే అనుట కుదురవచ్చునా? అని శంకించవలసిన యవసరము

లేదు. యమున సముద్రము చేరు నని అందురు కదా! అచట 'యమున' యనగా - గంగతో సంగమించిన యమున అనియే కదా అర్థము చెప్పికొనుచున్నాము! అట్లే, ప్రకృతమన కూడ ప్రాణ మనగా - జీవునితో గూడిన ప్రాణ మని అర్థము చెప్పికొనుటలో అనుపపత్తి లేదందురు శ్రీ భాష్యకారులు.

## 4. భూతాధికరణము

అనసర సంగతి తోడనే ఆరంభించిన ఈ యధికరణమునకు కూడ - "ప్రాణస్తేజసి' అనునది నే విషయ వాక్యము. పూర్వాధికరణమున ప్రాణ శబ్దార్థము నిర్ణయింపబడినది. ఈ యధికరణమున "తేజః" పదార్థము నిర్ణయింపబడును. ప్రాణము తేజస్సుతో సంశ్లేషించు ననగా - కేవల తేజస్సు తోడనే సంశ్లేషించునా! లేక - పంచభూతముల తోడను సంశ్లేషించునా? అనునది సంశయము. ఈ సంశయమునకు కారణ మే మనగా - ఈ సృష్టిలో కేవల తేజస్సు అనునది లేదు. భూతము లన్నియు పంచీకృతములే కదా! ఐనచో - లయము చెప్పుచున్నందున ప్రకృతములో కేవల తేజో భావమునందే లయ మని చెప్పికొనుటకు కూడ అవకాశ మున్నది. అందువలన సంశయము నేర్పడినది. తేజస్సు అని మాత్రమే ఉన్నందున, కేవల తేజస్సు తోడనే లయ మని పూర్వపక్ష మేర్పడును. అపుడు దానికి సమాధానముగ - "భూతేషు తచ్ఛ్రుతేః" అని సూత్రీకరింప బడినది. జీవుని సంచరించు దశను చెప్పుచు బృహదారణ్యకము - "పృథివీ మయః ఆపోమయః తేజోమయః" అని యుపదేశించినది. అందువలన జీవునితో జేరిన ప్రాణము అనగా - ప్రాణ విశిష్ట జీవుడు పంచ భూతముల తోడను సంశ్లేషించు ననియే చెప్ప వలెను నని సిద్ధాంతము.

ఐనచో - “ పృథివీ వాయుః ” అను వాక్యము - జీవుడు ఇతరా పృథివ్యాదులతో చేరు నని చెప్పకొనినను విరుద్ధమగును. కాని, నామ రూపములను వేరు పరచుటకు “ తాసాం త్రివృతం త్రివృతమ్ ఏకైకాం కరవాణి ” అను వాక్యానుసారము - ‘ పంచీకృతములైన భూతములే కదా ప్రపంచములో నున్నవి ’ అని స్వీకరించవలె గదా. అందువలన, ఇచట ‘ తేజస్సు ’ అనగా - ‘ఇతర భూత సంసృష్టమైన తేజస్సు ’ అనియే చెప్పవలసి యున్నది. కనుక, భూతములయందే సంశ్లేషించు నని సిద్ధాంతము.

## 5. ఆసృత్యుపక్రమాధికరణము

పై అధికరణము జీవునకు భూత సూక్ష్మ పరిష్వంగమును చెప్పినది. స్థూల శరీరమునుండి ఉత్క్రమించుటను చెప్పినది అను గ్గునను అన వచ్చును. ఈ భూత సూక్ష్మ పరిష్వక్తుడైన జీవునకు పరమాత్మ సంపత్తి యందు చెప్పుచున్నది ఉపనిషద్వాక్యము - “తేజః పరస్యాం దేవతాయామ్” అని. ఈ పరమాత్మ సంపత్తిని గురించి చెప్పవలసి వచ్చుటతో ఒక విషయము స్మృతిపథమున కరుదెంచినది. అది ఏ మనగా - ఇంతవరకు చెప్పుచువచ్చిన ఉత్క్రాంతి కాని, ఇకముందు చెప్పవలసిన పరమాత్మ సంపత్తి కాని మోక్షార్థి ఉపాసన చేసినవారికా ? లేక - ఉపాసన చేసినవారికి, చేయని వారికి అని లేడా లేకుండ అందరికిని సమానమేనా ? అను సందేహమునకు తీర్పు ఇదే అని. ఉపాసన చేసిన వారికి అమృతత్వము, బ్రహ్మ ప్రాప్తి అనునది ఇచటనే ఏర్పడునని అచ్చటచ్చట చెప్పబడి యుండుటచే వారికి, ఉత్క్రాంతి అవశ్యకము కాదు. ఇక చెప్పిన ఉత్క్రాంతి

కేవలము ఉపాసన చేయనివారికే అని కదా పర్వపమును ! కాని, మఱికొన్ని తావులలో - ఉపాసనకు కూడ ఉత్క్రాంతిని చెప్పు వాక్యము లున్నవి. ఐనప్పుడు - ఉత్క్రాంతి ఉపాసనకు కూడ చెప్ప వలసి యున్నది. మఱి - నిర్ణయించు టెట్లు ? అను ఆశంక ఏర్పడ వచ్చును. అందువలన, ఈ విషయము ఉపేక్షింపదగినది కాదు అని తలచి సూత్రకారుడు ప్రసంగ సంగతితో ఈ యధికరణమును ఆరంభించుచున్నాడు. స్మృతశ్చైః ఉపేక్షానర్హ మగునది ప్రసంగ సంగతి కలదని చెప్పికొనినాము కదా !

సుషుమ్నా నాడీ ప్రవేశము వఱకు వర్ణించబడిన ఉత్క్రాంతి ఈ యధికరణమునకు విషయము. ఇది ఉపాసకునకు, ఉపాసన చేయని వానికిని సమానమే యగునా ? కేవలము ఉపాసన చేయనివానికే ఈ ఉత్క్రాంతి చెప్పబడినదా ? అని సందేహము. ఉపాసన చేసిన వానికి ఇచటనే అమృతత్వము చెప్పబడినందున, ఉత్క్రాంతి యవసరము లేదు. కనుక, ఈ ఉత్క్రాంతి - ఉపాసన చేయనివానికే అని పూర్వపక్షము. కఠోపనిషత్తులో - "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అను వాక్యము - ఉపాసకునకు ఇచటనే బ్రహ్మప్రాప్తికి అమృతత్వమును చెప్పుచున్నది కదా అని పూర్వపక్షి అభిప్రాయము.

"సమానా చాసృత్యుపక్రమా దమృతత్వం చానుపోష్య ' అని ఆరంభించి, పదు సూత్రములతో విపులముగా చర్చించి, ఉత్క్రాంతి అందరికిని సమానమే అని సూత్రకారుడు ఈ యధికరణము నిర్ణయించుచున్నాడు. కఠోపనిషత్తులో సుషుమ్నా నాడి ద్వారా ఉత్క్రమించినవానికే అమృతత్వ మని చెప్పబడినది. "శతం చైకాచ.. తయోర్ధ్వమాయ న్నమృతత్వ మేతి " అని. కనుక, ఉపాసకునకు ఉత్క్రాంతి యున్నదని అంగీకరించ వలెను. నాడీ ప్రదేశము నుండి

ఉపాసకునకును, ఉపాసన చేయనివానికిని భిన్న గతి చెప్పబడినది. "చక్షుష్టో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీరదేశేభ్యః" అని ఉపాసకునకు మూర్ధభాగమునుండి నిష్క్రమణము ఇతరులకు ఇతర శరీర దేశములనుండి నిష్క్రమణము చెప్పబడినదికదా! కనుక, ఈ ఉత్క్రాంతి యనునది అందఱకును సమానమే యని సిద్ధాంతము.

ఐనచో - ఉపాసకునకు ఇచటనే అమృతత్వము చెప్పబడినది కదా! అని శంకింపనక్కఱలేదు. ఇచట అమృతత్వ మనగా - పూర్వ పాపముల నాశము, ఉత్తర పాపముల అశ్లేషము అని యర్థము. ఇక - "అత్ర బ్రహ్మ సమశ్నుతే" అనగా - ఇచట ఉపాసన సమయమందే బ్రహ్మానుభవము కలుగుననియే తాత్పర్య మని గ్రహింపవలెను. ఏల యనగా - బ్రహ్మప్రాప్తి జరుగు వఱకు విద్వానునకు శరీరసంబంధ ముండు నని అనేక వాక్యములు చెప్పుచున్నవి. "ధూత్వా శరీర మకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి" అనెడి ఛాందోగ్య వాక్యము - "సత్యం బ్రూయాత్" అని, ముక్తునకు చంద్రునితో జరుగు సంవాదమును తెల్పు కౌషీతకి వాక్యము మొదలగునవి ముక్తునికిని అర్చిరాదిద్వారా బ్రహ్మప్రాప్తి వఱకు శరీర సద్భావమునే చెప్పుచున్నవి. సూక్ష్మ శరీరము జీవునకు ఉన్నందుననే ఉపాసకునకును స్థూలశరీరములో ఒక్కొక తావున వేడి ఉపలబ్ధ మగుచున్నది. అది స్థూల శరీరమునకు సంబంధించినదే యైనచో - స్థూల శరీరము మొత్తముపై ఆ వేడి ఉపలబ్ధముకావలసియున్నది. అట్లుగాక, ఏదియో యొక చోట మాత్రమే వేడి ఉపలబ్ధ మగుచున్నందున, ఉపాసకునకును సూక్ష్మశరీర సంబంధము నాడీ నిష్క్రమణమువఱకు కలదని స్వీకరింపక తప్పదు కదా! అందువలన, ఉత్క్రాంతి అందఱకును సమానమే.

దేవతా సంపత్తిని ప్రతిపాదించినది కదా! ఇచట సంపత్తి యనగా - కార్యము కారణమున లయము చెందునట్టి సంశ్లేషమా? లేక - విడిగా నుండుటకు వీలులేని సంశ్లేషమా? అని సంశయ మేర్పడును. "తేజః పరస్యాం దేవతాయాం" అనునదియే విషయ వాక్యము. సర్వ కారణమైనవాడు పరమాత్మ కనుక, జీవునకు భూత సూక్ష్మములతో బాటు, పరమాత్మయందు లయము కుదురవచ్చును. కనుక, ఇచటి సంపత్తి కార్యమునకు కారణమున లయము జెందుట వంటిదే యున వచ్చునని పూర్వపక్షము. ఐనచో, పై వాక్యములోనికిని - "వాఙ్మనసి సంపద్యతే" అను పూర్వవాక్యములోని 'సంపద్యతే' అను క్రియా పదమే అనుషక్తమగుచున్నది. అచట 'సంపద్యతే' అనగా - విడిగా నుండుటకు వీలుకాని సంశ్లేష మనియేకదా చెప్పుకొన్నాము! ఆ యర్థమునే ఇచటకూడ చెప్పికొనుట భావ్యము. కనుక, భూత సూక్ష్మ విశిష్ట జీవునకు పరమాత్మతో పృథక్స్థితి అనర్హమగు సంశ్లేష మేర్పడునని అనియే అర్థము చెప్పికొనవలెను. అంతియేకాని, కారణ లయమునకు ప్రసక్తియే మేమియు లేదు కనుకను, ఇపుడు లయము చెందినచో - మరల సృష్టించినట్లు వాక్యము లేదు కనుకను కారణ లయాపత్తి రూప సంశ్లేషము కాదని సిద్ధాంతము.

## 8. తదోకోఽధికరణము

ఇంతవఱకు అందఱకును సమానమగు ఉత్క్రమణ దశ నిరూపింపబడినది. ఇక మఱి చెప్పవలసిన నాడి నిర్గమనము ఈ యధికరణమున చర్చించబడుచున్నది. ఇదియు అవసర సంగతిని బట్టియే యని గమనించవలెను. ఉపాసకునకు శతాధిక యగు మూర్ధన్య నాడి ద్వారా నిష్క్రమణము, ఉపాసన చేయనివానికి ఇతర నాడుల ద్వారా నిష్క్రమణము కఠోపనిషత్తులోని "శతంచైకాచ......"

ఇత్యాది మంత్రములచేత చెప్పబడినది. ఆ మంత్రమే నాడీ విశేష వాక్యము ఇచట ఉపాసకునకు ఈ నాడీ విశేష ద్వారమున నిష్క్రమణ మనియు, ఇతరులకు ఇతర నాడుల ద్వారా నిష్క్రమణ మనియు నియమము చేయవచ్చునా ? లేదా ? అను సందేహము. నాడులు అనేకములు, అతిసూక్ష్మములు కనుక, తెలిసికొనుట కష్టము అగుటవలన, నాడీ విశేష మూలమున నిష్క్రమణము నియమింపరాదని పూర్వపక్షము. జీవులకు తెలియుట కష్టమే యైనను, ఉపాసించిన పరమాత్మకు తెలియుట కష్టముకాదు కదా ! కనుక, ఉపాసన ప్రీతు డగు పరమాత్మ - జీవుని స్థానము మొదలగు వాని నెరిగి, జీవునకు మూర్ధన్య నాడీ విశేష ద్వారమును చూపించును. కావున ఉపాసకునకు నాడీ విశేషము ద్వారా నిష్క్రమణమను నియమము కుదురవచ్చు నని సిద్ధాంతము.

## 9. రశ్మ్యనుసారాధికరణము

అవసర సంగతి తోడనే ఈ యధికరణము కూడ చెప్ప బడినది. మూర్ధన్య నాడీ ద్వారా నిష్క్రమించిన ఉపాసకుడు సూర్య కిరణముల ద్వారా సూర్య మండలము చేరునని ఛాందో గ్యములోని ఈ వాక్యము చెప్పుచున్నది. "అథ యత్రైత దస్మా చ్ఛరీరా దుత్క్రామతి అథైతైరేవ రశ్మిభి రూర్ధ్వ మాక్రమతే." అనునది ఈ యధికరణమునకు విషయ వాక్యము. కిరణముల ననుసరించియే సూర్యమండలము చేరునను నియమము కుదురునా ? లేదా ? అని సందేహము. రాత్రి మరణించిన సందర్భములో - కిరణానుసరణము [illegible] [illegible] నందున, నియమము కుదురదని పూర్వ పక్షము. కాని, 'ఏతైః [illegible]' (ఈ కిరణముల ద్వారానే) అను వాక్యము [illegible] [illegible], కిరణముల మూలముననే సూర్యమండలము [illegible]

యని నియమము చెప్పవచ్చునని సిద్ధాంతము. "ఏవ" అనునది అవధారణమును కదా చెప్పును! ఐనచో - రాత్రి సూర్య కిరణము లుండునా? అని శంకింపనక్కరలేదు. సూర్య కిరణములు ఎల్లప్పుడును ఉండును. అందువలననే కొన్ని రాత్రులందును వేడి బాగుగా - తీవ్రముగా కలుగుచుండును. మఱికొన్ని రాత్రివేళలలో - హిమానిత్యముచే ఆ వేడి అభిభూతమై, ఉపలబ్ధము కాదు. అంతమాత్రమున సూర్యకిరణములు లేవని వాదింపరాదు. నాడీ మండలమునకును, సూర్య కిరణములకును పరస్పర సంబంధము సర్వ కాలములందును ఉండునని శ్రుతియు చెప్పుచున్నది. "త ద్యథా మహాపథః ఆతతః... ఆదిత్యాత్ప్రతాయన్తే" అని. అందువలన, రాత్రి మరణించిన ఉపాసకునకు కిరణముల ద్వారా సూర్యమండల ప్రాప్తియు, తన్మూలమున బ్రహ్మప్రాప్తియు కలదనియే సిద్ధాంతము.

## 10. నిశాధికరణము

రాత్రి మరణము శాస్త్రములయందు నిందించ బడినందున, రాత్రి మరణించిన ఉపాసకునకు బ్రహ్మప్రాప్తి లేదని తలంతురేమో అని తలచి, ప్రసంగ సంగతితో ఈ అధికరణము ఆరంభించినారు. రాత్రి మరణించిన ఉపాసకునకు బ్రహ్మప్రాప్తి కలుగునా? లేదా? అని సందేహము. "ఉవాచ పూర్వపక్షశ్చ ఉత్తరాయణ మేవ చ - ముమూర్షతాం ప్రశస్తాని విపరీతం తు గర్హితమ్" అని శాస్త్రములో నింద కలదు కనుక, రాత్రి మరణించినవానికి బ్రహ్మప్రాప్తి లేదని పూర్వపక్షము. శరీర సంబంధ మున్నంతవఱకే పుణ్య పాప రూప కర్మ సంబంధము కదా! ఉపాసకునకు పూర్వాఘ వినాశము, ఉత్తరాఘ అశ్లేషము చెప్పినారు కదా! ఇక సంసార బంధ హేతువే లేదు. కనుక, రాత్రి మరణించినను బ్రహ్మప్రాప్తి తప్పదని సిద్ధాంతము.

"తస్య తావదేవ చిరం" అను వాక్యము బ్రహ్మప్రాప్తికి కర్మనివృత్తియే కదా కావలసినది అని చెప్పినది। ఇక "దివా చ శుక్లపక్షశ్చ" అనునది ఉపాసన చేయనివారికి సంబంధించినది అని సిద్ధాంతము.

## 11. దక్షిణాయనాధికరణము

అదియే ప్రసంగ సంగతితో దక్షిణాయనమున మరణించినవాని బ్రహ్మప్రాప్తిని చర్చించుటకు ఈ యధికరణ మారంభించబడినది. రాత్రి మరణము వలె దక్షిణాయన మరణము కూడ నిందించబడినందున దక్షిణాయన మృతుని బ్రహ్మ ప్రాప్తికి సంబంధించిన విషయము ఇందు చర్చించబడుచున్నది. దక్షిణాయనమున మరణించినవానికి బ్రహ్మప్రాప్తి కలదా? లేదా? అని సందేహము. "అథ యో దక్షిణే ప్రమీయతే" ఇత్యాది తైత్తిరీయ నారాయణానువాకము నందలి వాక్యము దక్షిణాయనమున మరణించినవారికి చంద్రప్రాప్తిని మాత్రము చెప్పుచున్నది. "అథైతమే వాధ్వానం పునర్నివర్తంతే" అను ఛాందోగ్య వాక్యము - చంద్ర మండలము చేరినవారు - మరల తిరిగి రాగలరని చెప్పుచున్నది. భీష్మాది ఉపాసకులు ఉత్తరాయణము కొరకు వేచి చూచినట్లును తెలియుచున్నది. కనుక, "దక్షిణాయన మృతులకు బ్రహ్మప్రాప్తి లేదని పూర్వపక్షము.

ఇచట తైత్తిరీయకములో ఒక విధ మగు ఉపాసన చేసిన వారికి ఉత్తరాయణములో మరణించిన యెడల ఆదిత్య సాయుజ్య రూప

మగు అవాంతర ఫలము దక్షిణాయణమున మరణించిన యెడల చంద్రమ స్సాయుజ్య రూప మగు అవాంతర ఫలము చెప్పబడినది ఈ తైత్తిరీయ విద్యా విశేషనిష్ఠుడు పితృలోకమార్గమున చేయు చంద్రుమసకును అతివాహకులలో చెప్పిన చంద్రుడనకును భేద మున్నది. అతి వాహిక చంద్రప్రాప్తి పునరావృత్తి కలిగించు నని ఛాందోగ్యము చెప్పుచున్నది. ఉపాసన చేయనివానికే అతివాహిక చంద్రప్రాప్తియు తిరిగి ఆవృత్తియు చెప్పబడుచున్నది. ఈ తైత్తిరీయ పురుష విద్యా నిష్ఠునకు చంద్రప్రాప్తి అవాంతర ఫలము అనంతరము బ్రహ్మ ప్రాప్తియే కాని, నీనికి పునరావృత్తి యుండదు. "తస్మా బ్రహ్మణో మహిమాన మాప్నోతి "అను వాక్య విశేషము నినికిని బ్రహ్మప్రాప్తని స్పష్టముగా చెప్పుచున్నది. వాక్య శేషము లేకున్నను, వస్తుతః ఉపాసకునకు సర్వ కర్మ క్షయ మైనందున, సంసార హేతువు లేదనవలె కదా! అపుడు పునరావృత్తి ప్రసక్తియే ఉండదు. బ్రహ్మప్రాప్తియే చెప్పవలసియుండును.

భీష్ముడు దక్షిణాయనమున మరణించునా ఏమి ? అని బుద్ధు లనుకొనుట విని, తాను శక్తి కలవాడు కనుకను, సంగ్రహ స్వేచ్ఛా మరణ రూప మగు వర మొసగియున్నాడు కనుకను - ధార్మికులకు ఉత్తరాయణ మరణ ప్రాశస్త్యమును శాస్త్ర చోదితమైనదానిని సమర్థించుచు, లోక సంగ్రహము గావించుటకై భీష్ముడు ఉత్త రాయణమును ప్రతీక్షించినాడే గాని, బ్రహ్మవిద్యా నిష్ఠునకు దక్షిణాయన మరణము పునరావృత్తి కలిగించు నని కాదని గమనింప నగును. భగవద్గీతలలో కూడ - " యత్ర కాలే త్వనావృత్తిం ... తం

కాలం వక్ష్యామి " ఇత్యాదిగా చెప్పబడినది - పితృయాన దేవయాన రూప మార్గములేకాని, ఆవృత్తికి, అనావృత్తికి కారణములుగా కాల విశేషమును చెప్పుటలో తాత్పర్యము కాదు కనుక, ఉపాసకునకు కాల విశేష మరణము పునరావృత్తి కలిగించజాల దని సిద్ధాంతము.



# శ్రీమద్రామానుజులు - తాత్త్విక దృక్పథము

'విశిష్టాద్వైత వేదాంత విశారద'

డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు, ఎం.ఏ. పిహెచ్.డి.

" శ్రీరంగరాజ చరణాంబుజ రాజహంసం
శ్రీమత్పరాంకుశ పదాంబుజ భృంగరాజమ్
శ్రీభట్టనాథ పరకాల ముఖాబ్జమిత్రం
శ్రీవత్సచిహ్న శరణం యతిరాజ మీడే."

## ప్రవేశిక

శ్రీవైష్ణవ సంప్రదాయము ఈ విశాల విశ్వమున విరివిగా వ్యాప్తి జెందుటకు ప్రధాన కారకులు శ్రీమద్రామానుజ యతి శేఖరులు. అందువలననే ఇది - 'శ్రీ రామానుజ సంప్రదాయము' అని, 'శ్రీ రామానుజ దర్శనము' అనియు ప్రసిద్ధి పొందినది. సర్వ దర్శనములలో - శ్రీ రామానుజ దర్శనమే చాల గొప్పది. స్వాభావికమైన, సర్వ విలక్షణమైన, అర్థవంతమైన ఈ శ్రీ రామానుజ సంప్రదాయ ఘనతను లోకమున చాటి చెప్పి, బ్రహ్మసూత్రములపై అధికారికమైన వ్యాఖ్యానమును వెలయించి, పరమార్థతత్త్వమును సులభ గ్రాహ్యమగునట్లొనర్చి, జ్ఞాన హీనులై, అరిషడ్వర్గములకు జిక్కి, దుర్గతి పాలగుచున్న చేతనులకు శరణాగతి మార్గమున మోక్షమిప్పించుటకై మధ్యవర్తిత్వమును నెరపిన పరమ కారుణికులు శ్రీమద్రామానుజ యతి సార్వభౌములు. వారు శరణాగతత్రాణ బిరుదాంచితులు. శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనా

చార్యులు. నిరుపమ శమ దమాది గుణ సాగరులు అట్టి మహోదయు లగు శ్రీమద్రామానుజ మునిచంద్రుల యశశ్చంద్రికలు దిగంత పరివ్యాప్తమై, చక్కగ తేజరిల్లుచున్నవి.

## శ్రీమద్రామానుజులు - తత్త్వ సారము

శ్రీ రామానుజ దర్శనమున - ఈశ్వర చిదచిత్తు లను మూడు తత్త్వము లు, ఇందులను - శ్రీమన్నారాయణుడే ప్రధాన తత్త్వము. ఆయననే 'ఈశ్వరుడు.' ఈశ్వరు డనగా - సర్వమును నియమించువాడు. సమస్తమును ఆయనచే యథేచ్ఛగా వినియోగింపబడి యుండునవి. ఆయన సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, జ్ఞాన స్వరూపుడు నిఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణాకరుడు [illegible] మొదట అండమును సృజించి, తరువాత - చతుర్ముఖ దక్షాదులందును, కాలమునందును అంతర్యామిగా నుండి సృష్టి చేయును. విష్ణ్వవతార రూపముగను, మనుకాలాదులందు అంతర్యామిగను ఉండి, రక్షణ చేయుచుండును. రుద్ర కాలాంతకాదులందు అంతర్యామిగ నుండి, సృష్టి చేయును. విష్ణ్వవతార రూపముగను, మను కాలాదులందు అంతర్యామిగను ఉండి, రక్షణ చేయుచుండును. రుద్ర కాలాంతకాదులందు అంతర్యామిగ నుండి, సంహారము చేయును. అందువలన, ఈశ్వరుడు సృష్టి స్థితి సంహార కర్త, చిదచిద్విశిష్టుడు, జ్ఞాన శక్తి ఐశ్వర్య వీర్య తేజ స్సౌశీల్యాది మహా సద్గుణ పరిపూర్ణుడు, సర్వ శేషి. చిదచిత్తులు ఈశ్వరాధీనములు. అవి ఆయనకు శేషభూతములు. దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితుడై, సమస్త చేతనాచేతనములకు అంతర్యామియై, వానిని శరీరముగా గొనియున్నను, వాని దోషములు ఈశ్వరునకు అంటవు, జీవాత్మ శరీరమున ప్రవేశించుటకు కారణము కర్మము. ఈశ్వరుడు ప్రవేశించుటకు హేతువు కర్మము గాదు -

అనుగ్రహము అందువలన, జీవుల శరీరముల దోషములు - తదంత ర్యామియైన ఈశ్వరునకు గలుగవు. ఈశ్వరుడే జగత్తునకు త్రివిధ కారణ మగుచున్నాడు. ఉపాదాన కారణ మనగా - కార్య రూపమున వికార మొందుటకు యోగ్య మగు వస్తువు (కుండకు మట్టి - వస్త్రమునకు ప్రత్తి). ఉపాదాన వస్తువును కార్య రూపముగా వికారము నొందింపగల కర్త - నిమిత్త కారణ మనబడును (కుండకు కుమ్మరి - వస్త్రమునకు సాలెవాడు). సహకార కారణ మనగా - కార్య మేర్పడుటకు ఉపకరణమైన వస్తువు (కుండకు చక్రము, దండము మొదలైనవి వస్త్రమునకు తాకుడు పలక, మగ్గము మొదలైనవి.) కార్య రూపముగా వికారము నొందునట్టి వస్తువు ఉపాదాన మన బడుచున్నందున, సూక్ష్మ చిదచిద్విశిష్ట భగవత్స్వరూపము స్థూల చిదచిద్విశిష్ట రూపముగా మారుచున్నందున, ఉపాదాన కారణ మగును. సత్య సంకల్పుడగుచు, జగత్సృష్టిగా నియమించుటచే, నిమిత్త కారణ మగును. కులాలుడు మృత్తికను ఘటముగా మార్చునట్లు, ఈశ్వరుడు సూక్ష్మ చిదత్తులను స్థూల చిదచిద్రూప మగునట్లుగా తన సత్య సంకల్పముచే, పరిణమింపజేయును. కావున, సహకార కారణమును అగును. కులాలుడు మృత్తికను ఘటముగా పరిణమింపజేయుటకు దండ చక్రాదు లెట్లు ఉపకరణము లగునో, అట్లు, పరమ పురుషుడు స్థూల జగత్తును పరిణమింపజేయుటకు కాలము సహకారి అగును. అనగా — కాలాంతర్యామిగా నుండి, ఈశ్వరుడే సహకారి కారణ మగు నని తెలియుచున్నది

ఇక రెండవ తత్త్వము - 'చిత్తు' అనగా - జీవాత్మ. జీవులు అసంఖ్యాకములు. అవి - నిత్యమైనవి, అణు పరిమాణము కలవి. జీవులకు, ఈశ్వరునకు భేదము కలదు. జీవులు ఈశ్వరునికంటే వేరైనవి.

శేషత్వము, పారతంత్ర్యము జీవులకు ప్రధాన లక్షణములు. నిత్యులు, ముక్తులు, బద్ధులు - అని, జీవులు మూడు విధములు.

ఎన్నడును భగవదభిమత విరుద్ధాచరణ ప్రాప్తిలేక జ్ఞాన సంకోచమును బొందు ప్రసంగమును లేక యుండువారు అనంత గరుడ విష్వక్సేనాదులు నిత్యులు. ఈ నిత్యుల అవతారములు భగవంతుని నిత్యేచ్ఛ ననుసరించి, అనాదిగా నియమింపబడినవి. ఆ అవతారములు భగవంతుని అవతారములవలె స్వేచ్ఛచే సంభవించునవి కాని కర్మకృతములు కావు.

భక్తి ప్రపత్తులను పరిగ్రహించిన పిమ్మట, నిత్య నైమిత్తికము లనబడు భగవదాజ్ఞా కైంకర్య రూపము లగు కర్మములను నిష్కాముడై చేయుచు, భగవద్భాగవతాచార్యాపరాధములను చేయక, దేహావసాన కాలమున తన పుణ్య పాపములను మిత్రామిత్రుల యందు నిక్షిప్త మొనర్చి, పరమాత్మయందు మనస్సును నిగ్రహింపజేసి, ముక్తిద్వారభూతమైన 'సుషుమ్న' నాడియందు ప్రవేశించి, బ్రహ్మరంధ్రమునుండి బయలు వెడలి, సూర్య కిరణముల ద్వారా అగ్నిలోకమునకు పోయి, దినము, శుక్ల పక్షము, ఉత్తరాయణము, సంవత్సరము మొదలైన కాలములయందు అభిమాని - దేవతలచేత సంస్కరింపబడి, సూర్య మండలమును భేదించుకొని, ఆకాశ రంధ్రము ద్వారా సూర్య లోకమునకు బోయి, చంద్రుడు, విద్యుత్తు, వరుణుడు, ఇంద్రుడు, ప్రజాపతి అను మార్గదర్శకుల గూడి, ఆ యా లోకము లందు వారివారిచే సత్కరింపబడుచు, ఆ లోకము లను దాటి, ప్రకృతికిని, వైకుంఠమునకును హద్దుగా నున్న విరజా నదిని దాటి, సూక్ష్మ శరీరమును విడిచి, అమానవ పురుషుని యొక్క హస్త స్పర్శముచేత దివ్యమంగళ శరీరము గలవాడై, నాలుగు భుజములతో గూడి, బ్రహ్మాలంకారమును బొంది, 'ఇంద్ర నగరము' 'ప్రజాపతి నగ

రము' అను పేరులు గల పట్టణముల ద్వారపాలకులచే అనుమతింప బడి, శ్రీ వైకుంఠ నగరమున ప్రవేశించి, అనంత గరుడులతో కూడిన ఆళ్వారులతో అలంకరింపబడిన దీర్ఘ ప్రాకార సహిత గోపురము నతిక్రమించి, 'ఐరమ్మదము' అను పేరు గల అమృత సరస్సును, 'సోమ సదనము' అను పేరు గల అశ్వత్థ వృక్షమును దాటి, ఐదు నందల మంది దివ్యాప్సరలచే ఉపచారముల బొంది, 'బ్రహ్మ గంధము' మన్నగువానిచే అలంకృతుడై, అచట నున్న అనంత గరుడ విష్వక్సేనాదులకు నమస్కరించి, వారిచే గౌరవింపబడి, 'మహా మణి మండపము' అనబడు సభా భవనమును జేరి, పర్యంక సమీపమున నున్న స్వాచార్యులకు నమస్కరించి, పర్యంక సమీపమును జేరి పోయి, అచట ధర్మాదిపీఠోపరి భాగమున కమలము నందలి అనంతుని యందు, విమల మన్నగు చామర గ్రాహిణులచే సేవింప బడుచున్నట్టియు, శ్రీ భూ నీళలచే సేవింపబడుచున్నట్టియు, శంఖ చక్రాది దివ్యాయుధములను ధరించి, గొప్పగా ప్రకాశించుచున్న కిరీటము, మకర కుండలములు, కంఠ భూషణము, హారములు, భుజ కీర్తులు, హస్త భూషణములు, 'శ్రీవత్సము' అను పుట్టు మచ్చయు, కౌస్తుభ మణియు, ముత్యముల హారములు, మొలకట్టు, పీతాంబరము, మొలత్రాడు, పాద భూషణములు మొదలగు అపరిమిత దివ్యాలంకారములతో భూషితుడైనట్టియు, అపరిమితము లగు కల్యాణ గుణములకు సముద్రుడైనట్టియు భగవంతుని దర్శించి, ఆయన పాద పద్మములకు శిరస్సుతో ప్రణమిల్లి, పర్యంకము నెక్కి, ఆయనచే పర్యంకమున కూర్చుండబెట్టుకొనబడి, ' నీ వెవ్వరు ? ' అని యడుగ, 'బ్రహ్మ శేష భూతుడను ' అని పలికి, ఆయన కరుణా కటాక్షమునకు లోనయి, ఆయన ననుభవించుటచే గలిగిన సంతోషాతిశయముతో, సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలకును ఉచితము లగు సర్వవిధ భావ కైంకర్యములందును ఆసక్తుడైన, సంసార దశ యందు

మరుగున పడిన సహజములగు అపహత పాప్మత్వాదులు మరల ఆవిర్భవింపగా, ఉత్తరావధి రహిత పరబ్రహ్మానుభవము గలవారు ముక్తులు. ఈ ముక్తులకు బ్రహ్మతో సమాన మగు ఆనందానుభవ ముండునే కాని, జగత్సృష్ట్యాది వ్యాపారము లేదు. భగవత్సంకల్పము ననుసరించి, స్వేచ్ఛతో అంతట సంచరించుచుందురు.

సంసారమున నుండువారు బద్ధులు. చతుర్దశ లోకములందు నిండియున్న - అండ కటాహమునందున్న బ్రహ్మ మొదలు కీటకములవర కున్న సమస్త చేతనులును బద్ధులు. అందువలన, ఈ బద్ధులు - దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు, స్థావరములు అను భేదము కలవారు. ఇట్టి బద్ధులు - బీజాంకుర న్యాయమున అనాది కాలమునుండి వచ్చుచున్న అవిద్య, కర్మవాసన, రుచి, ప్రకృతి సంబంధము అనునవి విషమముగా ప్రవహించుచు, చక్రమువలె పరిభ్రమించుటచేత, గర్భవాసము, పుట్టుక, బాల్యము, యౌవనము, మేల్కొనుట, నిద్రించుట, స్వప్నము, మూర్ఛ, ముసలితనము, చావు స్వర్గ గమనము, నరక గమనము మొదలగు వివిధ విచిత్రావస్థలు గలవారై అనంత ప్రకారములును, అతి దుస్సహములును అగు తాపత్రయములచే పీడితులై స్వతః ప్రాప్తమైయున్న భగవదనుభవమునకు సంసారముచే విచ్ఛేదము కలవారు.

మూడవ తత్త్వము - 'అచిత్తు' అనగా - ప్రకృతి దీనిని - అవిద్య యనియు, 'మాయ' యనియును అందురు. ఇది ఈశ్వరుని క్రీడా కంచుకము వంటిది, సత్త్వ రజస్తమో గుణత్రయాత్మకమైనట్టిది, జీవులకు జ్ఞాన సంకోచమును గలిగించునది. ప్రకృతి -

మహత్తు - అహంకారము - మనస్సు - పంచ జ్ఞానేంద్రియములు - పంచ కర్మేంద్రియములు - పంచ తన్మాత్రలు - పంచ భూతములు అను ఇరువది నాలుగు తత్త్వములతో గూడియున్నది ఈ అచిత్తు. ఇయ్యది - జీవాత్మకు శరీరము. ఈ ఇరువది నాలుగు తత్త్వముల సమష్టి సృష్టి పిమ్మట, పంచీకృత భూతములచే బ్రహ్మాండ సృష్టి జరుగును ఈ విధముగా ఈశ్వరుడు ప్రకృతిచే జగత్తును సృష్టించు చున్నాడు. జీవులు ప్రకృతియందు బంధింపబడుచున్నారు. జీవులు ప్రకృతిబంధమును తొలగించుకొని, ఈశ్వరుని చేరుటయే మోక్షము. ప్రకృతి - శుద్ధ సత్త్వము, మిశ్ర సత్త్వము, సత్త్వ శూన్యము - అని మూడు విధములు. రజ స్తమ శూన్యమైనది శుద్ధ సత్త్వము. 'నిత్య విభూతి', 'పరమపదము', శ్రీవైకుంఠము' అని పిలువబడునట్టిది. జగ త్సృష్టికి కారణభూతమైనది మిశ్ర సత్త్వము. కాలమే సత్త్వ శూన్యము. సృష్టికి పూర్వము సూక్ష్మ రూపమున ప్రవర్తిల్లిన చిదచిత్తులు సృష్ట్యనంతరమున స్థూల రూపమును పొంది, ప్రళయ కాలమున మరల సూక్ష్మ రూపమున ఈశ్వరునిలో ఏకీకృత మగును. శ్రీ రామానుజ యతిశేఖరులు - ఈ తాత్త్విక విశేషములను విశదమై, విఖ్యాతమై, విరివిగా ప్రచార మందునట్లు, సోపపత్తికముగ తమ గ్రంథరాజములలో అంతటను, విస్తృత రూపమున సాయించి యున్నారు.

## శ్రీమద్రామానుజులు - గ్రంథ స్వరూపము

శ్రీమద్రామానుజ యతిచంద్రుల బృహ ద్రచనలలో - 'వేదార్థ సంగ్రహము' ఒకటి యైనను, 'శ్రీభాష్య' 'గీతాభాష్య' గ్రంథరాజములవలె వ్యాఖ్యాన రూపమున గాక, వేద తత్త్వ

స్వరూపమును సంగ్రహించి చెప్పజాలినట్టి చక్కని స్వతంత్ర రచనగా విలసిల్లినట్టిది. శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు సకల ఉపనిషత్సారభూతమైన వేదార్థముల సంగ్రహ వివేచనము సంతరించియున్నారు. ఉపనిషత్తుల పరమార్థమును ఇతరులకు చక్కగా అవగత మొనర్చుటయే ఈ రచన ముఖ్యోద్దేశము. అంతియే, ఇందు సంగ్రహముగా వివరించిన తత్త్వార్థము లన్నియు శ్రుతి స్మృతీతిహాస పురాణ దృష్టాంత వాక్యముల ద్వారా సిద్ధాంతీకరించిరి. శ్రీ రామానుజ యతి పుంగవులు - వేదార్థ సంగ్రహమున, తామై స్వయముగ చెప్పిన దేదియు లేదనియు, అది - పరంపరాగత మైన మహర్షి మహోదయులు ప్రబోధించిన తత్త్వార్థ విశేషమే యని స్పష్టీకరించియున్నారు :-

" పరబ్రహ్మవేత్తలును, ఆయనను సాక్షాత్కరింపజేయుటలో సమర్థులగు భగవద్ద్వైపాయనుడు, పరాశరుడు, వాల్మీకి, మనువు, యాజ్ఞవల్క్యుడు, గౌతముడు, ఆపస్తంబుడు మొదలగు మునిగణ ప్రణీత మగు విశ్వప్రమాణ సంగ్రహరూప వేదమూలములైన ఇతిహాస పురాణ ధర్మశాస్త్రములందు ఉపబృంహణములైన పరమార్థమును యథార్థస్వామాధర్మ రూపముల అనంత శాఖలు గల వేదమును అనుసరించు మనకు ఇష్టము కాని దే మున్నది ? "

— (వేదార్థ సంగ్రహము - పుట 4)

మొదట ఉపోద్ఘాతమున శ్రీభాష్యకారులు తమ ఉద్దేశ్యమును, శంకర - భాస్కర - యాదవ ప్రముఖు లగు ప్రతిపక్షుల ఉద్దేశ్యములను వివరించి, అటుపై - ఛాందోగ్యోపనిషత్తులోని (సద్విద్యా ప్రకరణము నందలి 'తత్త్వమసి' నీవు ఆ బ్రహ్మమై యున్నావు) అను మూల సూత్రముపై ప్రత్యర్థుల ఉద్దేశ్యములను ఖండింపబూనిరి. 'తత్త్వమసి' అను సూత్రార్థమును వివరింపబూనిరి.

'తత్ - త్వమ్ - అసి' అని పద విభాగము చేసి, 'తత్' శబ్దము బ్రహ్మ ప్రతిపాదక మని జీవుడు బ్రహ్మాత్మకుడగుట వలన 'త్వమ్' శబ్దముకూడ - బ్రహ్మప్రతిపాదకమే అగుచున్న దని చెప్పి, 'తత్' శబ్దమునందు - 'త్వమ్' శబ్దమునందును ప్రతిపాదింపబడినవాడు 'పరమాత్మయే' అని విశదీకరించిరి. పరబ్రహ్మ సర్వశబ్దవాచ్యుడగుటచేత, 'తత్' 'త్వమ్' అని సామానాధికరణ్యముచేతను, జీవశరీరకుడగుటచేతను జీవప్రకారుడైన పరమాత్మయే చెప్పబడుచున్నాడని వివరించియున్నారు. 'జీవాత్మ' - పరమాత్మల సంబంధమును గూర్చి -

" జీవాత్మ పరమాత్మకు శరీరము కనుకనే, బ్రహ్మాత్మకము. దీనికి బ్రహ్మము ఆత్మగా నున్నాడు. పరమాత్మకు శరీరమైన, జీవాత్మ ప్రకారముగ, దేవ మనుష్యాది సమస్త వస్తువులు బ్రహ్మాత్మకములే. కాబట్టి, దేవ - మనుష్య - యక్ష - రాక్షస పశు - మృగ - పక్షి - లతా - కాష్ఠ - శిలా - తృణ - ఘట - పటాది నామము లచే ప్రసిద్ధి పొందిన శబ్దము లన్నియు ప్రకృతికి ఆధీనమైన సంబంధము... గలిగియున్నాడు. ఈ విధముగా చిదచిదాత్మకమైన సమస్త ప్రపంచము బ్రహ్మాత్మకము. సమస్త జగత్తును ఆయనకు శరీరము అగుటచేత, 'త్వమ్' ... వాచ్యుడును జీవప్రకారమైన బ్రహ్మమే. అన్నిటికిని - 'బ్రహ్మాత్మకత్వము' అంగీకరింపబడినది. " - (వేదార్థ సంగ్రహము - పుట 4.)

అని నిరూపించియున్నారు. బ్రహ్మమునకు - జగత్తునకు గల ఏకత్వమును, భిన్నత్వమును చెప్పువారు. ఈవిధముగా ప్రసక్తి విహీనమై... శాస్త్రార్థములకు ఒకే యర్థమును చెప్పవచ్చునని, శ్రీమద్రామానుజ యతీంద్రులు విశదీకరించియున్నారు. శ్రుతులను చక్కగా అర్థము గా... చేసికొనినప్పుడు - శ్రీమన్నారాయణుడే పరమాత్మ యని, బ్రహ్మ రుద్రేంద్రాదులు కేవలము జీవకోటిలో ప్రథములుగా సృష్టింపబడినవారు అని నిర్ధారించి యున్నారు. సమస్త చరాచర

ప్రకృతికి ఆధార భూతు డగు పరబ్రహ్మ గానకు ప్రత్యేకముగ ఆచరింపదగిన, ఆచరింపదగని కర్మమును గూర్చి శబ్దము లు చెప్పినవి, పురుషోత్తమునకు ప్రీతి కరమైనవి, అప్రీతికరమైనవియానైన సమస్త కర్మముల ఫలితమును - ప్రతిఫలమునుగాని, శిక్షనుగాని కర్త తప్పక అనుభవించునని తెలియజెప్పియున్నారు. వేదార్థ సంగ్రహమున వివరి పూర్వ భాగములు భగవంతుని సర్వోత్కృష్టమైన దివ్యాకృతి కలవాడని, వేదములు అపౌరుషేయము లయినవని భక్తియే ఒక పరిపూర్ణమైన భగవత్ జ్ఞాన మని, అది భగవంతునికి ఒక సేవా భావ మని. ఆయనకు అది సేవకత్వమే అను నని నిరూపించియున్నారు

శ్రీమద్రామానుజ యతీంద్రులు ఆస్తిక మత ప్రాతిపదికపై బ్రహ్మ సూత్రములకు విశ్వ విఖ్యాత మగు వ్యాఖ్యానమును రచియించి, 'శ్రీభాష్యము'ను అనుగ్రహించిరి. దీనికే, 'శారీరక మీమాంసా భాష్యము' అని నామాంతరము. ఉపనిషత్తుల పరమార్థమును సంక్షేపించి చెప్పుటకో - బ్రహ్మ సూత్రములు రచింపబడినవని భావించి, సూత్రార్థములతో సహ అభిప్రాయములను ఒప్పిదమై యుండవలయు నని శ్రీమద్రామానుజ యతిశేఖరులు అభిలషించియుండిరి. తన అభిలషితార్థమున వారు నాలుగురకు శిష్యోత్తములై రని విజ్ఞుల నిశ్చితాభిప్రాయము. బ్రహ్మ సూత్రార్థములను వివరించు సందర్భమున శ్రీమద్రామానుజ యతీంద్రులు ప్రత్యేకముగ ప్రతి సూత్రమునకు ప్రతిపదార్థ వివరణము నిచ్చుటయే కాక, సూత్ర మంతటికి గల విశేషార్థమును గూడ వివరించియున్నారు. 'శ్రీభాష్యము'న నాలు గధ్యాయము లున్నవి. 545 సూత్రము లున్నవి. మొదటి రెండధ్యాయములలో - సమస్త జగదుత్పత్తి స్థితి లయ కారకుడుగ సకల చేతనాచేతనాంతర్వర్తి

యును, సర్వ విలక్షణ లక్షితుడునైన పరబ్రహ్మముయొక్క స్వరూపము నిరూపింపబడినది. మిగిలిన రెండు అధ్యాయములందు - ఉపాదానము, ఫలము వివరింపబడినవి. ఇందు - ఉపనిషత్తులనుండి, భగవద్గీతా శాస్త్రమునుండి ప్రమాణ వాక్యములు పుంఖానుపుంఖములుగ ఉదాహరింపబడియున్నవి. శ్రీభాష్య గ్రంథరాజమున మొదటి సూత్రమునందు శ్రీమద్రామానుజ యతివరేణ్యులు కూర్చిన లఘు సిద్ధాంత - మహా సిద్ధాంత - అధికరణ సిద్ధాంతముల స్వరూప స్వభావములను పరికించినచో, శ్రీభాష్యకారుల అసాధారణ ప్రజ్ఞా పాటములు తేటతెల్లము కాగలవు. ఇట్టి విస్తృత రూపమున వ్యాఖ్యా నింపబడిన మహా సిద్ధాంత మొక్కటే ఒక ప్రత్యేక గ్రంథ మనదగి యుండి, శ్రీరామానుజ మత సిద్ధాంత సారాంశమును వ్యక్తీకరించు చున్నది. ఉభయవరులు తమ బ్రహ్మసూత్ర వ్యాఖ్యానములకు ఈ ప్రథమ సూత్ర వ్యాఖ్యాన రూపమున విస్తరిల్లిన లఘు సిద్ధాంత - మహా సిద్ధాంత - అధికరణ సిద్ధాంతములను ఉపోద్ఘాతమున సంభా వించియుండి రని, కేవలము - ఈ ప్రథమ సూత్ర బృహద్వ్యాఖ్యాన మును పఠించుట చేతనే పఠితలు శ్రీ రామానుజ సిద్ధాంతమునే కాక, భగవత్తత్త్వమునుగూడ సూక్ష్మముగ అవగత మొనర్చుకొందు రని పెద్దలు సంభావించియున్నారు. కాని, శ్రీభాష్య గ్రంథ పరిపూర్ణ విశేష విషయ సుగ్రాహ్యత కది చాలదు. శ్రీభాష్య మహా గ్రంథము - “ ఓమ్ అథాతో బ్రహ్మజిజ్ఞాసా ”అను సూత్రముతో ప్రారంభమై, “ అనావృత్తి శ్శబ్దాత్ అనావృత్తి శ్శబ్దాత్ ” అను సూత్రముతో అంత మగుచున్నది

“ హరిః ఓమ్ అథాతో బ్రహ్మజిజ్ఞాసా ”

అనంతరము ఇందువలన బ్రహ్మవిచారము (చేయదగినది).

1-1-1 అను ప్రథమ సూత్రమునకు – 'అనంతరము - వేదాధ్యయనము ద్వారా సమస్త కర్మ విచారము చేసిన తర్వాత, 'అందువలన' - కర్మ విచారము చేయుటచే కర్మ ఫలము స్వల్పము, అస్థిరము - అని తెలియవచ్చుటవలన, 'బ్రహ్మవిచారము' - అనంతమైన, స్థిరమైనఫలము నిచ్చునట్టిదియునైన బ్రహ్మ (పరబ్రహ్మ) విచారము చేయవలయును-అని తాత్పర్యము. ఈ సూత్రమునకు - 'జిజ్ఞాసాధికరణము' అని నామకరణ మొనర్చబడినది. మోక్షార్థియైనవాడు ప్రయత్న పూర్వకముగ బ్రహ్మమును గూర్చి బాగుగా విచారించి తెలిసికొనవలె నని సారాంశము. ఈ సూత్రమునకు శ్రీభాష్య కారులు -

"అథ" అను శబ్దమునకు - 'అనంతరము' అని అర్థము. "అతః" అను శబ్దము - కడచిన హేతువును (అందువలన) తెలుపుచున్నది. అనగా - పూర్వ మొనర్చిన కర్మ ఫలము అనిత్య మని తెలియుటవలన నని యర్థము. వేద వేదాంతములను సాంగముగా జదివి, కర్మానుష్ఠానమువలన కలిగెడి ఫలము స్వల్ప మని, అస్థిర మని తెలిసికొనుటవలన, మోక్షాభిలాషియైనవానికి, అనంతమైన - స్థిరమైన ఫలము (మోక్షము) నిచ్చు బ్రహ్మజ్ఞానమును గూర్చి విచారింపవలయును 'జిజ్ఞాస' అనగా - తెలిసికొనవలయు ననెడి కోరిక 'బ్రహ్మ జిజ్ఞాస' అనగా - బ్రహ్మమును తెలియగోరుట. 'బ్రహ్మ' శబ్దమునకు - స్వభావము చేత నిరస్త నిఖిల దోషుడు, అనవధికాతిశయా సంఖ్యేయ కల్యాణ గుణ గణ పురుషోత్తము డని అర్థము. అంతటను 'బ్రహ్మ' శబ్దము - 'బృహత్త్వము' (పెద్దతనము) అను గుణము నుబట్టి వర్తించును. 'బృహత్త్వము' గూడ స్వరూపమునుబట్టి, గుణములను బట్టియు, ఎవనియందు అనవధికాతిశయమై యుండునో, వా డని - 'బ్రహ్మ' శబ్దమునకు ముఖ్యార్థము. అట్టివాడు సర్వేశ్వరుడే అందువలన, 'బ్రహ్మ' శబ్దము ముఖ్యముగా సర్వేశ్వరునే తెలియజేయునది. అట్టి 'బృహత్త్వ' గుణ లేశమును బట్టి, ఇతరత్ర

పదార్థములను తెలియజేయుచుండు - ఇది ఔపచారికముగ ప్రయోగింపబడి-
యున్నది. ఒక శబ్దమునకు అనేక ముఖ్యార్థములు కల్పించుట యుక్తము కానందువ-
ల్ల, భగవచ్ఛబ్దము పురుషోత్తమునియందు ముఖ్యార్థ మని, ఇతరులయందు - ఔప-
చారిక మని (ముఖ్యార్థము కా దని) చెప్పబడినది. తాపత్రయమును (ఆధ్యా-
త్మికము - ఆధిభౌతికము - ఆధిదైవికము) బాధ పడువారిచే అమృతత్వమును
(మోక్షమును) పొందుటకై, అతడే (సర్వేశ్వరుడే) తెలియగోరదగినవాడు. అందు-
చేత, వారి జిజ్ఞాసకు విషయ భూతముగ చెప్పబడు 'బ్రహ్మము' సర్వేశ్వరుడే.
'జిజ్ఞాసా' - జిజ్ఞాస అనగా - తెలిసికొనవలయు ననెడి కోరిక. కోరికకు ప్రయోజ-
నము - కోరబడు వస్తువు. ఇచట కోరిక అనగా - కోరబడునట్టి బ్రహ్మజ్ఞానము
విధింపబడుచున్నది" — (శ్రీభాష్యము. I-1-1.)

అని వ్యాఖ్యానమును సాయించియున్నారు. బృహస్వ గుణాము-
గలవాడు సర్వేశ్వరుడు. శ్రీమన్నారాయణుడే తెలిసికొనగోరదగిన
వాడని తెలియుచున్నను, ఇందలి సూక్ష్మాంశములు విశదీకరించు
సంగ్రహములందు - శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రమాణ వాక్యముల
చేత, పూర్వపక్ష సిద్ధాంత ప్రశ్నోత్తరములచేత విషయ విపులీకరణము
నకు అవకాశము మెండుగ కలిగింపబడినది. శ్రీభాష్య ప్రథమాధ్యాయ
మున శ్రుతవాక్య ప్రామాణ్యమునందు - 'జగత్కారణము బ్రహ్మము'
అని నిరూపింపబడినది. మొదటి నాలుగు సూత్రములు - 'చతు-
స్సూత్రి' అని వ్యవహరింపబడినవి. ఈ చతుస్సూత్రి ద్వారా 'బ్రహ్మ
విచారము చేయదగినదా? లేదా?' అను సందేహ నివృత్తి చేసి,
'బ్రహ్మవిచారము చేయదగినదే' అని నిర్ణయింప బడినది. అంతే కాక,
'బ్రహ్మజ్ఞానమును కలిగించు ప్రమాణము వేదాంత వాక్యమగునా?
కాదా?' అను సందేహమునకు - 'వేదాంత వాక్యము బ్రహ్మ-
జ్ఞానమును కలిగించు ప్రమాణము కాగలదు' అని నిరూపింపబడినది.

ఈ విధముగా - 'సమస్త జగత్కారణుడైన బ్రహ్మము శ్రీమన్నారాయణుడే' అను సిద్ధాంతమును నిరూపించు విశేష తత్త్వము - శ్రీమద్రామానుజ యతీశ్వరుల ప్రధాన గ్రంథరాజములందంతటను విస్పష్టముగా గోచరమగుచున్నది

'శ్రీభాష్యము' తరువాత శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు రచియించిన బృహద్వ్యాఖ్యాన గ్రంథము - 'శ్రీగీతా భాష్యము' ఇందలి కొన్ని ప్రత్యేక వ్యాఖ్యానములు - శ్రీభాష్యమునందు అవతరించినట్టివే. శ్రీభాష్య సూత్ర వ్యాఖ్యానము వలె బహు విస్తృతము, గంభీరము, జటిలమును గాక, 'గీతా భాష్యము' స్పష్టమైన అర్థ వివరణ రూపమున విస్తరిల్లిన వ్యాఖ్యాన పరిమితము. శ్రీమద్యామున మునిచంద్రుల 'గీతార్థ సంగ్రహ' సారాంశముచే ఉపయనతులు తమ గీతా భాష్యమున కూర్చియున్నారు. తమ పరమాచార్యులగు శ్రీమద్యామున మునిచంద్రుల వలె, శ్రీమద్రామానుజ యతిశేఖరులును - జ్ఞాన కర్మ యోగములు కేవలము భక్తికి సమాయత్తపరచు దశలు మాత్రమే కాని, భగవంతుని పొందింపలేవని విశ్వసించిరి. భగవంతుని కేవలము కర్మ జ్ఞాన యుక్తమైన భక్తి చేతనే పొంద దగినవాడని, ఇదియే గీతా శాస్త్ర సారాంశమని - వారిరువురును సమ్మతించి యుండిరి. శ్రీమద్రామానుజ యతిసార్వభౌముల దృష్టిలో - 'భక్తి' అనగా - 'ధ్యాన' మని, 'ధ్రువానుస్మృతి' అని, గీతాభాష్య - శ్రీభాష్య వ్యాఖ్యానములు రెండింటియందును విశదీకరించియున్నారు. మొత్తము మీద, 'గీతాభాష్యము' ఒక ముఖ్యమైన శ్రుతిపై అధికారిక గ్రంథముగా - శ్రీమన్నారాయణుని పరతత్త్వమును, ధ్యానార్చనాది విధి

విధాయక పవిత్ర సంప్రదాయ విశేషములను లోకమున చక్కగా చాటి చెప్పి, శ్రీవైష్ణవ భావిశిరోమణులవారికే గాక, లోకు లందరికిని మార్గ దర్శకత్వమును వహించు గ్రంథ రాజము.

'వేదాంత దీపము', 'వేదాంత సారము' అనునవి మరి రెండు లఘు రూపమున వెలసిన భాష్య గ్రంథములు. ఇవి ఉడయవరుల శ్రీభాష్య గ్రంథమునకు ప్రతిరూపములు. శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు మొదట బ్రహ్మసూత్రములకు విస్తృత రూపమైన వ్యాఖ్యాన రూపమున శ్రీభాష్య గ్రంథరాజమును వెలయించి, పిమ్మట - ప్రత్యేక ప్రయోజనము నుద్దేశించి - 'వేదాంత దీపము', 'వేదాంత సారము' అను గ్రంథములను సంక్షిప్త రూపమున సాయించి యున్నారు. వేదాంత దీపములోని సూత్రములు - 'శ్రీభాష్యము' లోని సూత్రములను అనుసరించి యున్నను, సంక్షిప్త రూపములు కానేరవు. ఇందు - విశేషాంశము లెన్నో కూర్చబడినవి. 'వేదాంత దీపము'న - ప్రథమ సూత్ర వివరణకు పూర్వము ఉపోద్ఘాతము ఉల్లేఖింపబడినది ఈ ఉపోద్ఘాతమున - విశిష్టాద్వైత సిద్ధాంత విశేషములు సంగ్రహముగా చెప్పబడినవి 'శ్రీభాష్యము'న - విస్తృత రూపమున వ్యాఖ్యానింపబడిన ప్రథమ సూత్రమువలె, 'వేదాంత దీపము'న - ప్రథమ సూత్ర వ్యాఖ్యానము కానరాదు. అచ్చట చ్చట కొన్ని వివరణలు, కొన్ని దృష్టాంతములు తప్ప, 'వేదాంత దీపము' లోని వ్యాఖ్యానము లన్నియు 'శ్రీభాష్య' గ్రంథము నందలి ప్రత్యేకాని కరణాంశములనే పోలియున్నవి. అయినను, 'శ్రీభాష్యము' నందలి వ్యాఖ్యానమే ఇందు పునరుక్తమై కనుపట్టదు. ఇక 'వేదాంత సారము లోని సూత్ర వ్యాఖ్యానములు మరింత సంక్షేపముగా కానుపించును. 'వేదాంత దీపము'న - తొలుత కూర్పబడిన విధముగ, 'వేదాంత సారము'న ఉపోద్ఘాతము లేదు. ఇందు ప్రతి సూత్రార్థమును విస్తృత

మైన వాద రూపమున కాక, సక్రమముగా, ఖండితముగా ఉదాహరింప బడినవి. ఇందులకు సిద్ధాంతముగా చూపబడిన శ్రుతి సూత్రము లన్నియు - తార్కికముగా కాక, ఉదాహరణములుగా, పట్టిక రూపమున కూర్చబడినవి. శ్రీ రామానుజ మతానుయాయులు ఈ వివరణమును కంఠస్థ మొనర్చుకొనుటకు అనువైన సాధనముగా దీని నుపయోగించుకొనియుండిరని తెలియవచ్చును. ఇతర మతానుయాయులకు ఈ విశేషమును వివరించి విశ్వాస పరచేయు ఉద్దేశ్యముతో శ్రీమద్రామానుజ యతి సార్వభౌములు దీనిని రచించియుండి యుందురు. 'వేదాంత సారము'న - గమనింపదగిన మరొక ముఖ్య విశేషము - రెండవ సూత్ర విశేష వ్యాఖ్యానము. 'శ్రీభాష్యము'న ప్రథమ సూత్రమునకు బృహద్ వ్యాఖ్యానము కూర్చబడగా, 'వేదాంత దీపము'న - వ్యాఖ్యానమునకు పూర్వము ఉపోద్ఘాతము కూర్చబడినది. కాని, 'వేదాంత సారము'న - మొదటి సూత్రమున కాక, రెండవ సూత్రమున విశేష వ్యాఖ్యానము కనబడును. 'వేదాంత సారము' శ్రీమద్రామానుజ యతీశ్వరుల ప్రథమ రచన అను అభిప్రాయము కలదు. ఉడయవరుల శిష్య సంప్రదాయపు విశేషముల ద్వారా తెలియవచ్చు విశేష మేమనగా, వారు శ్రీవైష్ణవ సిద్ధాంత వ్యాఖ్యానములను కేవల ప్రబోధాత్మక దృష్టితో కాక, శ్రీవైష్ణవ మతమును స్థాపించు గొప్ప పట్టుదలతో సాగించియున్నారు. ఐన, 'వేదాంత సారము' సంక్షిప్తముగా వ్రాయబడి యున్నను, శ్రీమద్రామానుజ యతి చంద్రులు ఈ గ్రంథమును శ్రీవైష్ణవ సంప్రదాయస్థులకు ప్రాథమిక శిష్యులకు ప్రబోధించుటకే గాని, ప్రతిపక్షులను తమ వాదమున గెలిపించి, విశ్వసింప చేయుటకు గాదు.

'గద్య త్రయము', 'నిత్య గ్రంథము' అనునవి శ్రీమద్రామానుజ యతీంద్రుల లఘు రచనలు. శ్రీవైష్ణవ మతానుయాయుల నిత్య

జీవితములో - గద్య త్రయము యొక్క ప్రాధాన్యత అపారమైనది. ఇవి- 'శరణాగతి - శ్రీరంగ - వైకుంఠ' గద్య లనునవి. శరణాగతి గద్యమున - భగవత్కృపకై భక్తుని పరిపూర్ణ శరణాగతి (ప్రపత్తి) వివరింపబడినది ఈ ప్రపత్తి కేవలము ఆచార కర్మ సంబంధమైన స్వల్ప విధానము. శరణాగతి గద్యము ద్వయ మంత్రమునకు వివరణ రూపము. దీనికి - 'బృహద్గద్య' 'పృథు గద్య' అను పేర్లు కూడ కలవు. శ్రీమద్రామానుజులు శ్రీరంగనాయకీ శ్రీరంగనాథుల సమక్షమున ఈ గద్యాలను విన్నపము చేసి రని ప్రతీతి. మొట్టమొదట ఉడయవరులు శ్రీమన్నారాయణుని శరణు పొందుటకుగాను, శ్రీదేవి పురుషకారమునకై ప్రార్థించిరి. శ్రీదేవి శరణు పొంది, ఆయన సమ్మతిని బడసి, పిమ్మట శ్రీమన్నారాయణుని శరణు వేడిరి. ఇందు శ్రీమద్రామానుజ యతివరేణ్యులు - తమ అనంతాపరాధములను మన్నించి క్షమింపు మని, శ్రీమద్భగవద్గీతలో నిర్దేశింపబడిన జ్ఞాని వలె తమకు పరభక్తి, పరజ్ఞానము, పరమ భక్తిని ప్రసాదింప వేడు కొనియున్నారు .-

" పరభక్తి, పరజ్ఞాన పరమ భక్తుల చేత చేయబడినట్టిది, సంపూర్ణమై, అవిచ్ఛిన్నమై, నిత్యమై, మిక్కిలి విశదమై వేరొక ప్రయోజనము లేనిదై, అత్యంతము అతిశయము కలదియు, ప్రియమును ఐన దగు భగవదనుభవము గల నేను, ఆ విధమైన భగవదనుభవము వలన కలిగిన ప్రీతిచే చేయబడినవి, సమస్తములైన అవస్థలకు తగినట్టిదియునైన 'భగవంతుని యందే మనసు నిలుపుట' అను నిత్య కైంకర్యము కలవాడను కావలయును. - (శరణాగతి గద్య)

అటు పిమ్మట, శ్రియఃపతినుండి - 'నీవు కోరినట్లుగ, నిత్య కైంకర్యము చేయువాడవు కాగలవు' అని, అనుగ్రహ రూపమైన సమాధానమును కూడ పొందిరి.

రెండవది - 'శ్రీరంగ గద్య'. ఇది మరింత సంక్షేప రూపమైనది. రామానుజులు సర్వ సులభులై వేంచేసియున్న శ్రీరంగనాథుని మ్రోల ప్రపత్తి చేయుచు, తమను నిత్య కైంకర్య నిరతులుగ సమ్మతింప ప్రార్థించియుండిరి

" భక్తి జ్ఞాన కర్మ యోగాదులు చేయనివాడ నైనను, పరమ దయా స్వభావుడగు భగవంతుడు నా అస్తిత్వమునే ఆధారముగా గొని, తన అధీనము వలన కలిగిన ప్రీతిచే కలిగినదియు, తనయందే నియతమై యుండునట్టిదియు, హద్దు లేనిదియునైన నిత్య దాస్యమును అనుగ్రహించగల డను విశ్వాసముతో భగవంతునియందు నిత్య కైంకర్యమునే ప్రార్థించుచున్నాను " — (శ్రీరంగ గద్య)

ఈ శ్రీరంగ గద్యకు - 'లఘు గద్య' యనియు పేరు.

ఇక మూడవదైన 'వైకుంఠ గద్య'లో - అనేక భాగము శ్రీవైకుంఠము, అందలి విశేషములు - విస్తృతముగా వర్ణింపబడినవి. ముముక్షువైనవాడు ప్రపత్తి చేసిన పిమ్మట, ప్రతి నిత్యము విధిగా శ్రీమన్నారాయణుని ధ్యానించు విధానము వర్ణింపబడినది. ఈ గద్యలో ఉడయవరులు మొదట తమ పరమాచార్యు లగు శ్రీయామున మునుల స్తుతి రూపమైన మంగళ శ్లోకమును వ్రాసియున్నారు ..

" పదునాలుగు లోకములు గల అండమును దానికి పది రెట్లు వ్యాపించి యున్న సప్తావరణమును, దానిపై గల సమస్త కార్య కరణ జాలమును దాటి, ఆ పైన ఉన్నట్టి 'పరమ వ్యోమ'మని పిలువబడునది, బ్రహ్మాదులకు - మనస్సు గూడ అతీతమై వెలసియున్న 'వైకుంఠము' అను దివ్య లోకమునందు .. "

— (వైకుంఠ గద్య)

త్రిని. పారార్థ్యాచార్యాభిమానమును చక్కగ ప్రకటించియున్నారు. ఈ విషయమున - శ్రీమద్రామానుజ యతిశేఖరులు తమ ప్రార్థనా శ్లోకమునందు భగవత్ పరతత్త్వమునే కాక, 'శ్రీ రామానుజ మహా వైశిష్ట్యమును కూడ వ్యక్తీకరించియున్నారు.

అఖిల భువన జన్మ స్థేమ భంగాది లీలే" - " బ్రహ్మణి శ్రీనివాసే " - అశేష చిదచిద్వస్తు శేషిణే శేషశాయినే " - " నిర్మలానంత కల్యాణ నిధయే విష్ణవే " ప్రమాణాంతోఽసంతో " - సమస్త చిదచిద్వస్తు శరీరాయాఖిలాత్మనే. "

అను వాక్య రాజములు - దీనికి దృష్టాంతములు. పరబ్రహ్మ స్వరూపమును, ఆర్చి శ్రీమద్రామానుజ యతిపుంగవులు - తమ ప్రధాన గ్రంథము లన్నింటిలోను వేద వేదాంతార్థ ప్రమాణ వాక్యములతో నిర్ధారించియున్నారు.

పరబ్రహ్మము శ్రీమన్నారాయణుడే అని, ఆయన రూపము అసాధారణమైన దని, శుభాశ్రయ మైన దని, సవిశేష మని (గుణ విశిష్ట మని) తెలియచేయబడినది. ఆ పరబ్రహ్మము యొక్క విభూతి యగు ప్రపంచ సమూహము పరమార్థమని తెలియజెప్పబడినది. ఆ పరబ్రహ్మము సర్వేశ్వరుడు లోకముల కన్నిటికిని గొప్ప ఈశ్వరుడు. పుట్టుక లేని వాడు ఆది లేనివాడు.[1] అన్ని భూతములు ఆ యనయందున్నవి. ఆయన మాత్రము వాని అధీనమైనది కాదు [2] ఆయన తన సంకల్పము చేత భూతములను ధరించియున్నాడు భూతముల వలన ఆయనకు ఏ ఉపకారమును లేదు. ఆయన సంకల్పమే భూతములను ధరించి

---

1. యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ (భ గీ 10-3)
2. మత్‌స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ (భ గీ 3-4)

నియమించునది.[3] సమస్త జగత్తునకు ఆయనయే ఉత్పత్తి స్థానమైనవాడు. ప్రళయ స్థానమైనవాడు[4] ఆయనకంటె గొప్పది మరేదియును లేదు. దారమునందు మణుల వలె, ఆయన యందు సమస్త ప్రపంచమును గ్రుచ్చబడియున్నది.[5] సమస్త జగత్తును ఆయన తన స్వల్పమైన అంశముచేత పట్టియున్నాడు[6] మూడు లోకములందును 'ప్రకృతి, జీవుడు, ముక్తుడు' అను పదార్థములలోను ఆయనయే అంతర్యామిగా ప్రవేశించి, వానిని పోషించుచున్నాడు. ఆయన నశింపని వాడు. బద్ధ ముక్తాత్మోత్తముడు - మహా పురుషుడు. ఆయననే 'పరమాత్మ' అని పిలువబడుచున్నాడు.[7] ఆయన వేదమునందు - 'పురుషోత్తముడు' అని ప్రసిద్ధి చెందినవాడు.[8] సమస్త భూతానికి కారణభూతమైన ప్రకృతి, మహత్తు మున్నగు వికారములను, సత్త్వ రజ స్తమో గుణ దోషములను అతిక్రమించువాడు. ఆగుణముల

---

3 న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరం
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః (భ గీ 9-5)

4. అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా॥ (భ గీ. 7-6)

5. మత్తః పరతరం నాస్తి కించి దస్తి ధనంజయ !
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ (భ గీ 7-7)

6. విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥ (భ గీ 10-42)

7. ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ (భ గీ 15-17)

8 యస్మా త్క్షర మతీతోఽహ మక్షరా దపి చోత్తమః
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ (భ గీ 15-18)

నన్నిటిని దాటినవాడు. భువనాంతరాళము నందు వ్యాపించి యున్న వాడు.[9] సమస్త కల్యాణ గుణాత్మకుడు. స్వశక్తి లేశ మాత్రముచే భూత సృష్టిని ధరించియున్నవాడు[10] బలైశ్వర్య వీర్య తేజ శ్శక్త్యాది గుణైకరాశి యైన వాడు[11] వ్యష్టి సమష్టి రూపుడు. అవ్యక్త స్వరూపుడు. ప్రకట స్వరూపుడు. సర్వ నియామకుడు. సర్వవేత్త. సమస్త శక్తియుతుడు సమస్తమును చూచువాడు. 'పరమేశ్వరుడు' అను పేరు గలవాడు.[12] ఉపాసనా రూప మగు జ్ఞానముచే చూడ బడువాడు. ఎల్లప్పుడు పరిశుద్ధమైనవాడు. మహా విభూతి యను పేరు గలవాడు అన్ని కారణములకు కారణమైనవా డగు పర బ్రహ్మము.[13] భగవంతు డను గొప్ప శబ్దము పరబ్రహ్మ మైన

---

9. స సర్వ భూత ప్రకృతిం వికారాన్ గుణాది దోషాంశ్చ మునే వ్యతీతః
అతీత సర్వావరణో ఽఖిలాత్మా తేనాస్తృతం య ద్భువనాంతరాళే॥
— (వి పు. 6-5-85)

10. సమస్త కల్యాణ గుణాత్మకో ఽసౌ। స్వశక్తి లేశా ద్భృత భూత సర్గః॥
— (వి.పు. 6-5-84)

11 తేజో బలైశ్వర్య మహావబోధ సువీర్య శక్త్యాది గుణైకరాశిః
పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయ స్సంతి పరావరేశే॥
— (వి పు 6-5-35)

12 స ఈశ్వరో వ్యష్టి సమష్టి రూపో ఽవ్యక్త స్వరూపః ప్రకట స్వరూపః
సర్వేశ్వర స్సర్వ దృ క్సర్వ వేత్తా సమస్త శక్తిః పరమేశ్వరాఖ్యః॥
— (వి పు 6-5-86)

13 శుద్ధే మహా విభూత్యాఖ్యే పరే బ్రహ్మణి శబ్ద్యతే
మైత్రేయ భగవ చ్ఛబ్ద స్సర్వ కారణ కారణే॥ — (వి పు 6-5-72)

బ్రహ్మమే. అది పురుష రూపము గాను, కాల రూపము గాను ఉన్నది[19] వ్యక్తావ్యక్తము లని చెప్పబడిన 'ప్రకృతియు, పురుషుడును' ఈ రెండును పరమాత్మయందు లయ మగుచున్నవి[20] అన్నిటికి ఆధారమైనవాడు, పరమేశ్వరుడును, విష్ణు వను పేరు గలవాడు నగు పరబ్రహ్మము - వేదములందు, వేదాంతము లందును చెప్పబడి యున్నాడు[21] పరబ్రహ్మమునకు - 'మూర్తము', 'అమూర్తము' అని రెండు రూపములు గలవు. అవి - 'క్షరము' ను, 'అక్షరము'ను స్వరూపములుగా గలవి, అన్ని భూతములం దుండునవి. ఆ పరబ్రహ్మము - 'అక్షర' మనబడును. ఈ జగత్తంతయు 'క్షర' మనబడును[22]

ఈ విధముగ స్మృతి పురాణ వాక్యములు పరబ్రహ్మము సర్వవిధముగ దోషము లేనిదనియు, సమస్త కల్యాణ గుణములతో ప్రధానముగా గల దనియు, జగదుత్పత్తి స్థితి సంహారాంతః ప్రవేశ

---

19 తదేవ సర్వ మేవైత ద్వ్యక్తావ్యక్త స్వరూపవత్
తథా పురుష రూపేణ కాల రూపేణ చ స్థితమ్॥ (వి.పు. 1-2-14)

20. ప్రకృతి ర్యా మయాఖ్యాతా వ్యక్తావ్యక్త స్వరూపిణీ
పురుష శ్చాప్యుభా వేతౌ లీయేతే పరమాత్మని॥ (వి పు 6-4-39)

21 పరమాత్మా చ సర్వేషా మాధారః పరమేశ్వరః
విష్ణునామా చ వేదేషు వేదాంతేషు చ గీయతే॥ (వి పు 6-4-40)

22. ద్వే రూపే బ్రహ్మణ స్తస్య మూర్తం చామూర్త మేవ చ
క్షరాక్షర స్వరూపే తే సర్వభూతేషు చ స్థితే॥
అక్షరం తత్పరం బ్రహ్మ క్షరం సర్వ మిదం జగత్॥
— (వి.పు. 1-22-55 56)

నియమనాది కార్యములను క్రీడార్థముగా నొనర్చున దనియును ప్రతిపాదించి, సమస్త చిదచిత్పదార్థములు సర్వావస్థలలోను ఉండునట్టి పారమార్థికములేయైన బ్రహ్మమునకు శరీర మగుట వలన, ఆ బ్రహ్మము శరీర యుక్త మైన దని, ఇట్లు శరీర - రూప - తను - అంశ - శక్తి - విభూతి మొదలగు శబ్దములచేతను, ఆ యా శబ్దములతో సామానాధికరణ్యము చేతను కనబడని, ఆ పరబ్రహ్మము యొక్క విభూతి యగు చిత్పదార్థము స్వస్వ రూపములతో నుండునట్టి స్థితిని - ఆ చిత్పదార్థ సంబంధము వలన క్షేత్రజ్ఞుడుగా నుండునట్టి స్థితిని - దేవ, క్షేత్రజ్ఞావస్థయందు పుణ్య పాప రూప కర్మ మనబడునట్టి అవిద్యచే ఆవరింపబడుటవలన చిత్పదార్థము తాను స్వాభావికముగా జ్ఞాన స్వరూపమైన దను తలంపు లేనిదై, అది త్పదార్థమైన దనెడి తలంపు గల దగుచున్న దని ప్రతిపాదించుచున్నవి. కావున, ఈ వాక్యముల వలన పరబ్రహ్మము సవిశేష మనియు (గుణ విశిష్ట మనియు), ఆ పరబ్రహ్మము యొక్క విభూతి యగు జగత్తు సహితము పారమార్థిక మనియు తెలియవచ్చుచున్నదని భాష్యకారులు (శ్రీమద్రామానుజులు) ప్రవచించి యున్నారు

చతుర్విధ పురుషార్థములలో మోక్షము అత్యుత్తమ మైనదిగా పరిగణింపబడినది. మోక్షార్థి యైనవాడు - కర్మ విభాగము చేసిన పిదప, 'కర్మ ఫలము స్వల్ప మైనది, అనిత్య మైనది' అని తెలియవచ్చుట వలన, 'అనంత మైనది, నాశ రహిత మైనది' అయిన మోక్ష ఫలము బ్రహ్మ జ్ఞానము వలన కలుగుచున్నందున బ్రహ్మ విచారము చేయదగిన దని శారీరక మీమాంసాశాస్త్రము తెలియజేయుచున్నది అందువలన, ముముక్షువు చక్కగా విమర్శించి బ్రహ్మమును తెలిసికొనవలయును. బ్రహ్మమును గూర్చిన విచారమును చేయునపుడు -

బ్రహ్మజ్ఞానమును కలిగించు సాధనము వేదాంత వాక్య ః వేదాంత వాక్యములకు బ్రహ్మజ్ఞానమును కలిగించు శక్తి కల నిర్ధారింపబడినది.

ఉపనిషత్తులు సర్వజ్ఞమును, సర్వశక్తియుతమును నైన 'బ్రహ్మ జగత్కారణ' మని ప్రతిపాదించుచున్నవి. శ్రీమద్రామానుజ చూడామణులు ఉపనిషత్తులపై ప్రత్యేకముగ వ్యాఖ్యాన గ్రంథ[illegible] వ్రాయకున్నను, వారి వ్యాఖ్యాన గ్రంథములలో ప్రత్యేకించి బ్ర సూత్రములను వ్యాఖ్యానించు సందర్భమున, వారు వివిధ స వేశములలో నుట్టంకించిన ఉపనిషద్వాక్యములు - వారి అ మేధా సంపత్తిని, బ్రహ్మజ్ఞాన విశేష వైదగ్ధ్యమును చాటి చె చున్నవి .-

" (అస్య) ఈ జగత్తునకు (జన్మాది) సృష్టి స్థితి లయములు (యతః) నుండి కలుగుచున్నవో, అది బ్రహ్మము" [23]

ఈ సూత్రమునకు శ్రీభాష్యకారులు -

" జన్మాది - అనుట ద్వారా సృష్టి స్థితి ప్రళయములు చెప్పబడుచున్నవి ఈ పదము తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి.[24] అస్య అనగా - అచింత్య

23 జన్మాద్యస్య యతః — (బ్ర.సూ 1-

24. తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి అనగా - 'వ్రేలాడుచున్న చెవులు గల తెమ్ము' అని చెప్పినపుడు వాడు వచ్చునపుడు వ్రేలాడుచున్న చెవులు కూడ వెంట వచ్చును. అందువలన, ఇది తద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి జన్మము మొదలుగా గల స్థితి ప్రళయులే కాక. జన్మము కూడ బ్రహ్మ అన్వయించు చున్నది.

విచిత్ర రచనతో, నియతము లగు దేశ కాల ఫల భోగములతో, బ్రహ్మాది స్తంబ పర్యంత జీవులతో కూడియున్నట్టి జగత్తునకు - 'యతః' అనగా - నిఖిల హేయ ప్రత్యనీక స్వరూపుడును, సత్య సంకల్పుడును, జ్ఞానానందా ద్యనంత కల్యాణ గుణగణుడును, సర్వజ్ఞుడును, సర్వ శక్తి యుతుడును, పరమ కారుణికుడును, పరాత్పరు డగు పురుషు డైన, ఏ పరమేశ్వరుని వలన సృష్టి స్థితి లయములు గలుగు చున్నవో, అట్టివాడు 'బ్రహ్మము' అని సూత్రార్థము. "

( శ్రీభాష్యము 1-1-2 )

అని వివరించియున్నారు జగ త్సృష్ట్యాదులకు కారణమైనది 'బ్రహ్మము' అని, బ్రహ్మము నొక్క లక్షణము చెప్పబడినది. జగ త్సృష్టి స్థితి లయములు బ్రహ్మమునకు ఉపలక్షణభూతము లని, ఈ ఉపలక్షణముల మూలముగా గూడ బ్రహ్మమును తెలిసికొనవచ్చు నని తెలియచేయబడినది. బ్రహ్మ శబ్దము - 'బృహతి' అను ధాతువు వలన నుత్పన్నమైన దగుటచేత, ఈ ఉపలక్షణములచే కనుపించు 'బ్రహ్మము' అపరిమిత మగు అతిశయము గల 'గొప్పతనము', 'గొప్ప శక్తి' కల దని తెలియు చున్నట్లు విశదీకరించియున్నారు. ఇందుకు ప్రమాణ ముగ -

" ఈ భూతములు ( చేతనాచేతనములు ) దేనినుండి పుట్టుచున్నవో, ఈ పుట్టినవి దేనిచేత జీవించుచున్నవో, చివరకు ఇవి దేనియందు ప్రవేశించు (లయ మందు) చున్నవో, దానిని 'బ్రహ్మము'గా తెలిసికొనుము[25] "

—(తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి 1)

అను శ్రుతి వాక్యము నుదహరించియున్నారు ఈ శ్రుతి వాక్యమును - 'ఏదో', 'దేనినుండియో', 'దేనిచేతనో' అని, బ్రహ్మమును ఒక

25. యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి।
యత్ప్రయం త్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి॥
— (తై. భృ. 1)

ప్రసిద్ధ వస్తువుగ నిర్దేశించుటచేత, ఆ ప్రసిద్ధి కనుగుణముగ జన
కారణ మనువర్తింపబడుచున్న దని వివరించుచు -

"సృష్టికి పూర్వము ఈ జగత్తు ఒక్కటియు, రెండవది లేనిదై, అనబడినదియుండెను. ఇది ప్రజలను సృజించుటకై అనేకముగా నగుదు సంకల్పించి, తేజస్సును సృజించెను[26]"

అను ఉపనిషద్వాక్యమున - 'సత్' అనబడు నది ఒక్కటే నిమి త్తోపాదాన కారణమైనదిగా తెలుపబడుటవలన, అట్టి ప్రసిద్ధి కలిగిన చెప్పబడినది 'సృష్టికి పూర్వము ఈ జగత్తు - 'సత్తు' అనబడు ఒక్కటిగా నుండెను' అనుటచేత, 'బ్రహ్మము' ఉపాదాన కా మగుటను ప్రతిపాదించి, 'రెండవది లేనిది' అనుటచే, ఇంక నియంతలేదని తెలిపి, 'అది ప్రజలను సృజించుటకై అనేకము గా నగుదునని సంకల్పించి, తేజస్సును సృజించెను' అని చెప్పుట ద్వా ఒకే వస్తువును ప్రతిపాదించుచున్నది. అందుచేత, జన్మ స్థితి ల ములు దేనిమూలకములో - అది 'బ్రహ్మము' అనుట వలన జ స్థితి లయములు తనకు నిమిత్తోపాదాన కారణ భూత మగు వస్తువై 'బ్రహ్మము' గాడ కానుపించుచున్నది. ఆ విధముగ జగత్తున నిమిత్తోపాదాన కారణములుగా నుండుటవలన, ఊహింపబడిన స జ్ఞత్వ, సర్వసంకల్పత్వ విచిత్ర శక్తిమత్త్వాది ఆకారములతో గా దిగా "బ్రహ్మము" తెలియబడుచున్న దని నాయించియున్నారు.

---

26. సదేవ సోమ్య! ఇద మగ్ర ఆసీత్। ఏక మే వాద్వితీయమ్।
తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి। త త్తేజో ఽసృజత॥
— (ఛాం ఉ. 6-2-1-1, 6-2-1-[illegible]

'సత్యరూపమైనది, జ్ఞానరూపమైనది, అంతము లేనిదియు బ్రహ్మము[27] అను శ్రుతి వాక్యమును, జగ జ్జన్మాది కారణభూత మగు బ్రహ్మము యొక్క స్వరూపము, త దితరములైన సమస్త వస్తు స్వరూపములకంటె విలక్షణమైన దని తెలియజేయుచున్నవి. అవి తమను నామాంతరములకు అర్హ మగునట్లు చేయు అవస్థాంతరములను బొందునవి కావున, వే రొక ఉపాధిని (నిమిత్తమును) అపేక్షించని సత్త కలవి కావు. 'జ్ఞానం' అను పదము - బ్రహ్మము ఎన్నడును సంకోచము నొందని జ్ఞానమే స్వరూపముగా గల దని తెలియజేయు చున్నందున, ముక్తులు ఒకప్పుడు సంకోచము నొందిన జ్ఞానము కలవా రగుట వలన, బ్రహ్మము వారికంటె వేరైన దని తెలియజేయుచున్నది. 'అనంతం' అను పదము - బ్రహ్మము దేశ కాల వస్తు పరిచ్ఛేదము లేని స్వరూపము గల దని తెలియజేయుచున్నది. స్వరూపము గుణ యుక్తమైనందున, స్వరూపము ననుసరించి, గుణములు ననుసరించి, బ్రహ్మము అనంతమైన దని, అందుచేత, 'సత్యం' - 'జ్ఞానం' అను విశేషణములచే వేరుపరుపబడిన బద్ధాత్మ - ముక్తాత్మలకంటె విల క్షణులు, నిరతిశయ స్వరూప గుణ సంపన్నులు నగు నిత్య సూరుల కంటెను బ్రహ్మము విలక్షణ మైన దని విశదీకరింపబడినది. కావున, జగ జ్జన్మాది కారణముగా తెలియ బడిన బ్రహ్మము - ఉపనిష ద్వాక్యముల ద్వారా, స్వేతర సమస్త వస్తు విలక్షణ మైనదిగ తెలుప బడుచున్న దని శ్రీభాష్యకారులు వివరించియున్నారు. జగ జ్జన్మాది కారణముగా బ్రహ్మము ప్రత్యక్ష అనుమాన ప్రమాణముల చేత తెలియదగినది కా దనియు, కేవలము శాస్త్ర ప్రమాణము చేత

27. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ. — (తై. ఆ 1)

తెలుపబడనదగిన దనియు విప్పి చెప్పబడినది. బ్రహ్మము శ చేతనే తెలిసికొనదగినది[28] అను సూత్రము ననుసరించి, ప్ర ఇంద్రియ గోచరము కానందున, శాస్త్ర ప్రమాణము అనగా - 'ఈ చేతనాచేతనములు దేనినుండి జన్మించుచు జన్మించినవి దేనివలన జీవించు చున్నవో'[29] అనునట్టి ఉపనిష ముల ద్వారా మాత్రమే తెలియదగియున్నందున, పరబ్రహ్మ సర్వేశ్వరుడు నగు పురుషోత్తముడు - మనకే ప్రమాణము శాస్త్ర మొక్కటే ప్రమాణముగా గలవాడని సిద్ధించుటను బడినది. అంతే కాక, వేదాంత వాక్యములు-'సత్', 'ఆత్మ', ' 'ఆకాశః', 'ఆనందః' 'నారాయణః' మొదలగు పదములచే కారణావస్థలు గలవాడగు పరమ పురుషుని బోధించుచు న్నలన, అవి పరమ ప్రమాణములై, సర్వ విధముల శిరోధార యున్నవి. అందువలన, ఆనంద స్వరూపుడగు పరబ్రహ్మ తె ఉపనిషద్వాక్య సమన్వయము వలననే చక్కగ సిద్ధించుచు శ్రీభాష్యకారులు వివరించియున్నారు

బ్రహ్మమును జగత్కారణముగ ప్రతిపాదించు శ్రు సాంఖ్యులు మొదలగు వారిచే జగత్కారణముగా నంగీకరిం ప్రకృతి మొదలగువానిని జగత్కారణముగ ప్రతిపాదించునవి అని చెప్పుచుండుటచేత, అచేతన మగు ప్రకృతికి అట్టి యుండుట అసంభవ మని చెప్పుచు శ్రీభాష్యకారులు -

" ఏది శ్రుతి చేతనే నిరూపింపదగినది కాదో, అది 'అశబ్దము' అనుమాన సిద్ధ మగు ప్రకృతి అని అర్థము 'సృష్టికి పూర్వము శ

---

28 శాస్త్ర యోనిత్వాత్. (బ్ర. సూ.

29 యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి॥ (తై.

ఉత్కృష్టియు, రెండవది లేనిదై, 'సత్' అనబడుచుండెను'[30] అను వాక్యము - ప్రకృతిని జగత్కారణముగా ప్రతిపాదించుచున్న దనుట యుక్తము కాదు. ఎట్లనగా, అది ప్రజలను సృజించుటకై అనేకముగా నగుదు నని సంకల్పించి, తేజస్సును సృజించెను'[31] అను వాక్యమున, సచ్ఛబ్ద వాచ్య మగు కారణ వస్తువు, ఈక్షణముతో ( సంకల్పముతో ) సంబంధించినదిగా కనబడుచున్నది అట్టి 'ఈక్షణము' - అచేతన మగు ప్రకృతి కలిగియుండుట - అసంభవము గాన, అట్లు సంకల్పింప సమర్థుడును, చేతన విశేషుడును, సర్వజ్ఞుడును, సర్వశక్తుడు నగు పురుషోత్తముడే సచ్ఛబ్దాభిధేయుడు. అంతేకాక, 'ఆ యాత్మ ప్రజలను సృజించుటకై సంకల్పించి, ఈ ప్రజ లందరిని సృజించెను'[32] మొదలగు సృష్టి ప్రకరణము లందలి వాక్యములు గూడ సృష్టి ఈక్షా పూర్వకమైన దానినిగా తెలుపుచున్నవి ”

— ( శ్రీభాష్యము 1-1-5 )

అని సాధించియున్నారు. సృష్టిని వర్ణించు వాక్యములలో కానవచ్చు సంకల్ప విహీనమైనది, అచేతనమైనదియు నగు ప్రకృతిని గూర్చి ఉదాహరించు అవకాశమే మాత్రము ఆ వాక్యములలో లేదని వివరించియున్నారు. జగత్కారణ మగు పురుషోత్తముడు సర్వ కార్యములకు అనుగుణుడే అని చెప్పుచు -

“ సర్వజ్ఞుడు సర్వశక్తుడు, సత్య సంకల్పుడును, సూక్ష్మములు నగు చిదచిత్పదార్థము లన్నియు శరీరముగాగల పురుషోత్తముడు జగత్కారణ మను పక్షమున,

---

30 సదేవ సోమ్య! ఇద మగ్ర ఆసీత్ ఏక మేవా ద్వితీయమ్॥
(ఛాం ఉ. 6-2-1-1)

31 త దైక్షత బహుస్యాం ప్రజాయేయేతి। త త్తేజో ఽసృజత॥
(ఛాం ఉ. 6-2-1-3)

32 స ఈక్షత లోకాన్ను సృజా ఇతి। స ఇమాన్ లోకా నసృజత॥
(ఐ ఉ. 1-1-1)

పరం కార్యములకు అనుగుణుడే. ఎట్లన, 'ఆ పురుషోత్తముని శక్తి - నానావిధమైనదిగా తెలియవచ్చుచున్నది. అతని జ్ఞానము, బలము, క్రియయు స్వాభావికములు'[33] అనియు, 'ఆ పురుషోత్తముడు సర్వమును బాగుగా తెలిసికొనినవాడు - సర్వ ప్రకారములను ఎఱిగినవాడు. అతనికి జ్ఞానమయమైన తపస్సు కలదు'[34] అనియు, ఆ పురుషోత్తమునికి ప్రకృతియును, జీవుడును, మృత్యువును శరీరభూతములు. అతడు సర్వ భూతములందు ఉండునట్టి అంతరాత్మ[35] అనియును శ్రుతి వాక్యములు చెప్పుచున్నవి." — (శ్రీభాష్యము 1-1-5)

అచేతన మగు ప్రకృతికి, చేతన ధర్మ మగు (ఈక్షితృత్వము) ఈక్షణము గౌణ మని చెప్పుట యుక్తము కాదని చెప్పుచు, జగత్కారణముగా చెప్పబడిన 'సత్తు'ను దెలుపుటకై శ్రుతియందు ఆత్మ శబ్దము ప్రయోగింపబడిన దని ఇట్లు వివరించియున్నారు :-

"తత్తేజ ఐక్షత' - ఆ తేజస్సు చూచెను. 'తా - ఆప ఐక్షన్త' - ఆ ఉదకములు చూచెను. ఇత్యాది ఉత్తర వాక్యములను గౌణార్థమున ప్రయోగింపబడిన 'ఈక్షతి' ధాతువు గూడ సృష్టికి పూర్వపు అవస్థా విశేషమును తెలియజేయునదియై, గౌణార్థమునందే ప్రయోగింపబడిన దని పూర్వపక్షి వాదించిన వాదమును యుక్తమైనది కాదు. ఎట్లనిన, 'ఈ ప్రజ లందరును సత్తు వలన గలిగినవారు సత్తు ఆధారముగా గలవారు. సత్తు ప్రతిష్ఠగా గలవారు అనగా, సత్తునందు లయము పొందువారు. ఇది యంతయు సచ్ఛబ్దవాచ్యుడే ఆత్మగా గలది. ఇది సత్యము. ఆతడే ఆత్మ'[36] అనుటచే, చేతనాచేతన ప్రపంచము వ్యాపించి, దాని

33 పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే। స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ॥ (శ్వే.ఉ 6-7)

34 యః సర్వజ్ఞః సర్వవిత్। యస్య జ్ఞానమయం తపః॥ (ముం.ఉ. 1-1-9)

35 యస్యావ్యక్తం శరీరం, యస్యాక్షరం శరీరం।
యస్య మృత్యుః శరీరం, ఏష సర్వభూతాంతరాత్మా॥ (సు. ఉ.7)

రాత్మగా నుపదేశింపబడినది కేవలము అచేతన పదార్థమగునేని, అట్టి ఉపదేశము పొసగదు ” — ( శ్రీభాష్యము 1-1-5 )

అంతేకాక, తేజస్సు, ఉదకము, పృథివి మొదలగు పదార్థములకును, పరమాత్మయే ఆత్మ కావున, తేజ శ్శబ్దము మున్నగునవియును పరమాత్మ వాచకము లని చెప్పబడినది. 'సృష్టికి పూర్వము 'ఆత్మ' ఒక్కటియే ఉండెను. మరి యొక ఏదియును లేదు. ఆ 'ఆత్మ' ప్రజలను సృజించుటకై సంకల్పించి, ఈ ప్రజ లందరిని సృజించెను'[37] అనియు, పరమాత్మనుండి ఆకాశము, ఆకాశ శరీరు డగు పరమాత్మ నుండి వాయువు పుట్టెను. వాయు శరీరు డగు పరమాత్మనుండి అగ్ని పుట్టెను. అగ్ని శరీరు డగు పరమాత్మనుండి ఉదకము పుట్టెను. ఉదక శరీరు డగు పరమాత్మ నుండి పృథివి పుట్టెను'[38] అనియు జగ త్సృష్టిని ప్రతిపాదించు వాక్యములు సహితము సర్వేశ్వరుని జగత్కారణముగా చెప్పుచున్నవి. 'పరమాత్మ శరీరుడుగా 'తేజస్సు, ఉదకము, పృథివి' అను వానిలో ప్రవేశించి, వీని నామ రూపములను ప్రకటింపజేయుచున్నాను'[39] అని పరమాత్మ వానిలో అంతరాత్మగా

36. స న్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజా స్సదాయతనాః
స త్ప్రతిష్ఠాః। ఐత దాత్మ్య మిదం సర్వం త త్సత్యం స ఆత్మా॥
(ఛాం ఉ 6-8-6)

37 ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర - ఆసీత్। నాన్య త్కించ న మిషత్।
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమా ల్లోకా న సృజత॥
(ఐ ఉ. 1-1-1)

38 తస్మా ద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః। ఆకాశా ద్వాయుః।
వాయో రగ్నిః। అగ్నే రాపః। అద్భ్యః పృథివీ॥ (తై ఆ 1)

39 హన్తాహ మిమా స్తిస్రో దేవతా। అనే నాత్మనాఽనుప్రవిశ్య।
నామరూపే వ్యాకరవాణి॥ (ఛాం ఉ 6 1-3)

సంకల్పించుటచేతనే అవి పదార్థములుగాను నామ రూపములును గలిగి యుండునవిగా నుండుచున్న వని శ్రుతులు తెలియజేయుచున్న వని, 'తత్తేజ ఐక్షత', 'తా ఆప ఐక్షంత' మొదలగు సందర్భములందు చెప్పబడిన 'ఈక్షణము' ముఖ్యమైనదే అని విశదీకరించియున్నారు

సచ్ఛబ్దవాచ్య మగు 'బ్రహ్మము', 'సంకల్పించినది' అని ప్రతిపాదింపబడియుండుటచేత, అది చైతన్య గుణములతో కూడుకొన్నట్టిదే అని, అచేతన మగు ప్రకృతి కాదని, అందుచేత సచ్ఛబ్ద వాచ్య మగు బ్రహ్మము అన్ని పదార్థములలో ఆత్మగా ప్రవేశించి, వానికి నామ రూపములను గావించినవా డనియు, సర్వజ్ఞ డనియు, సర్వశక్తు డనియు, సర్వమున కాధారభూతు డనియు, అపహతపాప్మత్వాది గుణములు గలవా డనియు, సత్యకాము డనియు, సత్యసంకల్పు డనియు చెప్పబడినది. ఈ ఈక్షణ గుణ యుక్తు డగు పరమాత్ముడు నిఖిల హేయ ప్రత్యనీక నిరతిశయానంద యుతు డని తెలియును, శ్రుతులయందు ఆ 'ఆనందము' నూరు నూరు రెట్లు చెప్పబడిన గణించి చెప్పి, నిరతిశయానందయుతుడు ఆనందమయు డగు పరమాత్మయే అని వివరింపబడిన దని తెలియజెప్పియున్నారు :—

" తైత్తిరీయులు - 'స వా ఏష పురుషోఽన్నరసమయః' అని ఆరంభించి, అన్నరసమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞాన మయులను చెప్పి, పిమ్మట - 'ఈ విజ్ఞాన మయునికంటె వేరుగ లోపల నుండునట్టి ఆత్మ ఆనందమయుడు'[40] అని పఠించుచున్నారు "

(శ్రీభాష్యము . 1-1-13)

---

40. తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయాదన్యోఽన్తర ఆత్మా ఆనందమయః॥

(తై. ఉ 5)

తైత్తిరీయోపనిషత్తునందు మొదట - 'అన్నమయ శరీరమే పర మాత్మ' అని ఉపదేశింపబడినది. తరువాత - అంతరంగముగా గల ప్రాణ మయ, మనోమయ, విజ్ఞానమయ కోశములను 'పరమాత్మ' అని తెలిపి, అన్నిటి యంతరమున ఆనందమయ మున్నట్లు బోధించు చున్నది, ఈ ఆనందమయుని లోపల, మ రెవ్వ రున్నట్లు చెప్పక పోవుటచేత, అతడే పరమాత్మ యని తెలియుచున్నది ఈ ఆనంద మయ వ్యాఖ్యను 'జీవాత్మ' అని తోచుచున్నను, సర్వాంతరత్వము శ్రుతి వాక్యము వలన వానికి కలుగుచుండుటచేత, అతడు 'పర మాత్మయే' అని నిర్ధారింపబడినది.

'త దైక్షత' అను శ్రుతి వాక్యము ననుసరించి జగత్కారణ ముగ ప్రతిపాదింపబడిన 'పరబ్రహ్మము' - అన్నమయు డని, ప్రాణ మయు డని, మనోమయు డని, విజ్ఞానమయు డని తెలియజేసి, తరు వాత, 'ఆనందమయు' డని తెలియజేయబడినది. ఈ ఆనందము - 'ఏ తత్త్వము నుండి మనస్సులతో సహా వాక్కులు మరలుచున్నవో, అట్టి బ్రహ్మానందమును పొందినవాడు.'41 అను శ్రుతి ననుసరించి - 'మనుష్యానందము' మొదలుకొని, 'బ్రహ్మానందము' వరకు గల ఆనం దములను - ఒకదానికంటె మరొకటి నూరు రెట్లధిక మని, బ్రహ్మా నందము అవాఙ్మనసగోచర మని తెలియుచున్నది అందువలన, అపరిమితానంద యుతుడు పరబ్రహ్మమె యని, ఆనందమయ శబ్ద ముచే బోధింపబడువాడు 'పరబ్రహ్మమే' అని విశదీకరింపబడినది :-

" ఆనందమయుడు పరమాత్మయే. ఎందు కనగా - శ్రుతులయందు - 'బ్ర హ్మానందమును గురించి విచారింపబడును' అని ఆరంభించి, 'యతో వాచో నివ

41. యతో వాచో నివర్తంతే। అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రహ్మణో విద్వాన్॥ (తై. ఆ 9)

రంతే' అను వాక్యము వలను, నూరు నూరు రెట్ల వంతున లెక్కించి, క్రమముగా అతిశయింప, చివరకు అంతకు మించిన వేదియును లేనట్టిదిగా చెప్పబడిన ఆనందము, అనంత దుఃఖ మిశ్రితమును, పరిమిత స్వల్ప సుఖము గల జీవునియం దుండుట అసంభవ మగుచు, నిఖిల హేయ ప్రత్యనీకుడు, కల్యాణైకతానుడును, సకలేతర విలక్షణుడును అగు పరమాత్మయే కలిగియుండునా దని తెలియచేయ బడుచున్నది అందుచేత, శ్రుతులను - 'ఈ విజ్ఞాన మయుని కంటె వేరుగ లోపల నుండునట్టి ఆత్మ ఆనంద మయుడు'[42] అని చెప్పుచున్నవి ఇట విజ్ఞాన మయు డనగా జీవుడు. ఈ విజ్ఞాన మయ శబ్దము బుద్ధి మాత్రమును చెలుపునది కాదు. ఎందుచేత ననగా 'విజ్ఞాన మయ' శబ్దమునం దుండు 'మయట్' ప్రత్యయము - విజ్ఞాన మయుడు కేవలము విజ్ఞాన మాత్రము కంటె వేరై నవా దని తెలుపుచున్నది ఏ రాక గతి లేకపోవుటచేత, ప్రాణమయ శబ్దమునం దుండుదానివలె, అర్థము లేనిది అని చెప్పుట న్యాయము కాదు. బద్ధావస్థయందు గాని, ముక్తావస్థయందుగాని ప్రత్యగాత్మ జ్ఞానము కల దని చెప్పియున్నాము కదా! ప్రాణ మయాది శబ్దములం దుండు 'మయట్' ప్రత్యయమున కర్థము గల పసు విషయమునుగూర్చి ఇక మీద చెప్పబడును "

'మయట్' ప్రత్యయమును గూర్చి వివరించుచు శ్రీ భాష్య కారులు - 'మయట్' ప్రత్యయము వికార పరముగ ప్రయోగింప బడినట్లు కనబడుచున్నను - 'ఆనంద మయః' - 'ఆనంద వికారము' అను విధముగ అర్థము గ్రహింపదగి యున్న దని చెప్పియున్నారు ఎందుచేత ననగా - 'మయట్' శబ్దము వికారార్థమునందే కాక, ప్రాచుర్యార్థమునను - అనగా, 'అధికమైనది', 'నిండినది' అను అర్థము నను ప్రయోగింప బడుట సంభవ మని చెప్పిరి 'జల మయము', 'అన్న మయము' - "అన్న మయో యజ్ఞః" అన్న సమృద్ధి గల యజ్ఞము, "శకట మయో యాత్రా" 'శకట సమృద్ధి గల యాత్ర'

42. తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యోఽంతర ఆత్మా ఆనందమయః॥
(తై. 5)

అని ఉదాహరించియున్నారు. 'ఆనంద మయుడు' అనగా - 'ఆనంద ప్రచురుడు' - ఆనందముతో నిండినవాడు' అని అర్థము. 'ప్రాణ మయ' శబ్దార్థమును గూర్చి విచారించునపుడు - 'మయట్' ప్రత్యయము 'వికార పరముగ' చెప్పినచో, ప్రాణ మయ మనగా - ప్రాణ వికారము (ప్రాణముతో చేయబడినది) అనెడి అర్థము కానేరదని, శ్రుతులలో వాయువు ప్రాణాపానాది పంచ వృత్తులలో - 'ప్రాణ వృత్తి' అధిక మగుట వలన, 'ప్రాణమయాత్మ' ప్రాణ మయు డను పేరుచే వ్యవహరింపబడుచున్నందు వలన, ప్రాచుర్యార్థముననే ప్రయోగ మని వివరింపబడినది.

అపహత పాప్మ త్వాది ప్రమాణాంతరములు పరబ్రహ్మము నందు దుఃఖాదు లేవియు లేవని, తెలియజేయుచున్నందున, బ్రహ్మము నందు ఆనందాధిక్య ముండుటయు, బ్రహ్మానందము మనుష్యానందము కంటె ఎన్నో రెట్లు గొప్పదై యుండి, ఇక దానిని మించినది మ రేదియు లేకుండుటయు సంభావ్య మని చెప్పి, ఈ ఆనందమయు డగు 'పరబ్రహ్మము' జీవులకు ఆనందము కలుగజేయువా డని శ్రుతులు చెప్పుచుండుట వలన, ఆనంద మయు డగు పరమాత్మ - జీవుల కంటె వేరైనవా డని తెలియజేయబడినది.

ఆదిత్యునియందు హిరణ్మయుడైన పురుషుడు దర్శింపబడు చున్నట్లు చెప్పబడినది.[43] నేత్రమునందు పురుషుడు ధ్యానింపబడు చున్నట్లు చెప్పబడినది.[44] ఆదిత్యునిలోను, నేత్రమునందును ఉన్నట్లు

43. అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే॥ (ఛాం. ఉ 1-6-6 7)

44 అథ య ఏషోఽన్తరక్షిణి పురుషః. (ఛాం. ఉ 15-1)

తెలియఁబడు పురుషుడు పరమాత్మయే అని చెప్పబడినది. అట్టి పురుషుడు జీవుని కంటె వేరైనవాడని, అపహత పాప్మ డని తెలియ చేయఁబడినది. అపహత పాప్మ డనగా - అపహత కర్మ డని, అట్టి వాడు ఎంత మాత్రము పుణ్య పాప రూప మగు కర్మలకు వశ్యుడు గాడని,[45] పుణ్య పాప కర్మాన గుణముగా సుఖ దుఃఖము లనుభవించుచున్నవారు జీవు లైనందున, జీవులు కర్మవశ్యు లైనందున, అపహత పాప్మముగా నుండుట జీవుని కంటె వేరైనవాడగు పరమాత్మ ధర్మమే అని వివరింపబడినది. అంతే కాక, ఈ అపహత పాప్మత్వము వలన నుండునవియైన లోక కామేశత్వము, లోకేశ్వరత్వము, సత్య సంకల్పత్వము, సర్వ భూతాంతరాంతత్వము మొదలగు స్వాభావిక గుణములు పరమాత్మకు మాత్రమే సంభవములు. అటులనే, 'ఈ పరబ్రహ్మము - అపహత పాప్మడు, జరా మరణములు లేనివాడు, శోకము లేనివాడు, సత్య కాముడు, సత్య సంకల్పుడు'[46] అనియు, 'ఈ సర్వ భూతాంతరాత్మకుడై, అపహత పాప్మడైన దివ్య దేవుడు నారాయణు డొక్కడే'[47] అను శ్రుతి వాక్యములు - అపహత పాప్మాది గుణములు గలవాడు నారాయణు డను పరమాత్మయే అని తెలుపుచున్నవి. మరియు, 'ఆ బ్రహ్మము తాను బహు రూపముల జనింప గలను అని సంకల్పించినది'[48] అను శ్రుతి వాక్యము ననుసరించి,

---

45 స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః. (ఛాం ఉ. 1-6-7)

46 ఏష ఆత్మా ఽపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సో ఽపిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః (ఛాం. ఉ. 8-1-5)

47 ఏష సర్వభూతాన్తరాత్మా అపహత పాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః. (సు ఉ. 7)

48 సో౽కామయత బహుస్స్యాం ప్రజాయేయేతి (తై. ఆ 6)

సత్య సంకల్పత్వ పూర్వకముగ, సమస్త చిదచిత్పదార్థములను సృజించుట ఏ ఉపాధి లేకయే నిగ్రహానుగ్రహములకు హేతువగుటయు, వాక్కు మొదలగు ఇంద్రియములచే గాని, మనస్సుచే గా ఇంతమాత్ర మని నిర్ధారణ చేయుటకు అలవి గాకుండుటయు, మితిలే ఆనందమును గలిగియుండుటయు ఇత్యాది కర్మ సంపాద్యములు గా స్వాభావిక ధర్మములు జీవునియం దుండుట ఎంతమాత్రము సం వము కానందున, ఆదిత్యాంతర్వర్తి యగు వాడు 'పరబ్రహ్మమే' అని విశదీకరింపబడినది. ఈ సందర్భమును ఉదహరించుచు శ్రీమద్రామానుజ సంయమీంద్రులు —

" సర్వేశ్వరుడు నిఖిల హేయ ప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూ పుడగుటచేత, సకలేతర పదార్థములకంటె విలక్షణుడు. ఆయనకు స్వాభావికానవ ధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణములు కలవు. ఆ విధముగనే స్వాభిమతా నురూపమైనట్టియు, ఏక రూపమైనట్టియు, అచింత్య దివ్యాద్భుత నిత్య నిరవ ద్య నిరతిశయ ఔజ్జ్వల్య సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవనా ద్యనంత కల్యా ణ గుణగణ నిధి యైనట్టియు, దివ్య రూపము గూడ ఆయనకు స్వాభావిక ముగా యున్నట్టిది. ఆయన ఉపాసకుల ననుగ్రహించుటకై, వారి వారి జ్ఞానమున అనుగుణ్య మగు శరీరమును స్వయముగ గ్రహించునట్టి అపార కారుణ్య సౌశీ వాత్సల్య ఔదార్య జలనిధి. నిరస్త నిఖిల హేయ గంధుడు అపహత పాప్మ పరమాత్ముడును, పరబ్రహ్మమును, పురుషోత్తముడును, నారాయణుడైనవా డు. విషయమును నిరూపించు ప్రమాణములేవియన - ఎవనినుండి ఈ భూతము ఉదయించుచున్నవో,[49] సృష్టికి పూర్వము ఈ జగత్తు అంతయు సత్తుగ నుండెను

---

49 యతో వా ఇమాని భూతాని జాయన్తే. (తై ఉ

50. సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ (ఛాం. ఉ 6-2-1-

సృష్టికి పూర్వము ఈ జగమంతయు పరమాత్మ ఒక్కడుగానే యుండెను [51] చతుర్ముఖ బ్రహ్మయు, శివుడును, పృథివి, అంతరిక్షము అనునవి ఏవియు ఉండలేదు. నారాయణుడు ఒక్కడు మాత్రమే ఉండెను [52] వికారము పొందనిది, జ్ఞాన సంకోచము లేనిది, పరిచ్ఛిన్నము కానిదియు పరబ్రహ్మము [53] జ్ఞాన స్వరూపుడును, ఆనంద మయుడును బ్రహ్మము'[54] అను వాక్యముల ద్వారా - జగత్కారణు డగు పరబ్రహ్మము యొక్క స్వరూపము ఇట్టిది అని తెలియు చున్నది పరబ్రహ్మము హేయ గుణములు లేనివాడు (నిర్గుణం) వికార రహితుడు (నిరంజనం), అపహత పాప్ముడు జరా మరణములు లేనివాడు సత్య కాముడు, సత్య సంకల్పుడు.[55] అట్టి పరబ్రహ్మమునకు ప్రాకృత శరీరమును, ఇంద్రియములును లేవు. ఆయనతో సమానుడును, ఆయనకంటె ఎక్కువవాడును లేరు. ఆయనకు నానావిధమై, ఉత్కృష్ట మగు శక్తియు కలదు మరియు, ఆయనకు స్వాభావికము లగు బలమును, క్రియయును గలవు [56] ఆ పరబ్రహ్మము ఈశ్వరు లందరిలో గొప్ప ఈశ్వరుడు. దేవతలలో అగ్రగణ్యుడు ఆయన కారణ భూతుడు. ఇంద్రియాధ్యక్షు

---

51 ఆత్మా వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్. (ఐ. ఉ.1-1-1)

52. ఏకో హ వై నారాయణ ఆసీత్। న బ్రహ్మా నేశానో. నే ద్యావా పృథివీ
(మహానారా. 1-1)

53 సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ (తై. ఆ. 1)

54 విజ్ఞాన మానందం బ్రహ్మ (బృ.ఉ 5-9-28)

55 అపహత పాప్మా విజరో, విమృత్యు ర్విశోకో
విజిఘత్సో ఽపిపాస స్సత్యకామ స్సత్య సంకల్పః (ఛాం. ఉ. 8-1-5)

56. న తస్య కార్యం కరణం చ విద్యతే। న త త్సమశ్చా భ్యధిక శ్చ దృశ్యతే।
పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే । స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ॥
(శ్వే ఉ. 6-8)

లగు జీవులకు అధిపతి. ఆయనను పుట్టించువాడును, ఆయనకు అధిపతియును ఎవ్వడును లేడు.[57] సర్వజ్ఞు డగు సర్వేశ్వరుడు, సమస్తము లగు రూపములను ధ్యానించి నామములను కూడ అట్లే కలుగజేసి, వానితో నిలుచుచున్నాడు.[58] మాత్మ ప్రకృతి యొక్క స్పర్శ లేనివాడును, సూర్యుని వలె ప్రకాశించుచున్నవాడును, గొప్పవాడును అగు పురుషుని నేను ఉపాసించుచున్నాను.[59] సమస్త కాలములును, ఈ మెరుపు వలె ప్రకాశించుచున్న పురుషుని వలన బుట్టినవి[60] అని ఈ విధముగ జెప్పుచు, పరబ్రహ్మమునకు ప్రకృతి సంబంధములగు హేయ గుణములను, ప్రకృతి సంబంధముచే హేయ మగు దేహ సంబంధమును, అందు వలన కర్మవశ్యుడుగా నుండుటను ప్రతిషేధించి (పరబ్రహ్మమునకు లేవని తెలిపి), ఆయనకు కల్యాణ గుణములును, కల్యాణ స్వరూపమును గలవని తెలుపుచున్నవి. ఇది పరబ్రహ్మము యొక్క స్వాభావికమైన రూపము. పరమ కారుణికు డగు భగవంతుడు - ఇట్టి స్వాభావికమైన రూపమును భక్తుల ననుగ్రహించుటకు వారి వారి ఉపాసనకు అనుగుణముగ, దేవ మనుష్యాది ఆకారములను తన సంకల్పముచే కలుగజేయుచున్నాడు. అందువేత, పరమేశ్వరుడు కర్మ వశమున జీవుల వలె పుట్టుక లేనివాడైనను, భక్తుల ననుగ్రహించుటకై తన సంకల్పము వలన బుట్టుచున్నాడు'[61] అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది. శ్రీమద్భగవద్గీత యందున - 'కర్మ వశమున గలుగు పుట్టుక లేని స్వభావము గలవాడ నగుచు, భూతములకు ఈశ్వరుడ నగుచు, నా స్వభావమును అధిష్ఠించి, నా సంకల్పముచే

57 త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దైవతానాం పరమం చ దైవతమ్
న కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చి జ్జనితా న చాధిపః
(శ్వే. ఉ 6-7)

58. సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివద న్యదాస్తే. (పు సూ)

59. వేదాహ మేతం పురుషం మహాన్త మాదిత్య వర్ణం తమసః పరస్తాత్
(పు సూ)

60. సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి. (తై నా. 1)

61 అజాయమానో బహుధా విజాయతే. (పు సూ)

...త్తులను రక్షించుటకును, దుష్టులను శిక్షించుటకును ప్రతి యుగమున పుట్టుచున్నాను'[62] అని, భగవంతుడు స్వయముగ జెప్పియున్నాడు ”

— (శ్రీభాష్యము 1-1-21)

అని విశదీకరించియున్నారు.

ఛాందోగ్యమున జగత్కారణ మని పేర్కొనబడిన ఆకాశము పరబ్రహ్మమే అని చెప్పబడినది అందు - 'ఈ లోకమునకు గతి ఏది'? అను ప్రశ్నకు-'ఆకాశము' అని సమాధానము చెప్పబడినది.[63] 'ఈ సమస్త భూతములు ఆకాశము నుండియే పుట్టుచున్నవి. ఆకాశమునందే లీన మగుచున్నవి ఈ భూతము లన్నింటి కంటెను ఆకాశమె పెద్దది. అందుచేత, ఆకాశమే ఈ భూతము లన్నింటికిని ఆశ్రయము'[64] అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది. ఇచటి 'ఆకాశ' శబ్దమునకు - 'పరబ్రహ్మము' అని అర్థము ఆకాశ మనగా - 'తనకు తాను ప్రకాశించునది - సర్వమును ప్రకాశింప జేయునది' అను శబ్ద వ్యుత్పత్తి ననుసరించి, 'స్వయముగ ప్రకాశించునది, ఇతర వస్తువులను ప్రకాశింపజేయునది' అని అర్థమగుచున్నది. పరబ్రహ్మము సర్వ

62 అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ (భ గీ. 4-6, 8)

63. అస్య లోకస్య కా గతి రితి ఆకాశ ఇతి హోవాచ. (ఛాం. ఉ. 1 9-1)

64. సర్వాణి హ వా ఇమాని భూతా న్యాకాశా దేవ సముద్యంతే। ఆకాశం ప్రత్యస్తంయన్తి ఆకాశోహ్యేవైభ్యో జ్యాయాన్ ఆకాశః పరాయణమ్॥
(ఛాం ఉ. 1-9-1)

లగు జీవులకు అధిపతి. ఆయనను పుట్టించువాడును, ఆయనకు అధిపతియును ఎవ్వడును లేడు.[57] సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడు, సమస్తము లగు రూపములను ధ్యానించి నామములను కూడ అట్లే కలుగజేసి, వానితో పిలుచుచున్నాడు.[58] మహత్తు ప్రకృతి యొక్క స్పర్శ లేనివాడును, సూర్యుని వలె ప్రకాశించుచున్నవాడును, గొప్పవాడును అగు పురుషుని నేను ఉపాసించుచున్నాను.[59] సమస్త కాలములును, ఈ మెరుపు వలె ప్రకాశించుచున్న పురుషుని వలన పుట్టినవి[60] అని ఈ విధముగ చెప్పుచు, పరబ్రహ్మమునకు ప్రకృతి సంబంధములగు హేయ గుణములను, ప్రకృతి సంబంధముచే హేయ మగు దేహ సంబంధమును, అందు వలన కర్మవశ్యుడుగా నుండుటను ప్రతిషేధించి (పరబ్రహ్మమునకు లేవని తెలిపి), ఆయనకు కల్యాణ గుణములును, కల్యాణ స్వరూపమును కలవని తెలుపుచున్నవి. ఇది పరబ్రహ్మము యొక్క స్వాభావికమైన రూపము. పరమ కారుణికుడగు భగవంతుడు - ఇట్టి స్వాభావికమైన రూపమును భక్తుల ననుగ్రహించుటకు వారి వారి ఉపాసనకు అనుగుణముగ, దేవ మనుష్యాది ఆకారములను తన సంకల్పముచే కలుగజేయుచున్నాడు. అందువలన, పరమేశ్వరుడు కర్మ వశమున జీవుల వలె పుట్టుక లేనివాడైనను, భక్తుల ననుగ్రహించుటకై తన సంకల్పము వలన పుట్టుచున్నాడు'[61] అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది. శ్రీమద్భగవద్గీత యందున - 'కర్మ వశమున గలుగు పుట్టుక లేని స్వభావము గలవాడ నగుచు, భూతములకు ఈశ్వరుడు నగుచు, నా స్వభావమును అధిష్ఠించి, నా సంకల్పముచే

---

57 తమీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దైవతానాం పరమం చ దైవతమ్
న కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః
(శ్వే. ఉ 6-7)

58. సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వాఽభివదన్ యదాస్తే. (పు సూ)

59. వేదాహమేతం పురుషం మహాంతమాదిత్యవర్ణం తమసః పరస్తాత్
(పు సూ)

60. సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి. (తై నా. 1)

61 అజాయమానో బహుధా విజాయతే. (పు సూ)

హించినవి కాక, కేవలము పరబ్రహ్మమునకే సంబంధించి యున్నందున, ఇగిత్యాకారణముగ చెప్పబడిన ఆకాశము 'పరబ్రహ్మమే' అని తెలియ చెప్పబడినది.

'ఆకాశ' శబ్దము భూతాకాశమును గాక, పరమాత్మను తెలుపునది యైనట్లే, 'ప్రాణ' శబ్దము గూడ పంచ వృత్త్యాత్మక మగు ప్రాణ వాయువును తెలుపునది కాక, తద్వ్యతిరిక్త మగు పరమాత్మను తెలియ జేయునది యని వివరింపబడినది. ప్రళయ కాలమున ప్రాణు లన్నియు - 'ప్రాణము' నందు ప్రవేశించుచున్నవి. సృష్టి సమయమున అవి ప్రాణమునుండి 'బయలు వెడలుచున్నవి'[65] అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది. శిలా కాష్ఠాది పదార్థములును, చేతన స్వరూపమును, పంచ వృత్త్యాత్మక మగు ప్రాణ వాయువునందు ప్రవేశించునవిగాను, దాని నుండి నిష్క్రమించునవిగాను కనబడు చుండవు. అందుచేత, ఇచట ప్రాణ శబ్దముచే వివక్షితమైనది ప్రాణవాయు వనుట యుక్తము కాదని చెప్పి, శ్రీభాష్యకారులు -

" కాబట్టి, 'ప్రాణ యతి సర్వాని భూతాని' అనగా - 'సమస్త భూతముల యొక్క ప్రాణన వ్యాపారమును జేయించునది' అను శబ్ద వ్యుత్పత్తిని బట్టి, ఇచట ప్రాణ శబ్దము పరమాత్మ పరము ఈ హేతువులను బట్టి, ఆకాశ ప్రాణాది శబ్ద వాచ్యము - లోక ప్రసిద్ధము లగు భూతాకాశ ప్రాణ వాయ్వాదుల కంటె వేరై నట్టియు, నిఖిల జగదేక కారణత్వము, అపహత పాప్మత్వము, సార్వజ్ఞత్వము, సత్య సంకల్పత్వము - ఇత్యాది అనంత కల్యాణ గుణ గణములతో కూడుకొనిన పరబ్రహ్మమే సిద్ధ మగుచున్నది " — (శ్రీభాష్యము 1-1-24)

అని వివరించియున్నారు.

---

65. సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణ మేవాభిసంవిశంతి ప్రాణ మభ్యుజ్జిహతే. (ఛాం. ఉ 1-11-5)

‘జ్యోతిస్సు’ అనుపదము పరమాత్మకు సర్వభూతములు పాదముగా చెప్పబడియుండుటవలన, జ్యోతి శ్శబ్ద వాచ్యుడు సర్వేశ్వరుడు’[66] అను బ్రహ్మసూత్రమును శ్రీభాష్యకారులు ఈ విధముగ వివరించియున్నారు :—

" ఈ ద్యులోకమున కంటె మీదుగా ఏ జ్యోతిస్సు ప్రకాశించుచున్నదో, ఏ జ్యోతిస్సు ప్రాణివర్గము మీదను, భూలోకము మీదను, అంతకంటె విశిష్టము లగు సమస్త లోకముల మీదను ప్రకాశించుచున్నదో, ఆ జ్యోతిస్సే పురుష శరీరము నందును ప్రకాశించుచున్నది’[67] అను శ్రుతి వాక్యమున, ద్యులోక సంబంధిగా చెప్పబడిన ‘జ్యోతిస్సు’ పరమ పురుషుడే అని వివరించియున్నారు. ఎందుచేత ననగా - ‘జ్యోతిస్సు’ యొక్క ఒక పాదము ఈ వ్యక్తమైన ప్రపంచము. దీని యొక్క మిగిలిన మూడు పాదములు ద్యులోకమున నున్నవి[68] - అని, శ్రుతి - సమస్త భూతజాలము ఈ ద్యులోక సంబంధి యగు పురుషుని యొక్క పాద మని తెలుపుచున్నది. ద్యులోక సంబంధి యగు జ్యోతిస్సునకు జఠరాగ్నితో ఐక్యము చెప్పబడినది. అందులకు దృష్టాంతముగ నేను వైశ్వానరుడను జఠరాగ్నినై ప్రాణుల దేహమును ఆశ్రయించియున్నాను’[69] - అని భగవంతుడే స్వయముగ ఉపదేశించి యున్నాడు. " (శ్రీభాష్యము 1-1-27)

---

66. జ్యోతిశ్చరణాభిధానాత్. (బ్ర. సూ. 1-1-25)

67. అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠే ష్వనుత్తమేషూత్తమేషు లోకే ష్విదం వావ తద్యదిద మస్మి న్నన్తః పురుషే జ్యోతిః. (ఛాం. ఉ. 3-13-7)

68. పాదో ఽస్య విశ్వా భూతాని త్రిపా దస్యామృతం దివి. (ఛాం. ఉ. 3-12-6)

69. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః. (భ.గీ 15-14)

ఈ విధముగా ద్యులోక సంబంధిగా చెప్పబడినవాడును, జఠరాగ్ని రూపమున ప్రాణుల దేహములను ఆశ్రయించియున్నవాడును 'పరబ్రహ్మము' అని తెలియుచున్నది.

'ఇంద్ర' శబ్దము, 'ప్రాణ' శబ్దమును పరబ్రహ్మ వాచకములని చెప్పబడినది. దివోదాసుని కుమారుడు ప్రతర్దనుడు. ఇతడు యుద్ధరంగమున ప్రతాపము చూపుటచే, ఇంద్రుని ప్రియ మందిరమును చేరుకొనెను.[70] అప్పుడు ఇంద్రుడు ఏదేని వరమును కోరుకొను మనెను. అందువలన ప్రతర్దనుడు - మనుష్యున కేది హితమని నీవు తలంతువో, దానిని ప్రసాదింపు[71] మనెను. అప్పుడింద్రుడు- 'నేను ప్రాణ స్వరూపుడను ప్రజ్ఞాత్మను ఇట్టి నన్ను ఆయుస్సును గాను, అమృత స్వరూపుని గాను ఉపాసింపుము'[72] అని ఉపదేశించెను. ఇచట 'ప్రాణ' శబ్దముచేత ఇంద్రుడే బోధింపబడుచున్నట్లు తోచుచున్నను, 'ప్రాణ' శబ్దముచేత 'పరబ్రహ్మమే' బోధించుచున్నది కాని, ఇంద్రుడు కాదని తెలియచెప్పబడినది:-

" ఇచట ఇంద్రుడనియు, ప్రాణమనియును చెప్పబడినవాడు జీవమాత్రుడు కాడు అయినచో, ఆతడు జీవునికంటె వేరగు పరబ్రహ్మమే ఎట్లనిన, 'ఆ ప్రాణ మనబడువాడు ప్రజ్ఞాత్మ, ఆనంద స్వరూపుడు ముసలితనము లేనివాడు.

70. ప్రతర్దనో హ వై దైవోదాసి రింద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేన చ పౌరుషేణ (కౌ. ఉ. 3-11)

71 త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే (కౌ. ఉ. 3)

72 ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మా మాయు రమృత మిత్యుపాస్స్వ. (కౌ. ఉ. 3)

అమృత స్వరూపుడు'[73] అని శ్రుతి వాక్యము చెప్పుచున్నది ఇంతకు పూర్వము ఇంద్ర' శబ్దముచే చెప్పబడినవాడు పరబ్రహ్మమైన పక్షముననే, ఆతనిని ఆనంద మయునిగ, జరా రహితునిగ, అమృత స్వరూపునిగను చెప్పుట - అనుపపన్న మగును " — (శ్రీ భాష్యము 1-1-29)

అని - ఆనంద మయుడైనవాడ, జరా మరణ రహితుడైనవాడు పరబ్రహ్మము' కావలయునుగాని, ఇంద్రుడు గాని, ప్రాణము గాని కాజాలడని తెలియచేయబడినది.

'నేను ప్రాణము. నన్ను ఉపాసింపుము' అని ఇంద్రుడు ఉపదేశించినను, 'ప్రాణ' శబ్దము ఇంద్రుని బోధింపదని చెప్పబడినది. ప్రాణ' శబ్ద వాచ్యుడు లోకాధిపతి, సర్వేశ్వరుడు. ఆయన - ఆనందము, అజరము, అమృతము అని చెప్పబడినందున, ఇట్టి విశేషములు బ్రహ్మమునందే సంగతములై యుండి, ఇంద్రునియందు సంగతము కాకపోవుటచేత, 'ఇంద్ర' 'ప్రాణ' శబ్దములకు 'పరబ్రహ్మ' మనియే అర్థ మని వివరింపబడినది. ఇంద్రుడు ఒక జీవుడైనందున, అతడు మోక్షమునకై తన నుపాసింపు మని ఉపదేశించుట ఎట్లు పొసగు నను విశేషమును శ్రీభాష్యకారులు విశదీకరించుచు -

" జీవులలో నొకడుగ పరిగణింపబడు ఇంద్రుడు - 'నన్నే తెలిసికొనుము నన్ను ఉపాసింపుము' అని తనకు అంతరాత్మ యగు 'పరమాత్మను' ఉపాసింపు మని ఉపదేశించుచున్నాడు. ఈ సందర్భమున, ఇంద్రుడు - ప్రమాణాంతరావగత మగు తన ఆత్మను (అనగా - జీవుని) ఉపాసింపు మని ఉపదేశించుచుండలేదు అయినచో, తన ఆత్మకు ఆత్మగ శాస్త్ర ప్రమాణావగతు డగు 'పరమాత్మను' ఉపాసింపు మని ఉపదేశించుచున్నాడు. ఇందులకు ప్రమాణముగ, 'పరమాత్మ జీవ శరీరుడుగ అన్నింటి యందును ప్రవేశించి, వాని నామ రూపములను ప్రకటింప

73. స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఽఽనందో ఽజరో ఽమృతః. (కౌ. ఉ. 3)

చేయుచున్నాడు'[74] అనియు 'ఇది అంతయును పరమాత్మయే - ఆత్మగా కలది'[75] అనియు, పరమాత్మ అందరి లోపలను ప్రవేశించి, జను లందరిని నియమించుచున్నాడు. 'ఆయన అందరికిని ఆత్మ'[76] అనియు, ఏ పరమాత్మ ప్రత్యగాత్మయందున్నవాడై, ప్రత్యగాత్మలోపల నుండి, ప్రత్యగాత్మచే తెలిసికొనబడక, ప్రత్యగాత్మ శరీరముగా గలవాడై, ప్రత్యగాత్మను లోపలనుండి నియమించుచున్నాడో'[77] అనియును, 'ఈ సర్వేశ్వరేశ్వరుడు జీవు లందరికిని ఆత్మ. అపహత పాప్ముడు ప్రకృతి సంబంధము లేని నారాయణుడు'[78] అని శ్రుతి వాక్యములు చెప్పుచుండుటచే, శాస్త్రమం తంతటను పరమాత్మ, జీవాత్మలు శరీరముగా గలవాడుగా చెప్పబడుట తెలిసికొని, అందువలన, జీవాత్మ వాచకము లగు నేను (అహం) నీవు (త్వం) మొదలగు శబ్దములు, జీవాత్మ శరీరు డగు పరమాత్మను తెలియజేయుట యందే పర్యవసించుచున్న వనియు తెలిసికొనినవాడై, ఇంద్రుడు 'నన్ను (మాం) - నా కంతరాత్మ యగు పరమాత్మను తెలిసికొనుము' అనియును ఉపదేశించెను "

— (శ్రీభాష్యము 1-1-31.)

అని విశదీకరించియున్నారు. శాస్త్ర దృష్టితో విచారించినప్పుడును, వాసుదేవు డనువాడు 'పరబ్రహ్మము' సర్వమునకు అంతరాత్మ యని, సర్వము ఆయనకు శరీర మని, శరీర వాచకము లగు (చేతనాచేత

---

74. అనేన జీవే నాత్మనా ఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి (ఛాం. ఉ. 6-3-2)

75. ఐత దాత్మ్య మిదం సర్వం. (ఛాం. ఉ. 6-8-7)

76. అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా. (యజు)

77. య ఆత్మని తిష్ఠన్ ఆత్మ నోఽన్తరో య మాత్మా న వేద
యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి (బృ. ఉ. 5-7-22)

78. ఏష సర్వ భూతాన్తరాత్మా, అపహత పాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః (సు. ఉ. 7)

నముల) శబ్దములు, శరీరిని (పరబ్రహ్మమును) తెలియజేయుటయందు పర్యవసించుచున్న దని తెలిసికొని, 'నేను' అను శబ్దముచే, తన ఆత్మనే శరీరముగా గల పరమాత్మను నిర్దేశించి, 'నేను మనువు నైతిని, నేను సూర్యుడ నైతిని, నేను కక్షీవంతుడను, నేను బ్రహ్మము నైతిని'[79] అని పలికియున్నా డని వివరించియున్నారు. ఈ దృష్టితోనే ఇంద్రుడును - 'నన్ను ఉపాసింపుము - నేను ప్రాణమై యున్నాను' అని చెప్పియున్నాడని, 'ఇంద్ర - ప్రాణ' శబ్దములచే పరబ్రహ్మమే బోధింపబడుచున్నదని తెలియజేయబడినది.

అందువలన, సమస్త కల్యాణ గుణాత్మకుడును, ప్రకృతి - పురుషుల కంటె వేరైనవాడును, వానితో గూడియున్నవాడును - 'పరబ్రహ్మమును' అగు శ్రీమన్నారాయణుడే జగత్కారణ మని విశదీకరింపబడినది. శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు గమ సూత్ర వ్యాఖ్యానము లందు ఈ విధముగా పరబ్రహ్మ స్వరూపమును ఉపనిషద్వాక్య ప్రామాణ్యముతో విస్పష్టముగ నిర్దేశించియున్నారు. ఉపనిషత్తులలో 'పరబ్రహ్మము' మూడు విధములుగ నిర్ణింపబడు చున్న దనియు - 'శుద్ధ పరబ్రహ్మము, జీవాంతర్యామి పరబ్రహ్మము, అచేతనాంతర్యామి పరబ్రహ్మము' అను మూడు రూపములలోను 'పరబ్రహ్మమును' ఉపాసింపవచ్చు ననియు తెలియజేయబడినది.

## శ్రీమద్రామానుజులు - జీవాత్మ స్వరూపము

'జీవాత్మ' దేహము కంటెను, ఇంద్రియముల కంటెను, మన స్సుకంటెను, ప్రాణముల కంటెను వేరుగా నుండు నని పూర్వా

79 తద్ధైతత్ పశ్యన్ ఋషి ర్వామదేవః ప్రతిపేదే అహం మను రభవం సూర్యశ్చాహం కక్షీవాన్ ఋషి రస్మి విప్రః. (బృ. ఉ. 3-4-10)

చార్యులు తెలిపియున్నారు. అందువలన, దేహము కాని, ఇంద్రియములు గాని, మనస్సుగాని, ప్రాణము గాని, జ్ఞానముగాని 'జీవాత్మ' కా దని, 'ఇరువ దైదవ తత్త్వము పురుషుడు'[80] అను సూక్తి ననుసరించి, వీని కన్నిటికంటె వేరైనది, 'నా' (ఇది నా శరీరము) అని చెప్పబడు వ్యవహారమునకు లోనైన వస్తువే 'జీవాత్మ' అని, దీనివలన శరీరము వే రనియు, 'నా' శబ్దార్థము వే రనియు వివేదీకరింపబడినది.

'జీవాత్మ' అజడమై యుండునని చెప్పబడినది. 'అజడ' మనగా- 'స్వయం ప్రకాశమై యుండుట' అనియు, 'తాను కనిపించుటకు వేరొక వస్తువునకై ఎదురు చూడవలసిన అవసరము లేకుండుటయే స్వయంప్రకాశమై యుండుట' అనియు వివరింపబడినది అందులకు ఉదాహరణముగ - ఒక దీపము ఇంకొక దీపమును అపేక్షింపక యే తన వ్యవహారమునకు తాను హేతు వగుచున్నట్లు, 'జీవాత్మ' జ్ఞానమును గూడ అపేక్షింపక, తానే తోచుచుండుట అజడత్వ మనబడు నని, 'జీవాత్మ' అజడత్వము తెలియజేయబడినది. ఈ జీవాత్మ - ఆనంద రూపమై యుండు ననియును తెలియజెప్పబడినది. తనకు తానే సుఖ రూపమై యుండు జీవాత్మను దెలిసికొనుటకు శాస్త్ర ప్రమాణము అక్కరలేదని చెప్పుచు, నిద్రించి లేచినవాడు - 'నేను సుఖముగా నిద్రించితిని' అని చెప్పుట సర్వ సంప్రతిపన్న మని వివరింపబడినది. "ఆత్మ (జీవాత్మ) జ్ఞానానంద మయ మైనది",[81] (జీవాత్మ) జ్ఞానానందైక లక్షణము (కలది)[82] అను ప్రమాణములును దీనికి ప్రోద్బలకము.

---

80 పంచవింశోఽయం పురుషః.

81 జ్ఞానానందమయ స్త్వాత్మా.

82 జ్ఞానానం దైక లక్షణమ్.

జీవాత్మకు జనన మరణములు లేవనియు, అది నిత్యమైనదనియు చెప్పబడినది. 'జీవుడు పుట్టడు - గిట్టడు'[83] అను శ్రుతి వలనను, 'పుట్టుక లేనివాడు, నాశము లేక యుండువాడు, స్థిర రూపుడు, పురాతనుడైనను క్రొత్తవాడు, దేహము హతము చేయబడుచున్నను, ఈ జీవుడు హతుడు గాడు'[84] అనుట వలనను, 'నిత్యులలో (నిత్యమైన జీవాత్మలలో) నిత్యుడును, చేతనులలో (చేతనులైన జీవాత్మలలో) చేతనుడును, పెక్కండ్రలో (పెక్కండ్రైన జీవాత్మలలో) ఒక్కడును అగు ఎవడు (ఏ పరమాత్ముడు) కోరికల నిచ్చుచున్నాడో'[85] - ఈ మొదలగు శ్రుతుల వలనను, 'ప్రకృతి' - 'పురుషుడు' ఇద్దరును ఆది రహితులు అని తెలిసికొనుము'[86] - అను స్మృతి వలనను, జీవుడు నిత్యుడనియు, సృజింపబడడనియు, చంపబడడనియు, నివరింపబడినది.

'ఈ బ్రహ్మము నుండి ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, పృథివి జనించుచున్నవి'[87] అను శ్రుతి వాక్యము ననుసరించి సృష్టి క్రమము తెలియవచ్చు

---

83 న జాయతే మ్రియతే వా విపశ్చిత్. (కఠ. ఉ 2-18)

84 అజో నిత్యః శాశ్వతో ఽయం పురాణః న హన్యతే హన్యమానే శరీరే (కఠ. ఉ 2-18)

85. నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్ (శ్వే ఉ 6-13)

86. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి. (భ. గీ. 13-20)

87. ఏతస్మా జ్జాయతే ప్రాణః మన స్సర్వేంద్రియాణి చ, ఖంవాయు ర్జ్యోతి రాపః పృథివీ. (కఠ. ఉ. 2-1-3)

చున్నందున జీవాత్మయు, పరమాత్మనుండి పుట్టుచున్నాడని అంగీకరింపవలయునను పూర్వ పక్షమునకు శ్రీ భాష్యకారులు ఈ విధముగ సమాధాన మిచ్చియున్నారు :-

'ఒకదానిని తెలియుటచే సమస్తమును తెలియుట'[88] అను ప్రతిజ్ఞ సిద్ధించుటకు ఆకాశాదులు పరబ్రహ్మమునుండి పుట్టుచున్నావని అంగీకరింపవలయు ననుట యుక్తము కాదు. ఎందుచేత ననగా, 'న జాయతే' ఇత్యాది శ్రుతుల వలన, జీవాత్మ నిత్యుడని స్పష్టమగుచున్నది. అందువలన, అతనికి ఆకాశాదులకు వలె ఉత్పత్తి లేదు. 'ప్రజాపతి ప్రజలను సృజించెను.'[89] మొదలగు జీవోత్పత్తి ప్రబోధక శ్రుతులు - జ్ఞాన గుణకుడైన జీవాత్మ యొక్క జ్ఞాన సంకోచమును 'వినాశ' మనియు, విజ్ఞాన వికాశమును 'ఉత్పత్తి' యనియు బోధించుచున్నవే తప్ప, జీవోత్పత్తిని కాదు. ఎందుచేత ననగా, శ్రుతులు జీవోత్పత్తిని నిషేధించుచున్నవి. జీవులు నిత్యులైనచో - 'సృష్టికి పూర్వము బ్రహ్మ మొక్కటియే యుండినది - రెండవది లేదు'[90] అనుట ఎట్లు పొసగు నని సందేహింప నవసరము లేదు. చేతనాచేతనముల నామ రూప విభాగానర్హ సూక్ష్మ దశను పురస్కరించుకొని, అట్లు చెప్పబడినది. అందుచేతనే, జగత్సృష్టి జీవుల కర్మములను బట్టి యుండుటను గాని, బ్రహ్మమునకు పక్షపాతము, నిర్దయత్వము కలుగవని చెప్పబడినది. 'మంచి పని చేసిన వాడు మంచివాడుగా జన్మించును - పాప కార్యమును చేసినవాడు

---

88. ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానమ్.

89. ప్రజాపతిః ప్రజా అసృజత. (యజు : 2-6)

90. స దేవ సోమ్య ఇద మగ్ర ఆసీత్, ఏక మేవాఽద్వితీయమ్. (ఛాం. ఉ. 6)

పాపిగా జన్మించును'[91] అను శ్రుతి వాక్యము ననుసరించి జీవుల కర్మ మును బట్టి, ఉత్తమ లోక వాసులుగనో, లేక - అధమ లోక వాసులుగనో సృజించుచుండుట వలన, బ్రహ్మము పక్షపాతము కల దని కాని, నిర్దయ కల దని కాని నిర్ణయించుటకు అవకాశము లేదు. కావున, సృష్టికి పూర్వము నామ రూప విభాగములు లేనందున వలన, స దేవ సౌమ్య' అని చెప్పబడినది. కాని, ఆ స్థితియందున, ఆ బ్రహ్మ యందు జీవులు, వాని సంచిత కర్మములు ప్రకృతి సూక్ష్మ రూపమునను న్నవి అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. " అందుచేత, జీవాత్మ సృజింపబడ దని, నిత్యు డనియు తెలియజేయబడినది.

జీవాత్మ తెలిసికొనువా డనియును స్పష్టీకరింపబడినది. 'ఎవడు నేను దీనిని వాసన చూచుచున్నాను - అని తెలిసికొనునో, అతడు ఆత్మ (జీవాత్మ)'[92] అని శ్రుతి చెప్పుచున్నందున, జీవుడు 'జ్ఞాత' అని తెలియుచున్నది, 'జ్ఞాత' అనగా - 'తెలిసికొనువాడు' అని అర్థము

ఈ జీవాత్మ అణు పరిమాణు డనియును తెలియజేయబడినది. హృదయమం దుండు జీవాత్మ, శరీరమునుండి బయలు వెడలుటయును, పర లోకమునకు పోవుటయు, తిరిగి ఈ లోకమునకు వచ్చుటయు అను పరలోక గమనాగమనములు తెలియవచ్చుచున్నందు వలన, జీవుడు అణు పరిమాణు డని, విభువు కాదని తెలియుచున్నది ఆ వెలుగులో ఈ ఆత్మ నిష్క్రమించుచున్నాడు'[93] అనియు, ఈ లోకము నుండి

---

91. సాధుకారీ సాధు ర్భవతి పాపకారీ పాపో భవతి. (బృ. ఉ. 6-4-5)

92. అథ యో వేదం జిఘ్రాణీతి స ఆత్మా. (ఛా. ఉ. 8-12-4)

93. తేన ప్రద్యోతే నైష ఆత్మా నిష్క్రామతి (బృహ ఉ 6-4-2)

రెగలినవా రందరు చంద్రుని చేరుచున్నారు'[94] అనియు, కర్మానే నుభవించుటకై ఆ లోకమునుండి తిరిగి ఈ లోకమునకు వచ్చున అనియును శ్రుతులు జీవాత్మ అణు పరిమాణు డని తెలియజే మన్నవి, అంతేకాక, 'ఈ జీవాత్మ అణువు ఇతనిని మనస్సు చే తెలియవలయును'[96] అను శ్రుతి వాక్యము - జీవాత్మ అణు పరిమా ము ను స్పష్టముగ వివరించుచున్నది. వెంట్రుక కొనను వేయి భ ము లు చేసిన వో, అం దొక భాగము యొక్క పరిమాణము 'జీవా పరిమాణ' మని తెలియవలెయును'[97] అను శ్రుతి వాక్యము సైతమ ''వాత్మ' అణుత్వమును నిస్సష్టముగ తెలియజేయుచున్నది.

జీవాత్మ' అణు పరిమాణము కలదై హృదయ ప్రదేశవ దున్నవో, శరీరమం దంతటను జ్ఞాన మెట్లు కలుగుచున్న ద ప్రశ్నకు - జీవాత్మ జ్ఞానమునకు ఆశ్రయమైనదని (జ్ఞానాశ్రయ భూ మని) సమాధానము చెప్పుచు శ్రీ భాష్యకారులు -

" ఏ విధముగా వారి చందనము హృదయ ప్రదేశమం దలవ న్నను, శరీరమం దంతటను చల్లదనము కలుగునో, ఆ విధము జ్ఞాన స్వరూపు డగు జీవాత్మయును హృదయ ప్రదేశమందు అ పరిమాణుడే అయియున్నను, శరీరమునం దంతటను జ్ఞానము కలు న్చును. కావున, జీవుడు అణు పరిమాణుడే " అని వివరిం యున్నారు.

---

94 యే వై కే చాఽస్మాల్లోకా త్ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి. (కౌషీ. ఉ.

95 తస్మా ల్లోకా త్పున రే త్యస్మై లోకాయ కర్మణే ॥ (బృహ. ఉ 6-4-6

96 ఏషో ఽణురాత్మా చేతసా వేదితవ్యః. (ముం. ఉ. 3-1-9

97. వాలాగ్ర శత భాగస్య శతధా కల్పితస్య చ, జీవో భాగస్య విజ్ఞేయః.

అణు పరిమాణుడైన ఈ జీవుడు - హృదయాంతర్వర్తియై, శరీరము నంతటను విజ్ఞాన వ్యాప్తిని కలిగించుచున్నాడని చెప్పుచు - 'ప్రాణములందు విజ్ఞానమయుడుగాను, హృదయమునందు జ్యోతి స్వరూపుడుగను జీవుడు ఉన్నాడు'[98] అని శ్రుతి వాక్యము బోధించుచున్నది. 'దీపము' - 'కాంతి' రెండును తేజో ద్రవ్యములై యున్నను, దీపము కాంతికి ఆశ్రయమై యుండును. దీపము చిన్నదే అయినను తన కాంతిచే అంతట ప్రసరించునట్లు, జ్ఞాన స్వరూపుడు, జ్ఞాన గుణుడు నగు జీవుడు - స్వరూపముచేత అణు పరిమాణుడైనను, తన ధర్మభూత జ్ఞానము చేత శరీరమం దంతటను వ్యాపించి, సుఖ దుఃఖానుభూతిని గలిగించుచున్నాడని తెలియచేయబడినది.

భూమి గంధము గలది (గంధవతీ పృథివీ), ఆత్మ (జీవాత్మ) జ్ఞానము కలవాడు (జ్ఞానవాన్ ఆత్మా) అను వాక్యముల ననుసరించి, భూమియొక్క గుణమగు గంధము భూమికంటె వేరైనట్లే, జీవాత్మ యొక్క 'ధర్మభూత జ్ఞానము' సహితము జీవాత్మ కంటె భిన్నముగ నున్నట్లు 'ఈ పురుషుడు తెలిసికొనుచునే యున్నాడు'[99] అను శ్రుతి వాక్యము వలనను, తెలిసికొను జీవుని కంటెను వేరుగ 'ధర్మభూత జ్ఞానము' కల దని తెలియుచున్నది. అంతేకాక, 'విజ్ఞాత యగు జీవుని విజ్ఞానమునకు ఎన్నడును లోపము లేదు కదా'[100] అను శ్రుతి వాక్యమును - జీవుని కంటె వేరుగ 'ధర్మభూత జ్ఞానము కూడ కల దని తెలుపుచున్నది. అందువలన, అణు పరిమాణుడైనందున, జీవుని

98 యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః. (బృహ. ఉ. 3-7)

99. జానాత్యేఽవాయం పురుషః. (బృహ. ఉ. 6-3-30)

100. న హి విజ్ఞాత ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే. (బృహ. ఉ. 6-3-31)

ధర్మ భూత జ్ఞానమున వ్యాపక మగుట వలన, శరీరమం దంతట సుఖ దుఃఖానుభవము కలుగుచున్న దని వివరింపబడినది

జ్ఞాన మను గుణమును సహజముగా గలిగియుండుటచేత, విజ్ఞానము కలవాడగుట జీవాత్మ పేర్కొనబడియున్నా డని, విజ్ఞానమే అసాధారభూతమైన గుణ మని, ధర్మభూత జ్ఞాన మాత్రసారు డగు జీవాత్మ - 'జీవుడు యజ్ఞమును చేయుచున్నాడు'[101] ఇత్యాది వాక్యములందు, 'విజ్ఞాన' శబ్దముచే పేర్కొనబడియున్నా డని చెప్పబడినది అంతమాత్రమున, 'విజ్ఞానమే ఆత్మ' అని కాక, 'విజ్ఞాతయే జీవాత్మ' అని తెలంపవలయు ననియును విశదీకరింపబడినది. గో త్వ ధర్మమును పురస్కరించుకొని, 'గోవు' అను వ్యవహారము ఏర్పడుచు, గోవులలో ఎన్ని మార్పులు వచ్చినను గోత్వము మారనట్లే, 'జ్ఞాత' యగు జీవునకు జ్ఞానము నిత్యమైన ధర్మ మని తెలియజేయబడినది. అనగా, జీవుని వలె అతని ధర్మభూత జ్ఞానము కూడ నిత్యమైన దని తెలియుచున్నది. అందువలన, జ్ఞాన శబ్దముచే జ్ఞాత యగు జీవుని పేర్కొనుటలో దోషము లేదని వివరింపబడినది. విజ్ఞానము జీవాత్మకు నిత్యమైన ధర్మమైనచో, అది గాఢనిద్రయందును భాసింపవలయును గదా ! అను శంకను నివారించుచు శ్రీభాష్యకారులు -

" పురుషునియందు పుంస్త్వము నిత్యమైన ధర్మమే అయినను, అది బాల్యదశ యందు వ్యక్తము కాక, యౌవన దశలో మాత్రమే వ్యక్త మగు యున్నట్లుగ, జీవుని జ్ఞానము కూడ నిత్యమే అయినను అది నిద్రావస్థయందు భాసింపక, జాగ్ర ద్దశ యందు మాత్రమే భాసించును' అని తెలియజేసియున్నారు.

---

101. విజ్ఞానం యజ్ఞం తనుతే. (తైత్తి. బ్ర. 5-1)

'జ్ఞానమే ఆత్మ' అని చెప్పుట అసంగత మనియు, అట్లు జ్ఞానమే ఆత్మ' అయినచో, దాని వలన నెల్లప్పుడు జ్ఞానము కలుగు చుండవలయు ననియు, లేక - కలుగకుండుటైన నుండవలయు ననియు తెలియచేయబడినది.

జీవాత్మకు జ్ఞాతృత్వము వలె కర్తృత్వము గూడ స్వాభావిక మని చెప్పబడినది. అందుచేత, అణు పరిమాణుడైన, జ్ఞానమును గుణముగ గలవాడైన జీవుడు - 'కర్త'[102] అనియును తెలియుచున్నది, విధి నిషేధ రూప మగు శాస్త్రము ప్రయోజనవంతము కావలసి యున్నందున, 'జీవుడు కర్త' అను సూత్ర వ్యాఖ్యానమున, ప్రకృతికి సంబంధించిన సత్త్వ రజ స్తమో గుణములచేత అనేక విధములుగా జేయబడుచున్న కర్మములకు, అహంకారముచే మూఢుడైన ఆత్మ (జీవుడు) - తాను కర్తను అని తలంచుచున్నాడు.'[103] ఈ మొదలైన స్మృతి వాక్య ప్రమాణములు - జీవుడు కర్త కాడనియు, ప్రకృతి గుణములే కర్త లనియు తెలుపుచున్నవి. కావున, కర్త జీవుడా? ప్రకృతి గుణములా? అను సందేహ నివృత్తికై శ్రీ భాష్య కారులు -

" జీవుడే కర్త. ప్రకృతి గుణములు కావు. శాస్త్రము 'సత్యము పలుకుము' 'జీవ హింస చేయకుము' మొదలగు విధి నిషేధ వాక్యములు జీవాత్మను గూర్చి బోధించుచున్నవి గాని, ప్రకృతిని గూర్చి కాదు. అందుచేతనే, జీవుడు పుణ్య పాప రూపము లగు

---

102. కర్తా శాస్త్రార్థవత్త్వాత్. (బ్ర. సూ. 2-3-33)

103 ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ (భ గీ 3-23)

కర్మములకు కర్త, భోక్తయును జీవుడు కర్త గానిచో, ఈ విధి నిషేధ శాస్త్ర ప్రబోధము వ్యర్థమైపోవును కావున, జీవుడు కర్త' అని ప్రబోధించియున్నారు.

'స్వర్గమును గోరువాడు యజ్ఞ మొనర్పవలయును (స్వర్గ కామో యజేత).' ముముక్షువులైనవారు బ్రహ్మమును ఉపాసింపవలయును (ముముక్షుః బ్రహ్మ ఉపాసీత) ఇత్యాది విధి వాక్యముల ననుసరించి, స్వర్గము, మోక్షము మొదలగు ఫలముల ననుభవించువాడు కర్తయే. కాని, అన్న పానాది లౌకిక భోగముల నుద్దేశించి చేయు వ్యాపారములందు ఈ కర్తృత్వము స్వరూప ప్రయుక్తము కాదనియు, అది సత్త్వ రజ స్తమస్సు లనెడి గుణ సంసర్గము వలన గలిగిన దని తెలియజేయబడినది. ఈ విశేషమును గూర్చి -

మనుష్యుడు మనో వాక్కాయములచేత - శాస్త్రీయమైనదైనను, శాస్త్రీయమైనది కాకున్నను - ఏ కర్మమును ప్రారంభించుచున్నాడో - ఆ కర్మమునకు జీవాత్మకు స్థానమైన శరీరమును, జ్ఞాతృత్వ కర్తృత్వములు గల జీవాత్మయును వేర్వేరు వ్యాపారములు గల కర్మేంద్రియము లైదు, మనస్సును, నానావిధమైన ప్రాణాపానాది పంచ వాయు వ్యాపారమును, అంతర్యామి యైన పరమాత్మయును ఈ అధిష్ఠానాదులందును - హేతువులు.''104

— (భగవద్గీత . 18-14,16)

104. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥ (భ. గీ. 18-14)
తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. (భ. గీ. 18-16)

'జ్ఞానమే ఆత్మ' అని చెప్పుట అసంగతే మనియు, అట్లు జ్ఞానమే ఆత్మ' అయిననో, దాని వలన నెల్లప్పుడు జ్ఞానము కలుగు చుండవలయు ననియు, లేక - కలుగకుండుటైన నుండవలయు ననియు తెలియజేయబడినది.

జీవాత్మకు జ్ఞాతృత్వము వలె కర్తృత్వము గూడ స్వాభావిక మని చెప్పబడినది. అందుచేత, అణు పరిమాణుడైన, జ్ఞానమును గుణముగ గలవాడైన జీవుడు - 'కర్త'[102] అనియును తెలియుచున్నది. విధి నిషేధ రూప మగు శాస్త్రము ప్రయోజనవంతము కావలసి యున్నందున, 'జీవుడు కర్త' అను సూత్ర వ్యాఖ్యానమున, ప్రకృతికి సంబంధించిన సత్త్వ రజ స్తమో గుణములచేత అనేక విధములుగా జేయబడుచున్న కర్మములకు, అహంకారముచే మూఢుడైన ఆత్మ (జీవుడు) - తాను కర్తను అని తలంచుచున్నాడు.'[103] ఈ మొదలైన స్మృతి వాక్య ప్రమాణములు - జీవుడు కర్త కాదనియు,' ప్రకృతి గుణములే కర్త లనియు తెలుపుచున్నవి. కావున, కర్త జీవుడా ప్రకృతి గుణములా ? అను సందేహ నివృత్తికై శ్రీ భాష్య కారులు -

" జీవుడే కర్త ప్రకృతి గుణములు కావు. శాస్త్రము 'సత్యము పలుకుము' 'జీవ హింస చేయకుము' మొదలగు విధి నిషేధ వాక్యములు జీవాత్మను గూర్చి బోధించుచున్నవి గాని, ప్రకృతిని గూర్చి కాదు. అందుచేతనే, జీవుడు పుణ్య పాప రూపము లగు

---

102. కర్తా శాస్త్రార్థవత్త్వాత్. (బ్ర. సూ. 2-3-33)

103. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥ (భ. గీ 3-23)

కర్మములకు కర్త, భోక్తయును జీవుడు కర్త గానిచో, ఈ విధి నిషేధ శాస్త్ర ప్రబోధము వ్యర్థమైపోవును. కావున, జీవుడు కర్త' అని ప్రబోధించియున్నారు.

'స్వర్గమును కోరువాడు యజ్ఞ మొనర్పవలయును (స్వర్గ కామో యజేత).' ముముక్షులైనవారు బ్రహ్మమును ఉపాసింపవలయును (ముముక్షుః బ్రహ్మ ఉపాసీత) ఇత్యాది విధి వాక్యముల ననుసరించి, స్వర్గము, మోక్షము మొదలగు ఫలముల ననుభవించువాడు కర్తయే. కాని, అన్న పానాది లౌకిక భోగముల నుద్దేశించి చేయు స్వవ్యాపారములందు ఈ కర్తృత్వము స్వరూప ప్రయుక్తము కాదనియు, అది సత్త్వ రజస్తమస్సు లనెడి గుణ సంసర్గము వలన కలిగిన దని తెలియజేయబడినది. ఈ విశేషమును గూర్చి -

మనుష్యుడు మనో వాక్కాయములచేత - శాస్త్రీయమైన దైనను, శాస్త్రీయమైనది కాకున్నను - ఏ కర్మమును ప్రారంభించుచున్నాడో - ఆ కర్మమునకు జీవాత్మకు స్థానమైన శరీరమును, జ్ఞాతృత్వ కర్తృత్వములు గల జీవాత్మయును వేర్వేరు వ్యాపారములు గల కర్మేంద్రియము లైదు, మనస్సును, నానావిధమైన ప్రాణాపానాది పంచ వాయు వ్యాపారమును, అంతర్యామి యైన పరమాత్మయును ఈ అధిష్ఠానాదులందును - హేతువులు."[104]

— (భగవద్గీత . 18-14,16)

104. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥ (భ. గీ. 18-14)
తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః
పశ్యత్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః. (భ. గీ. 18-16)

అని వివరింపబడి యున్నది. ఏ విధముగ మహారాజు తన పరివారమును తీసికొని, తన దేశమున యథేచ్ఛగ సంచరించునో, ఆ విధముగ ఈ జీవుడు తన ఇంద్రియములను తీసికొని, తన శరీరమునందు యథేచ్ఛగా సంచరించుచున్నాడు'[105] అను శ్రుతి వాక్యము ననుసరించి, ఇంద్రియములను గ్రహించి విహరించువాడుగా చెప్పబడియున్నందున, 'జీవునకు కర్తృ' అని స్పష్టీకరింపబడినది.

ప్రకృతికి కర్తృత్వము, జీవునకు కర్తృత్వము కాక, భోక్తృత్వ మున్నదనుట సాంఖ్యులు చెప్పుదురు. కాని, అది సరియైనది కాదని, ప్రకృతికే కర్తృత్వ ముండి, జీవాత్మ కది లేనిచో, జీవాత్మకు శాస్త్రీయ కర్తృత్వము, భోక్తృత్వమును నశించునని తెలియజేయబడినది. కర్త ఒకరు, భోక్త మరియొకరు అగు పక్షమున, ఎవ్వడైనను భోక్త కావచ్చునను వ్యవస్థ ఏర్పడునని, అందువలన - 'ఎవరు కర్తయో అతడే భోక్త' అని గ్రహింపవలయు నని, కర్తృత్వ భోక్తృత్వ ధర్మములు రెండును జీవాత్మయందే ఉన్నవని, అందువలన - 'కర్త' - 'భోక్త' జీవుడే అగునని తెలియజెప్పబడినది. మోక్ష సాధన భూతమైన సమాధి యందు ప్రకృతి కర్త కాజాల నందువలనను, అది కర్త యగు నేని, 'నేను ప్రకృతి కంటె ఇతరుడను' అను సమాధి దానికి కలుగనందువలనను జీవాత్మయే కర్త. ప్రకృతి కర్త కాజాలదు - అని వివరింపబడినది. అంతేకాక, ఏ విధముగా వడ్రంగి తన ఇచ్ఛానుసారము కొన్ని సమయములందు కార్యములు గావించును, కొన్ని

---

105. స యథా మహారాజః స్వే జనపదే యథా కామం పరివర్తేత।
ఏవమేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథా కామం పరివర్తతే (బృహ. ఉ. 4-1-18)

సమయములందు గావింపడు. ఈ విధముగ జీవుడు కర్తగను, అకర్తగను ఉండునని తెలియజేయబడినది. ప్రకృతి కర్త యగునేని, అది అచేతన మగుట వలన, దానికి 'ఇచ్ఛ' - 'అనిచ్ఛ' అనునవి సంభవింప నందున, సర్వదా కార్యము జరుగుచుండవలయును. కాని, ఇది లోక విరుద్ధమైనందున, 'చేతను డగు జీవుడే కర్త' అని పరిష్కరింపబడినది.

ఈ జీవుని కర్తృత్వము స్వాతంత్ర్యము వలన కలుగుచున్నదా? లేక, పరమాత్మాయత్తముచేతనా? ఎట్లు ప్రాప్తించినది? అను ప్రశ్నకు సమాధానముగ - స్వాతంత్ర్యము చేతనే కలిగినది. పరమాత్మాయత్తమని చెప్పుట వలన, విధి నిషేధ శాస్త్రానర్థక్యము కలుగుచున్నది. తన బుద్ధిచేత, ప్రవృత్తి నివృత్త్యారంభశక్తుడై, అతడే (జీవుడే) నియమించువాడగుచున్నాడు. అందుచే, ఈ జీవుని కర్తృత్వము స్వాతంత్ర్యము చేతనే - అను పూర్వపక్షమునకు శ్రీభాష్యకారులు ఈ విధముగ సమాధానము చెప్పియున్నారు.

“ఈ జీవుని కర్తృత్వమునకు పరమాత్మయే హేతుభూతు డగుచున్నాడు. ఎట్లనగా - 'లోపల ప్రవేశించి జనులను శాసించువాడు పరమాత్మ' [106] అనియు, 'ఎవడు ఆత్మయందుండి ఆత్మను నియమించుచున్నాడో'[107] అనియును శ్రుతి వాక్యములు చెప్పుచున్నవి. అంతే కాక, నేను సమస్త భూతముల జ్ఞానోదయ ప్రదేశమైన హృదయమునందు ఆత్మరూపముగ ప్రవేశించినవాడను. నా వలన స్మృతియును, జ్ఞానమును, ఊహయు కలుగుచున్నవి. సమస్త వేదములచేత తెలియదగినవాడను. వారి అంతర్యామియు, ఆత్మయు

---

106 అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా (తై. ఆ. 3-2-10)

107. య ఆత్మాన మన్తరో యమయతి (బృహ. ఉ. 5-7-31)

అని వివరింపబడి యున్నది. ఏ విధముగ మహారాజు తన పరివారమును తీసికొని, తన దేశమున యథేచ్ఛగ సంచరించునో, ఆ విధముగ ఈ జీవుడు తన ఇంద్రియములను తీసికొని, తన శరీరమునందు యథేచ్ఛగ సంచరించుచున్నాడు'[105] అను శ్రుతి వాక్యము ననుసరించి, ఇంద్రియములను గ్రహించి విహరించువాడుగా చెప్పబడియున్నందున, 'జీవునకు కర్తృ' అని స్పష్టీకరింపబడినది.

ప్రకృతికి కర్తృత్వము, జీవునకు కర్తృత్వము కాక, భోక్తృత్వ మున్నదని సాంఖ్యులు చెప్పుదురు. కాని, అది సరియైనది కాదని, ప్రకృతికే కర్తృత్వ ముండి, జీవాత్మ కది లేనిచో, జీవాత్మకు శాస్త్ర వశ్యత్వము, భోక్తృత్వమును నశించు నని తెలియచేయుబడినది. కర్త ఒకరు, భోక్త మరియొక డగు పక్షమున, ఎవ్వడైనను భోక్త కావచ్చు ననుట వ్యవస్థ ఏర్పడదు అని, అందువలన - 'ఎవడు కర్తయో అతడే భోక్త' అని గ్రహింపవలయు నని, కర్తృత్వ భోక్తృత్వ ధర్మములు రెండును జీవాత్మయందే ఉన్నవని, అందువలన - 'కర్త' - 'భోక్త' జీవుడే అగునని తెలియజెప్పబడినది. మోక్ష సాధన భూతమైన సమాధి యందు ప్రకృతి కర్త కాజాల దందువలనను, అది కర్త యగు నేని, 'నేను ప్రకృతి కంటె ఇతరుడను' అను సమాధి దానికి కలుగనందువలనను జీవాత్మయే కర్త. ప్రకృతి కర్త కాజాలదు - అని వివరింపబడినది. అంతేకాక, ఏ విధముగా వడ్రంగి తన ఇచ్ఛాను సారము కొన్ని సమయములందు కార్యములు గావించును, కొన్ని

105. స యథా మహారాజః స్వే జనపదే యథా కామం పరివర్తేత,
ఏవమేవైష ఏతాన్ ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథా కామం పరివర్తతే. (బృహ. ఉ. 4-1-18)

సమయములందు గావింపను. ఈ విధముగ జీవునకు కర్తగను, అకర్తగను ఉండునని తెలియజేయబడినది. ప్రకృతి కర్త యగునేని, అది అచేతన మగుట వలన, దానికి 'ఇచ్ఛ' - 'అనిచ్ఛ' అనునవి సంభవించనందున, సర్వదా కార్యము జరుగుచుండవలయును. కాని, ఇది లోక విరుద్ధమైనందున, 'చేతను డగు జీవుడే కర్త' అని నిర్ధారింపబడినది.

ఈ జీవుని కర్తృత్వము స్వాతంత్ర్యము వలన కలుగుచున్నదా? లేక, పరమాత్మాయత్తముచేతనా? ఎట్లు ప్రాప్తించినది? అను ప్రశ్నకు సమాధానముగ - స్వాతంత్ర్యము చేతనే కలిగినది. పరమాత్మాయత్త మని చెప్పుట వలన, విధి నిషేధ శాస్త్రానర్థక్యము కలుగుచున్నది. తన బుద్ధిచేత, ప్రవృత్తి నివృత్త్యారంభశక్తుడై, అతడే (జీవుడే) నియమించువా డగుచున్నాడు. అందుచే, ఈ జీవుని కర్తృత్వము స్వాతంత్ర్యము చేతనే - అను పూర్వపక్షమునకు శ్రీభాష్యకారులు ఈ విధముగ సమాధానము చెప్పియున్నారు.

"ఈ జీవుని కర్తృత్వమునకు పరమాత్మయే హేతుభూతు డగుచున్నాడు. ఎట్లనగా - 'లోపల ప్రవేశించి జనులను శాసించు వాడు పరమాత్మ' [106] అనియు, 'ఎవడు ఆత్మయం దుండి ఆత్మను నియమించుచున్నాడో' [107] అనియును శ్రుతి వాక్యములు చెప్పుచున్నవి. అంతే కాక, నేను సమస్త భూతముల జ్ఞానోదయ ప్రదేశమైన హృదయమునందు ఆత్మ రూపముగ ప్రవేశించినవాడను. నా వలన స్మృతియును, జ్ఞానమును, ఊహాయు కలుగుచున్నవి. సమస్త వేదములచేత తెలియదగినవాడను వారి అంతర్యామియు, ఆత్మయు

---

106 అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా (తై. ఆ. 3-2-10)

107. య ఆత్మని తిష్ఠ న్నాత్మానమన్తరో యమయతి (బృహ. ఉ. 5-7-31)

నైన నేనే వేదోక్తఫలముల నిచ్చువాడను, వేదశాస్త్రము నెఱింగినవాడను నేనే'[108] అనియు, 'అర్జునా! సర్వ నియంత యగు వాసుదేవుడు, దేహేంద్రియ రూపమున నుండు ప్రకృతి యను యంత్రము నారోహించి యున్న సమస్త ప్రాణులను, సత్త్వాది గుణ మయమైన తన మాయ చేత ప్రవర్తింపచేయుచు, సమస్త ప్రాణుల యొక్క సకల ప్రవృత్తి నివృత్తులకు మూలమైనట్టి జ్ఞానోదయమునకు ప్రదమైనవాని హృదయమందున్నాడు'[109] అనియును స్మృతి వాక్యములు చెప్పుచున్నవి. అందువలన, జీవుడు కర్తయైనను, స్వతంత్రుడు కాడని, జీవుని కర్తృత్వము పరమాత్మాధీన మనియు తెలియజేయ బడినది."

జీవుని కర్తృత్వము పరమాత్మ సంకల్పాధీనమైన యెడల జీవుని పుణ్య పాపములు పరమాత్మకే కలుగును గాని, జీవునకు కలుగు అవకాశము లేదు కదా?' అని సందేహింపరాదని శ్రీ భాష్యకారులు తెలియజేయుచు, జీవుడు మొదట పరమాత్మ యొక్క అనుమతితో కర్మలలో వర్తించు నని, పిమ్మట పరమాత్మ అతని పుణ్య పాప కర్మలను బట్టి, ఆ తరువాత కర్మములలో అతనిని ప్రవర్తింపచేయు ననియు వివరించి యున్నారు ఈ విధముగా పరమా

---

108. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనం చ ।
వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥
(భ. గీ 15-15

109. ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా ॥ (భ. గీ 18-61

త్ముడు జీవుని పూర్వ వాసనా రూపమైన ప్రవృత్తి మంచి చెడ్డలను పరిశీలించి, మంచి చేయునపుడు అనుమతించుచు, చెడును అనాద రించుచు, మంచి నొనర్చునపుడు అనుగ్రహమును, చెడు యొనర్చునపుడు నిగ్రహమును జూపుచు, ఆ యా జీవులకు సుఖ దుఃఖముల నిచ్చుచుండు నని శ్రీభాష్యకారులు నాయించియున్నారు. ఈ విశేషమును గూర్చి పరమాత్ముడు స్వయముగ ఇట్లానతిచ్చి యున్నాడు :-

"నాతో నిత్య యోగమును కోరుచున్నవారై, నన్ను భజించు జ్ఞానులకు, వారు కోరిన బుద్ధియోగమునే ప్రీతి పూర్వకముగ నిచ్చుచున్నాను దానిచేత వారికి మత్ప్రాప్తి కలుగును"[110] అనియు వారిని అనుగ్రహించుట కొఱకే నేనువారి మనో వృత్తికి విషయభూతుడనై యుండువాడను గనుక, వారికి నా కల్యాణ గుణములను పరిచ్ఛిన్న మద్విషయమైన జ్ఞాన మనెడి ప్రకాశించుచున్న దీపము చేత జ్ఞాన విరోధియు, ప్రాచీన కర్మరూపమైన అజ్ఞానము వలన బుట్టినదియు, నాకు వ్యతిరిక్తములైన పూర్వము నుండి అలవడియున్న విషయ మందలి ప్రావణ్య మైనదియు నగు దానిని నాశము చేయుచున్నాను."[111]

అనియును —

అసుర (భగవ దాజ్ఞ నతిక్రమించు) స్వభావము గల జనులు, ఈ జగత్తును అసత్య మని చెప్పుదురు. బ్రహ్మాత్మక మని, బ్రహ్మమునం దుండునది అని చెప్పరు నియమించువాడు లేని దని చెప్పుదురు. స్త్రీ పురుష పరస్పర సంగము చేత

110 తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ॥ (భ. గీ 10-10)

111 తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మ భావస్థో జ్ఞాన దీపేన భాస్వతా॥ (భ. గీ 10-11)

సామ్యముగ భగవ న్నిగ్రహానుగ్రహములకు పాత్రు డగుట సంభవించుచున్న దని తేటతెల్ల మగుచున్నది.

జీవుడు పరమాత్మ యొక్క అంశ మని వివరింపబడినది. ఉపనిష ద్వాక్యములు జీవాత్మ - పరమాత్మలకు కొన్ని చోట్ల భేదమును చెప్పుటవలనను, మరి కొన్ని చోట్ల అభేదమును చెప్పుట వలనను జీవాత్మ, పరమాత్మ యొక్క అంశ మని చెప్పబడినది. 'జీవాత్మను, **అతనిని** ప్రేరేపించు పరమాత్మను భిన్నులనుగా ధ్యానించి'[115] అను ఉపనిష ద్వాక్యము జీవాత్మ - పరమాత్మలకు భేదమును బోధించుచున్నది 'నీవు ఆ పరమాత్మవై ఉన్నావు'[116] అను ఉపనిష ద్వాక్యము జీవాత్మ - పరమాత్మలకు అభేదమును చెప్పుచున్నది. ఈ సందర్భమున దేనిని సమ్మతింపవలయు ననను సందేహమునకు జీవుడు పరమాత్మ యొక్క అంశ మని సమాధానము చెప్పబడినది 'ఏ పరమాత్మ జీవాత్మయం దున్నాడో, ఏ పరమాత్మకు జీవాత్మ శరీరమై యున్నాడో'[117] అను శ్రుతి వాక్యము జీవాత్మ పరమాత్మలకు 'శరీర - శరీరి' భావమును తెలియజేయుచున్నది. ఈ 'శరీర - శరీరి' భావమును ననుసరించి, జీవాత్మ పరమాత్మలకు భేదమును, అభేదమును సమన్వయింపవచ్చు నని చెప్పి, జీవుడు అజ్ఞుడు - పరమాత్మ సర్వజ్ఞుడు. కావున, వీరు పరస్పరము భిన్నులైనను, వీరికి గల 'శరీర - శరీరి' భావ సంబంధముచే అభిన్నులుగ బోధింపబడవచ్చు నని తెలియ జేయబడినది 'దేవ దత్తుడు' అను శబ్దము, ఆ వ్యక్తి యొక్క శరీరమును, ఆ శరీరమం దున్న జీవాత్మను తెలియజేయువల్లె, ఆ జీవుని యందు అంతరాత్మగ నున్న పరమాత్మను కూడ తెలియచేయుచున్నది. ఈ

115 పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా (శ్వేతా ఉ. 1-6)
116 తత్త్వ మసి (ఛాం. ఉ. 8-12-4)
117. య ఆత్మని తిష్ఠన్, యస్యాత్మా శరీరమ్. (బృహ. ఉ. 5-3-4)

విధముగా సమస్త శబ్దములు ఆ యా పదార్థములను శరీరముగ జేసి కొని, వానియందు అంతర్యామిగా నున్న పరమాత్మను తెలియజేయు చున్నవి. అందుచేత, జీవ వాచక శబ్దములు జీవ శరీర పరమాత్మ బోధకము లని తెలియజేయబడినది. 'సమస్త భూతములు బ్రహ్మము యొక్క పాదములు'118 అను మంత్ర భాగము ననుసరించియును జీవుడు పరమాత్మ యొక్క అంశ మని తెలియుచున్నది. అంతే కాక, స్మృతి యందును ఈ విశేషము ఇట్లు విశదీకరింపబడినది. 'జీవ లోకమున సనాతనుడైన జీవుడై వెలుగొందుచున్నది నా అంశమే'119 అని భగవంతుడు స్వయముగ జీవుడు తన యుక్క అంశ మని స్పష్టము చేసియున్నారు

జీవుడు పరమాత్మ యొక్క అంశ మైనచో, జీవుని దోష ములు పరమాత్మకు సంక్రమించును గదా ! అని శంకింపరా దని చెప్పబడినది జీవాత్మ పరమాత్మల అంశాంశి భావము, ప్రభా - ప్రభావంతుల అంశాంశి భావము వంటి దని చెప్పబడినది. ప్రకాశ విశిష్టమైన సూర్యుని యందు - ఆతనికి గుణభూత మైన ప్రకాశము అంశ మగుచున్నట్లు, పరమాత్మ విశేష మని, జీవాత్మ విశేషణ మని వివరింపబడినది. విశేష్య విశేషణముల స్వరూప స్వభావములు పర స్పర భిన్నములై యుండవచ్చు నని చెప్పి, విశేష్యమైన పరమాత్మ సర్వజ్ఞుడు, సత్య సంకల్పుడు, దోష గంధ రహితుడు కాగా, విశేషణ మైన జీవుడు అజ్ఞుడు, పరతంత్రుడు, సుఖ దుఃఖ భోక్త యగుచు, పరమాత్మ యొక్క అంశ మగు చున్నా డని విశదీకరింపబడినది. 'ఒక

118 పాదో ఽస్య విశ్వా భూతాని (పు. సూ.)

119. మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః॥ (భ. గీ. 15-7)

చోట నున్న అగ్ని యొక్క కాంతి - నలు వైపుల ఎట్లు వ్యాపించు చున్నదో, అదే విధముగ, ఈ జగత్తంతయు పరమాత్మ యొక్క శక్తియై, అంతట వ్యాపించి యున్నది'[120] అని పరాశర మహర్షియు - అగ్నికి కాంతి వలె, ఈ చరాచర జగత్తంతయు పరమాత్మకు అంశ మని స్పష్ట మొనర్చి యున్నారు. అంతే కాక, 'జగత్సృష్టి కావలసిన శక్తి యంతయు పరమాత్మకు అంశ మని స్పష్ట మొనర్చి యున్నారు. అంతే కాక, 'జగత్సృష్టి కావలసిన శక్తి యంతయు పరమాత్మ యైన శ్రీహరి శరీరము'[121] అని చెప్పుచు, చేతనాచేతనములతో పరమాత్మకు గల శరీర -శరీరి భావమును గూడ విశదీకరించియున్నారు. అందుచేత, జీవుడు పరమాత్మ యొక్క అంశ మైనను, జీవుల దోషములు పరమాత్మకు అంట వని చెప్పబడినది.

జీవు లందరు బ్రహ్మాంశ భూతులై యున్నను, కొందరిని మాత్రమే వేదాధ్యయనాదులందు అనుమతించుట, మరి కొందరిని నిషేధించుట ఎట్లు సంభవించుచున్నది ? అను సంశయమును శ్రీమద్రామానుజ యతీంద్రులు నివారించుచు, ఏ విధముగా వివాహాది శుభ స్థలములం దున్న అగ్నిని పరిగ్రహించుచు, శ్మశానాది అశుభ స్థలము లందలి అగ్నిని పరిహరించుచున్నామో - అదే విధముగ, జీవు లందరు బ్రహ్మాంశ భూతులై యున్నను, ఆ యా జీవులకు గల బ్రాహ్మణాది దేహ సంబంధమును బట్టి, కొందరికి మాత్రము వేదాధ్యయనాదులయందు అనుమతిలభించుట, మరికొందరికి లభింపక

---

120 ఏక దేశ స్థిత స్యాగ్నేః జ్యోత్స్నా విస్తారిణీ యథా
పరస్య బ్రహ్మణః శక్తిః తథేద మఖిలం జగత్॥ (వి. పు. 1-22-56)

121. తత్సర్వం వై హరే స్తనుః. (వి. పు. 1-22-38)

పోవుట అనునది సంభవించుచున్న దని, ఆ విధముగా జీవునకు విధి నిషేధ శాస్త్రములు వర్తించుచున్న వని వివరింపబడినది.

పరమాత్మ యొక్క అంశ భూతు లైన ఈ జీవులు పరస్పరము భిన్ను లని, ఒక్కొక్క దేహము నందు ఒక్కొక్క జీవు డుండు నని, తెలియజేయబడినది. అందుచేతనే ఒకని 'కర్మ ఫలము'ను - మరొక డనుభవించు దోషము కలుగకున్న దని తెలియజేయబడినది. ఈ విధముగ శ్రీ రామానుజ మతానుసారము - జీవులును భగవంతుని వలె అనాదులును, నిత్యులును, స్వరూపమున భగవంతునకు వేరైన వనియును విశదీకరింపబడినది.

## శ్రీమద్రామానుజులు - ప్రకృతి స్వరూపము

ప్రాణము నాశ్రయించుకొని యున్న జీవ శరీరముల వలె జీవాత్మ - ప్రకృతులును పరమాత్మ నాశ్రయించుకొని, ఆయనకు శరీర భూతములై, ఆయన వలె నిత్యములై యున్న వనియు, ఆయన కంటె భిన్నములై యున్న వనియును ఆచార్య పురుషులు సాధించి యున్నారు

ద్రవ్యము, అద్రవ్యము అని, ప్రమేయము రెండు విధములుగా చెప్పబడినది. ద్రవ్యము ఉపాదాన మగు నని చెప్పి, ఘటమునకు మట్టి ఉపాదాన మనియు, మట్టిపిండ కపాలా ద్యవస్థా భేదములకు ఆశ్రయ మగుచున్న దనియు, వివరింపబడినది. అందుచేత, మట్టి ఉపాదాన మును, అవస్థాశ్రయమును అగుచున్నందున ద్రవ్యమగు ననియు, అట్టి ద్రవ్యము గుణాశ్రయ మనియు, అది సామాన్య మనియు ద్రవ్యము యొక్క లక్షణము చెప్పబడినది.

ప్రకృతి యందు ఈ అవస్థాశ్రయత్వము సుప్రసిద్ధమైనట్టి దనియు, అందుచేతనే జీవుని జ్ఞాన సంకోచ వికాసములు లనబడు అవస్థలకు ఆశ్రయ మగుచున్న దనియు చెప్పుచు. కాలము ఒక్కటియే యైనను, ఉపాధి సంబంధముచేత క్షణ - కలా - కాష్ఠాది భేదమును బొందుచు, అవస్థాశ్రయ మగుచున్న దనియు వివరింపబడినది. జీవునకు శరీరము ద్వారా బాల్యావస్థాశ్రయత్వము కలుగుచున్నది. ఈశ్వరునికిని స్థూల సూక్ష్మావస్థలు రెండు ప్రకృతి ద్వారమున అవస్థాశ్రయము కలదు. శుద్ధ సత్త్వమునకు అవస్థాశ్రయత్వము ప్రసిద్ధమైనట్టిదే. అందుచేత, అవస్థాశ్రయత్వము ద్రవ్య లక్షణ మగుట ఉపపన్న మని తెలియజేయబడినది.

ద్రవ్యములు - ప్రకృతి, కాలము, శుద్ధ సత్త్వము, ధర్మభూత జ్ఞానము, జీవుడు, ఈశ్వరుడు అని ఆరు విధములుగా చెప్పబడినది. ఇందు, 'ప్రకృతి - కాలము' జడములనియు, 'శుద్ధ సత్త్వము, ధర్మభూత జ్ఞానము, జీవుడు, ఈశ్వరుడు అజడము లనియు వివరింపబడినది, సత్త్వ రజస్తమో రూప గుణ త్రయాశ్రయమైన ప్రకృతి - బద్ధ జీవుల జ్ఞానానందములను కప్పిపుచ్చు ననియు, విపరీత జ్ఞానమును గలిగించునది యనియు, ఈశ్వరున కిది క్రీడా సాధన మనియును విప్పి చెప్పబడినది. ఈ ప్రకృతి - నిత్యము, అక్షరము, అవిద్య, మాయ అను శబ్దములచే వ్యవహరింపబడు ననియు, నిత్య మైనందున - 'అక్షర' మనబడుచున్న దనియు, జ్ఞాన విరోధి యైనందున, 'అవిద్య' యనియు, విచిత్ర సృష్టి కారిణి కావున 'మాయ' యనియు తెలియజేయబడినది భగవత్సంకల్పాధీన గుణ వైషమ్యమువలన, సృష్ట్యనుకూల మగు అవస్థయందు ఈ ప్రకృతి - 'అవ్యక్త' మనబడు ననియు, గుణముల భేదము వ్యక్తముగా తెలియక పోవుట వలన, 'అవ్యక్త'

మనబడుచున్న దనియు వివరింపబడినది. గుణ వైషమ్య మనగా - 'సత్త్వ రజ స్తమస్సు లనెడి గుణముల పరస్పర ఉద్రేకము' అనియు, ఈ గుణ వైషమ్యము వలన విషమ వికారము లేర్పడునపుడు ప్రకృతి నుండి 'మహత్తు' జనించు ననియు, ఆ మహత్తు - సాత్త్విక, రాజస, తామస భేదముచేత మూడు విధము లనియు వివరింపబడినది. ఈ మహత్తునే 'బుద్ధి' అనియు నందురు మహత్తు నుండి 'అహంకారము' జనించు ననియు, ఆ అహంకారమును - సాత్త్విక, రాజస తామస, భేదముచే మూడు విధము లనియు, సాత్త్వికాహంకారము వైకారిక మని, రాజసాహంకారము తైజస మని, తామసాహంకారము భూతాది యని వ్యవహరింపబడు ననియు తెలియజేయబడినది. ఈ అహంకారమే జీవుని యందు దేహాత్మాభిమానమును కలిగించునట్టిది. రాజసాహంకార సాహాయ్యముతో గూడిన సాత్త్వికాహంకారము నుండి అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, మనస్సు అనబడు ఇంద్రియముతో పదు నొకండు ఇంద్రియములు జనించు నని, జ్ఞానము ను ప్రసరింపజేయు సామర్థ్యము కలిగి యున్నందున జ్ఞానేంద్రియము లని, అవి మనస్సు, చెవి, కన్ను, ముక్కు, నాలుక, త్వక్కు అను ఆరు విధము లనియు చెప్పబడినది. స్మృతి (తలపు) మొదలగు వానికి 'మనస్సు' ముఖ్య సాధనము. అది హృదయ ప్రదేశమున నుండునది. దీనినే చిత్త మనియు వ్యవహరింతురు. ఇది జీవుని బంధ మోక్షములకు హేతుభూతమైన దని చెప్పబడినది. శబ్ద మాత్ర గ్రహణ శక్తి గలది (చెవి) శ్రోత్రేంద్రియము. రూప మాత్ర గ్రహణ శక్తి గలది (కన్ను) చక్షు రింద్రియము. గ్రహణ మాత్ర శక్తి గల ఇంద్రియము (ముక్కు) ఘ్రాణేంద్రియము. రసమును

మాత్రమే గ్రహించు శక్తి గలది (నాలుక) రసనేంద్రియము. స్పర్శ మాత్ర గ్రహణ శక్తి గల ఇంద్రియము (త్వక్కు) త్వగింద్రియము. ఇది శరీరమంతటను ఉండు ననియు, నఖ - దంత - కేశములందు త్వగింద్రియము వర్తించి యున్నప్పటికిని, అందు దాని శక్తి తగ్గి యున్నందున, స్పర్శ జ్ఞానము కలుగదే దనియు చెప్పబడినది.

ఉచ్చారణాది క్రియలలో నొక క్రియ యందు శక్తి కలిగి యున్నట్టిది కర్మేంద్రియ మని కర్మేంద్రియ లక్షణము చెప్పుచు, అవి 'వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ' అని అయిదు విధము లని వివరింపబడినది. వర్ణోచ్చారణ ముఖ్యసాధనము 'వాక్కు' అని, అది హృదయమునను, కంఠమునను, జిహ్వా మూలమునను, తాలువు నందును, దంతము లందును, ఓష్ఠ్యము లందును, నాసిక యందును మూర్ధ స్థానము నందున - ఇట్లె నిమిది స్థానములందు వర్తించుచుండు నని విశదీకరింపబడినది. శిల్పాదులకు ముఖ్య సాధనము 'పాణి' యని సంచరించుట కుపకరించునది 'పాద' మని, మల విసర్జన సాధనము 'పాయు' వని, ఆనంద విశేష ముఖ్య సాధనము 'ఉపస్థ' యని కర్మేంద్రియ స్వరూపము వివరింపబడినది.

రాజసాహంకారి సాహాయ్యముతో 'భూతాది' యనబడు తామసాహంకారము నుండి పంచ తన్మాత్రములు, వాని విశేషమైన పంచ భూతములును పుట్టు నని చెప్పబడినది. 'శబ్ద తన్మాత్రము' స్పర్శ తన్మాత్రము, రస తన్మాత్రము, గంధ తన్మాత్రము' అని, తన్మాత్రము లైదనియు, 'ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి' అని - భూతము లైదనియు వివరింపబడినది. తామసాహంకారము నకును, ఆకాశమునకును మధ్యమావస్థ గల ద్రవ్యము శబ్ద తన్మాత్ర మని, ఇది పాలు పెరుగుగా మారుటకు మధ్య నున్న యవస్థలో

నుండు ద్రవ్యము వంటిదే అని, ఈ శబ్ద తన్మాత్రము నుండియే ఆకాశము జనించు నని, అది విశిష్ట శబ్దాధార మగుచు శ్రవణానంద కరత్వము గలిగి యుండు నని వివరింపబడినది. ఆకాశము నుండి స్పర్శ తన్మాత్రమును, దాని నుండి వాయువు జనించు నని, ఈ వాయువు విశిష్ట స్పర్శనము గలిగి రూప శూన్య మైనట్టి దని, అనగా - త్వగింద్రియమునకు మాత్రమే గ్రాహ్య మగున దని, చల్లదనము గాని, వేడి గాని, గంధము గాని లే దని చెప్పబడినది. వాయువు జల సంబంధము వలన చల్లని దనియు, ఆతపాది తేజః పదార్థ సంబంధము వలన వెచ్చని దనియు, కుసుమాది సుగంధ ద్రవ్యావయవ సంబంధముచే పరిమళము కల దనియు ప్రతీతి కలుగునే కాని, శీతోష్ణాదులు దానియందు లేదని చెప్పపడినది. అంతే కాక, ఈ వాయువు త్వగింద్రియమునకు అప్యాయకర మగు నని, దీని యందు - 'శబ్దము, స్పర్శము' అను గుణములు కల వని, శరీర ధారణాది హేతు వగు వాయు విశేషము 'ప్రాణాపాన వ్యానోదాన సమాన' మని అయిదు విధములుగా నుండు నని వివరించబడినది. వానిలో - హృదయ ప్రదేశ మందు ప్రాణము, గుద ప్రదేశమందు 'అపానము', శరీర మంతటను వ్యాపించి 'వ్యానము', కంఠమున 'ఉదానము', నాభి యందు 'సమానము' ఉండు నని తెలియజేయబడినది. వాయు తేజస్సుల మధ్యమావస్థా విశిష్ట మగు ద్రవ్యము రూప తన్మాత్ర మన బడు నని, దాని నుండి 'తేజస్సు' జనించు నని చెప్పబడినది. ఈ తేజస్సు ఉష్ణ స్పర్శము గలది, భాస్వర రూపము గలది, బయట అగ్ని రూపమునను, సూర్య రూపమునను పచనాదులకు హేతు వగును. ప్రాణుల చాక్షుష జ్ఞానమునకు వెలుగు రూపమున తోడ్పడు నట్టిది. ఇది - 'భౌమము, దివ్యము, ఔదర్యము, ఆకరజము' అను నాలుగు విధము లని చెప్పబడినది. ప్రత్యేక పదార్థము లయిన ప్రకృతి, కర్మలు

మొదలగునవి ఇంధనములుగా గల తేజస్సు 'భౌమ' మని, జలము మాత్రము ఇంధనముగా గలది 'దివ్య' మని పార్థివ మగు ఆహారము, జలము ఇంధనముగా గలది 'ఔదర్య' మని, ఇంధనము లేని తేజము 'ఆకర' మని, అది సువర్ణాదిక మనియు తెలియజేయబడినది. సువర్ణ మున పృథివీ పదార్థము అధికముగా గలిసి యున్నందున వేడి లేదు. తేజస్సు శబ్ద స్పర్శ రూపములు - అను మూడు గుణములు కలిగి యుండును తేజస్సు నుండి రస తన్మాత్రమును, దాని నుండి జల మును జన్మించును. తేజ స్సలిల మధ్యమావస్థలో నున్న ద్రవ్యమే రస తన్మాత్ర మనబడు నని తెలియజెప్పబడినది. చల్లని స్పర్శ గుణము గలిగి యుండుట, వాసన లేక విశిష్ట రసము ను గలిగి యుం డుట, అది సహజముగా మాధుర్యమై యుండుట, రూపము తెలుపున నొప్పారుట జల లక్షణములుగా పేర్కొనబడినవి. అయినప్పటికిని, ఆశ్రయాదులు సంసర్గ మమున రూప రస స్పర్శములు మారుచుండు నని, అట్టి మార్పు - జలము, నదులు, సముద్రము మున్నగు రూపము లతో బహు విధము లని తెలియజేయబడినది. ఈ జలము నందు శబ్ద స్పర్శ రూప రసము లను నాలుగు గుణము లుండు నని, చల్లుటకును, ముద్దగా జేయుటకును ఇది సాధన మని విశదీకరింపబడినది. జలము నుండి గంధ తన్మాత్రమును, దాని నుండి పృథివియు ను పుట్టును. సలిల పృథివీ పదార్థముల మధ్యమావస్థలో నున్న ద్రవ్యము గంధ తన్మాత్ర మనబడును. విశిష్ట గంధ తత్త్వము దాని లక్షణము రసము గలిగి యుండి, విశిష్ట స్పర్శనము గలిగి యుండుట పృథివీ లక్షణ మని చెప్ప బడినది. ఈ పృథివి - గంధము, మాధుర్యము, నలుపు మున్నగు రూపము, చల్లదనము, వేడియు గాని - స్పర్శము అను గుణములు గలిగి యుండును. అంతే కాక, దీని యందు తేజస్సు యోగము వలన గలిగిన పాకము వలన విచిత్ర వర్ణములును, విచిత్ర రసములును

గలుగు నని తెలియజేయబడినది. ఇది మనస్సునకును ఆప్యాయనమును గలిగించుటలో సహకరించును. ఈ పృథివియే మట్టి, రాయి, అన్నము, ఔషధము మున్నగు రూపములలో బహు విధములుగా నుండు నని, దీని యందు శబ్ద స్పర్శ రూప రస గంధము లను అయిదు గుణము లుండు నని, ధారణమున కిది హేతు వనియును వివరింపబడినది.

భూతములయందు పంచీకరణ ప్రక్రియచేత, శబ్దాది గుణములు కానవచ్చుచుండు నని తెలియజేయబడినది. పంచీకరణ మనగా - భగవంతుడు మొదట పంచ భూతములను సృష్టించి, ఒక్కొక్క భూత మును రెండు సమ భాగములు కావించి, ఆ రెండు భాగములలో నొక భాగమును ఒక చోట నుంచి, రెండవ భాగమును నాలుగు భాగములు కావించి, ఆ నాలుగు భాగములను మిగిలిన నాలుగు భూతములలో కలుపు నని, ఇట్లన్ని భూతములను కలుపగా, ఒక్కొక్క భూతమున తన భాగము సగమును, మిగిలిన నాలుగు భూతముల భాగములు మిగిలిన సగ భాగ మగు నని విశదీకరింపబడి నది. అనగా, ప్రతి భూతము నందును ఎనిమిది భాగములలో నాలుగు భాగములు స్వాంశమును, మిగిలిన నాలుగు భాగములు మిగిలిన నాలుగు భూతములలో యుండు నని; ఈ విధముగా అన్ని భూత ములు ఇతర భూతములతో కలిసి యున్నను, అధిక భాగము గల భూతముగా వ్యవహరింపబడుచుండు నని తెలియజెప్పబడినది. 'ఆ తేజో జల పృథివీ తత్త్వములను ఒక్కొక్క దానిని తక్కిన దానితో మిశ్రము గావింతును'[122] అను శ్రుతి వాక్యము ననుసరించి చెప్పబడిన త్రివృత్కరణము పంచీకరణమునకు ఉప లక్షణ మని, పంచ భూత

---

122. తాసాం త్రివృత మేకైకాం కరవాణి. (ఛాం. ఉ. 6-3-2)

ములతో 'మహత్తు' 'అహంకారము'ను గూడ కలిపి సప్తీకరణ మనియు జెప్పుదు రని పెద్దలు సాయించియున్నారు.

ప్రకృతి, మహత్తు, అహంకారము, ఏకాదశేంద్రియములు (పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు), పంచ తన్మాత్రములు, పంచ భూతములు - అను ఇరువది నాలుగు తత్త్వము లలో - పంచ భూతములు, ప్రకృతి, మహ దహంకారములును శరీర మునకు ఉపాదాన కారణ మగు నని, ఏకాదశేంద్రియములు అభర ణములలో పొదుగబడిన రత్నముల వలె శరీరమునందు గూడి యుండు ననియు, ఇవి ప్రత్యేకముగ అసంఖ్యాకము లయి, ప్రతి జీవునికి వేరు వేరుగా నుండు ననియు వివరీకరించి చెప్పబడినది.

'చేతనమునకు నియతముగా ఆధేయ శేషభూత మగుచు అపృథ క్సిద్ధ మగు ద్రవ్య విశేషము శరీరము' అని శరీర లక్షణము చెప్పబడినది. అపృథ క్సిద్ధ మనగా - నియమింపబడున దని, ఆధేయ - మనగా - ఆశ్రయించి యుండున దని, విశేష మనగా - అంగభూత మైన దని వివరింపబడినది. చేతను డనగా - చైతన్య విశిష్టు డగు జీవుడు, ఈశ్వరుడు నని చెప్పి, చేతనునికి తాను వసించు శరీరము తన కాధేయ మని, అనగా - తన నాశ్రయించి నియమముగా నుండునట్టి దని, అట్లే, శరీరము చేతనునికిని యాప్య మని, అనగా - నియ మింప దగిన దని, అంగభూతమును అగుచున్న దని వివరించబడినది.

పంచ భూతములు, వాని తన్మాత్రలును గూడిన ఈ శరీరము జీవ విరహిత మైన రూపము. ఇది 'అన్నమయ కోశము' అని చెప్ప బడినది. దీనినే 'స్థూల శరీర' మనియు చెప్పియున్నారు. కేవల పంచ భూతాత్మక మగు ఈ అన్నమయ కోశమును ఉపాధిగ గొని, అందు.

జ్ఞాన కర్మేంద్రియములు, మనస్సును గలిగి యుండునట్టి ఆవరణమును 'మనోమయకోశ' మని సాయించియున్నారు. ఈ మనోమయ కోశ మును స్థూల శరీర మగు అన్నమయ కోశమును, ప్రాణాపాన వ్యానోదాన సమాన పంచ వాయువులు ఒక విధ మగు ఆవరణముగ నేర్పడ, కలిసియుండు ననియు, అట్టి వాయువులనే 'ప్రాణ' మను చున్నా రనియు తెలియజేయబడినది. వాని ఆవరణమును 'ప్రాణ మయ కోశము' అందు రని తెలియజెప్పబడినది. మహత్తు (బుద్ధి), అహంకారము, మనస్సును పరస్పర సంబంధము గలిగి, సమస్త వ్యాపారములు నిర్వర్తించుటకు మంత్రుల వలె ఆలోచించుచు, ఏదియో యొక తీర్మానమునకు వచ్చుచుండు నని, అందుచేత ఈ మూడింటికిని 'అంతఃకరణము' అను ఏక నామము కల దని నిర్ధీక రింపబడినది. మహత్తునకు (బుద్ధికి) పై మెట్టుగ భగవ చ్ఛక్తి స్వరూ పావరణ మగు 'మూల ప్రకృతి' విలసిల్లు నని, ఈ పరమాత్మ స్వరూ పము ప్రకృతి శరీరమందును, ప్రతి పదార్థమందును ప్రకాశించు చుండు నని వివరింపబడినది. చేతనము లందు ఆత్మావరణ ప్రకృతి రూపమును 'ఆనందమయ కోశ' మందు రని, ఇట్లు ప్రతి చేతన శరీర మును - అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయావరణము లను గలిగియుండు నని, వీనినే పంచకోశము లందు రని తెలియజేయబడినది. అన్నమయ కోశమును 'స్థూల శరీర' మనియు, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశ సముదాయ మును 'సూక్ష్మ శరీర' మనియు, ఆనందమయ కోశమును 'కారణ శరీర' మనియు, అన్నమయ కోశము కాక, తక్కిన కోశము లన్నియు గలిసియున్న జీవాత్మ స్వరూపమునకు 'లింగ శరీర' మని పే రనియు తెలియజేయబడినది.

శరీరము 'నిత్యము', 'అనిత్యము' అని రెండు విధములుగ చెప్పబడినది. త్రిగుణ ద్రవ్యము, కాలము, జీవుడు, శుభాశ్రయాదికమైన ఈశ్వర శరీరమును నిత్యములు. గరుడుడు, శేషుడు మున్నగ నిత్యసూరుల శరీరమును నిత్యమే. అనిత్య శరీరమును 'అకర్మకృతము', 'కర్మ కృతము' అని రెండు విధములుగా చెప్పబడినది. మహా దశావతారాది రూప మగు ఈశ్వర శరీరము అకర్మ కృత మగు అనిత్య శరీర మనియు, అనంత గరుడాదులు తమ ఇచ్ఛానురూపముగా ధరించు ఆ యా రూపములను అనిత్యాకృత కర్మ శరీరములే యని వివరింపబడినది. కర్మకృత శరీరమును రెండు విధములుగా పేర్కొనబడినది. ఒకటి సంకల్ప సహాకృత కర్మకృత మని, రెండవది - కేవలము కర్మకృత మని, సౌభరి మున్నగువారి శరీరము సంకల్ప సహాకృత మని, ఇతరుల శరీరములు కేవల కర్మకృతము లని చెప్పబడినది. కేవల కర్మకృత శరీరము రెండు విధము లని, అవి - స్థావర శరీరము, జంగము శరీర మని తెలియజేయబడినది. స్థావరము లనగా - శిలలు, చెట్లు, పొదలు, లతలు మున్నగున వని వివరించి, జంగములు నాలుగు విధము లని చెప్పపడినది. అవి - దేవ యోనులు, మనుష్యులు, తిర్యక్కులు, నారకులు అనువారి శరీరము లని, అసుర, యక్ష, రాక్షసాదులు దేవయోను లని, భూలోకమున నుండు బ్రాహ్మణ క్షత్రియాదులు మనుష్యు లని, మృగములు, పక్షులు, సరీసృపములు, మున్నగునవి తిర్యక్కు లని, రౌరవాది నరకములందు పాపానుభవమును బొందుచున్నవారు నారకు లని పూర్వాచార్యులు విశదీకరించియున్నారు. ఉద్భిజ్జములు, స్వేదజములు, జరాయుజములు, అండజములు అనియు శరీరములు నాలుగు తెరగులుగా జెప్పబడినవి. ఉద్భిజ్జము లనగా - భూమిని చీల్చుకొని పుట్టునట్టి తరు గుల్మాదులు. స్వేదజము లనగా - ఉక్క వలన జనించు క్రిమి కీటకాదు లనియు,

జరాయుజము లనగా - యోనిజాతము లయిన పశువులు, మనుష్యులు మున్నగువా రనియు, అండజము లనగా - గ్రుడ్డు వలన బుట్టునట్టి పక్షులు, బల్లులు మున్నగున వని వివరించబడినది. అంతే కాక, అయోనిజాత శరీరములును గల దని చెప్పి, బ్రహ్మ, మధుకైటభులు మున్నగు దేవజాతివారును, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపది మున్నగు మానవ జాతివారును, ఐరావతము, స్వేదజము లగు క్రిమి కీటకాదులు, తిర్యక్కులును అయోనిజము లని విశదీకరింపబడినవి.

ఈ విధముగా పంచభూత సృష్ట్యనంతరము పంచీకృతము లయిన భూతములతో ఈశ్వరుడు అండముల సృష్టించు నని, అండ సృష్టికి పూర్వసృష్టి యంతయు - అనగా, ఇరువది నాలుగు తత్త్వముల సృష్టి యంతయు 'సమష్టి సృష్టి' అనబడు నని వివరింపబడినది. అటు పిమ్మట, పంచీకృత పంచ భూతములతో ఈశ్వరుడు బ్రహ్మాండ సృష్టి జరిగించు నని, అది మొదలుకొని బ్రహ్మేంద్రాదుల సృష్టి - 'వ్యష్టి సృష్టి' అనబడు నని విప్పి చెప్పబడినది.

ప్రకృతి మొదలగునవి ఈశ్వరునికి, జీవునికిని - భోగ్యములు, భోగోపకరణములు, భోగస్థానములు నగు నని చెప్పబడినది. భోగ్యము లనగా - అనుభవింపదగిన శబ్ద స్పర్శాది విషయము లని, భోగోపకరణము లనగా - భోగముల ననుభవించుటకు నిర్ణీతము లయిన స్థానము లగు పదునాలుగు లోకముల మధ్యభాగమున గల బ్రహ్మాండ సమూహాము లని తెలియజేయబడినది. పంచీకరణము బొందిన పంచ భూతములతో - వెలగపండు ఆకారమున రచింపబడిన ప్రకృతి వికార ద్రవ్యమే అండ మన బడు నని విశదీకరింపబడినది. ఈ విధముగా శ్రీమద్రామానుజ యతిచంద్రులు ప్రకృతి స్వరూపమును స్పష్టీక

రించియున్నారు. జీవుడు, ప్రకృతి రెండును ఈశ్వరునితో పాటు నిత్యము లని, వీనికి (జీవ ప్రకృతులకు) ఈశ్వరు డగు శ్రీమన్నారాయణుడే సర్వశేషి యని సాయించియున్నారు. ఇట్లు ఈశ్వర శక్తి వ్యాపితములై, మూలప్రకృతి సంభవము లయిన పదార్థము లన్నియు. వృక్ష లతాదులు, క్రిమి కీటక పశు పక్ష్యాదులు మనుజులుగ చేతన పదార్థములుగను, జడము లయిన లోహములు, శిలలు మొదలగు అచేతన పదార్థములుగను కనుపించుచున్నవి.

## ముగింపు

శ్రీమద్రామానుజ యతిసార్వభౌములు శ్రీభాష్యాది ప్రముఖ గ్రంథరాజములలో - శ్రీమన్నారాయణుడే పరతత్త్వము' అను విశేషమును ప్రతిపాదించియున్నారు అంతేకాక, అనేక జీవాత్మలకును, అశేష లోకములకును శ్రియఃపతియే అధినాథు డను పరమార్థమును స్థాపించియున్నారు. సర్వ వేద సారభూతుడు, ఉపనిషత్ప్రతిపాద్యుడు, పరబ్రహ్మ వాచ్యు డగు శ్రీమన్నారాయణుడే సర్వశేషి, సర్వవ్యాప్తి, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు, సర్వభూత హితుడు అని తెలిసికొనక, సంసార సాగరమున మోహాంధులై పరిభ్రమించు అజ్ఞాను లగు పామరులను తరింపజేయుటకై భక్తి - ప్రపత్తు లను సులభ మోక్షోపాయమును ప్రబోధించిన మహనీయ కారుణ్యమూర్తు లు శ్రీమద్రామానుజ యతిచూడామణులు. విలక్షణ పారమార్థిక జ్ఞాన సంపన్నులై, వేద విరుద్ధములగు మతములను ఖండించి, శ్రీ విశిష్టాద్వైత మత వ్యవస్థాపకులై, దిగంత విశ్రాంత కీర్తిమంతులైన జగదాచార్యవర్యులు శ్రీమ

ద్రామానుజ యతిశేఖరులు. ఏతాదృశ మహా ప్రభావోపేతులు, సద్గుణోదారులు నగు శ్రీమద్రామానుజ యతిచంద్రులు సంస్థాపించి ప్రవచించిన శ్రీ విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యమును అవగతమొనర్చుకొని, పరమ ప్రాప్యమైన ఎంబెరుమానారుల చరణ కమలైక దాస్యమే - సర్వదేశ, సర్వకాల, సర్వావస్థల యందును అభిలషింపదగినట్టి దని దృఢముగ విశ్వసించి, లోకు లెల్లరు భగవద్భాగవత కైంకర్య ధురంధరులై, పురుషోత్తముడు, వాసుదేవుడు, సర్వేశ్వరుడు నగు పరమ పురుషుని అపార కారుణ్య సౌశీల్య వాత్సల్య మహా జలధి యందు ఓలలాడి, ధన్యత జెందుదురు గాక !

" రామానుజార్య దివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్. "



# శ్రీ రామానుజ సిద్ధాంత ప్రవర్తకులు

'విద్యాభూషణ - కవితా విశారద'

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## 1. శ్రీవత్సాంక మిశ్రులు

శ్రీవత్సాంక మిశ్రులు (క్రీ: శ: 1010 - 111) అనబడు కూరేశులు - కాంచీ పురమునకు సమీపమున గల 'కూరం' అను గ్రామమునకు చెందినవారు వీరిని తమిళమున - 'కూరత్తాళ్వారులు' అని వ్యవహరింతురు వీరు శ్రీ రామానుజుల శిష్యులలో కెల్ల మిక్కిలి ప్రతిభా సంపన్నులు. వీరు - శ్రీభాష్య రచనలో తమ ఆచార్య పాదు లగు శ్రీ రామానుజులకు విశేషముగ సహకరించి, విశిష్టాద్వైత సిద్ధాంత వ్యాప్తికి అమూల్యమైన సేవ గావించిరి. ఈ శ్రీవత్సాంక మిశ్రులు - (1) అతిమానుష స్తవము (౨) వరదరాజ స్తవము (౩) వైకుంఠ స్తవము (౪) శ్రీ స్తవము (౫) సుందర బాహు స్తవము అను భక్తి ప్రబోధకము లగు స్తోత్రము లైదింటిని రచించిరి. మఱియును వీరు - 'అభిగమనసారము' అను గ్రంథమును కూడ రచించియున్నట్లు - శ్రీ వేదాంత దేశికులు తమ 'పాంచరాత్ర రక్ష'

అను గ్రంథమున తెలిపియున్నారు.* కాని, ఈ గ్రంథ మిపుడు కాన రాదు.

ఈ శ్రీవత్సాంక మిశ్రులు - 'ఆంగీరస' గోత్రజులు. తల్లి - పెరిందేవమ్మ. తండ్రి - దామోదరులు. భార్య - ఆండాళమ్మ. ఈయమ మహా జ్ఞానవంతురాలు. పరాశరభట్టరు, శ్రీరామపిళ్ళ అను వార లిరువురును వీరి కుమారులు. ఈ శ్రీరామ పిళ్ళను - 'వ్యాస భట్టరు' అనియు వ్యవహరింతురు.

## 2. గోవింద మిశ్రులు

గోవింద మిశ్రులు (క్రీ: శ: 1131) అనువారు - శ్రీ రామానుజుల శిష్యులు. వీరు - 'విజ్ఞాన స్తుతి' అను గ్రంథమును రచించిరి. ...యర్యాది - శ్రీవైష్ణవ మతమునకు సంబంధించిన మూల సిద్ధాంతము ...ను వివరించు గ్రంథము వీరికి - 'గోవింద భట్టరు' అనియు నామాం ...ర మున్నది. ఈ గోవింద మిశ్రులు - శ్రీ రామానుజులకు పినతల్లి ...నయులు. తండ్రి - కమల నయన భట్టరు. వీరిది - శ్రీ పెరుంబూ ...దూరుకు సమీపమున గల 'మధుర మంగళ' మను గ్రామము. ఈ ...ోవింద మిశ్రులు - మహా వైరాగ్య సంపన్నులు. వీరి వైరాగ్య విశే ...మునకు సంతుష్టులైన భగవద్రామానుజులు - వీరికి - తురీయా ...శమము నను గ్రహించుచు, - 'ఎంబారులు' అని నామకరణము ...వించిరి. తాము పరమ పదించునపుడు వీరిని శ్రీ రామానుజులు -

---

* శ్రీవత్సాంకమిశ్రై రపి వటుక పూర్వాశ్యర్థవయా ఆభగమన సార మువది ప్ర దాదావుక్త మ్ - "ప్రాత రుత్థాయ స్వగురో శ్చరణారవిందే స్వాత్మానం ంర్ప్య, కృతార్థ నిర్భరం స్వాత్మాన మనుసంధాయ, స్నానాదికం స్వకర్మ కృత్వా, ా దేశే ఆసీ నసీ" ఇత్యాది. — (పాంచరాత్ర రక్ష 111 పుట.)

పరాశర భట్టరు వారికి ఒప్పగించిరి. నాటి నుండియు వీరు - ఆ భట్టరు వారికి శిష్యులై, స్వాచార్యుల యెడ మిగుల విశ్వాసము గలవారై యుండిరి.

## 3. ప్రణతార్తిహరాచార్యులు

ఈ ప్రణతార్తి హరాచార్యులు (క్రీ: శ: 1057 - 1157) శ్రీ రామానుజుల శిష్యులు ఆత్రేయ గోత్రులు, వీరిని - 'కిడాంబి అచ్చాన్' అనియు వ్యవహరింతురు. వీరికి శ్రీ రామానుజులు - 'వేదాంతోదయన' అను బిరుదము నొసంగి గౌరవించిరి.

వీరు శ్రీరామానుజుల నాశ్రయించి, శ్రీభాష్యాది గ్రంథముల నన్నిటిని అధికరించి, వారికి సేవ గావించుచు, వారి వద్ద క్రమ క్రమముగా సకల రహస్యార్థములను గ్రహించిరి. వీరి రచన లేవియు నేడు కానరావు. కాని, వీరు - డెబ్బది నాలుగు (74) సింహాసనాధిపతులలో నొకరుగా ప్రసిద్ధులు.

## 4. నంజీయర్

వీరు - 11, 12 శతాబ్దములకు చెందినవారు. వీరిది - మైసూరు రాష్ట్రమున గల 'మేలుకోట' అనబడు తిరునారాయణపురము. వీరిని - వేదాంత మునులు, రంగనాథ మునులు, నారాయణ మునులు అను నామములతో వ్యవహరించెడివారు. వీరు వేదాంతమును గురించి అద్భుతముగా ప్రసంగించెడివారు. కనుక, వీరికి - 'వేదాంత మునులు' అను పేరు వచ్చెను. పరాశర భట్టరు వీరిని వాగ్వాదమున పరాజితుల గావించి, శిష్యులనుగా జేసికొనిరి. అపుడు వీరు - 'రంగనాథ మునులు' అనియు, సంన్యసించినయనంతరము 'నారాయణ మునులు' అనియు వ్యవహరింపబడిరి. పరాశర భట్టరు ఒకానొకపుడు

వీరిని శ్రీరంగమున కలిసినపుడు - 'ఎవ రీయన ? నంజీయరా !' అని ఆశ్చర్యముగ ప్రశ్నించి రట ! అందువలన, వీరికి - 'నంజీయర్' అను బిరుద మేర్పడెను. అదియును గాక, వీరికి - 'పెరియ జీయర్' అనియు మఱి యొక గౌరవ నామ మేర్పడెను ఈ నంజీయరు - తిరుప్పల్లాండు, తిరుపళ్ళి యెళుచ్చి, కణ్ణినుణ్ శిరుత్తాంబు - మొదలగు ద్రావిడ దివ్య ప్రబంధములకు వ్యాఖ్యానములు రచించి, ప్రఖ్యాతి వహించిరి. అదియును గాక, వీరు - ఋగ్వేదమును గేయ రూపమున రచించిరి. మఱియు - శ్రీ సూక్తమునకు భాష్యమును రచించిరి. ఈ భాష్యములో లక్ష్మీదేవి - సకల శుభ లక్షణోపేత యనియు, కళంక రహిత యనియు, నాథుడైన నారాయణుని సమాన స్థాయిలో విలసిల్లు జగన్మాత యనియు, వర్ణించుచు - వేద శాస్త్ర పురాణేతిహాసముల నుండియు, యామున - రామానుజాది శ్రీ సంప్రదాయ ప్రవర్తనుల గ్రంథముల నుండియు అనేక ప్రమాణముల నుల్లేఖించి యున్నారు.

## 5. పరాశర భట్టరు

పరాశర భట్టరు 1074 - వ శతాబ్దమునకు చెందినవారు. వీరి తండ్రి కూరేశులు. ఈ పరాశర భట్టరు - విష్ణు సహస్ర నామ భాష్యము - భగవ ద్గుణ దర్పణము, అష్ట శ్లోకి, తత్త్వ రత్నాకరము, శ్రీగుణ రత్నకోశము, శ్రీ రంగరాజ స్తవము, అధ్యాత్మ ఖండద్వయ వివరణము అను గ్రంథములనే గాక, నాలాయిర దివ్య ప్రబంధము నందలి కొన్ని భాగములకు వ్యాఖ్యానములను సైతము రచించిరి.

## 6. శ్రీరామ మిశ్రులు

వీరు క్రీ. శ. 1094 - వ సంవత్సరమున జన్మించిరి. శ్రీ రామానుజుల పాదారవిందముల నాశ్రయించి, శ్రీభాష్యమును ముమ్మారు

అధ్యయనము గావించిరి. ఈ శ్రీరామ మిశ్రులచే రచింపబడిన 'పదార్థ సంక్షేపము' అను గ్రంథమున, విశిష్టాద్వైత సిద్ధాంతము - (1) జీవుడు (2) దేవుడు (3) మాయ (ప్రకృతి) (4) మాయను తొలగించు మార్గములు (5) మోక్ష సాధనము (6) మోక్ష స్వరూపము - అను ఆరు (6) ప్రకరణములలో వివరింపబడినది. మఱియును వీరు - నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి' యను ద్రావిడ దివ్య ప్రబంధమునకు - 'ఆరాయిరప్పడి' యను పేర నొక వ్యాఖ్యానమును రచించిరి. ఈ వ్యాఖ్యానమును - 'షట్సాహస్రి' అని వ్యవహరించుట పరిపాటి. మూల మంత్రము, (తిరుమంత్రము), రహస్య త్రయము అను మఱి రెండు గ్రంథములను కూడ వీరు రచించిరి.

## 7. వరద విష్ణు మిశ్రులు

వీరు - 10, 11 శతాబ్దములకు జెందినవారు. వీరు శ్రీ రామానుజుల సోదరీ పుత్రులు. కాంచీ పురమునకు సమీపమున గల 'నడాదూర్' గ్రామ వాస్తవ్యులు. వీరిని - 'నడాదూర్ ఆళ్వారులు' అనియు వ్యవహరింతురు, వీరు గొప్ప తర్క పండితులు. శ్రీమద్రామానుజులకు శిష్యులై, వారి శ్రీభాష్య రచనలో విశేషముగ తోడ్పడినవారు.

## 8. పంగివంశేశ్వరులు

శ్రీరంగ నారాయణాచార్యులు అనబడు వీరు - క్రీ. శ. 11, 12 శతాబ్దములకు జెందినవారు. వీరు - శ్రీ రామానుజ విరచిత మగు నిత్య గ్రంథమును ఆధారముగ నిడుకొని, 'ఆహ్నిక కారిక' అను పేర నొక గ్రంథమును రచించిరి. ఇందు - 538 కారికలు కలవు. ఈ గ్రంథమున - శ్రీమన్నారాయణుని నిత్యము అర్చించు విధానము

వివరింపబడినది. అదియును గాక, ధర్మ శాస్త్రముల ననుసరించి శ్రీవైష్ణవులు ఆచరింపవలసిన సంస్కారములు సైతము ఇందు వివరింపబడినవి. ఈ గ్రంథమును - 'వంగేశ్వర కారికలు' అని వ్యవహరింతురు ఇందు - (1) అభిగమనము (ప్రాతఃకాల ప్రార్థనము) (2) ఉపాదానము (నివేదనలు సమర్పించుట) (3) ఇజ్య (పూజించుట) (4) స్వాధ్యాయము (వేదాధ్యయనము) (5) యోగము (ధ్యానము) అను ఐదు విషయములు వివరింపబడినవి. ఈ వంగీ ంచేశ్వరు లింకను - 'ప్రాత ర్నివేదన కారికా' అను గ్రంథమును కూడ రచించినట్లు ప్రతీతి కలదు

## 9. శ్రీ విష్ణు చిత్తులు

వీరికి - ఇంగిలాళ్వారులు (క్రీ: శ: 1106 - 1206) అనియు నామాంతర మున్నది. వీరు కురుకేశుల శిష్యులు. విష్ణు పురాణము నకు - 'విష్ణు చిత్తీయ' మను వ్యాఖ్యానమును రచించి, ప్రశస్తి గాంచిరి. వీరిచే రచింపబడిన గద్యత్రయ వ్యాఖ్యానము, ప్రమేయ సంగ్రహము, సంగతి మాల - అను గ్రంథము లిపు డలభ్యములు

## 10. ఆత్రేయ రామానుజులు

ఆత్రేయ రామానుజులు అనువారు (క్రీ. శ: 1220 - 1310) పద్మనాభాచార్యుల కుమారులు. వేదాంత దేశికుల మేనమామ. వీర ఆచార్యులు - 'వరదాచార్యులు' అనబడు 'నడాదూర్ అమ్మాళ్' అనువారు. 'శ్రుత ప్రకాశిక' అను గ్రంథమును రచించిన సుదర్శనుల సహాధ్యాయులు. వీరిని - 'వాది హంసాంబు' లనియు, 'వాది హంస

నవాంబుధు' లనియు వ్యవహరింతురు. వీరు రచించిన 'న్యాయ కులి శము' అను గ్రంథమునకు - 'హేతుబద్ధమైన వివేకముతో గూడిన మెఱపు శాణము' అని యర్థము. ఇందు అటనట ప్రాస్తావిక శ్లోకము లనేకములు ప్రమాణములుగా పేర్కొనబడినవి. విశిష్టాద్వైత సిద్ధాంత మిందు - పదమూడు (13) విధము లగు వాదనలచే బల పరచబడినది. అద్వైత, భేదాభేద సిద్ధాంతములు విమర్శింపబడినవి.

## 11. వరద నారాయణ భట్టారకులు

వీరికి - 'వకుళాభృత్ కింకరు' లనియు నామాంతర మున్నది వీరిచే రచింపబడిన ప్రజ్ఞా పరత్రాణము, న్యాయ సుదర్శనము అను రెండు గ్రంథములలో - రెండవ గ్రంథమునందలి కొంత భాగమే నేడు లభించుచున్నది. ఈ రెండు గ్రంథములును విశిష్టాద్వైత సిద్ధాంతము ననుసరించి రచింపబడినవి.

## 12. అభయ ప్రద రాజులు

క్రీ. శ: 1227 లో జన్మించిన వీరికి - అభయ ప్రద సూరులు, కృష్ణ సూరులు అను నామాంతరము లున్నవి. తమిళమున వీరిని - 'పెరియ వాచ్చాం పిళ్ళై' అని వ్యవహరింతురు

" అభయ ప్రద నామానం అస్మ ద్గురు ముపాం భజే. "

అని, 'వాదికేసరి' బిరుదాలంకృతు లగు సౌమ్యజామాతృమునులు - 'తత్త్వ నిరూపణము' అను తమ గ్రంథమున స్తుతించియున్నారు.

ఈ అభయ ప్రద రాజులు - నాలాయిర దివ్య ప్రబంధమునకు వ్యాఖ్యానమును రచించి, 'వ్యాఖ్యాన చక్రవర్తి' అను బిరుదు

పొందిరి అదియును గాక, 'తని శ్లోకి వ్యాఖ్య' అను గ్రంథమునకు కూడ మణిప్రవాళ భాషయందే వ్యాఖ్యానమును రచించిరి. ఇయ్యది రామాయణమునందలి కొన్ని ముఖ్య శ్లోకములకు వ్రాయబడిన వ్యాఖ్యానము ననుసరించి రచింపబడినది. మఱియును వీరు - కొన్ని రహస్య గ్రంథములను రచించిరి. అట్టి వానిలో - 'అష్ట రహస్యములు' అనున దొకటి. శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రతిపాదకము లగు మూలరహస్యములకును వ్యాఖ్యానముగ వీరు - 'రహస్య త్రయము' అను గ్రంథమును రచించిరి. ఋగ్వేదాంతర్గత మగు జితంతా స్తోత్రమునకును, కొన్ని ప్రాస్తావిక శ్లోకములకును, యామునాచార్యుల స్తోత్ర రత్నమునకును శ్రీ రామానుజ విరచిత మగు గద్య త్రయమునకును వ్యాఖ్యానములు రచించి, 'వ్యాఖ్యాన చక్రవర్తి' అను బిరుదము నార్జించి, విఖ్యాతి వహించిరి.

## 13. మేఘనాద సూరులు

12 - వ శతాబ్దమునకు చెందిన మేఘనాద సూరులు - శ్రీ రామానుజుల శిష్యులగు శ్రీరామ మిశ్రుల వంశస్థులు. జననీ జనకులు - అధర్వణయిక, ఆత్రేయ రంగనాథులు అను వారలు. ఈ మేఘనాద సూరులకు - హస్త్యాద్రి నాథుడు, వరదరాజు, రామచంద్రుడు అను మువ్వురు సోదరులు కలరు. ఈ మేఘనాద సూరులు - (1) నయ ద్యుమణి, (2) నయ ప్రకాశిక (3) భాష్య భావ ప్రబోధము (4) ముముక్షూపాయ సంగ్రహము - అను నాల్గు గ్రంథములను రచించిరి.

మొదటి గ్రంథ మగు 'నయ ద్యుమణి'లో - పండ్రెండు (12) ప్రకరణములు కలవు. ఈ గ్రంథము - శ్రీ రామానుజుల నిశ్శబ్ద

లక్షణములను వివరించుటే గాక, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసల నడుమగల సంబంధమును సైతమువివరించును. రెండవది యగు 'నయ ప్రకాశిక' అను గ్రంథము - భగవద్రామానుజుల శ్రీభాష్య వైశిష్ట్యమును వివరించు వ్యాఖ్యానము. మూడవది యగు 'భాష్య భావ ప్రబోధము' అను గ్రంథములో 'స్వాధ్యాయో అధ్యేతవ్యః' అను వేద ప్రమాణము ననుసరించి, తమ వేద శాఖను తాము తెలిసికొనునంతవఱకు వేదాధ్యయనమును తప్పక చేయవలె నని ఇందు ప్రబోధింపబడినది. ఇక నాల్గవది యగు 'ముముక్షూపాయ సంగ్రహము' అను గ్రంథము ఇపు డలభ్యము.

## 14. నారాయణాచార్యులు

క్రీ. శ: 11, 12 శతాబ్దములకు జెందిన 'నారాయణాచార్యులు' అనువారు - 'నీతి మాల' అను గ్రంథమును రచించిరి. ఇందు - (1) బ్రహ్మ జిజ్ఞాస (2) కర్మ జిజ్ఞాస (3) వేదాంత గమనము (4) ప్రపంచ పరిణామవాద ఖండనము (5) బ్రహ్మ పరిణామ వాద ఖండనము (6) శక్తి నిక్షేపము (7) బ్రహ్మ లక్షణము (8) అహం బ్రహ్మస్మి వాదము (9) విధి సూచనము (10) మోక్ష స్వరూపము - మోక్ష మార్గము అను పది ప్రకరణములు కలవు.

జైమిని మహర్షి మీమాంసా సూత్రములను సంగ్రహపఱచి, వానిలో - పరస్పర విరుద్ధము లగు సూత్రములను సమన్వయించి, తాను మఱి యొక గ్రంథమును రచించినట్లే, 'నీతిమాల' అను ఈ గ్రంథము - నారాయణాచార్యులచే రచింపబడినది.

## 15. సేనేశ్వచార్యులు

ఈ సేనేశ్వరాచార్యులకు - 'భాగవత సేనాపతు' అను నామాంతరము కలదు. వీరు - 'న్యాయ కలాప సంగ్రహము' అను పేర నొక గ్రంథమును 331 కారికలతో - బ్రహ్మసూత్ర సంగ్రహముగా రచించిరి

## 16. వాత్స్య వరదాచార్యులు

వీరు (క్రీ. శ: 1167 - 1275) దేవరాజాచార్యుల తనయులు. వీరిని - 'నడాదూర్ అమ్మాళ్' అని వ్యవహరించుట పరిపాటి. వీరి నివాసము కాంచీపురము, 'ఆత్రేయ రామానుజులు' అనువారి వీరి ఆచార్యులు. ఈ వరదాచార్యుల రచనలివి :- (1) తత్త్వ నిర్ణయము (2) తత్త్వసారము (3) ప్రపన్న పారిజాతము (4) ప్రమేయ మాల (5) మంగళాశాసన స్తోత్రము (శ్రీ వరదరాజస్వామిని గూర్చి) (6) హేతిపుంగవ స్తవము (7) పరత్వాది పంచకము (8) శ్వేతాశ్వతరోపనిషద్ వ్యాఖ్యానము అనునవి

## 17. శ్రీకృష్ణ గురూజీ

శ్రీకృష్ణ గురూజీ అనువారు దాదాపు 13 - వ శతాబ్దారంభమునకు చెందినవారు. వీరు - 'సోమయాజి ఆండాన్' అనువారి శిష్యులు. శ్రీవైష్ణవాచారములను, నిత్య విధులను వేదాంత దేశికులు- తాము రచించిన 'పాంచ రాత్ర రక్ష' అను గ్రంథమున వివరించుచు, ఈ శ్రీకృష్ణ గురువులను గురించి పలు మారులు ప్రస్తావించియున్న కారణమునుబట్టి, ఈ శ్రీకృష్ణ గురువులు - శ్రీవైష్ణవాచార

సంపన్ను లని స్పష్ట మగుచున్నది. వీరు భాగవతమునకు వ్యాఖ్యానమును రచించినట్లు ప్రతీతి కలదు.

## 18. సుదర్శన భట్టరు

సుదర్శన సూరి, వేదవ్యాస భట్టాచార్యులు, వ్యాసాచార్యులు అను నామాంతరములు గల ఈ సుదర్శన భట్టరు - క్రీ. శ. 13, 14 శతాబ్దములకు జెందినవారు. వాగ్విజయ భట్టారకుల తనయులు. వాత్స్య వరదాచార్యుల శిష్యులు వీరి రచనలు :- (1) శ్రుత ప్రకాశిక (శ్రీభాష్యమునకు సుప్రసిద్ధమైన వ్యాఖ్యాన గ్రంథము) (2) శరణాగతి వ్యాఖ్య (3) తాత్పర్య దీపిక (4) శ్రీ రామానుజుల వేదార్థ సంగ్రహమును గురించి వ్యాఖ్యానము (5) సుబాలోపనిషద్వ్యాఖ్యానము (6) సంధ్యావందన భాష్యము అనునవి.

## 19. వాదికేసరి మిశ్రులు

వీరు - పెరియవాచ్చాంపిళ్ళ శిష్యులు. వీరికి - 'సౌమ్యజామాతృ మునులు', 'అళగియ మణవాళ జీయరుస్వామి' - అను నామాంతరములు కలవు. వీరి రచన లివి :- (1) అధ్యాత్మ చింత (2) గీతా సారము (3) తత్త్వ దీపము (4) తత్త్వ దీప సంగ్రహ కారిక (5) పన్ని రాయిర ప్పడి (6) ప్రమాణ సంగ్రహము (7) రహస్యత్రయ కారిక (8) రహస్యత్రయ వివరణము (9) నరసింహాష్టకము అనునవి.

## 20. పిళ్ళలోకాచార్యులు

వీరు - (క్రీ. శ. 1205 - 1326) వడక్కు తిరువీధి పిళ్ళ కుమారులు. ఈ పిళ్ళలోకాచార్యులు అష్టాదశ (18) రహస్య గ్రంథములను

రచించిరి. అట్టివానిలో - తిరుమంత్రార్థము, శ్రీవచన భూషణము, తత్త్వ త్రయము, అర్థ పంచకము మున్నగు గ్రంథములు సుప్రసిద్ధములు. 'అర్థ పంచకము' అను రహస్య గ్రంథములో - (1) భగవ తత్త్వము (2) ఆత్మ తత్త్వము (3) జీవిత పరమావధి (4) మోక్ష మార్గము (5) ముముక్షువులు అధిగమింపవలసిన అవరోధములు - అను ఐదు ప్రకరణములు గలవు. మోక్ష సాధనకు భగవ త్సేవయే సులభ మార్గ మని, ఈ 'అర్థ పంచకము' నొక్కి వక్కాణించు చున్నది.

పైన పేర్కొనబడినవారలే గాక, ఇంకను - 'వరవర మునులు' అనబడు 'మణవాళ మహామునులు' మున్నగువా రనేకులు - శ్రీ రామానుజ సిద్ధాంత ప్రవర్తకులుగా ప్రసిద్ధి గాంచియున్నారు.



# శ్రీ పిళ్ళలోకాచార్యుల వైభవము

" గానకళా ప్రపూర్ణ - సంగీత సాహిత్య కళానిధి - ఉభయ వేదాంత విశారద "

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



## శ్రీవైష్ణవము అనాది వేద మతము

శ్రీవైష్ణవ మను మతము అత్యంతము అనాది అయిన మతము. ఎంత అనాది అనగా - వేదములు ఎంత అనాదులో - అంత అనాది అయినది కాల విపర్యయాదులచేత అప్పు డప్పుడు ప్రకాశాప్రకాశములు జరుగుచున్నను, విషయము అనాది సిద్ధము అగుటచేతనే -

" యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత !
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్. "

ఓ భారతా ! ఎప్పు డెప్పుడైతే (వేదోక్త) ధర్మమునకు లోపమును, అధర్మమునకు వృద్ధియు గలుగుచున్నదో, అప్పు డంతయు నన్ను నేనే సృజించు కొనుచున్నాను' అని, భగవానుడు వక్కాణించినాడు.

(భ. గీ: 4-7)

" త ద్విష్ణోః పరమం పదమ్ "

ఆ విష్ణు భగవానుని పరమ పదమును - అనంత గరుడ విష్వక్సేనాది అసంఖ్యాకు లగు సూరులు - వేద శరణ శీలురై, స్తోత్ర పరాయణులై, జ్ఞాన స్వరూపులై, నిరంతరము చూచుచుందు' రని వేదము నిర్వ

చించినది. ఈ సూరులు - నిత్య మగు 'త్రిపా ద్విభూతి' యనబడు శ్రీవైకుంఠమునందలివారు కనుక, 'నిత్యసూరులు' అని చెప్పబడిరి.

" పాదో ఽస్యేహా భవ త్పునః - త్రిపాదస్యామృతం దివి. "

అను పురుషసూక్త వచన ప్రకారము - బ్రహ్మలోకము మొదలు కొని, అధోలోకము లనియు, ఏకపా ద్విభూతి, వాని కవ్వల నున్న వైకుంఠము త్రిపా ద్విభూతి. ఏకపా ద్విభూతి యందు జనించి, నిత్య సూరుల వలె వైష్ణవ లక్షణ సమృద్ధి గలిగిన మహాత్ములు - దేహావ సాన సమయమున పూర్వ పురుషాదులచే స్పృశింపబడి, గౌరవింపబడి, ముక్తు లగుచు, నిత్యవిభూతిని చేరి, అచట నిత్యు లగుదురు.

" సో ఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ విపశ్చితా. "

అనెడి ఉపనిష ద్వాక్య ప్రకారము - ముక్తులు వైకుంఠమున సర్వజ్ఞు డగు భగవంతుని కల్యాణ గుణములను రెప్పపాటు లేక, తనివిదీర అనుభవింతురు. ఇట్లు తరింపవలె ననిన, భగవానుడే అనేకము లగు ఉపాయములను వేద శాస్త్రాదుల ద్వారా మనకు తెలియజేసినాడు. తరింపవలె ననిన - ఏ కర్మాచరణమో, జ్ఞానోపార్జనమో, మంత్రో పాసనమో చేయవలెను.

" ఓమి త్యగ్రే వ్యాహరేత్ నమ ఇతి పశ్చాత్. నారాయణాయే త్యుపరిష్టాత్ ఓమి త్యేకాక్షరమ్ నమ ఇతి ద్వే అక్షరే. నారాయణా యేతి పంచాక్షరాణి ఏత ద్వై నారాయణ స్యాష్టాక్షరం పదమ్. యోహవై నారాయణ స్యాష్టాక్షరం

పదమధ్యేతి. అనపబ్రువ స్సర్వమాయు రేతి. విందతే ప్రాజాపత్యం రాయస్పోషం గౌపత్యం. తతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వ మశ్నుత ఇతి. ఏత త్సామ వేద శిరోఽధీతే. "

— (నారాయణోపనిషత్తు)

అని వేద మంత్రమును నిర్దేశించినది. 'ఓం' అని ఒక అక్షరము, 'నమః' అని రెం డక్షరములు, 'నారాయణాయ' అని ఐ దక్షరములు. ఇదియే నారాయణాష్టాక్షర మంత్రము. 'ఓం' అని మొదట పలుక వలెను, 'నమః' అని పిదప, ఆ తరువాత 'నారాయణాయ' అని. ఈ మంత్రమును అధ్యయనము చేసినవాడు పూర్ణాయుర్దాయమును, రాజ ప్రాజ్యత, భూపతిత్వము, తుదకు అమృతత్వమును (పునరావృత్తి రహిత మగు మోక్షమును) పొందగలడు' అని వేద నిర్దేశము.

అన్నిటికిని మూల మగు వేదముచేత నిర్దేశింపబడి, అందఱకును మూల మగు నారాయణుని వైభవమును ప్రతిపాదించిన మంత్రము కనుక, ఈ మంత్రము -

" మూల మంత్ర స్సనాతనః "

అని ఋషులచే నిర్దేశింపబడినది. శ్రీవైష్ణవ సంప్రదాయమున 'తిరు మంత్రము' అని ప్రసిద్ధ మైనది. వేద వాక్యమును ఆధారముగావించు కొని, పరమ ఋషులు మంత్ర మహిమను ఇట్లు వివరించిరి :-

" ఋచో యజూంషి సామాని తథైవాథర్వణాని చ
సర్వ మష్టాక్షరాంతః స్థం య దన్య చ్చాపి వాఙ్మయమ్. "

సమస్త వేదములు, సర్వ వాఙ్మయము అష్టాక్షరి మంత్రమున అంతర్భ వించునవి అని. అంతే కాక -

" బహవో హి మహాత్మానో మునయ స్సనకాదయః
అష్టాక్షరం సమాశ్రిత్య తజ్జగ్ము ర్వైష్ణవం పదమ్. "

సనకాది మునులు, పెక్కురు మహాత్ములు ఈ మంత్రమును ఆశ్ర
యించియే విష్ణు ధామమున కేగిరి అని. మఱియు ఇహలోకైశ్వర్యము
స్వర్గాది పరలోకములు, కైవల్యము, భగవత్పదమును ఈ మంత్రమ
ఉపాసకుల ఇచ్ఛానుసారముగా ప్రసాదించు ననియును పురాణము
యందు ఋషులు చెప్పిరి. ఇంతకును - వేదము చెప్పిన నారాయ
ణాల మంత్రమును జపించి, విష్ణు పదమును చేరగలిగిన బహ
మహాత్ములది, సనకాది మునులదియు వైష్ణవ మతమే కదా
మఱియు - పురాణ ప్రసిద్ధు లయిన ప్రహ్లాదుడు, అంబరీషుడ
మున్నగువారు ఎవరు ? నిర్వివాదముగా వైష్ణవులే. అంతకు ముందు
నముచి, జంభాది రాక్షసులు కూడ పరమ వైష్ణవు లయి, అజేయ
లయిరి - అని పురాణములు చెప్పియున్నవి.

" రాక్షసానాం దేవతానాం సామాన్య మధిదైవతమ్. "

రాక్షసులకును, దేవతలకును విష్ణువే దేవు డని విష్ణుపురాణ వచనము
వైష్ణవు లనగా - విష్ణువు నొకనినే కొలిచెడి భక్తులు. కనుక
'వైష్ణవము అనాది' యనుట కిది చాలును.

## లుప్త కాలము - పున రుద్ధరణము

పైన చెప్పిన విధముగా - వేదముల ద్వారా, స్మృతీతిహా
పురాణముల ద్వారా, ఋషుల ఆచరణము ద్వారా వైష్ణవ సంపత్
ద్వాపరాంతము వఱకును - అనగా, వశిష్ఠుడు మొదలుకొని, శ్రీ
శుకమహర్షి వఱకు పరంపరాగత మైనది. కలియుగారంభమునుం
బౌద్ధాది మతముల వలన వైష్ణవ సంపత్తి మరుగున పడినది. అచ్
టచ్చట కొంత నిలచి లేకపోలేదు. ఏదేని యొక మతము నిల
యుండవలె నన్న, దానికి సంబంధించిన వాఙ్మయము, బోధకుల

ప్రవర్తకులు అవసరము. ద్వాపరాంతము వరకు సంస్కృత వేదము, ఉపనిషత్తులు, భాగవతాది పురాణములు, వ్యాస శుకాది ప్రవర్తకులు వైష్ణవ సమృద్ధిని నిలుపుట జరిగినది.

" వేదశాస్త్రా త్పరం నాస్తి న దైవం కేశవా త్పరమ్ "
" నాష్టాక్షరా త్పరో మంత్రః "

వేద శాస్త్రము కన్న మిన్న లేదు, కేశవుని కన్న దైవము లేదు, అష్టాక్షరము కన్న మిన్న యగు మంత్రము లేదు' అని భుజ మెత్తి చాటిన వేదవ్యాసుని యొక్కయు, విష్ణుకథా శ్రవణమే మోక్షహేతు వని చెప్పిన శ్రీశుకుని యొక్కయు బోధాచరణములు వెనుకకు బోయినవి. వేదబాహ్య మని పూర్వులు నిర్దేశించిన బౌద్ధా దులు పుట్టి, వ్యాపించినవి.

## నాలాయిరము

అది కలియుగ ప్రథమ పాదము. మరల సనాతనము, పరమ వైదికము నైన వైష్ణవ మతము పునరుద్ధరింపబడవలె నని భగవ త్సంకల్పము కలిగినది. అప్పుడే జరిగినది ఆళ్వారుల అవతారము.

" త దాత్మానం సృజామ్యహమ్. "
" జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్. "

అనెడి గీతా వాక్య ద్వయము ననుసరించి, ధర్మగ్లాని సమయమున, తనకు ఆత్మభూతు లగు ఆళ్వారులను భగవానుడు అవతరింపజేసి నాడు. పూర్వ మొక కాలమున, అగస్త్య మహర్షి 'ద్రావిడము' అను భాషను సృజించి, ఆ భాష శిష్ట పరిగృహీతమై, భగవ త్ప్రీతి భాజన మగుటకు శ్రీమన్నారాయణుని గూర్చి తప మాచరించెను. భగవంతు

డనుగ్రహించెను. ఆళ్వారుల అవతారమునకు, అగస్త్యున కిచ్చిన వరమునకు సంధి కుదిరినది. ఆళ్వారులు ద్రావిడమున నాల్గు వేల పాశురముల దివ్య ప్రబంధములు రచించిరి. ఈ ప్రబంధముల మొత్త మునకు - 'నాలాయిరము' అని పేరు. ఆళ్వారులు కేవలము నారాయణైక పరాయణులు, అవిదిత విషయాంతరులును. వారి భగవ దను భవసారమే వాఙ్మూపముగా ప్రవహించినది. సంస్కృతము దేవ భాష, ద్రావిడము ఆర్ష భాష. ఇంద్రాదులు సంస్కృత భాషా వ్యాకర్తలు, అగస్త్యుడు ద్రావిడభాషా వ్యాకర్త. దేవతలకన్న ఋషులు మహిమాన్వితు లని కొన్ని వార్త లున్నవి. ఇపుడు భగ వానుడు - ఈ భాష ననుగ్రహించినాడు. అనుగ్రహించి, ఆళ్వారుల ద్రావిడ పాశురములకు వేద సమాన ప్రతిపత్తి నొసంగి, స్వీకరించి నాడు. ఆళ్వారుల మహిమ, ద్రావిడ వేదావతరణము మొదలగు విషయములు - భారత, భాగవత, భవిష్య త్పురాణ, పాంచరాత్రాగమ, పారమేశ్వర సంహితాదులయందును, శంభు రహస్య, ద్రవిడోపనిషత్తుల యందును ప్రతిపాదింపబడినవి.

## ఆళ్వారులు

భగవ త్సంకల్ప మగు ఈ సంఘటనతో - ఆధ్యాత్మిక తత్త్వ వృక్షమునకు సంస్కృత వేదము, ద్రావిడ వేదము అని రెండు శాఖ లేర్పడినవి. ఋషుల యుగము భూతము, ఆళ్వారుల యుగము వర్త మానమును అయినది. సంస్కృత వేదోపనిషాదులయందు నారాయణ పారమ్య మెంతగా నుద్ఘాటింపబడినదో, అంతకంటెను ప్రస్ఫుటముగా ద్రావిడ ప్రబంధములలో ఉద్ఘాటింపబడినది. ఋషులు విషయాంతర ములయందును ప్రవిష్టులు, ఆళ్వారులు కేవలము భగవ దేక పరా యణులు. కనుక, ఈ ఉభయులకు తర తమ భేదమున్న దనియును,

సంస్కృత వేదము త్రైగుణ్య విషయము, ద్రావిడ ప్రబంధములు నిస్త్రైగుణ్యములు కనుక, ఈ రెండిటికిని తరతమ భేద మున్న దనియు పూర్వాచార్యులు భావించిరి. కృష్ణ భగవానుడు కూడ - 'వేదములు త్రైగుణ్య విషయములు, నీవు నిస్త్రైగుణుడవు కమ్ము అర్జునా !' అనెను కదా ! ఉపమానము చెప్పవలసి వచ్చినచో - ఆళ్వారు లందఱు వ్యాసుని పరతత్త్వ నిర్ణాయక వైభవమును, శుకుని వైరాగ్య విభవమును, గోపికల కృష్ణ తృష్ణా భావమును కలిగి నర్తిల్లినవారు.

" నారాయ ణేతి శబ్దో ఒస్తి వా గస్తి వశవర్తినీ. "

అను వ్యాసుని రీతిగా వీ రందఱును తమ ప్రబంధములయందు నారాయణ పారమ్యమును ఎలుగెత్తి చాటిరి.

## నాథమునులు

కాలక్రమమున సుమారు ఎనిమిదవ శతాబ్దమున - మన్నారు గుడియందు 'నాథమును' లను మహాత్ము లవతరించి, వ్యాస మహర్షి వేదముల చిక్కు విడదీసి, సమర్థముగా ఋగాది విభజనము చేసినట్లు, ద్రావిడ వేద మని పరిగణింపబడిన 'నాలాయిర' ప్రబంధములకు కొన్ని సిద్దేశములు చేసి, ప్రమృష్ట ప్రాయమైన పరమ వైష్ణవమునకు అమృత సెచనము చేసి పునరుద్ధరించిరి. అనగా - వీ రేదో క్రొత్తది ప్రవేశ పెట్టలేదు. సంస్కృత వేదముతో పాటు - ద్రావిడ వేదమును ప్రమాణ కోటిలో చేర్చుట, ఆలయ - గృహ దేవతార్చన ప్రకరణమున ఆ వేదముతో నెలకొల్పుట జరిగినది. దీనికై వారికి పాంచ రాత్రాగమము ప్రమాణము. తరువాత వారయిన పూర్వాచార్యులు వారి మార్గము ననుసరించిరి. కనుకనే, 'విశిష్టాద్వైత' మని వ్యవహా

రింపబడు 'వైష్ణవము' నాథోపజ్ఞము (నాథమునులచే కనుగొనబడినది) అని పేరు గాంచినది. వేదాంత విద్య - వ్యాసుని కన్న పూర్వమున్నది; వ్యాకరణ శాస్త్రము పాణిని కంటెను పూర్వమున్నది. అయినను, ఆ రెండును - వైయాసకి, పాణినీయము అని ప్రసిద్ధి చెందినట్లు, కొన్ని శాస్త్ర సిద్ధము లగు సంస్కారములచేత ప్రస్తుత వైష్ణవమును నాథోపజ్ఞ మనిరి.

## శాస్త్రీయ బహుళము

కాలక్రమమున భగవద్రామానుజులు అవతరించి, ఈ సిద్ధాంతమును ప్రవర్ధమానము గావించిరి. వారిది అఖండ దిగ్విజయము. వారు - 'శ్రీరంగేశ జయధ్వజ కేతువు' అని ఖ్యాతి వహించిరి. వారితో ప్రారంభమైన ఆచార్య పరంపరలో ముఖ్యులు - కూరేశులు, పరాశరభట్టరు, నంజీయరు, నంబిళ్ళై అనువారలు. నాథమునులు సంపాదించిన ద్రావిడ గాథామృత భాండమును యామునాచార్యులు మొదలు, పరాశరభట్టరునకు సేవించుకొనుచు, రక్షించుకొనుచునే వచ్చిరి. అందును ఆళ్వారుల యొక్కయు, వారి ప్రబంధముల యొక్కయు మహిమలను తమ ప్రబంధములందు బహుధా ప్రశంసించుచునే యుండిరి ఆ దివ్య ప్రబంధముల వ్యాఖ్యలు వారు చేయలేదు పరపక్ష విక్షేపము, స్వమత ప్రతిష్ఠాపనము వారు చేయవలసిన తరుణ మది. తత్ఫలముగా - యామునాచార్యుల స్తోత్రరత్నాదుల, భగవద్రామానుజుల శ్రీభాష్యాది గ్రంథ పరంపర, కూరేశుల పంచస్తవాదులు, భట్టరువారి విష్ణు సహస్రనామ భాష్యాదులు వెలసినవి. ఇవి సంస్కృతముననే ఉండవలెను. దాదాపుగా ఇక వాద కోలాహల మనవసర మయినది. విశిష్టాద్వైతము స్థిర పడినది. నంజీయరు నుంచి తిరువాయిమొళి మీద మనసు ప్రసరించినది. వారిది - 'ఒన్పది

నాయిరం' (తొమ్మిది వేలు), తిరుక్కురుగై ప్పిరాన్ పిళ్ళానుది - 'ఆరాయిరం' (ఆరు వేలు), పెరియవాచ్చాంబిళ్ళైది - 'ఇరుపత్తు నాలాయిరం' (24 వేలు) వడక్కు త్తిరువీధి ప్పిళ్ళైది - 'ఈడు ముప్పత్తారాయిరం (36 వేలు), వాదికేసరి - 'పన్నీరాయిరం' (12 వేలు) వారు వారు ఆ యా సంఖ్యా పరిమితి గల వ్యాఖ్యానములు వ్రాసిరి. తిరువాయిమొళి యొక్క ఈ వ్యాఖ్యాన సముదాయమునకు - 'భగవ ద్విషయము' అని పేరు వచ్చినది. ఇప్పటికిని శ్రీవైష్ణవమున భగవ ద్రామానుజుల శ్రీభాష్యము, భగవ ద్విషయము మూర్ధన్యము లయిన వేదాంత గ్రంథము లయినవి. ఇవి విషయము నందును, పరిమాణము నందును చాల బృహత్తరములై యుండి, బహు పాండిత్య ముండి, బహు కాలము సేవించిననేకాని ప్రాప్తించునవి కాక యుండెను. ఈ సమయమున పిళ్ళలోకాచార్యు లవతరించిరి.

## లోకాచార్యుల అవతారము

నంబిళ్ళగారి గోష్ఠితో శ్రీరంగము వైష్ణవ శ్రీరంగస్థల మయి నది నంబిళ్ళ గోష్ఠియో, నంబెరుమాళ్ళ (రంగనాథుని) గోష్ఠియో అని అన్నాగు అనాటి పెద్దలు అనేకులు వారి నాశ్రయించి, వారి నద్ద భగవ ద్విషయాదులు అధికరించి, ఆ ఆచార్య పరంపరను అనుస్యూతము చేసినారు. అందులో ప్రధానులు శ్రీకృష్ణ పాదులు. 'వడక్కు త్తిరువీధిపిళ్ళై' అని వీరికి మఱి యొక పేరు వీరి ఆచార్య నిష్ఠ చాల గొప్పది. ఒకనాడు నంబిళ్ళగారు కృష్ణపాదుల ఇంటికి వేంచేసినారు. ఆచార్యులు వేంచేసి రని అచట నున్న స్త్రీ పురుషు లందఱును వారికి సాష్టాంగ దండ ప్రణామ మాచరించిరి. వారిలో ఒక రామె తడి వస్త్రములతో ప్రణామ మాచరించినది. నంబిళ్ళ

గారు - ఈమె ఎవరు ? ఇట్లు తడి వస్త్రములతో వచ్చిన దేమి ? అని అడిగిరి. అప్పుడే ఋతుస్నానము చేసిన దనియు, కృష్ణపాదుల పత్ని అనియును అచటివారు చెప్పిరి. ఆచార్యులు వేంచేసిరి, పొడి వస్త్రములు ధరించుటకు కొంత తడ వగును, నంబిళ్ళగారు కుశల మడిగి వెడల నున్న ట్లామె ఊహించినది. ఆచార్యులను కొంతసే పుండు డని కోరుట స్వరూప హాని అదియును గాక, వారి దర్శన మైనంతనే ప్రణమిల్ల వలెను. అందుచేత ఆమె తడవు చేయక, తడి వస్త్రముల తోడనే దాస్యము సమర్పించినది. వెంటనే ఆమెను పిలిచిరి. మరల నామె ప్రణమిల్లి నిలచినది. అప్పుడు కృష్ణపాదుల వారి తల్లి - స్వామీ ! మా కోడలికి దేవరవారి వంటి కుమారుడు కలుగవలె నని మంగళాశాసనము కటాక్షింపు డని కోరినది. నంబిళ్ళ గారు - "తథాఽస్తు" అని ఆమె గర్భమును తమ దివ్య హస్తముతో స్పృశించిరి.

" మంత్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భిషజే గురౌ
యాదృశీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృశీ. "

మంత్రమందు, తీర్థమందు, ద్విజునియందు ఔషధమందు, గురువు నందు - ఏ భావ ముండునో - అట్టి సిద్ధియే కలుగును. మఱియు, భాగవత మహిమ ఇట్లు చెప్పబడినది :-

" యం యం స్పృశతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా
స్థావరా ణ్యపి ముచ్యన్తే కిం పున ర్బాంధవా జనాః. "

భాగవతోత్తముల దర్శన స్పర్శనములచే జడ పదార్థములే ముక్తి నొందు నని. ఇక నంబిళ్ళగారి స్పర్శచేత, మంగళాశాసనముచేత

ఆమెకు సత్సంతానము కలుగుటలో సందేహ మేమి? కాలక్రమమున శ్రీకృష్ణపాదుల భార్య - మగ శిశువును ప్రసవించినది. కృష్ణపాదులు ఆ శిశువుకు ఆచార్యు లయిన నంబిళ్ళ గారి ఉపకార స్మృతిగా - 'పిళ్ళైలోకాచార్యులు' అని పేరు పెట్టిరి. నంబిళ్ళగారి అసలు పేరు - నంబూరి వరదరాజులు. వారి ఆచార్యు లయిన నంజీయరు - వరదరాజులను కటాక్షించి, నమ్ - పిళ్ళై = 'మన పిల్ల వాడు' అన్నారు. నాటినుండి అది ప్రసిద్ధ నామ మయినది తరువాత, వారి ఆచార్యత్వ మహిమను 'లోకాచార్యులు' అని లోక ప్రసిద్ధి కలిగినది. అనగా - నంజీయరు, నంబిళ్ళ అనువారు, ఆశ్రితులు లోకాచార్యు లనువారు. కృష్ణపాదులు - 'నం' వదలి, పై రెంటిని కలిపి, తమ శిశువునకు - 'పిళ్ళైలోకాచార్యులు' అని నామకరణము చేసిరి. నంబిళ్ళగారికి ఇది తెలిసి, 'నేను రంగనాథుని పేరు పెట్ట సంకల్పించితిని, నీవు నా ఆజ్ఞ లేక ఇట్లు చేసితి వేల ?' అని అడిగిరి. కృష్ణపాదులు - "సర్వాపరాధాన్ క్షమధ్వం" అని పాదములపై బడిరి. అచట నున్న భాగవతులు కూడ పురుషకారము చేసిరి. నంబిళ్ళగారు కృష్ణపాదులను లేవనెత్తిరి. కృష్ణపాదులు మొదటనే యోచించి నట్లున్నది. వారి పే రుంచుట నంబిళ్ళగారికి సమ్మతిన నుండదేమో! నామకరణ సమయమున వా రున్నచో - వారి ఆజ్ఞకు వ్యతిరేకము చేయుట కుదురదు. అప్పుడు తమ అభీష్టము నెరవేరదు. అని నంబిళ్ళగారి పరోక్షమందే పేరు పెట్టి, వారి కిది ఇష్టము కానిచో - పాద ప్రణిపతనముతో వారిని ప్రసన్నులను చేసికొనవచ్చును అని. నంబిళ్ళగారు పుట్టబోవు కుమారునకు నా ఆజ్ఞ ప్రకారము రంగనాథుని పేరు పెట్టుమని శాసించిరి. మఱి రెండు సంవత్సరములకు కృష్ణపాదులకు మగ శిశువు కలిగెను.

" ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి. "

గార్వ ఋషుల వాక్యము ననుసరించి జరుగు నన్న ట్లాయునది. ంబిళ్ళగా రా శిశువు నామకరణ మహోత్సవమున సన్నిధి చేసి, అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్' అని పేరు పెట్టించిరి ది తమిళమున రంగనాథుని పేరు. అళగియ మణవాళన్ అనగా - ందమయిన అల్లుడు' అని యర్థము గోదాదేవి పాణిగ్రహణము సి, విష్ణుచిత్తులకు అల్లు డయిన తరువాత, రంగనాథునకు ఆ పేరు లిగినది. దానికి సంస్కృతీకరణమే 'రమ్య జామాత', 'సుందర మాతా' మొదలగునవి.

## పిళ్ళలోకాచార్యుల ప్రబంధములు

ప్రస్తుతాంశ మునకు వత్తము. అప్ప దమ్ము లిద్దఱు తండ్రిగా ంచిన పేర్ల నర్థిల్లిరి వారి మైత్రి - రామ లక్ష్మణులను తలపిం నది క్రమముగా వా రిరువురికి కర్మాంగోపనయన మయిన వమగు, నాంగోపనయన మయిన పంచ సంస్కారమును కృష్ణపాదులు నెర ర్చిరి. పిళ్ళలోకాచార్యులు, అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనారు - తండ్రిగారి వద్ద కావ్య నాటకాలంకార సాహిత్యము, వ్యాకరణాది శాస్త్రములు, సంస్కృత ద్రావిడామ్నాయములు, శ్రీభాష్య భగవద్విషయాదులును అధికరించి, ఉద్దండు లయిరి. ంబిళ్ళగారు వయోవృద్ధులై, తిరునా డలంకరించిరి. కృష్ణపాదులవారి ల్లి ఆకాంక్షించినట్లు లోకాచార్యులు నంబిళ్ళగారి స్థానము నలంక ంచిరి. ఇప్పుడు నిజముగా వీరు లోకాచార్యులు. లోకాచార్య లని ంబిళ్ళగారి ప్రసిద్ధనామము కదా ! పిళ్ళలోకాచార్య లనగా - అభి వ లోకాచార్యు లని కూడ అగుచున్నది. కాలక్రమమున శ్రీకృష్ణ పాదులును పరమపదించిరి. పుత్రు లిరువురును వారికి బ్రహ్మమేధాది సంస్కారములు చేసి, కృతకృత్యు లయిరి. దీపోత్పన్న ప్రదీపము -

దీపము కొండెక్కినను ద్విగుణిత కాంతిమంతమై, తమస్సును పారద్రోలునట్లు - పిళ్ళలోకాచార్యులు సిద్ధాంత ప్రవర్తక వీర మలంకరించిరి. వారు తమ నాశ్రయించిన పెక్కు మందికి శ్రీభాష్య భగవద్విషయాది శాస్త్రములను ప్రసాదించుచు, భగవ ద్భాగవతాచార్య నిష్ఠా గరిష్ఠులై, రంగనాథుని సేవించుకొనుచు, కాలక్షేపము చేయుచుండిరి. ఆ తరుణమున పిళ్ళలోకాచార్యులకు ఒక నూత్న స్ఫూర్తి కలిగినది. శాస్త్రమా అనంత బహుళము. క్రమముగ కలియుగ పురుషులు బహు సంఖ్యాకులు అల్ప బల మేధసు లగుదురు. పూర్వాచార్యు లనుగ్రహించిన సాంప్రదాయిక మహా దర్థములను సూత్రప్రాయముగా గ్రంథ రూపమున వెలయించినచో - బహు జన హితమగు నని తలచి, స్వ దేశ భాష యగు ద్రావిడమున సులభ సుందరమగు శైలిలో - పదునెనిమిది గ్రంథములను రచించిరి. వారి గ్రంథములను పూర్వు లిట్లు శ్లోక రూపమున సూత్రీకరించిరి.

" ముముక్ష్వాది తన్వాది తత్త్వాది సాదీన్
చతు స్త్రి ద్వేక ద్విత్వ సంఖ్యాక్రమేణ
ప్రాదీ నవాదీ తథా శ్యాది మాదీ
జగుః కార్ష్ణపాది ప్రణీతాన్ ప్రబంధాన్ "

కార్ష్ణపాది అనగా - పిళ్ళలోకాచార్యులు - వారి ప్రబంధములు.

ముముక్షుత్వాదులు :- (1) ముముక్షుప్పడి (2) యాదృచ్ఛికప్పడి
(3) పరందపడి (4) శ్రియఃపతిప్పడి.

తన్వాదులు - (1) తనిద్వయము (2) తని చరమము
(3) తని ప్రణవము.

తత్త్వాదులు :- (1) తత్త్వ త్రయము (2) తత్త్వ శేఖరము

సారాదులు .. (1) సార సంగ్రహము (2) సంసార సామ్రాజ్యము.

వ్రాచులు .- (1) ప్రమేయ శేఖరము (2) ప్రపన్న పరిత్రాణము.

నవాచులు :- (1) నవవిధ సంబంధము (2) నవరత్న మాలై.

శ్రీ - ఆది :- శ్రీవచన భూషణము.

ఞ - ఆచులు :- (1) అర్చిరాది (2) అర్థ పంచకము.

ఈ గ్రంథములు మొత్తము పదునెనిమిది (18).

## ప్ర వా స ము

పిళ్ళలోకాచార్యులు తమ్మునితో కలిసి, తమ గ్రంథముల ద్వారా, ఉపదేశముల ద్వారా, సంప్రదాయ ప్రవర్తకులై, దర్శన స్థాపనాచార్యులై, చేతను లనేకులను ఉజ్జీవింపజేసిరి. ఇరువురును నైష్ఠిక బ్రహ్మచర్యాశ్రమము నుండియే యత్యాశ్రమమును స్వీకరించిరి. కొంత కాలమునకు నయనార్ పరమపదించిరి. లోకాచార్యులు సోదరు డని ఖేదపడలేదు. మహా భాగవతుని వియోగము కలిగె నని ఖేదపడిరి. యథా శాస్త్రముగ సోదరునకు బ్రహ్మమేధ సంస్కార మొనరించిరి. కొంత కాలమునకు తురుష్క దండయాత్ర నూహించి, శ్రీరంగనాథుని స్థలము మార్చి, ఒక మాయా విగ్రహమును అట నుంచి, అర్చకులు అసలు మూర్తిని 'జ్యోతిష్కుడి' అను చోటికి తరలించిరి. పిళ్ళలోకాచార్యులును తమ సర్వస్వమును భాగవతులకు దానము గావించి, శ్రీరంగనాథునితో 'జ్యోతిష్కుడి' చేరిరి. అచట లోకాచార్యులను కొందఱు ఆశ్రయించి తరించిరి.

(కాలాంతరమున శ్రీరంగనాథుడు స్వస్థాను చేరెను)

## శిష్య పరంపర

పిళ్ళైలోకాచార్యుల నాశ్రయించినవారిలో ప్రధానులు - కూరకులోత్తమ దాసర్, తిరుమల యాళ్వాన్, అళగియ మణవాళ ప్పెరుమాళ్ పిళ్ళై, తాదరణ్ణర్ (మణవాళ మహామునుల జనకులు) మొదలగువారు. పైవా రందఱును ఆచార్యుల అష్టాదశ రహస్యములను - విశేషించి శ్రీవచన భూషణ దివ్య శాస్త్రమును ప్రవర్తింప చేసిన ఆచార్య పరంపర - అందుచేతనే అష్టాదశ రహస్యములను సేవించుటకు ముందు

" లోకగురుం గురుభి స్సహ పూర్వైః
కూరకులోత్తమ దాస ముదారమ్।
శ్రీనగప త్యభిరామ వరేశౌ
దీ ప్రశయం వరయోగిన మీడే. "

అని అష్టాదశ రహస్య వ్యాఖ్యాత అయిన మణవాళ మహామునులను కూడ చేర్చి అనుసంధించెదరు. పాఠాంతరమున - 'లోదిలులగాశరి యన్' ఇత్యాదిగా పైవారికే శాంతి చెప్పెదరు.

## ప్రపత్తి

భగవ త్ప్రాప్తికి పెక్కు మార్గము లున్నవి. అనాది కాలము నుండి ఈ మార్గముల కన్నిటికిని శాస్త్రము లున్నవి. కాని, ఒక్కొక్క కాలమున ఒక్కొక్క మార్గము ఆచరణయోగ్యమై, సులభమై, అతిప్రధానమై యుండును.

" ధ్యాయన్ కృతే యజన్ యజ్ఞైః
త్రేతాయాం ద్వాపరే ఒర్చయన్. "

అనినట్లు, కృత యుగమునందు యోగమార్గముతో - హృత్పుండరీక స్థితు డగు భగవంతుని ధ్యాన గమ్యుని చేసికొనిరి. దీనికి శాస్త్రము సాంఖ్యమే ఉన్నది. దాని ఆధారముతో - అర్వాచీను డగు పతంజలి - యోగ సూత్రములను రచించినాడు. త్రేతాయుగమున భగవంతుని యజ్ఞ స్వరూపునిగా భావించి, యజ్ఞములు చేసి, భగవ త్ప్రాప్తిని పొందిరి దానికి వేదములు, దాని ననుసరించిన స్మృతులు శాస్త్రము. ద్వాపరమున అర్చనను సులభముగా గ్రహించిరి. అదియే విగ్రహారాధనము. దీనికి పాంచరాత్రము శాస్త్రము. దీనికి కర్త స్వయముగా నారాయణుడే వ్యాసుడు దీనిని భారతమున నుగ్గడించి నాడు కలియుగమున విగ్రహారాధనము అత్యంత మావశ్యకమై, పాంచరాత్రాగమ ప్రామాణ్యమును యామునాచార్యులు దృఢ పరచిరి. దీనికి ముడిపడి ప్రపత్తి యోగము స్వరూపానురూప మయినది. ఈ యోగము వేదమునందు, ఉపనిషత్తు లందు, గీత యందును, రామాయణ మందును చెప్పబడియున్నది. సామాన్య జనుల కందదు. భగవ ద్రామానుజులు ప్రపత్తి నవలంబించిరే కాని, తమ వేదార్థ సంగ్రహాది గ్రంథములందు సూత్ర ప్రాయముగా కొన్ని చోట్ల చెప్పిరి మతాంతరుల కొఱకు ఇతర శాస్త్ర వాదముల ఆవశ్యకతయే దానికి కారణము. వారి గద్యత్రయము అనుసంధాన రూపమున నున్నది. ఇప్పుడు ప్రపత్తి శాస్త్రము యొక్క ఆవశ్యకత కలిగినది. పిళ్ళైలోకాచార్యులు ప్రధానముగా ద్రావిడ వేదమును ఆకరముగా జేసికొని, శ్రీవచన భూషణమును రచించి, ఆ కొఱత దీర్చిరి. భారత, భాగవత, రామాయణములలో - ద్రౌపది, గజేంద్రుడు, విభీషణుడు చేసిన ప్రపత్తి - కథలలో మునిగిపోయినది. గీతలో నిది పదిలో పదునొకం డయినది. దానిని పిళ్ళైలోకాచార్యులు తమ శాస్త్రమునందు ప్రస్ఫుటము జేసిరి. నిజమునకు పై పురాణేతి

హాసములు వేదార్థోపబృంహణములేకదా! మఱి పిళ్ళలోకాచార్యులు తమ రచనలను సంస్కృతమున చేయవచ్చునుగదా? అనిన, ప్రధానాకరములు ద్రావిడ మగుట, దేశభాషామాత్రాభిజ్ఞులకు ఉపకరింపవలె నను భావమే కాక, అగస్త్యుని తపః ఫలము వీరి పర్యంతము ఈ రూపమున కూడ ఫలించినది.

## నిగమనము

ఈ రీతిగా పిళ్ళలోకాచార్యులు చేతనోజ్జీవన కారకులై, 'జ్యోతిష కుడి' అను గ్రామమందే తమ దేహమును లీలా విభూతి యందు వదలి, నిత్య విభూతిని చేరిరి. వారి బోధామృతము చవి చూచిన శిష్యులు - 'లోకాచార్యులు సంసార విష సర్ప దష్టు లగు చేతనులకు జీవ నౌషధము' అని తలంచి -

" లోకాచార్యస్య గురవే కృష్ణపాదస్య సూనవే
సంసారభోగి సందష్ట జీవ జీవాతవే నమః "

అని ఉద్ఘాటించిరి. ఈ శ్లోకము శ్రీవైష్ణవ గురుపరంపరా ధ్యానములో నిత్యానుసంధేయమై వచ్చుచున్నది. వీరి గ్రంథములే శ్రీవైష్ణవ సంప్రదాయమున భాష్య భగవ ద్విషయముల వలె ఆచార్య ముఖతః సేవింపవలసిన తుది గ్రంథములు. ఈ గ్రంథము లన్నిటికిని మణవాళ మహాముసులు వ్యాఖ్యలు రచించి, పరమాచార్యుల ఋణము దీర్చుకొనిరి



# అష్టాదశ రహస్యములు – తద్విశేషములు

'సాహిత్య విద్యా ప్రవీణ' - 'విశిష్టాద్వైత వేదాంత శిరోమణి'
డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, ఎం.ఏ. పిహెచ్.డి.



## నమస్సుమాంజలి

" ప్రణతార్తి హరాంహాయ ప్రకృష్ట గుణ శాలినే
లీలయోద్ధృత లోకాయ లోకార్య గురవే నమః. "

## ఉపక్రమము

శ్రీవైష్ణవ సంప్రదాయమునకు - ఆళ్వారులు, ఆచార్యులు మూల పురుషులు. ఆళ్వారుల దివ్య ప్రబంధము లందును, నాథమునులు, యామునాచార్యులు, భగవద్రామానుజులు మున్నగు ఆచార్య ప్రముఖులచే రచింపబడిన గ్రంథరాజము లందును నిక్షిప్తమయిన దివ్య సూక్తి సౌరభమును అష్టాదశ రహస్యములుగాననుగ్రహించినారు - పరమ కారుణికులైన పిళ్ళలోకాచార్యులవారు. నిఖిల చేతనోజ్జీవనార్థము బహు తత్త్వార్థములు, రహస్యార్థములు ఈ దివ్యగ్రంథములలో స్పష్టీకరింపబడినవి. సంసార నివృత్తికి, భగవత్ప్రాప్తికి ఆవశ్యకము లగు తత్త్వ హిత పురుషార్థములు ఈ రహస్య గ్రంథములలో వివరింపబడినవి.

" తులాయాం శ్రవణే జాతం లోకార్య మహా గురుమ్
శ్రీకృష్ణపాద తనయం తత్పాదాంబుజ సంశ్రితమ్ "

## వంశ గౌరవము

పిళ్ళైలోకాచార్యుల అవతార స్థలము కోయిల్. అవతార సమయము క్రోధన వర్షము. కులము పరమాల్. గుడి ముఖంపై గోత్రము శ్రీవత్స. శాఖ యజుశ్శాఖ సూత్రము ఆపస్తంబ ఉలగాశిరియన్, లోకాచార్యులు అను నామములు వీరికి విఖ్యాతములు. శ్రీరంగరాజ తిరువారాధనము ఆచార్యులు - నంబిళ్ళై, శ్రీ వడక్కు త్తిరువీధిపిళ్ళై. సోదరుడు - శ్రీమ దళగియ మణవాళ పెరుమాళ్ నాయనాచార్యర్. శిష్యులు - కూరకులోత్తమ దాసు, నాయనార్, తిరువాయి మొళిప్పిళ్ళై, వేళామ్ జీయర్ పిళ్ళై, మణల్ పాక్కత్తు నంబియార్ మున్నగువారు. పిళ్ళైలోకాచార్యుల తండ్రిగారయిన వడక్కు త్తిరువీధి పిళ్ళైగారు - ఆచార్యానుగ్రహమువలన ప్రాప్తించిరని, పుత్రునకు - 'ఉలకాశిరియన్' అను తమ ఆచార్యుల నామము నుంచిరి. ఈ పిళ్ళైలోకాచార్యులవా రనుగ్రహించిన గ్రంథ రత్నములు అష్టాదశ రహస్యములు.

## అష్టాదశ సంఖ్యా వైభవము

విశిష్టాద్వైత సంప్రదాయమున శ్రీభాష్యాది గ్రంథములందు ప్రమాణములుగా నుదాహరింపబడిన ఉపనిషత్తులు అష్టాదశ. వేదాంతమునకు ఉపబృంహణము లయిన పురాణములు అష్టాదశ. సర్వోపనిషత్తులకు సంగ్రహ రూపమైన తత్త్వ హిత పురుషార్థోపదేశమును ఈశావాస్యోపనిషత్తు నందలి ఋక్కులు అష్టాదశ. మహాభారతము యొక్క సమగ్ర సారమైన, పరమ ప్రసిద్ధమైన శ్రీమ

ద్భగవద్గీత యందలి అధ్యాయములు అష్టాదశ అట్లే, ఈ గ్రంథము నందలి రహస్యములు అష్టాదశ

## రహస్యముల క్రమము

1. ముముక్షుప్పడి 2. తత్త్వ త్రయము 3. అర్థ పంచకము 4 శ్రీవచన భూషణము 5. అర్చిరాది 6. ప్రమేయ శేఖరము 7. ప్రపన్న పరిత్రాణము 8. సార సంగ్రహము 9. సంసార సామ్రాజ్యము 10. నవవిధ సంబంధము 11. నవరత్నమాల 12. యాదృచ్ఛిక ప్పడి 13. పరంద పడి 14. శ్రియఃపతి ప్పడి 15. తత్త్వ శేఖరము 16. తని ద్వయము 17. తని చరమము 18 తని ప్రణవము - అనునవియే అష్టాదశ (18) రహస్యములు. ఈ రహస్య గ్రంథములు - మృదు మధుర గంభీరమానమైన మణిప్రవాళ భాషలో విరచింపబడినవి. సుధా మధుర మగు సంస్కృతము, మధురము వంటి ద్రవిడము - ఈ రెండును మిళితమై, మణిప్రవాళముగా రూపొందినది.

## అష్టాదశ రహస్యముల సారము

'ముముక్షుప్పడి' యందు - తిరు మంత్రము, ద్వయ మంత్రము, చరమశ్లోకము - మూడు ప్రకరణములందు స్పష్టముగా వివరింపబడినవి.

'శ్రియఃపతి ప్పడి' యందు - పై మూడు ప్రకరణములును, సంస్కృత వాక్య బాహుళ్యముగ వివరింపబడినవి.

'యాదృచ్ఛిక ప్పడి' యందు - మూడు ప్రకరణములును అతి సంగ్రహముగ వివరింపబడినవి.

'పరంద పడి' యందు - మూడు ప్రకరణములును అతి విస్తృతముగా వివరింపబడినవి.

ఈ రీతిగ ఈ నాల్గు రహస్య గ్రంథములను - ఈ మూడు మంత్రములను గూర్చి విపులముగా బోధించుచున్నవి.

'తని ద్వయము' నందు - ద్వయమంత్ర మొకటియే వివరింపబడుచున్నది.

'తని చరమము' నందు - చరమశ్లోక మొక్కటియే చర్చింపబడుచున్నది.

'తని ప్రణవము' నందు - తిరుమంత్ర మొక్కటియే విపులీకరింపబడినది.

'సార సంగ్రహము'నందు - అతి సంగ్రహముగ ద్వయము ప్రమాణీకరింపబడినది.

'తత్త్వ త్రయము' నందు - చిత్, అచిత్, ఈశ్వర తత్త్వములు మూడును - లక్షణ, స్వరూప, ప్రమాణములతో - ఇతర మత నిరాకరణ పూర్వకముగా ప్రతిపాదింపబడినవి.

'తత్త్వ శేఖరము' నందు - పర స్వరూపము, జీవ స్వరూపము, పురుషార్థ స్వరూపము, విరోధి స్వరూపము, ఉపాయ స్వరూపము అనునవి మైదును ఐదు ప్రకరణములలో వివరింపబడినవి.

'అర్చిరాది యందు - నాలుగు ప్రకరణములలో - భోగ విభూతి, లీలా విభూతి, ముముక్షుత్వ సిద్ధి క్రమము, ముక్తు లనుభవించు విధము, అర్చిరాది గమన ప్రకారము, శ్రీవైకుంఠ దివ్య

నగర ప్రవేశము, దివ్యస్థాన మండప ప్రాప్తి, దివ్య పురుషులచే సేవింపబడుట, పరమాత్మ చూడాది పాద పర్యంత అవయవ సౌందర్య, సౌభాగ్యాదుల వర్ణనము, భగవ దుపలాలనా క్రమము, నిత్య కైంకర్యానుష్ఠాన క్రమము, మంగళాశాసన క్రమము స్పష్టము చేయ బడినవి.

'ప్రమేయ శేఖరము'నందు - హృదయ గుహా నిర్గమన క్రమము, దివ్య దేహ ప్రాప్తి, దివ్య కరిమ ప్రాప్తి, సపత్నీక సర్వేశ్వర దర్శనము, కైంకర్య సామ్రాజ్యానుభవ ప్రకారము వివరింప బడినవి.

'సంసార సామ్రాజ్యము' నందు - సంసార సామ్రాజ్యానుభవ ప్రకారము, ఆచార్య విషయ కృతజ్ఞత, భగవ ద్విషయ ప్రేమావిర్భావము, లక్ష్మీ పురుష కారముచే భగవ ప్రాప్తికల్గు విధము అభివర్ణింపబడినవి.

'నవరత్న మాల'యందు - శరణాగతి, స్వస్వరూప, సంసార, దేహాచరణ విధాన, దేవతాంతర, శ్రీవైష్ణవ, ఆచార్య, లక్ష్మి, సర్వేశ్వరులను గూర్చి వివరించబడినది.

'నవవిధ సంబంధము' న - విశేషణ, విశేష్య, రక్ష్య రక్షక, శేష, శేషి, భర్తృ భార్యా, జ్ఞాతృ జ్ఞేయ, స్వస్వామిభావ, శరీర శరీరి భావ, ధార్య ధారక, భోక్తృ భోగ్య సంబంధముల నిరూపణము, ఫల సిద్ధియు స్పష్టము చేయబడినవి.

'ప్రపన్న పరిత్రాణము' న - భ్రాతా, పుత్ర, మాతృ పితాదులు రక్షకులు కా రనియు, చంద్ర - ఆదిత్య - ఇంద్ర - బ్రహ్మ -

రుద్రాదులు రక్షకులు కారనియు, పరమాత్మ యొక్కడే రక్షకుడనియు, అనన్య గతిత్వ నిరూపణము, అకించిన్య నిరూపణము చేయబడినవి.

'శ్రీవచన భూషణము'న - ఉపాయ, ప్రాపకాంతర పరిత్యాగ, మంగళాశాసన, త్రిపా ద్విభూతి యను నాల్గు ప్రకరణములు గలవు. ప్రథమ ప్రకరణమున - పురుషకార, ఉపాయ, ఉభయ సాధారణ, ప్రపత్తుల వైభవములు నిరూపింపబడినవి. ద్వితీయ ప్రకరణమున - ప్రాపకాంతర పరిత్యాగ హేతు నిరూపణము, ప్రప త్త్యుపాయ సిద్ధోపత్వ వర్ణనము, స్వగత స్వీకార, పరగత స్వీకారములకు గల తారతమ్యము, ప్రపన్న దిన చర్యాక్రమము స్పష్టము చేయబడినవి. తృతీయ ప్రకరణమున - మంగళాశాసనము యొక్క స్వరూప నిరూపణములు, అకృత్య కరణ - భగవ దపచార - భాగవ తాపచార - అసహ్యాపచారముల నిరూపణము, సదాచార్య లక్షణము, సచ్ఛిష్య లక్షణము, భగవ న్నిర్హేతుక విషయీకార్యక్రమ నిరూపణము చేయబడినవి. చతుర్థ ప్రకరణమున - ఈశ్వరుడు సంసారుల ననుగ్రహించు క్రమము, భగవ దాభిముఖ్యము, కృపా ఫలాను భవము, భయాభయ హేతు నిరూపణము, చరమ ప్రాప్య ప్రాపక నిరూపణము, ఆచార్యాభిమానమే ఉత్తారక మని నిరూపించుటయు చేయబడినవి.

మొదటి మొనిమిది గ్రంథము లందును చర్చింపబడిన విషయములు - తిరు మంత్రము, ద్వయ మంత్రము, చరమ శ్లోకము. కావున, ముందుగా ఈ మూటిని గూర్చి సంగ్రహముగా నిట వివరింపబడుచున్నది.

# తిరుమంత్ర వివరణము

'ముముక్షుప్పడి' యందు ఒక ప్రకరణమునను, సంస్కృత వాక్య బాహుళ్యముగ 'శ్రియఃపతి ప్పడి' యందలి ఒక ప్రకరణమునను, అతి సంగ్రహముగ 'యాదృచ్ఛిక ప్పడి' లో ఒక ప్రకరణము నందును, అతి విస్తృతముగ 'పరందపడి' యందు ఒక ప్రకరణమునను, 'తనిప్రణవము' నందు కేవలము ఒక్కటిగను - 'తిరుమంత్రము, అనగా - 'ఓం నమో నారాయణాయ' అను అష్టాక్షరీ మంత్రము వివరింపబడినది.

భగవత్ప్రాప్తి యందును, సంసార విమోచన మందును ఇచ్ఛ గల వారికి స్వరూప యాథాత్మ్యము లగు అనన్య శేషత్వ, అనన్య శరణత్వ, అనన్య భోగ్యత్వము లను ప్రతిపాదించునది తిరుమంత్రము. స్వరూపమునకు తగిన ఉపాదేయములను, త్యాజ్యముల యొక్క విషయ విభాగ జ్ఞానమును సంపూర్ణముగ కలుగజేయునట్టిది తిరుమంత్రము. "మంతారం త్రాయతే ఇతి మంత్రః" తనను అనుసంధించువారిని రక్షించును గనుక, 'మంత్రము' అనబడుచున్నది. శబ్దానుసంధానము వలన, జప హోమాదుల వలన సాధక మని యెంచు సాధనాంతర పరు లగు ఉపాసకులకును - అర్థానుసంధానము చేత సర్వేశ్వరుడే ఉపాయ మని యుండు ప్రపన్నులకును రక్షకత్వముగా నుండుటచేత మంత్ర మనబడుచున్నది.

భగవన్మంత్రము లనేకము లున్నను, శ్రేష్ఠము లైనవి - "నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్" అను వ్యాపక మంత్రములు మూడును ముఖ్యము లైనవి. ఈ మూడింటిలో - వాసుదేవ, విష్ణు శబ్దముల కంటెను

"నారాయణాయ విద్మహే" అను అష్టాక్షర మంత్రము అత్యంతము శ్రేష్ఠము.

" ఓమి త్యేకాక్షరమ్. నమ ఇతి ద్వే అక్షరే. నారాయణాయేతి పంచాక్షరాణి. ఇ త్యష్టాక్షరమ్ ఛందసా గాయత్రీ చేతి. "

అనునట్లు, ఎనిమిది అక్షరములుగను, మూడు పదములుగను ఉండును. మొదటి పదము - 'ఓమ్' అను ప్రణవము. రెండవ పదము - 'నమః' అను నమస్కారము. మూడవ పదము - 'నారాయణాయ' అను నారాయణ పదము. " ఓమి త్యగ్రే వ్యాహరేత్ " అనగా - 'ఓమ్' అను పదమును ముందుగా అనుసంధింపవలె నని తాత్పర్యము.

## ఓంకార స్వరూప వివరణము

" భూ రితి ఋగ్వేదా దజాయత " అనగా - ఋగ్వేదమునుండి 'భూః' అను వ్యాహృతి పుట్టెను. "భువ ఇతి యజుర్వేదా దజాయత" అనగా - యజుర్వేదమునుండి 'భువః' అను వ్యాహృతి పుట్టెను, " సువ ఇతి సామవేదా దజాయత " సామ వేదమునుండి - 'సువః' అను వ్యాహృతి పుట్టెను. " తాని శుక్రా ణ్యభ్యతపత్. " ఆ వ్యాహృతి త్రయము తపించెను "తేభ్యోఽభిత ప్తేభ్య స్త్రయో వర్ణా అజాయంత" "అకార, ఉకార మకార ఇతి." తపింపబడిన ఆ వ్యాహృతుల వలన - అ, ఉ, మ్ - అను మూడు అక్షరములు పుట్టెను. అవి మూడును ఒకటిగా చేర్చబడి, 'ఓమ్'అని అయ్యెను. వేదత్రయములో - "భూః, భువః, సువః" అను వ్యాహృతులందు - 'భూః' అనగా - జగత్కారణమైన బ్రహ్మము కార్యరూపముగ పరిణమించె ననియు, 'భువః' అనగా - ఆశ్రితులకు సంసార నివర్తకుం డనియు, 'సువః'

అనగా - సర్వాంతర్యామి యనియు తెలియనగును. ఈ అక్షరత్రయ రూపమైన ఓంకారము సకల వేద సారము.

## 'నమః' శబ్దార్థ వివరణము

నమస్సు - 'న' 'మః' అని రెండు పదములు. రెండు అక్షరములు. 'మః' అని షష్ఠీ విభక్త్యంతమందు గల మకారముచేత, మకారవాచ్యుడైన ఆత్మకు స్వాతంత్ర్యము తోచుచుండగా - 'న' అని, నిషేధవాచకము. ఈ నమస్సుచేత విరోధ మయిన అహంకార, మమకార స్వాతంత్ర్యము నివర్తించుచున్నది. ఆ విరోధము మూడు విధములు. (1) స్వరూప విరోధము (2) ఉపాయ విరోధము (3) ప్రాప్య విరోధము అని ఓంకారమునందు చెప్పిన భగవ దనన్యార్హ శేషిత్వ స్వరూపమునకు విరోధము, నమః పదమునకు వాక్యార్థమైన స్వాతంత్ర్య నివృత్తి యగు అర్థము సిద్ధించు ఉపాయమునకు విరోధము, నమః పదమునకు ఉత్తర పదమం దున్న నారాయణ పదమందు చెప్పబడు ప్రాప్యమైన కైంకర్యమునకు విరోధము అని కాకాక్షి న్యాయముచేత పూర్వోత్తర పదములందు చెప్పబడిన స్వరూప - పురుషార్థముల యొక్క విరోధులను నివర్తించును. స్వరూప విరోధ నివర్తన మనగా - 'నీకు నేను శేషభూతుడను, నా గత్తు నీవే' అని యుండుట. ఉపాయ విరోధ నివర్తన మనగా - 'నా పాపములను నివర్తించినను, నివర్తించకున్నను నా రక్షకుడవు నీవే' అని యుండుట. ప్రాప్య విరోధ నివర్తన మనగా - 'నా కోరికలను ఆర్తిగా నివర్తింపజేయును' అని యుండుట. 'మః' అనుట - స్వరూప మని 'నమః' అనుట - స్వరోపోజ్జీవనము. స్వరూపాదులందు గల

విరోధులను పోగొట్టి, 'నమస్సు' - స్వరూప జ్ఞానమును కలుగ జేయును. నమస్సునందు - 'నీ దాసులకు దాసుడను' అను అర్థము నందు - అహంకార మమకారములు నివృత్తములై, భగవచ్ఛేషత్వము నందు ప్రకాశించుచున్నది. శేషత్వమే ఆత్మకు స్వరూపము భగ వంతున కొక్కనికే దాసుడ ననుట వలన, అత్యంత పారతంత్ర్యప్రపి భక్తి స్పష్టము. ఈ తలంపు లేని యజ్ఞ యాగాదులు నిరర్థకములు. ఈ పారతంత్ర్య ప్రపత్తి చేత, సర్వేశ్వరుని అనుగ్రహాతిశయముచేత సకల పాపములు నశించును. సకల ఫలములును లభించును ఇట్లు మధ్యమ పదమైన 'నమః' పదార్థము వివరింపబడినది.

## నారాయణ శబ్దార్థ విచారము

"నారాణాం అయనం యస్య సః నారాయణః" అనగా - నారములకు నివాసమైనవాడు ఎవడో - అతడు నారాయణుడు అనియు, "నారాః అయనం యస్య సః నారాయణః" అనగా - నారములు ఎవరికి నివాస స్థానమో, అతడు నారాయణుడు అనియు, తత్పురుష, బహువ్రీహి సమాస ద్వయము సిద్ధము. 'నారములు' అనగా - నిత్య వస్తువుల సమూహము. 'రిఙ్ క్షయే' అను ధాతువు నందు - 'ర' అనగా - 'నశించు వస్తువు' అని యర్థము 'న' కారముచే, దానిని నిషేధించగా - 'నర' అనగా - 'నాశము లేని నిత్య వస్తువు' అని తాత్పర్యము. 'అణ్' అను ప్రత్యయము ఆది వృద్ధియై, 'నార' అని నిత్య వస్తు సమూహమును చెప్పి, 'నారాః' అనునది బహు వచనము గనుక, సమూహ బాహుళ్యము చేత - 'నిత్య వస్తు సమూహము' అనుచున్నారు.

**నారములు :-**

ఆ నారము లేవి ? అనగా - జ్ఞానానందామలత్వాదులు. అనగా - జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సు లను షడ్గుణములు. జ్ఞాన మనగా - నిరంతరము సర్వ పదార్థములను ప్రకాశింప చేయుచున్నదై, స్వయం ప్రకాశమై యున్న గుణ విశేషము.

శక్తి యనగా - అఘటిత ఘటనా సామర్థ్యము. బల మనగా - సమస్త వస్తు ధారణ సామర్థ్యము. ఐశ్వర్య మనగా - సమస్త వస్తు నియమన సామర్థ్యము. వీర్య మనగా - పరాక్రమము. తేజస్సు అనగా - పరాభిభవన సామర్థ్యము. వాత్సల్యాది సౌశీల్యాదు లనగా - జ్ఞానాది షాడ్గుణ్యములకు పరాధీనమైన వాత్సల్య, సౌశీల్య, స్వామిత్వ, సౌలభ్యాది అసంఖ్యేయ కల్యాణ గుణ విశేషములు. వాత్సల్య మనగా - దోష భోగ్యత్వము. అప్పుడే పుట్టిన లేగ దూడ శరీర మందు గల మాలిన్యము నంతను రుచిగా స్వీకరించు ధేనువు (ఆవు) వలె, ఆశ్రితుల దోషములను భోగ్యముగా అంగీకరించుటకు ఉపయుక్తమైన ఒక గుణ విశేషము. సౌశీల్య మనగా - తాను సర్వ విధముల గొప్పవాడైనను - దానిని చూడక, అపకృష్టు లగు చేతనులతో గూడ ఎడతెగని కూడిక గలవాడై యుండునట్టి గుణ విశేషము. స్వామిత్వ మనగా - చేతనాచేతనములకు నియామకుడై యుండు గుణ విశేషము. సౌలభ్య మనగా - ఇంద్రియములకు అగోచరమైన పరమాత్మ శరీరమును సామాన్య జను లందఱకును కాన వచ్చునట్లు చేయుట కుపయుక్తమైన గుణ విశేషము.

పరమాత్మ శరీర మెట్టి దనగా - అసాధారణమై, అప్రాకృతమైన దివ్య మంగళ విగ్రహము, కాంతి సౌకుమార్యాదులతో గూడినది. కాంతి సౌకుమార్యాదు లనగా - ఆ విగ్రహ గుణములు

సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్య, లావణ్యా, యౌవనాదులు. కిరీట నూపుర పర్యంతముగా అసంఖ్యేయముగ అలంకరింపబడిన ఆభరణ ములు, ఆశ్రితులను రక్షించు శంఖ, చక్ర, గదా, శార్ఙ్గ, ఖడ్గ, దివ్యాయుధములు, శ్రీ, భూ, నీళాది దేవులు, అనంత - గరుడ - విష్వక్సేనాది నిత్యసూరులు, కైంకర్యోపకరణములైన ఛత్ర - చామర - తాలవృంత - భృంగారములు, చండ - ప్రచండ - భద్ర - సుభద్ర - జయ - విజయాది ద్వారపాలకులు, కుముద - కుము దాక్ష - పుండరీక - వామన - శంఖుకర్ణ - సర్పనేత్ర - సుముఖ - సుప్రతిష్ఠాది గణాధిపులు, ముక్తులైన - అసంఖ్యేయులైన చేతనులు, పంచోపనిషణ్మయమైన పరమ పదము, సమస్త నిత్య విభూతి. లీలా విభూతి యందు ప్రకృతి, సాత్త్విక రాజస తామస గుణత్రయ సమూహ ప్రకృతి, సంసార బద్ధాత్మలు, రాత్రి - పగలు మొదలగు రీతిగా విభజింపబడిన కాలము, ప్రవాహ రూపమున గల్గు మహత్త త్త్వము మొదలు - పృథివీ పర్యంతముగా గల ఇరువది మూడు తత్త్వ ములు, అసంఖ్యేయములైయుండు అండ విశేషములు, అండాంతర్వర్తు లగు దేవ - మనుష్య - తిర్యక్ - స్థావరములు మొదలగునవి.

**అయనము :-**

అయన మనగా - ఆశ్రయ మని యర్థము. నారముల కాశ్రయ మని తత్పురుష సమాసము. నారము లను ఆశ్రయముగా గల వాడు అని బహువ్రీహి సమాసము ఇచట ఆశ్రయముగ గలవాడు అను చోట - కల్యాణ గుణములను తప్పక చెప్పవలెను. నారములకు వాస స్థానము. నారములను వాస స్థానముగ గలవాడు - అను ఉభయ విధ సమాసములచేత - పరత్వము, సౌలభ్యము చెప్పబడినవి. అంత ర్యామిగ నుండి నియమించు నని - 'ఇన్ గతౌ' 'అయ గతౌ' అను

ధాతువులందు సిద్ధమైన అయన పదమందు 'వీనిచేత పొందబడు చున్నది కనుక, అయనము' అను కరణార్థ ప్రధానమైన వ్యుత్పత్తి చేత - 'వీడు పొందబడుచున్నాడు' అను కర్మణి వ్యుత్పత్తి చేత ప్రకాశింపబడిన ఉపాయత్వ, ఉపేయత్వములు కానవచ్చును. నారములకు ఉపాయముగాను, ఉపేయముగాను ఉండుటచేత, సర్వేశ్వరుడు నారాయణుడనబడుచున్నాడు. మఱియు - విద్వాంసులచేత నారము లనగా _ జీవ సమూహ మని చెప్పబడుచున్నది. 'నాకు ఉపకారకుడు' 'నాకు తండ్రి' 'నా బంధువు' 'నాకు రాజు' 'నాకు ప్రాణము' అనుట చేత, సర్వేశ్వరుడే ఈ యాత్మకు సర్వ విధ బంధు వని అయనపద మందు చెప్పబడుచున్నది. నారాయణ పదమువలన కైంకర్య సంబంధియగు సర్వేశ్వరుడు చేయు ఉపకారము స్పష్ట మగుచున్నది. 'ఆయ' అను చతుర్థి వలన, సర్వవిధ కైంకర్యములను చేయవలె నని తెలియు చున్నది.

నమస్సు స్వరూప యుక్తము కావున, 'అనవరత దాస్యము చేయవలెను' అను ప్రార్థనను చతుర్థి ప్రకాశింపజేయుచున్నది. అనవరత కైంకర్యాచరణముచే నిత్యసూరుల వలె భగవ దనుభవము చేసి, నేత్రోత్సవముగ సర్వేశ్వరుని సేవించి, ఆనందించువారలకు సదుర రాదు ప్రాప్తి నైలక్షణ్యము కలిగినవారి స్వభావము ఈ విధముగ అనవరత కైంకర్య ప్రార్థనతోడనే యుండును. ఈ యాత్మ యొక్క స్వరూపానురూప పురుషార్థమైన ఈ కైంకర్యము జీవిత కాల మంతయు కలిసి యుండి, సర్వదేశ _ సర్వకాల - సర్వావస్థలందును అనువర్తించును.

భార్యకు మంగళసూత్ర ధారణము భర్తకు అనన్యార్హతా లని తెలుపునట్లు, తిరుమంత్ర ధారణము చేతనులకు గల భగవ దన

న్యాస్వాతంత్ర్యమునకు ప్రకాశకరము. పదునారు పోగులు, రెండు పేటలు అను లౌకిక మాంగల్యము వలె గాక, ఎనిమిది పోగులు, మూడు పేటలుగా నున్న మాంగల్యము వలె, ఎనిమిది అక్షరములు, మూడు పదములతో నున్నది ఈ తిరుమంత్రము. మాంగల్యముగ పోల్చబడుట వలన శ్రీమన్నారాయణుడు దీనితో సంబంధము గల జీవాత్మలకు భర్తగా నుండి రక్షించు నని స్పష్ట మగుచున్నది.

ఈ విధముగా తనకు తాను శేషభూతుడు కాక, సర్వేశ్వరునకే శేషభూతుడై, సర్వశేషి యయిన నారాయణునకే సకల విధ దాస్యములను, కైంకర్యములను చేయవలెను అని స్పష్టము జేయుచున్నది కావున, ఈ తిరుమంత్రార్థమును - విశేషజ్ఞులు, అల్పజ్ఞులు అందఱును కాల నిర్బంధము లేక, అనుసంధించవలెనని సారాంశము.

## ద్వయ మంత్ర వివరణము

'ముముక్షు ప్పడి'యం దొక ప్రకరణమునను, సంస్కృత వాక్య బాహుళ్యముగ 'శ్రియఃపతి ప్పడి'యం దొక ప్రకరణమునందును, అతి సంగ్రహముగ 'యాదృచ్ఛిక ప్పడి' యందును, అతి విస్తృతముగ 'పరంద పడి'యం దొక ప్రకరణమునను 'తని ద్వయము' నను పేరుల మొక్కటిగను - 'ద్వయ మంత్రము' అనగా - 'శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే' 'శ్రీమతే నారాయణాయ నమః' అనునది వివరింపబడినది.

నిరంతరము పరమాత్మను విడియుండని, చేతనుని రక్షింపదగిన పురుషకార భూతురా లగు పెరియ పిరాట్టి (లక్ష్మీదేవి)చేత పురుషార్థ ద్వయమునందు ఈ ద్వయ మంత్రము చెప్పబడినది. అకించన్యము, అనన్య గతిత్వము కలవారు - ద్వయ మంత్రమున కర్హులు.

అకించన్య మనగా - ఉపాయాంతరములు లేకయుండుట. పూర్వ ఖండమున 'శ్రీమత్' అని, లక్ష్మిని పురుష కారముగా ముందుంచు కొని, 'నారాయణ చరణౌ' అని ఉపాయముగా చెప్పబడినది. ఉత్తర ఖండమున - లక్ష్మీనారాయణులకు ఏకముగా చతుర్థీ విభక్తి నిత్య కైంకర్యమును ప్రార్థించుచున్నది నమస్సు కైంకర్య విరోధి నివృత్తి ప్రతిపాదిక మగుటచేత, కైంకర్యమును ప్రార్థించుటయందు అంగ భూత మయినది.

శ్రీ శబ్దము లక్ష్మీదేవికి మొదటి నామము. ఇది ఆమె యొక్క పురుషకారము మొదలగు దయా స్వభావములను తెలియజేయును. శ్రీ అనునది సేవా వాచక మను ధాతువు నందు 'శ్రీయత ఇతి శ్రీః' అనగా - ఆశ్రయింపబడుచున్నది గాన, శ్రీ యనియు, శ్రయత ఇతి శ్రీః అనగా - ఆశ్రయించుచున్నది కావున శ్రీ యనియు - కర్మణి, కర్తరి వ్యుత్పత్తి ద్వయము సిద్ధము. 'శ్రీయతే చేతనైః' అనగా - చేతనులచేత ఆశ్రయింపబడుచున్న దను కర్మార్థక వ్యుత్పత్తిచేత, సాపరాధులయిన చేతనుల స్వరూపస్థితి ప్రవృత్తి నివృత్తులు ఈమె యొక్క కటాక్షాధీన మగుటచేత, చేతనులు ఆశ్ర యింపదగిన వాత్సల్యాధికము చెప్పబడినది. 'శ్రయతే భగవంత మితి శ్రీః' అనగా - తన యొక్క స్వరూప స్థితి ప్రవృత్తులు - ఈశ్వర కటాక్షాధీనము లగుటచేత, 'భగవంతుని ఆశ్రయించుచున్నది' అను కర్త్రర్థక వ్యుత్పత్తి చేత, స్వతంత్రుడైన భగవానుని ఎడబాయకుండు టకు కారణమైన ప్రియత్వము మొదలగునవి చెప్పబడినవి. కనుక, లక్ష్మికి శేషిత్వ శేషత్వములు రెండును నిత్యమై వర్తించును చేత నుల కార్యము తన కార్యముగ భావించి, భగవంతుని తన కటాక్షప దేశములతో స్వాధీనము గావించుకొని, కోపమును శమింపచేసి

రక్షించునది ఈ అసదృశము, పరప్రయోజనకరము నగు పురుష కారము.

'మత్' ప్రత్యయము చేత పురుషకారభూతురాలైన లక్ష్మీ దేవియు, సర్వేశ్వరుడును ఇరువురి కలయిక నిత్య మని స్పష్ట మగు చున్నది. స్వ వ్యతిరిక్తము లగు సమస్త వస్తువుల కంటె విలక్షణము లైన జ్ఞానానందములే స్వరూపముగ గలవా డని భగవ త్స్వరూప మును నిరూపించుచున్న జ్ఞానానందములు మొదలగువానికి పూర్వము శ్రియఃపతిత్వమును జెప్పునట్లు, ఆ భగవ త్స్వరూప జ్ఞానానందమునకు ప్రధాన నిరూపకురా లగుటచేత, ఆమెతో కూడియుండు టే తత్త్వా ర్థము శ్రీ మహాలక్ష్మితో కూడియే శ్రీమ న్నారాయణు డనబడు చున్నాడు. పురుషకార ఉపాయ వస్తువుల సిత్య యోగమును ప్రతి పాదించుచున్న ఈ మ త్ప్రత్యయముచేత ఈ విషయమును ఆశ్ర యించువారికి రుచి మాత్రమే ఆవశ్యకము. 'దేవ్యా కారుణ్య రూపయా' అనునట్లు, కృపయే శరీరముగ గల లక్ష్మీదేవి - సర్వేశ్వ రునకు స్వాతంత్ర్యమును అణచి, కృపను వృద్ధి చేసి, చేతనులను రక్షించును. మహాపరాధమును చేసి, బ్రహ్మాస్త్రమునకు గురి యగు సమయమున, కాకాసురుడు పిరాట్టి (లక్ష్మీదేవి) కృపచే బ్రతికినాడు కదా !

**నారాయణ పదార్థ వివరణము :-**

ఉపదేశ బలము చేతను, సౌందర్యము చేతను స్వాధీనము గావించుకొని, కార్యము చేసికొనగల పురుషకార బలముచేత ఆశ్ర యోన్ముఖుడైన చేతనుడు - అనాదిగా చేసిన యపరాధములను దాచి, కోపించి, సహించజాల నను సర్వేశ్వరునకు వ్యతిరేకముగా

కల్యాణ గుణములను చెప్పుచున్నది నారాయణ పదము. ఆ గుణము లేవి యనగా - వాత్సల్యము, స్వామిత్వము, సౌలభ్యము, జ్ఞానము, శక్తి మొదలగునవి

వాత్సల్య మనగా - దోష భోగ్యత్వము, అప్పుడే పుట్టిన దూడ యందు ఆవునకు గల ప్రేమ భావము. దూడ శరీర మందలి మాలిన్యమును రుచిగా స్వీకరించి, పాలిచ్చి పెంచునట్లు, సర్వేశ్వరుడును శ్రీదేవి సాన్నిధ్యముచే చేతనుల దోషములను భోగ్యపఱచు గొని, తన కల్యాణ గుణములచేత విరోధములను తొలగింపజేయును.

స్వామిత్వ మనగా - ఈ చేతనుడు స్వతంత్రుడై, విషయ ప్రావణ్యము గల దశయం దున్నను, విడువక రక్షణ చింతయే చేసి, సత్తను కల్గించి, విరోధ నివృత్తి చేసి, పరమపద ప్రాప్తి కల్గించి, స్వరూప ప్రకాశమును, పరభక్తి - పరజ్ఞాన - పరమ భక్తులను కల్గించి, భగవ దనుభవమును కృప జేయునట్టి పరమ శేషిత్వము.

సౌశీల్య మనగా - ఉభయ విభూతులతో తనకు గల స్వామిత్వ రూప సంబంధము చేత, ఆశ్రయ వైముఖ్యము పుట్టకుండునట్లు తన యతిశయమును, యెదుటి నికృష్టత్వమును చూడక, సర్వేశ్వరుడు వ్రేపల్లెయందు గొల్లలతో గూడియుండునట్లు, అమాయకు లగు చేతనులతో చేరియుండుట.

సౌలభ్య మనగా - సామాన్య చక్షువులకు విషయుడు కాని తాను, సామాన్య చక్షువులచే సేవింపబడుటకు, ఆశ్రయింపబడుటకు తగిన విధముగా అర్చా రూపమును గొని, సులభము గా వేంచేసి యుండుట.

ఈ వాత్సల్యాది గుణ చతుష్కముచే ఆశ్రయణ సౌకర్యాపాదకము లని యందురు. అనగా - ఆశ్రయించుటకు తగినట్లుగా సౌకర్యమును కలుగజేయునవి యని యర్థము.

జ్ఞాన మనగా - ఈ చేతనునకు నివర్తింపదగిన అనిష్టములను, ఈయవలసిన యభిమతములను, తన కంటె ఇతరము లగు సకల పదార్థములను ఏక కాలమున ప్రత్యక్షముగా తెలిసికొనదగిన తెలివి.

శక్తి యనగా - హేయులుగా నుండుట వలన, త్యాజ్యు లగు నిత్య సంసారులను, ఉపాదేయతములైన నిత్యసూరులతో సమానముగా చేర్చగల అఘటిత ఘటనా సామర్థ్యము

జ్ఞాన శక్తులను రెండును చెప్పె యవియే ప్రాప్తి పూర్తులకు సలక్షణము. ప్రాప్తి యనగా - నిరుపాధిక శేషిత్వరూప సంబంధము. పూర్తి యనగా - అవాప్త సమస్త కామత్వము.

తమ దోషములను నశింపజేసి, సర్వేశ్వరుడు ఇష్టప్రాప్తి కల్గించు నను ధైర్యముతో ఆశ్రయించుటకు వాత్సల్యము, తన సొత్తు కానివానియందు వినియోగించదు కావున, స్వేతర సమస్తము తన సొమ్మని అభిమానించునట్టి స్వామిత్వము, అందుకుగాను ఎదుటి వాని తన యతిశయమును జూచి, విముఖులై పోకుండుటకు తగిన సౌశీల్యము, సౌశీల్యము కన్నులార సేవించి యనుభవించుటకు తగిన సౌలభ్యము, ఆశ్రయించినవారి యిష్ట ప్రాప్తికి, అనిష్ట నివారణమునకు తగిన జ్ఞానము, దాని నాచరింపజేయుటకు తగిన శక్తియు, అవాప్త సమస్త కామత్వము మొదలగు సర్వ గుణ పరిపూర్ణతయు నారాయణ పదమునందు కలవు. అతని యునికి నే మనకు రక్షకము.

**'చరణౌ' శబ్దార్థ వివరణము :-**

ఈ శరణ శబ్దముచేత చెప్పబడిన దివ్య మంగళ విగ్రహ మొక్కటే చేతనుని ఇష్ట ప్రాప్తికి, అనిష్ట నివారణమునకును తప్పని ఉపాయము. ఇష్ట ప్రాప్తి, పరమపద ప్రాప్తి, సంసార సంబంధము, అనిష్ట నివారణము. శరణ శబ్దము చేత ప్రప్యుడైన ఈశ్వరుడే ప్రాపక మని చెప్పబడుచున్నది. లక్ష్మీ విశిష్టత్వము, కల్యాణ గుణ యోగము, దివ్య మంగళ విగ్రహ విశిష్టము అను మూడును చేతనునకు అనుభవముగా చెప్పబడుటచేత ప్రాప్యములు. అకించనుడు, అనన్యగతికుడు నగు చేతనుడు స్వప్రవృత్తి లేనివా డగుటచేత, భోగ్యమై యున్న క్షీరమును రోగ నివృత్తికై పథ్యముగా స్వీకరించినట్లు, ఫలమైన పరమాత్మనే, ప్రాప్యమునే ప్రాపకముగ చేసికొనుచున్నాడు. 'శరణౌ శరణం' అని ప్రాప్య ప్రాపకములకు ఏకత్వము కలుగుటచేత సిద్ధోపాయ మనియు, ప్రాప్య ప్రాపకములకు 'భేదము కల్గియుండు కర్మ - జ్ఞాన - భక్తి యోగాదులకంటెను విలక్షణ మనియు అతిశయమును స్పష్టము చేయుచున్నది.

**“ప్రపద్యే' శబ్దార్థ వివరణము :-**

'ప్రపద్యే' అనగా - 'ఆశ్రయించుచున్నాను' అని అర్థము. 'పద గతౌ' అను ధాతువునుండి గతివాచకమై, వర్తమాన నిర్దేశకమై, అనన్యార్హ శేషత్వ జ్ఞాన కార్యమై, భగవ ద్రక్షకానుమతియై, సర్వాధికారమై, భగవ దనుగ్రహ ప్రాప్తమగు దృఢా ధ్యవసాయ రూపమై, జ్ఞాన విశేషణమై యున్నది. 'ప్రపద్యే' అనగా - ఆశ్రయించుచున్నా నని కదా యర్థము! ఇదియే 'ప్రపత్తి' అనబడును. దీనిని మానసిక, వాచిక, కాయిక రూపములైన త్రివిధ కరణములచే

ఆశ్రయింపవలసిన యవసరము లేదు. ఫల సిద్ధికి పరమాత్మయే ఉపాయ మగుటచేత, అధ్యవసాయ రూపమైన మానస స్వీకారం మొకటియే చాలును 'జ్ఞానాత్ మోక్షః' అని చెప్పబడినదికదా ! ఉపాయాంతరములు చేరక, సదా అనుసంధానము చేయుటకుగాను 'ప్రపద్యే' అని వర్తమానము నిర్దేశింపబడినది ప్రపత్తి చేయుటకు పూర్వము గల సాధనాంతరములందు బుద్ధి మరల్చక, రస్యత కల్గిన ఈ ద్వయ మంత్రము విడువ శక్యము కానందున, వర్తమానమై యుండును.

ఉత్తర వాక్యము చేత పూర్వ వాక్య మందలి ఉపాయము చేత ఈ వాక్యము నందలి ఫలము స్పష్టము. ఇతర ఫలములైన ఐశ్వర్య, కైవల్యాదులను విడచి, కైంకర్య రూప మయిన ప్రాప్య మును తెలియజేయుచున్నది.

**'శ్రీమతే' శబ్దార్థ వివరణము :**

'శ్రీమతే' అనగా - 'శ్రీ' మహాలక్ష్మితో కూడియున్నవాని కొఱకు' అని యర్థము. 'మత్' ప్రత్యయమునకు నిత్య యోగమును అనుసంధించవలయును. పరమాత్మ ఉపాయ మైనప్పుడు - లక్ష్మి పురుషకారమై యుండును. చేతనులు చేయు కైంకర్యమునకు ప్రతి సంబంధిగా నుండి ప్రాప్యుడై, పొందదగినవాడైనప్పుడు, పరమాత్మతో కూడ కైంకర్యమునకు ప్రతిసంబంధిగా నుండి, తానును ప్రాప్యురాలై, పొందదగినదై యుండి, చేతనులకు కైంకర్య వర్ధకురా లగును. తిరుమంత్రమునందు - 'నారాయణుని కొఱకు కైంకర్యము' అని చెప్పి, ఈ మంత్రమునందు లక్ష్మితో కూడిన నారాయణుని కొఱకు అని వివరించినారు. అందువలన, లక్ష్మణస్వామి వలె ఇరువురును కూడి

యుండునట్లు (శ్రీ (శ్రియఃపతి లియువురును) కైంకర్యము చేయ వలెను. తల్లిదండ్రులు చేరిక గా నుండు సమయమున శుశ్రూష చేయు పుత్రుని వలె, మహాలక్ష్మితో కూడియుండు శ్రీమన్నారాయణుని సన్నిధిలో చేతనుడు చేయు కైంకర్యము సిద్ధించును, రసించును. ఈ విధముగా పురుషకారత్వ - ఉపాయత్వములు రెండును లక్ష్మికి స్వరూపానురూపమై యున్నవి.

## 'నారాయణ' శబ్దార్థ వివరణము :-

'నారాయణాయ' యనగా - 'సర్వమునకు శేషి యయినవాని కొఱకు' అని యర్థము - శేష భూతుడు చేయు కైంకర్యమును సమ్మతించువాడు శేషి. ఈ నారాయణ పదమందు - కైంకర్యమునకు పూర్వమునందుండు భగవదనుభవమునకు విషయమైన దివ్య మంగళ విగ్రహము, కల్యాణ గుణములు స్పష్టములు. చివరి చతుర్థ్యంశముచేత చెప్పబడుచున్న వృత్తి విశేషమునకు మిగుల అంతరంగముగా నుండుట శేషత్వము. సర్వేశ్వరుడు అనంత కల్యాణ గుణపూర్ణుడు కావున, అతని శేషత్వము అత్యంతానందావహము. ఈ చతుర్థి - కైంకర్యమును ప్రకాశింపజేయుచున్నది. ఆత్మ స్వరూపము నిత్యమైనట్లు, త ద్వృత్తి యగు కైంకర్యము నిత్యమైనది. సర్వేశ్వరుడు సర్వస్మాత్ పరుడగుటచేతను, చేతనుడు అత్యంత పరతంత్రుడగుటచేతను, ప్రార్థనా విశేషము లేనిచో - కైంకర్యము సిద్ధించదు. కావున, నిత్యము సర్వేశ్వరుని ప్రార్థించవలెను. శేషి యగు సర్వేశ్వరునకు - శేషుడైన చేతనుడు చేయు కైంకర్యములచేత ప్రీతి రూపమైన అతిశయమును కలుగజేయుట, శేషభూతుడైన తన స్వరూపమునకు లాభమై, స్వామి యైన సర్వేశ్వరుని ముఖోల్లాసమునకు కారణమై

యుండుటచేత ప్రాప్యమై యుండును. కనుక, కైంకర్యమును ఎల్లప్పుడు చేయవలెను.

**'నమః' శబ్దార్థ వివరణము :-**

'స్వతంత్రుడను కాను' అని నమ శ్శబ్దార్థము ఇచ్చట భోక్తను, నేను, 'ఇది నాకు భోగ్యము' అనునట్లు, కైంకర్యమును తనకు రసక్తమని యెంచి చేయుటవలన, తాను చేయునది సర్వము భగవన్ముఖ వికాసమునకు హేతు వగుట వలన, కైంకర్య ప్రాప్తమునకు విరోధములైన వానిని ఈ 'నమః' పదము నివర్తించును అహంకార, మమకార నివృత్తిని ప్రార్థించుచున్న అజ్ఞానాది దోషములను, అవిద్యాకార్యమైన పుణ్య పాప రూప కర్మములను, ఆ కర్మముల వలన కలుగు ప్రకృతి సంబంధమును నివర్తింపజేయును అందువలననే ద్వయ వివరణమైన గద్యత్రయమున నమ శ్శబ్దార్థము నను సంధించు సమయమున - 'మనో వా క్కాయ' మొదలగు చూర్ణికచేత, అకృత్య కరణము మొదలగు సమస్త కర్మముల నివృత్తిని శ్రీభాష్యకారులు ప్రార్థించినారు.

కైంకర్యమును చేయునపుడు - 'నీకే మేము దాస్యము చేయలము' అను సమయమున సంతోషముగా నుండవలెను కైంకర్య ప్రార్థన వలె - 'నమః' అను పదమునందు కైంకర్య విరోధి నివృత్తికై సర్వ కాలము లందు సంతోషముగ నుండవలెను. ఈ విధముగా పురుషకారము, తన్నిత్యయోగము, దానిచేత ప్రకాశించిన వాత్సల్యాది గుణములు, ఆ గుణములకు ప్రకాశకమైన దివ్యమంగళ విగ్రహము, గుణ విగ్రహ విశిష్ట వస్తువు యొక్క ఉపాయత్వము, తద్విషయ కైంకర్యము, కైంకర్య విరోధి నివృత్తియు ఈ ప్రకరణమున చెప్పబడినవి.

## చరమశ్లోక వివరణము

'ముముక్షుప్పడి'యం దొక ప్రకరణమున స్పష్టముగను, 'శ్రీయఃపతిప్పడి'యందు సంస్కృత వాక్య బాహుళ్యముగను, 'యాదృచ్ఛికప్పడి'యందు అతి సంగ్రహముగను, 'పరందపడి'యందు అతి విస్తృతముగను, 'తని చరమము'నందు ఒక్కటిగను చరమ శ్లోకము వివరింపబడుచున్నది. మహా భారతము యొక్క సమగ్ర సారాంశమైన భగవద్గీత యందు గల చరమశ్లోక మిది :-

" సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః. "

సర్వ ధర్మములను త్యజించి, నన్నొక్కనినే శరణు పొందుము. నిన్ను అన్ని పాపములనుండి నేను విముక్తుని గావింతును నీవు చింతింపకుము" అని దీని భావము. కర్మ జ్ఞాన భక్తు లను ఉపాయములను, అనుష్ఠించుట అశక్య మనియు, ఇక భగవత్ప్రాప్తి లేదనియు దుఃఖాక్రాంతుడైన అర్జునుని చూచి, 'ఇక దీనికి మించినది, సమాన మైనది వే రొకటి లేదు' అనియు అంతిమ ఉపాయముగా చెప్పుట చేత - ఇది చరమ శ్లోక మనబడుచున్నది.

**పూర్వ వాక్యార్థము :-**

ఈ శ్లోకము నందలి పూర్వ వాక్యమున అధికారి కృత్యము, ఉత్తర వాక్యమున ఉపాయ కృత్యము చెప్పబడుచున్నవి. పరమాత్మను తనకు ఉపాయ భూతునిగా పరిగ్రహించుటయే అధికారి కార్యము. ఉపాయ భూతుడైన పరమాత్మ చేయునది ఉపాయ కృత్యము. పూర్వార్థమున - 'సర్వ ధర్మాన్, పరిత్యజ్య, మామ్,

ఏకం, శరణం, వ్రజ' అని ఆఱు పదములు గలవు. 'సర్వ ధర్మాన్' అనగా - 'సర్వ ధర్మములను' అని యర్థము. ధర్మ మనగా - జనులకు వాంఛిత ఫలములు సిద్ధించుట కొఱకు శ్రుతి స్మృత్యాదులందు విధింపబడిన సాధన విశేషము. పశు పుత్రాది ఫలముల వంటి అని సౌఖ్యము లను ప్రాప్తింపజేయు ధర్మము లన్నింటిని విడచి, అనగా - 'నా స్వభావములను చక్కగా తెలిసికొని, ముత్యపు చిప్పను వెండి యని భావించి స్వీకరించినవాడు - యదార్థము కాదని, భ్రమించితి నని తెలిసి విడుచునట్లు విడచి' అని భావము. 'నన్ను' అనగా - సర్వ రక్షకుడ నయిన, సదా రక్షకుడ నయిన, పర వ్యూహాదుల కంటె, ఇతర దేవతల కంటె విలక్షణుడ నగు, సిద్ధమైన, పరమ చేతనమైన, సర్వశక్తి మయమైన, నిరపాయమైన, సహాయాంతర నిరపేక్షమైన, వాత్సల్య - స్వామిత్వ - సౌశీల్య - సౌలభ్యము లను గుణ విశేషములు ప్రత్యక్షముగ ప్రకాశించుచున్న 'నన్ను' ఒక్కనినే ఉపాయముగా శరణు పొందుము' అని పూర్వ వాక్యార్థము.

**ఉత్తర వాక్యార్థము :-**

ఉత్తర వాక్యమున - 'అహం, త్వా, సర్వపాపేభ్యః, మోక్షయిష్యామి, మా, శుచః' అని ఆఱు పదములు గలవు. 'అహం' అనగా - 'నేను' అని, సర్వేశ్వరుడు - తాను చేతనునకు చేయునది చెప్పుచున్నాడు. సర్వజ్ఞుడ నయిన, సర్వశక్తిమంతుడ నయిన, ప్రాప్తుడ నయిన 'నేను' - 'శేషత్వ' మను బంధ విశేషము గల నేను - త్రివిధ చేతనాచేతనముల స్వరూప స్థితి ప్రవృత్తులను స్వాధీనమున గల నేను - 'నిన్ను' అనగా - అజ్ఞుడవై, అశక్తుడవై, అప్రాప్తుడవై నన్ను ఉపాయముగ స్వీకరించిన నిన్ను - 'సర్వ పాపములనుండి' అనగా - నన్ను పొందుటకు ప్రతిబంధకము లని ఏ పాపములను

గూర్చి నీవు భయము జెందుచుంటివో, ఆ విధమైన పాపము లన్నిటి నుండి, అవిద్యా కర్మ వాసనా రుచి ప్రకృతి సంబంధముల నుండి 'విడిపించెదను' విముక్తుని చేయగలను. నన్ను ఆశ్రయించిన మాహాత్మ్యము చేత నిన్ను చూచి, పాపములు భయపడి, స్వయముగనే వెడలిపోవును. ఇంతవఱకు స్వరక్షణము గావించుకొనుచున్నావు గావున ఊరకున్నాను. ఇపుడు నన్నాశ్రయించి, నా శరీరములో భాగమైతివి గావున, ఆ పాప మాలిన్యమును నేనే పోగొట్టుకొనెదను. కనుక, నీవు శోకించవలదు' అని ఉత్తర వాక్యార్థము.

ఈ రీతిగా ఉత్తరార్థములో - ఉపాయ భూతుడైన సర్వేశ్వరుని రూపమును - 'అహమ్' అను పదము చేతను, నివర్తింపదగిన పాపములకు ఆశ్రయమైన చేతన స్వభావమును 'త్వా' అను పదము చేతను, నివర్తింపబడవలసిన పాపములను - 'సర్వ పాపేభ్యః' అను పదము చేతను, ఆ పాపములు స్వయముగనే పోవునని - 'మోక్షయిష్యామి' అను పదము చేతను, పాప నివృత్తి కార్యమైన శోక నివృత్తిని - 'మా శుచః' అను పదముచేతను ప్రతిపాదింపబడినవి.

చరమశ్లోక సారాంశము :-

ఈ రీతిగా ఈ శ్లోకమునకు అర్థమైన సర్వ ధర్మములను వదలి, సర్వేశ్వరునే ఉపాయముగ స్వీకరించుటయందు అభిరుచి కలుగుట కష్ట మనియు, ఈ శ్లోకమునకు ఈశ్వర స్వాతంత్ర్యమునందు తాత్పర్య మనియు, త్యాగ స్వీకారమున విశ్వాసము కలుగుట దుర్లభ మనియు, సర్వేశ్వరుడు ఆరంభమునందే ఈ శ్లోకమున ఉపదేశింపకుండుటకు కారణము - ఉపాయాంతరములను స్వరూపముతో అను

ఫాయములుగా విడచు పక్షమున దోషము లేదనియు, కర్మ జ్ఞానా దులు కైంకర్యాది రూపముగ అనుష్ఠింపబడుచున్నవి కావున - విహిత ములే కావనియు, పురుషార్థమునకు సాధనములు భగవత్ప్రసాద ములగు, సర్వ ధర్మములను వదలి, సర్వేశ్వరునే ఉపాయముగ ఆశ్ర యించినచో - ఆ సర్వేశ్వరుడు ప్రాప్తి ప్రతిబంధకము లగు స్వరూ ములను నివర్తింపజేసి, స్వప్రాప్తిని కలుగజేయు నను మహా విశ్వాస మునే ఉజ్జీవించుట ముఖ్య మనియు, ఆ విశ్వాసము లేనిచో నిష్ఫల మగుయు, ఇందువలన - తన్నిష్ఠులై యుండవలె ననియు చరమ శ్లోకా ర్థము స్పష్టము చేయబడినది.

## తత్త్వ త్రయము

మోక్షసిద్ధికి తిరుమంత్ర ద్వయ చరమ శ్లోకము లనబడు రహస్య త్రియము నెఱుంగు టెంత యావశ్యకమో, చిత్తు - అచిత్తు - ఈశ్వరుడు అను తత్త్వత్రయ విశేషముల నెఱుంగుట అంతటి యావ శ్యకము. కావున ఆ వివరము లిట పేర్కొనబడుచున్నవి :-

చిత్ప్రకరణము :-

చైతన్యమునకు ఆధార మగునది 'చిత్' అనబడును. 'చిత్' అనగా - చేతనుడు. అనగా - జీవాత్మ. దేహమున కంటెను, ఇంద్రియముల కంటెను, మనస్సు కంటెను, ప్రాణము కంటెను, బుద్ధి కంటెను అతిరిక్తమై, అజడమై, ఆనంద రూపమై, అణువై, నిత్యమై, జ్ఞానమునకు స్థానమై, ఈశ్వరునకు శరీరమై యుండును. ఆత్మ అనునది - 'అహమ్' అను వ్యవహారం సిద్ధ మగునది. దేహేంద్రి యాదులు ఆత్మ కావు. శ్రుతి స్మృతుల చేత ఆత్మ - దేహాదుల కంటెను అతిరిక్త మని స్పష్టము. ఆత్మ అజడమై యుండుట యనగా-

స్వయం ప్రకాశమై యుండుట. నిత్యమైన ఆత్మ - దేహముతో సంబంధించుట జనన మనియు, దేహమును విడచుట మరణ మనియు వ్యవహరింపబడును. ఆత్మ పుట్టదు, నశించదు, కన్ను మొదలగు ఇంద్రియములచే ఎఱుగబడదు కావున - 'అవ్యక్త' మనబడును తలచుటకు అనువైనది కాకుండుటచేత 'అచింత్య' మనబడును. ఆ యాత్మ - సజాతీయముగా తలంప వీలు కాదు అవయవ సము దాయము కాకుండుటచే - ఆత్మ నిరవయవము, జ్ఞానమే రూపముగా గలది, అచ్ఛేద్యమైనది, అదహ్యమానమైనది, అసించనమైనది, అశోచ్యమైనది, కాంతికి దీపము ఆశ్రయమైనట్లు - జ్ఞానమున కాశ్ర యము ఆత్మ. ఆత్మకు జ్ఞాతృత్వము, కర్తృత్వము, భోక్తృత్వము కలవు. ఈ కర్తృత్వము భగవ దధీనము. ఆత్మ యొక్క సార గుణ మైన జ్ఞానము స్వరూపానుబంధియై, స్వరూప నిరూపక ధర్మమైనది. ఈ ఆత్మ యొక్క సకల వ్యాపారములు - పరమాత్మ యొక్క సంక ల్పము ననుసరించియే వర్తించుచుండును.

ఈ ఆత్మలు - బద్ధు లనియు, ముక్తు లనియు, నిత్యు లనియు మూడు విధములు. ప్రకృతి సంబంధముచే సంసార నిమగ్ను లయిన వారు బద్ధులు. ఆ సంసార బంధము తొలగి, పరమాత్మానుగ్రహ ముతో పరమపదమును చేరినవారు ముక్తులు. సంసార గంధము లేకనే సర్వదా సర్వేశ్వరుని సన్నిధిలో సంచరించు విష్వక్సేనాదులు నిత్యులు. ఈ విధముగా జీవాత్మలు అనంతమైనవారు. స్వభావముగ జ్ఞానానందామల స్వరూపులయిన వీరు - ప్రకృతి సంబంధము వలన అవిద్యాదులందు ఆసక్తు లగుచున్నారు. వివిధ శరీరములను ధరించు చున్నారు. ఆత్మ ఏకము కాదు. అనేకము లనుటకు అనేక అనుప పత్తులు కలవు, స్వరూపమైన జ్ఞానము, ధర్మమైన జ్ఞానము అని రెండు

విధములుగా గలది జ్ఞానము. జ్ఞానము, జ్ఞాతయు ఆత్మయే యని నిరూపింపబడినది. సంకోచ వికాసములు లేక, స్వయం ప్రకాశమై, అణువై యుండునని ధర్మభూత జ్ఞానము. సంకోచ వికాసములకు యోగ్యమై, ఇతర పదార్థములను సహితము ప్రకాశింపజేయునదియై, ఆత్మచే ప్రకాశింపజేయదగినది ధర్మభూత జ్ఞానము. సంసారుల జ్ఞానము కర్మానుగుణముగా సంకోచ వికాసములు కల్గియుండును. నిత్యసూరుల జ్ఞానము సంకోచము లేక, ఎల్లప్పుడును విభువై యుండును. ముక్తుల జ్ఞానము పూర్వావస్థలో అవిభువై, ఉత్తరావస్థలో విభువై యుండును. జ్ఞానము నిత్యమైన ద్రవ్యమనియు, అజడమనియు, ఆనంద రూపమనియు, భగవంతునకు శరీరము వంటిదనియు చేతన తత్త్వము వివరింపబడినది.

అచి త్ప్రకరణము :-

జ్ఞానము లేని వస్తువు - 'అచిత్' అనబడును అచేతన మయినది అచిత్. జ్ఞాన శూన్యమై, వికారాస్పదమైన వస్తువు - 'అచిత్' అనబడును. వికార మనగా - ఒక యవస్థ నుండి మఱియొక యవస్థను పొందుట. చేతనమునకు వికారము లేదు అది ఎప్పుడును ఏక రూపముగనే యుండును. అచేతన మయిన అచి త్తత్త్వము వికారము నందుచుండును. శుద్ధ-సత్త్వము, మిశ్ర సత్త్వము, సత్త్వ శూన్యము - అని అచిత్తు మూడు విధములు వేఱొక గుణము కలియని కేవల సత్త్వ గుణము శుద్ధ సత్త్వ మనబడును. ఇది నిత్యమై, భగవ దాజ్ఞానుసారము చేతనులకు జ్ఞానానందములను కలిగించుటకై, విమాన - గోపుర - ముఖ మండపములుగా పరిణమించును. సూర్యాగ్నుల కంటెను అధికమైన తేజో రూపముగా నుండును. ప్రకాశము అపూర్వ మగుచు, ఆశ్చర్యానహమై యుండును. రజ

స్తమస్సులతో గూడిన సత్త్వము మిశ్రసత్త్వ మనబడును. ప్రకృతి, అవిద్య, మాయ - అని దీనికి పేర్లు. దీనివలన - సంసారులకు విపరీత జ్ఞానము కల్గును. జగత్సృష్టికి గాను పరమాత్మ కిది యుపకరణము. మహత్తు మొదలగు వికారములను ఘటించును కావున, ప్రకృతి యన బడును. జ్ఞానమునకు అవరోధముగ నుండును కావున, 'అవిద్య' అన బడును. విచిత్ర సృష్టి గావించుట వలన - 'మాయ' యనబడును. ఇది ఇరువది నాల్గు తత్త్వములతో గూడియుండును. శబ్దాది విషయ ములు ఐదు, కర్ణాది జ్ఞానేంద్రియములు ఐదు, వాగాది కర్మేంద్రియ ములు ఐదు, ఆకాశాది పంచభూతములు ఐదు, ప్రకృతి, మహత్తు, అహంకారము, మనస్సు మొదలగునవి. ప్రకృతి, ప్రధానము, అవ్య క్తము అని పేర్లు. సర్వేశ్వరుని లీలకు ప్రధానమైన ఉపకరణము కావున, ప్రధాన మనబడును. గుణముల భేదము వ్యక్తము గానందున, అవ్యక్త మనబడును.

ఈ ప్రకృతి నుండి సత్త్వ రజ స్తమో గుణ వైషమ్యము వలన మహదాది వికారములు పుట్టును. మహత్తు నుండి సాత్త్విక, రాజస, తామస భేదములతో అహంకార ముద్భవించును. సాత్త్వి కాహంకారము నుండి కర్మేంద్రియ పంచకము, జ్ఞానేంద్రియ పంచ కము, మనస్సు అనునవి పదునొకండు జన్మించును. భూతాది యను తామసాహంకారమునుండి పంచ తన్మాత్రలు, పంచ భూతములు కల్గును. భూతాది నుండి శబ్ద తన్మాత్రము, అందుండి ఆకాశము, అందుండి స్పర్శ తన్మాత్రము, అందుండి వాయువు, అందుండి రూప తన్మాత్రము, అందుండి గంధ తన్మాత్రము, అందుండి పృథి వియు పుట్టుచున్నవి. సాత్త్విక - తామసాహంకారములకు - రాజ సాహంకారము తోడుగా నుండును. వీని యన్నిటిని చేర్చి, పర మాత్మ సృష్టి చేయుచున్నాడు. ఆ సర్వేశ్వరుని సంకల్పానుసారము

బహు విధములుగా సృష్టి జరుగుచున్నది. సత్త్వ శూన్యము కాలము. పరమాత్మ సంకల్పానుసారము - కాలము సృష్టి స్థితి లయములకు సంబంధించును. సర్వేశ్వరునకు లీలోపకరణమైన కాలము యొక్క పరిణామము - నిమేష, కాష్ఠ, కలా, ముహూర్త, దినసు, మాస, ఋతు, అయన, సంవత్సరములుగా నుండును. పరమాత్మకు భోగ్యము, భోగోపకరణము, భోగోపస్థానము ఈ త్రివిధాత్మక మయిన అచిత్తు. శుద్ధ సత్త్వము నిత్య విభూతి యనియు, మిశ్ర సత్త్వము లీలా విభూతి యనియు, సత్త్వ శూన్యము ఉభయ విభూతి యనియు వ్యవహరింప బడును. ఈ విధముగా అచి త్తత్త్వము వివరింపబడినది.

ఈశ్వర ప్రకరణము :-

చిదచి త్తత్త్వములకు నియామకు డయిన ఈశ్వరుడు తృతీయ తత్త్వము - అఖిల హేయ ప్రత్యనీకుడు, జ్ఞానానందైక స్వరూపుడు, జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజ స్సౌశీల్య, వాత్సల్య, ఔదార్య, మార్ద వార్జవ శౌర్య ధైర్య పరాక్రమాది అనంత కల్యాణ గుణా కరుడు. సర్వ సృష్టికర్త. రక్షకుడు, చతు ర్విధ పురుషార్థ ప్రదాత, శ్రీ భూ నీళా నాయకుడు.

అఖిల హేయ ప్రత్యనీకు డనగా - దోష రహితుడు అనంతు డనగా - దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితుడు, జ్ఞానమే స్వరూపముగా గలవాడు. త దానుకూల్యమే ఆనందము. అందులకే జ్ఞానానందైక స్వరూపుడు. సకల గుణములును - ఉత్పత్తి వినాశములు లేనివి. నిత్యమైనవి. పరికించుటకు, గణించుటకు అలవి గానివి. ఇన్ని కల్యాణ గుణములు కేవలము పరమాత్మయందే సందర్శింపనగును.

**కల్యాణ గుణములు :-**

జ్ఞాన మనగా - హితాహిత నిరూపణమునకు ఉపయుక్త మైనది. శక్తి యనగా - అఘటిత ఘటనా సామర్థ్యము. దయ యనగా - ఇతరు లనుభవించు దుఃఖము నోర్వలేకుండుట. వాత్సల్య మనగా - ఆశ్రితుల దోషములను భోగ్యముగా గ్రహించుట. శీల మనగా - గొప్ప తగ్గులను వ్యత్యాసము లేక, కలిసి మెలిసి యుండుట ఆర్జవ మనగా - కరణ త్రయముచే ఒకే స్వభావమును కల్గి యుండుట. సౌహార్ద మనగా - నిరంతరము తమను చెడుగా భావించువారికి సహితము సహాయముగా నుండుట. సౌకుమార్య మనగా - తనను విశ్లేషించి యుండుటకు భయపడువారికి సాయముగా నుండుట. సౌలభ్య మనగా - అతీంద్రియమైన విగ్రహమును కంటికి లక్ష్య మగునట్లు చేయుట. ఆశ్రిత పరతంత్రు డగుటచేత, ఇతరుల కొఱకే ఉపయోగపడుచుండును. సామ్య గుణ యుక్తు డగుటచేత, దాసుల నైచ్యమును చూడక, ప్రవర్తించును. అశరణ్య శరణ్యుం డగుటచేత, ఇతర గతి లేక ఆశ్రయించినవారికి రక్షకుడై యుండును. సత్యకాము డగుటచేత గురు వగు సాందీపుని పుత్రునకు పునర్జన్మ నొసంగెను. ఇట్లే, సత్య సంకల్పము, అమోఘ సంకల్పము, ఔదార్యము, కృతి, కృతజ్ఞత, మాధుర్యము, చాతుర్యము, ప్రణయిత్వము, ఆర్జవము, మార్దవము, సౌశీల్యము మొదలగు కల్యాణ గుణ గణ సంపన్నుడు సర్వేశ్వరుడు

ఇట్లు విలక్షణ స్వరూప గుణ విశిష్టుడైన శ్రీమన్నారాయణుడే సమస్త కార్యములకును కారణమై యుండును. అవిద్యాది దోష రహితుడైనవాడు, సర్వ నియామకుడు నయిన సర్వేశ్వరుని సర్వ కార్య కారణత్వమునకు హేతువు అతని సంకల్పమే. సంకల్ప

మాత్రము చేతనే సర్వమును సృజించుచున్నాడు ఇది యంతయు కేవలము సర్వేశ్వరుని లీలా మాత్రమే. సర్వ జగత్కారణము అనగా - ఉపాదాన కారణము, నిమిత్త కారణము పరమాత్మయే. సృష్టి స్థితి సంహారకర్త పరమాత్మయే.

పరమాత్మ - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారము లని పంచ విధములుగా నుండును. శ్రీవైకుంఠమున విష్వక్సేనాది నిత్యసూరులకు, ముక్తులకును అనుభవ విషయభూతు డగుచు, వేంచేసియుండు స్థితి - పరత్వము.

విభూతి యందలి సృష్టి స్థితి సంహారముల నిర్వహణకుగాను - వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధుల రూపమున నుండు స్థితి - వ్యూహము.

విభవ మనగా - అవతారము. సర్వ జగ ద్రక్షణకు గాను ధరించు రామ కృష్ణా ద్యవతారములు. ఈ యవతారములు అనంతములు. ఈ విభవము - గౌణ మనియు, ముఖ్య మనియు రెండు విధములు. ఇతర సజాతీయ మగుచు ఆవిర్భవించుటయే విభవము.

చేతను లందఱిలో ప్రవేశించి, సకల ప్రవృత్తులకు నియంతలై యుండుట అంతర్యామిత్వము. శరీర శరీరి భావ సంబంధముతో హృదయ కమలమున వేంచేసి యుండుట - అంతర్యామిత్వము. ఆశ్రితులైన చేతనులకు అభిమతమైన ద్రవ్యములో, రూపములో, ప్రదేశములో వేంచేసియుండి, విగ్రహ సౌందర్యముచే మనస్సులను హరించి, అనుభవైకవేద్యమైన ఆనందము నందించునది అర్చావతారము. ఈ రీతిగా పరమాత్మ తత్త్వము వివరింపబడినది.

# తత్త్వ శేఖరము

ఈ రహస్య గ్రంథమునందు ఐదు ప్రకరణములు గలవు. అందు ప్రథమ ప్రకరణమున పర స్వరూపము, ద్వితీయ ప్రకరణమున జీవ స్వరూపము. తృతీయ ప్రకరణమున పురుషార్థ స్వరూపము, చతుర్థ ప్రకరణమున ఉపాయ స్వరూపము నిరూపింపబడినవి.

పర స్వరూపము :-

సకల చేతనులకు జనన మరణాది రూపమగు సంసార బంధ నివర్తనమునకు గాను ఆవశ్యకము తత్త్వ జ్ఞానము. పర స్వరూపమైన నారాయణుని శరణు వేడుటయే తత్త్వజ్ఞాన విశేషము. ఆశ్రితులను రక్షించువాడు, అందరికంటెను అధికుడు, సర్వ జగత్కారణ భూతుడు, సర్వ సంరక్షకుడు, సర్వ నియామకుడు, శాసకుడు శ్రీమన్నారాయణుడే. ఉపనిషత్తులు, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు సర్వ కార్యకర్తగా, సర్వ శబ్ద వాచ్యునిగా నారాయణుని ప్రతిపాదించుచున్నవి. ఛాందోగ్య, వాజసనేయ, కౌషీతకీ బ్రాహ్మణములందు - సద్బ్రహ్మ మొదలగు శబ్దములచే చెప్పబడుచున్నది. ఈ సద్బ్రహ్మాదిశబ్దములు నారాయణునే ప్రతిపాదించును. హిరణ్యగర్భ, ధాతృ, ప్రజాపతి శబ్దములు - అపర్యవసాన వృత్తిచే గాని, అవయవ శక్తిచే గాని, నారాయణ ప్రవృత్తి[illegible] గాని, నారాయణవాచకములే. బ్రహ్మ దేవేంద్రాదులు శరధ్రైనైన నారాయణుని అంతరాత్మగా గలవారే. మార్కండేయ విష్ణు, వరాహ, వాయు, మత్స్య పురాణములందు - విష్ణువు యొక్క పరమ తత్త్వము ప్రబోధింపబడినది. అప్రాకృత రూపములను సాగ

ఫలచే, దేవ - మనుష్య - తిర్యక్కులనుగా సృష్టించుచున్నాడు. జగదుపకారము కొఱకు తాను స్వయముగా వివిధ రూపములతో అవతరించుచున్నాడు. ఈ సర్వ భూతములకు అంతరాత్మగా నుండి, వాని దోషము లంటక, దివ్యమైన దేవునిగా విరాజిల్లుచు, వానిని ప్రవర్తింపజేయుచున్నాడు నారాయణుడు. పురుష సూక్తమున - నారాయణ స్వరూపము, నారాయణుని కారణత్వము, మోక్షప్రదత్వము విపులముగా వర్ణింపబడియున్నవి.

**జీవ స్వరూపము :-**

సకల జీవాత్మలు నారాయణునకు పరతంత్రములు. ఈ జీవాత్మ - దేహము కంటెను, కర్మేంద్రియముల కంటెను, జ్ఞానేంద్రియముల కంటెను, మనస్సు కంటెను, ప్రాణము కంటెను అతిరిక్తము. ఈ జీవాత్మ స్వరూపమునుగూర్చి ఇంతకు మున్నే వివరింపబడినది.

**పురుషార్థ స్వరూపము :-**

జీవాత్మలకు పురుషార్థ మేమనగా - స్వరూపావిర్భావ పూర్వకమై, నిత్యమై, నిర్దోషమై, నిస్సమానందాత్మకమయిన, సవిభూతికమై, సమస్త కల్యాణ గుణాత్మకమైన పరమాత్మయొక్క యాథాత్మ్యానుభవము వలన గల్గిన ప్రీతి చేయబడిన కైంకర్యము. తనను శేషముగా, పరమాత్మను శేషిగా ఎఱుంగుటయే కైంకర్యము, మోక్షము, పురుషార్థము.

శబ్దాది విషయానుభవము పురుషార్థము కాదు. స్వానుభవమాత్రము పురుషార్థము కాదు. స్వరూపోచ్ఛేదము పురుషార్థము కాదు. వైశేషిక జ్ఞానాది గుణ వినాశము పురుషార్థము కాదు. సుఖము పురుషార్థము కాదు. అవిద్యా నివృత్తియే

మోక్షము కాదు. ఉపాధి వియోగము మాత్రమే పురుషార్థము కాదు.

నిర్దోషమైన, నిరతిశయానంద రూపమైన పరమాత్మానుభవమైన కైంకర్యమే మోక్షము. పరమాత్మను ఎట్లు ఉపాసించిన, అట్లు సిద్ధించును. తనను వేరుగా, ప్రేరకుడైన పరమాత్మను వేరుగా మననము చేసినవానికి ప్రీతిపాత్రుడై, దానిచే మోక్షము నిచ్చును. ఉభయ విభూతి సహితుడై, సమస్త కల్యాణ గుణాత్మకు డయిన పరమాత్మ యొక్క యాథాత్మ్యానుభవము వలనకల్గిన ప్రీతిచే చేయు కైంకర్యమే పరమ పురుషార్థము.

## విరోధి స్వరూపము :-

విరోధ మనగా - పురుషార్థమునకు ప్రతిబంధకము. పరమాత్మ స్వరూప, రూప, గుణ, చేష్టితములను, తన స్వరూపము యొక్క యాథాత్మ్యమును తెలిసికొనక, క్షణిక జ్ఞానమునకు, నానావిధములైన దేహములందు ఆత్మ బుద్ధిని చేసి స్వతంత్రమును భోగ్యముగా దలచి, పర క్షేత్రము, పరహింస, దేవతాంతర భజనము చేయుట - విరోధమునకు స్వరూపములు. నానావిధ కర్మ సంబంధములచే బంధితుడగుటయే విరోధము యొక్క ఫలితాంశము.

## ఉపాయ స్వరూపము :-

ప్రతిబంధక నివృత్తికి ఉపాయము - న్యాసము, త్యాగము, నిక్షేపము, శరణాగతి మొదలగు శబ్దములచే చెప్పబడినది. భగవదాజ్ఞాతివర్తన నివృత్తియు, భగవదానుకూల్యము, సర్వశక్తిత్వము అనుసంధించుట మొదలగు ప్రార్థన గర్భమైన, విశ్వాస రూపమైన

గాని విశేషము శరణాగతి. 'ముముక్షువైన నేను శరణు పొందు చున్నాను' అని వేమాటయే ప్రపత్తి. లేక - న్యాసము. మఱి గమిక లేదు లేను, 'నీవే నాకు ఉపాయము కమ్ము' అని, భగవంతుని మహా విశ్వాస పూర్వకముగ యాచించుటే ప్రపత్తి యనబడును. తపస్సు లలో అతిరిక్తమైన తపస్సు ప్రపత్తి. ఈ ప్రపత్తి చేయుటకు అధి కారులు ఎవరనగా - పరమ ప్రాప్యమందు అత్యాశయు, ప్రాప్యాంతరములందు వైరాగ్యము, భగవంతుని ఔదార్య గుణమందు దృఢ విశ్వాసము గలవారు. ఈ ప్రపత్తికి అంగము అకించనము. అనగా - ఉపాయాంతరము లేకుండుట. ఈ మహా శ్రేష్ఠమైన ప్రపత్తి - ప్రారబ్ధ మును నశింపజేయును. భగవత్సమారాధనతో, ఫలాపేక్ష లేక, నిత్య కర్మానుష్ఠానముతో శాంతుడై, దాంతుడై, వైరాగ్య సంపన్నుడై, తన యాత్మ యందే పరమాత్మను చూడవలెను. అట్లు శమ దమాది కర్మానుష్ఠానముచే రజస్తమస్సులు తగ్గి, సత్త్వ గుణ మధికమై, దానిచే ధ్యానము సిద్ధించును ఈ విధముగా అవ్యవహితముగా సవ్యవహితమై, పరమాత్మ విషయమైన ప్రపత్తియే ప్రతిబంధకమును తొలగించును. కావున, భగవన్నిగ్రహమును తొలగించుటకు ఉపా యము - ప్రాణి జంతు జాతమునకు రక్షకుడైన శ్రీమన్నారాయణుని పాదారవిందములయందు శరణాగతి యను జ్ఞాన విశేషము.

## అర్థ పంచకము

అనంత వాక్యము ..

అఖిల చరాచర జీవరాశులు సంకీర్ణమైయున్న ఈ జగత్తునందు సు రాసి జీవు లున్నను వివేకము విలక్షణము విశిష్ట జ్ఞాన సంపన్ను మం దగు నరుడు, ప్రధానమైన మొదలు మానవునిలో క్రమముగా ఆలోచ

గాలు అధిక మగుచుండును. ఆరాటముచే అనుభవించిన యనంతరము గాని, మఱెప్పుడైనగాని - అతనిలో కొన్ని సందేహము లుద్భవింపక మానవు. అవి యెవ్వి యనగా :- నేనెవరు ? ఎచ్చటి నుండి ఇచ్చటకు వచ్చితిని ? ఇచ్చటినుండి తిరిగి ఎచ్చటకు పోవుదును ? నేను వాంఛించు సుఖాదులు లభింపవేల ? నేను వాంఛింపకనే ఆ సుఖాది భోగములు స్వయముగా ఎట్లు ప్రాప్తించు చున్నవి ? ఈ విధముగా చేయుచున్న శక్తి యేది ? అనునవి.

ఎంతటి లక్షాధికారి యైనను, భిక్షాధికారి యైనను - ప్రస్తుత స్థితికి సంతృప్తి చెందక, అంతకంటెను అధికానందము కొఱకు అఱ్ఱులు చాచుచుండుట పరిపాటి. ఆస్తికుడైనను, నాస్తికుడైనను, రక్తుడు గాని, విరక్తుడు గాని - ఎవరైనను ఎప్పుడో ఒకప్పుడు ఈ ప్రకృతి దేహమును విడచి పోవుదురు. ఇందులకు కారణమును తెలియ చేయునది తత్త్వశాస్త్రము. కనుకనే, మానవునకు అత్యావశ్యకమైనది తత్త్వశాస్త్రము.

'తల్లిని వీడి పిల్ల నిలువలేనట్లు, కొమ్మను వీడి రెమ్మ నిలువ లేనట్లు, దేవుని వీడి జీవుడును నిలువజాలడు.' పంచ భూతాత్మక మైన దేహమును ధరించి, పంచభూతములలో ఏ ఒక్క దానినైనను ఆహార ముగ స్వీకరింపక ఎటుల నిలువలేడో, అట్లే - ఆ శరీరాంతర్యామి యయిన జీవాత్మ కూడ పరమాత్మ విషయక తత్త్వ జ్ఞానము లేనిదో నిలువజాలడు.

శరీర స్థితికి, వృద్ధికి ఆహారము ఆవశ్యక మగు నటుల, ఆత్మ స్థితికి, వికాసమునకు - పరమాత్మ విషయక తత్త్వ జ్ఞానము ఆవశ్య కము లయినవి పంచ విధ జ్ఞానములు.

పునరావృత్తి రహితమైన జన్మ, జరా, వ్యాధి, మరణాది దుఃఖ రహితమైన నిత్య, నిరవద్య, నిరవచ్ఛిన్న, నిరుపమాన, నిస్సమాభ్యధిక, నిస్సీమ, నిరతిశయమైన ఆనందస్థితి నందుటకు అత్యావశ్యకమైనవి పంచ విధ జ్ఞానములు. అవి ఎవ్వి యనగా ..

**పంచవిధజ్ఞానములు :-**

(1) తా నెవరు ? తన స్వరూప స్వభావము లెట్టివి ? అనునది మొదటి జిజ్ఞాస్య జ్ఞానము.

(2) తనను ఈ విధముగ జన్మ, జరా, వ్యాధి, వార్ధక్యములను, సుఖ దుఃఖములను కలిగించుచు, శాసించువా రెవరు ? వారి స్వరూప స్వభావము లెట్టివి ? అనునది రెండవ జిజ్ఞాస్య జ్ఞానము.

(3) తాను కోరుచున్న ఆనందస్థితి మోక్షము స్వరూప స్వభావము లెట్టివి ? అనునది మూడవ జిజ్ఞాస్య జ్ఞానము.

(4) ఆ ఆనంద స్థితిని పొందుటకు సాధనము లేవి ? వాని స్వభావము లెట్టివి ? అనునది నాల్గవ జిజ్ఞాస్య జ్ఞానము.

(5) ఆ ఆనంద స్థితిని ప్రస్తుతము తా ననుభవించలేనందులకు కారణ మేమి ? వాని స్వరూప స్వభావము లెట్టివి ? అనునది ఐదవ జిజ్ఞాస్య జ్ఞానము.

గ్రంథము - **వ్యాఖ్యలు**

ఈ పంచ విధ జ్ఞానములను గూర్చి పరమ జ్ఞాన సంపన్నులైన పిళ్ళైలోకాచార్యులవారు అష్టాదశ రహస్యములలో 'అర్థ పంచకము'

అను గ్రంథమును ద్రవిడ భాషలో రచించియున్నారు ఇందు 62 సూత్రములు గలవు. ఇందలి చివరి సూత్రములో - పూర్వోక్త సందేహములు నివారింపబడి, బాగుపడదలచినవారికి నడచుకొనవలసిన విధానము వివరింపబడినది. దీనిని విశ్వాసముతో మననము చేసి అనుష్ఠించువారు - తప్పక ఉజ్జీవింపబడగలరు. ఇది సత్యము.

క్రీ: శ. 1268 - 1369 కాలమున కవితార్కిక సింహులైన శ్రీ వేదాంత దేశికులు వీనిని గూర్చి 11 భాగములలో వివరించుచు - 'అర్థ పంచక' అను తమిళ రహస్య గ్రంథమును వ్రాసిరి. 'శ్రీ దేశిక ప్రబంధమ్' అను పేర 1960 లో - కుంభకోణమునందు శ్రీ V.N దేశికాచార్యుల వారిచే ఇది ప్రకటింపబడినది.

క్రీ: శ. 17 - 18 శతాబ్దములలో - నారాయణ పండితునిచే పిళ్ళలోకాచార్యులవారి 'అర్థ పంచక' మను మణిప్రవాళ గ్రంథము తమిళానువాదము చేయబడినది. ఇది - **Indian Philosophy (Bibliography)** అను గ్రంథమున **Karl M. Potter** అనువానిచే పేర్కొనబడినది.

ఒక అజ్ఞాత పండితునిచే పిళ్ళలోకాచార్యులవారి మణిప్రవాళ గ్రంథమునకు - 'అర్థ పంచక నిరూపణకు' అను సంస్కృత వ్యాఖ్య వ్రాయబడినది. ఇది - మద్రాసులో అడయార్ గ్రంథాలయమున (D X.135.) కలదు.

రహస్య త్రయ సారమున - 'అర్థపంచకాధికారము' అని సంగ్రహముగ వేదాంత దేశికులు పేర్కొనియున్నారు.

**అర్థపంచక వివరణము :-**

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తు శ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫలం చైవ తథా ప్రాప్తి విరోధి చ"

అను రీతిగా - స్వ స్వరూపము, పర స్వరూపము, ఉపాయ స్వరూపము, విరోధి స్వరూపము, ఫల స్వరూపము - అని అయిదు అర్థములు - 'అర్థ పంచక' మనబడు చున్నవి. ఈ అర్థ పంచక జ్ఞానము చేత జీవునకు సంసారమునుండి విముక్తి కలుగును. అయిదును మరల ఒక్కొక విషయము అయిదు విధములుగా నుండును.

**1. స్వ స్వరూపము :-**

స్వ స్వరూప మనగా - జీవాత్మ స్వరూపము. ఈ జీవాత్మ - నిత్యు లనియు, ముక్తు లనియు, బద్ధు లనియు, కేవలు లనియు, ముముక్షువు లనియు అయిదు విధములుగా నుండును.

నిత్యు లనగా - సంసార గంధ రహితులై, నిర్దోషులై, భగవంతుని యనుభవించుటకు అనుకూలురుగా నుండువారు. అనాది కాలము నుండియు సర్వేశ్వరుని వలెనే జ్ఞాన సంకోచము లేనివారు. వీరు నిత్యులై సేవ చేయుచున్నట్టి అనంత, గరుడ, విష్వక్సేనాదులు. వీరికి సర్వ సాధారణముగా - అణుత్వ, జ్ఞానత్వ, ఆనందత్వ, అమలత్వ భగవ చ్ఛేషత్వ, పారతంత్ర్యాదు లుండును.

ముక్తు లనగా - భగవ దనుగ్రహముచే సుకృతి వలన గలుగు సుఖ దుఃఖ మోహ బంధముల నుండి విముక్తులై, పరమాత్మ స్వరూపమును కల్యాణ గుణములను, వైభవము లను అనుభవించి, ఆ యనుభవముచే గల్గిన ప్రీతి - అంతఃకరణమున అగక, నోరార స్తుతించు, మరలిరాని వైకుంఠ నగరమున వసించుచు ఆనందించునట్టి వారైనవారు.

బద్ధు లనగా - పృథి వ్యాప స్తేజో వాయు రాకాశము లను పంచ భూతములచే నిర్మితమై, అనిత్యమై, సుఖ దుఃఖముల ననుభవించుచు, అజ్ఞానముతో, అపవిత్రతతో, అన్యథా జ్ఞానముతో, విపరీత జ్ఞానముతో కూడి, దేహాధారుడై, విషయానుభవముచే గల్గిన దేహ పోషణమునే పురుషార్థముగ భావించి, వర్ణాశ్రమ ధర్మములను పరిత్యజించి, హీనులను సేవించి, ప్రాణులను హింసించి, పరదారా ద్రవ్యముల నపహరించి, సంసారాభివృద్ధియం దాసక్తులై, భగవంతుని యందు విముఖులైన చేతనులు. కేవలు లనగా - ఏకాంత ప్రదేశమున మిక్కిలి ఆకలి దప్పులచే బాధపడువారు. భక్ష్యాభక్ష్య రహితులై, స్వశరీర స్వానుభవముచే సంతృప్తు లగువారు. ఆత్మ, ప్రకృతి - అను వాని వివేచనముతో దుఃఖాశ్రయమైన, నీచ పదార్థ సముదాయమైన ప్రకృతి స్వరూపమును, ప్రకృతి కతీతమై, పంచ వింశతి (25 - వ) తత్త్వమై, స్వయం ప్రకాశమైన, నిత్యమైన స్వస్వరూపము ననుసంధించి, దుఃఖాధిక్యతచే పరిపూర్ణ జ్ఞానానందాత్మకమైన పరమాత్మ వివేచన చేయజాలక, అమృత ప్రవాహ రూపమైన ముక్తిని విడచి, జీవాత్మప్రాప్తికి సాధనమైన జ్ఞానయోగ నిష్ఠులై ఫల రూపమైన **జీవాత్మానుభవమును** మాత్రమే పురుషార్థ ఫలముగ అనుభవించి, సంసారబంధమును, భగవత్ప్రాప్తిని దూరము గావించుకొని సంచరించువారు.

ముముక్షువు లనగా - మోక్షమందు ఇచ్ఛ గలవారు. ఉపాసకులు, ప్రపన్నులు - అని ముముక్షువులు రెండు విధములు.

**2. పర స్వరూపము :**

పర స్వరూప మనగా - పరమాత్మ స్వరూపము. పరమాత్మ

పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారము లని ములుగా గోచరించుచున్నాడు.

పరుడు అనగా - పరమ పదమున వేంచేసియున్న కారణమైన, సుందరమైన జ్యోతి స్వరూపుడు

వ్యూహ మనగా - సృష్టికి, రక్షణకు, సంహారమునకు సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులు

విభవ మనగా - అవతారము రామకృష్ణా ద్యనే విధములు. స్వస్వరూపావేశములు, శక్త్యావేశములు వి బడును.

అంతర్యామి యనగా - జీవాత్మలంగతియందును నుండి శాసించువాడు, సమస్తు లయినవారి హృదయ క విలక్షణమైన యాకారముతో - ప్రవృత్తి, నివృత్తులను చూచుకొనుచు, వేంచేసియుండువాడు.

అర్చావతార మనగా - భక్తుల కభీష్టమైన స్వరు ధరించి, వారికి ప్రీతికరమైన పేరుతో పిలువబడుచు, పూ ... సర్వజ్ఞుడైనను, అజ్ఞునిగను, సర్వశక్తి సంపన్నుడైనను ... గను, సర్వరక్షకుడైనను ఇతరులచే రక్షింపబడు నట్లుంగువా ... సులభుడై, ఆలయ - గృహారణ్య దేశ - కాలములను ... ంచునట్లు వేంచేసి యుండు అర్చావతారమున గల సర్వే ఈ అర్చావతారము - స్వయం వ్యక్తము, దివ్యము, పౌర మానుషము, గృహార్చనము - అని ఐదు ముఖ్య భేద గలవు.

## 3. ఉపాయ స్వరూపము ..

ఉపాయ మనగా - పరమాత్మను పొందుటకు మార్గము. ఈ మార్గము - కర్మ, జ్ఞానము, భక్తి, ప్రపత్తి, ఆచార్యాభిమానము అను ఐదు విధములుగా నుండును.

కర్మ యోగ మనగా - యజ్ఞము, దానము, తపస్సు, ధ్యానము, సంధ్యా వందనము, పంచ మహా యజ్ఞములు, అగ్ని హోత్రాచరణము, తీర్థయాత్ర, పుణ్యక్షేత్రములందు నివాసము, కృచ్ఛ్రములు (సాంతపనాది వ్రతములు) చాంద్రాయణ వ్రతము, పుణ్య నదుల యందు స్నానము, వ్రతములు, చాతుర్మాస్యములు, కందమూల ఫల భక్షణము, శాస్త్రాభ్యాసము, సంతర్పణము, జపము మొదలగు కర్మల నాచరించుటవలన గల్గిన శరీర శోషణముచే పాపము నశించి, ఇంద్రియముల ద్వారా ప్రసరించు ధర్మభూత జ్ఞానమునకు శబ్దాదులు అవరోధములు కాకుండుటచే, యమ - నియమ - ఆసన - ప్రాణాయామ - ప్రత్యాహార - ధ్యాన - ధారణ - సమాధు లను అష్టాంగ యోగముల ననుసరించి, యోగాభ్యాసము సిద్ధించు వఱకు ఆత్మను విషయముగా చేయుట. ఈ కర్మయోగము జ్ఞానయోగమునకు సహకారియై, ఐశ్వర్యమునకు ప్రధాన సాధనమై యుండును.

జ్ఞాన యోగ మనగా - అష్టాంగయోగమువలన గల్గిన జ్ఞానమునకు - హృదయ పద్మము, ఆదిత్య మండలము మొదలగు విశేష స్థలములందు వేంచేసియున్న సర్వేశ్వరుని అనంత కల్యాణ గుణముల ననుభవించి, యోగాభ్యాసముచే అనుభవ కాలమున అభివృద్ధి గావించుకొని, అనవరత భావనా రూపముగా జేయుట. ఈ

జ్ఞాన యోగము భక్తి యోగమునకు సహకరించుచు, మోక్షమునకు సాధనమై యుండును.

భక్తి యోగ మనగా - తైలధార వలె అవిచ్ఛిన్నమైన భగవత్స్మరణముతో పరంపరానురూపమైన భగవ దనుభవ మును ప్రీతిరూపాపన్నమైన దానినిగా జేయుట.

ప్రపత్త్యుపాయ మనగా - కర్మ జ్ఞాన సహకృతమైన భక్తి యోగాచరణమునకు శక్తి లేనివారలకు, యోగ్యత లేనివారలకు సులభ మయినది. శీఘ్ర ఫలకారియైనది ప్రపత్తి. దీనిని ఒక పర్యాయము ఆచరించిన మాత్రముననే, భగవ ద్విషయానుభవము లన్నియు ప్రాప్యకోటి యందు చేరియుండును. ఇది చేతన స్వరూపమునకు మిక్కిలి తగినది. ఇది - ఆర్తరూప ప్రపత్తి యనియు, దృప్తరూప ప్రపత్తి యనియు రెండు విధములు.

ఆర్తరూపప్రపత్తి :-

నిర్హేతుకముగా గల్గిన భగవంతుని కటాక్ష కారణమున, శాస్త్రాభ్యాసము వలన, సదాచార్యోపదేశము వలనను యథార్థ జ్ఞానము కలిగిన వెంటనే భగవ దనుభవమునకు విరుద్ధమైన పాంచ భౌతిక దేహ - ప్రాకృత దేశ సంబంధములను సహింపజాలక, భగవ దనుభవమునకు అనుకూలమైన, అప్రాకృత విలక్షణ దేహ, దేశముల కొఱకు ఆరాటపడుచు - 'బలహీనమును గల్గించు వార్ధక్యమును, జన్మమును, మరణమును, వ్యాధిని నశింపజేయువాడు శ్రీనివాస భగవాను డని భావించి, స్వామీ! నీవు తప్ప' వేఱు దిక్కు లేనివాడను, నీ దాసుడను' అని ప్రపత్తిని చేసి, ఆ స్వామి యందే న్యాస భారము వైచుట - ఆర్తరూప ప్రపత్తి యనబడును.

దృప్తరూప ప్రపత్తి :-

దృప్తరూప ప్రపత్తి యనగా - ప్రస్తుత అన్యతర శరీరముల యందును, స్వర్గ నరకానుభవములయందును విరక్తి కలిగి, తన్నివారణకై, భగవత్ప్రాప్తికై, సదాచార్యుల ఉపదేశానుసారము విపరీత ప్రవృత్తులనుండి నివృత్తులై, యోగ్యకర్మాచరణముతో - మనోవాక్కాయ శక్త్యనుసారము భగవద్భాగవత కైంకర్య మొనరించుట. సర్వేశ్వరునకు శేషభూతుడై, నియామ్యుడై, శరీరమై, భోగ్యమై, అజ్ఞానుడై, అశక్తుడై - 'నా దుఃఖములను నశింపజేసినను, నశింపజేయకున్నను - నాకు ఉపాయము నీవే తప్ప, వేరేదియు లేదు, అని సమస్తభారములను సర్వేశ్వరునియందుంచి, తాను నిర్భరుడై యుండుట దృప్తరూప ప్రపత్తియనబడును. ఆచార్యాభిమానమనగా - ఇంతకు మున్ను చెప్పబడిన నాల్గు ఉపాయములలో - దేని నవలంబించుటకును శక్తిలేనివాని నుద్దేశించి - పాలు త్రాగు బిడ్డకు వ్యాధి సంభవించినచో, అది తన అజాగ్రత్తగా, తన దోషముగా భావించి ఔషధము సేవించు తల్లివలె, ఈ జీవుని కొఱకై తాను ఉపాయానుష్ఠానము చేసి, దయతో, అభిమానముతో రక్షించు ఆచార్యుల సంకల్పానుసారము వర్తించుట. ప్రత్యేకముగా - నిత్యుడు, ప్రాప్యుడు, సిద్ధిరూపుడైన సర్వేశ్వరుడు - సమస్త దేవతలందు అంతర్యామియై, ప్రాప్యుడగుచున్నట్లు - 'ఆచార్యాభిమానము' కూడ సకలోపాయములకు సహకారియై, స్వతంత్రమైనదై యుండును.

4 విరోధి స్వరూపము :-

పరమాత్మను పొందుటకు చేతనునకు కలుగు ఆటంకము - 'విరోధి' యనబడును. స్వరూప విరోధి, పరత్వ విరోధి, పురుషార్థ

విరోధి, ఉపాయ విరోధి, ప్రాప్త విరోధి - అని, విరోధి స్వరూపము ఐదు విధములుగా నుండును.

స్వరూప విరోధి యనగా - దేహమే ఆత్మయను అభిమానము, ఇతరులకు శేషభూతుడై యుండుట, తనకు తాను స్వాతంత్ర్యము వహించి యుండుట.

పరత్వ విరోధి యనగా - సర్వేశ్వరుని కంటెను ఇతరు లయిన దేవతలు కూడ గొప్పవార లనుకొనుట, సర్వేశ్వరునితో సమాను లనుకొనుట, క్షుద్రు లయిన దేవతలను సర్వేశ్వరుని సమస్త శక్తులు కలవారనుకొనుట, భగవంతుని అవతారములను శక్తిహీనము లనుకొనుట, భగవంతుని అవతారములను మనుష్యుడే యని తలంచుట. పురుషార్థ విరోధి యనగా - మోక్షేతర పురుషార్థము లందు అధికాసక్తియు, స్వేష్ట భగవ త్కైంకర్య వాంఛయు, కలిగి యుండుట.

ఉపాయ విరోధి యనగా - 'తా నవలంబించిన భగవంతుడు' అను ఉపాయము కంటెను, ఇతర ఉపాయములు విలక్షణము లని తలంచుటయు, తా నవలంభించిన ఉపాయమును తక్కువగా భావించుటయు, ఉపాయము కంటెను ఉపేయము గొప్పదని భావించుటయు.

ప్రాప్తి విరోధి యనగా - ప్రారబ్ధ శరీరమునవిధమై, అను తాపము లేనిదై, గొప్పవిదై, స్థిరములైనదై యుండు భగవ దపచార, భాగవ తపచార ఆచార్యాపచార, అసహ్యాపచారములు కలిగి యుండుట.

ఇవి యన్నియు విరోధము లనబడును. అన్నము వలన గల్గిన దోషము జ్ఞానమునకు విరోధ మగును. అనగా - మంచి జ్ఞానమును కలుగనీయదు. సహవాసమున గల్గిన దోషము - భగవ దనుభవము

కలుగనీయక, విరోధి యగును. దేహాత్మాభిమానము స్వస్వరూప జ్ఞానమును కలుగనీయక, విరోధి యగును.

5 పురుషార్థ స్వరూపము :-

మానవునిగ జన్మించినందులకుగాను సాధించవలసినది పురుషార్థము. ధర్మము, అర్థము, కామము, మోక్షము - అని పురుషార్థములు నాల్గు విధములు. కామమునకు - ఆత్మానుభవ మనియు, మోక్షమునకు భగవ దనుభవ మనియు పేరులు.

ధర్మ మనగా - ప్రాణుల కుపయుక్త మగు క్రియా విశేషము. అహింసాచరణమే ధర్మ మని కొందఱి భావము.

అర్థ మనగా - వర్ణాశ్రమములకు తగిన రీతిగా - ధన ధాన్యాదుల నార్జించి, దేవతాదుల విషయమునను, పితృదేవతాదుల సంబంధమైన కర్మల యందును, జీవకోటుల విషయమునను, శ్రేష్ఠమైన దేశ, కాల, పాత్రతల నెఱింగి, ధర్మ బుద్ధితో వ్యయము చేయుట.

కామ మనగా - ఇహ పరములకు రెంటికిని సంబంధించినది. అనగా - ఐహికము, పారలౌకికము అని రెండు విధములు. తల్లి, తండ్రి, రత్నములు, ధనము, ధాన్యము, వస్త్రము, అన్న పానములు, భార్యా, పుత్రులు, పుత్రికలు, మిత్రులు, పశువులు, గృహము, భూములు, చందనము, పుష్పములు, తాంబూలము మొదలగు పదార్థములయందు శబ్దాది విషయానుభవ సిద్ధము లగు సుఖ విశేషములు - ఇహలోకమునకు సంబంధించినవి.

వీని కంటెను విలక్షణమై, తేజోరూపముగ స్వర్గాదుల కేగి, ఆకలి దప్పులు, దుఃఖము, మోహము, ముదిమి, మరణము మొద

లగునవి లేక, ఆర్జించిన పుణ్యమునకు తగిన అమృతమును సేవించి, అప్సరసలతో శబ్దాది విషయముల ననుభవించుట పరలోక కామము.

**మోక్ష** మనగా - భగవ దనుభవ రూప మైన పరమ పురుషార్థము. ప్రారబ్ధ కర్మ శేషమైన కర్మానుభవముచే పుణ్య పాపములు నశించగా - అజ్ఞాన, అన్యథాజ్ఞాన, విపరీత జ్ఞానములు తొలగిపోగా, సుషుమ్న నాడి ద్వారా శిరస్సు నందలి కపాలమును భేదించుకొని, బయ ల్వెడలి, సూక్ష్మ శరీరములో - పరమ పదము నకు పోవు అర్చిరాది మార్గమును పొంది, నిత్యమైన - తీక్ష్ణమైన సూర్య మండలము నందలి విలక్షణమైన మధ్య ప్రదేశమున గల అద్వితీయ ద్వారమును దాటి, విరజానదీ స్నానముచే కర్మవాసనాది శేషములను నశింపజేసికొని, సమస్త తాపములు హరించునటుల అమానవ కర స్పర్శను పొంది, శుద్ధ సత్త్వాత్మకమై, పంచోపనిషన్మయమై, జ్ఞానానందమును కల్గించునదియై, పరమాత్మ ననుభవించుటకు ప్రధాన సాధనమై ప్రకాశించు తేజోరూప అప్రాకృత శరీరమును పొంది, కిరీట ధారులైన నిత్యసూరులు ఆహ్వానింపగా - నిరతిశయానందమున తిరుమామణి మండపమును జేరి, శ్రీ భూ నీళా సమేతుడైన, దివ్య మంగళ విగ్రహ స్వరూపు డయిన, తేజో ప్రవాహమున వసించుచున్న, అద్వితీయ రూపుడైన శ్రీ వైకుంఠ నాథునకు నిత్యకింకరుడై యుండు స్వభావము గలవాడై వర్తించుట.

**పిండితార్థము :-**

ఈ విధము గా అర్థ పంచక జ్ఞానము కలిగి, ముముక్షువులై, సంసారమున గల చేతనునకు **మోక్షము** సిద్ధించు వఱకు సంసార సముద్రమున మునక లిడక, తమ తమ వర్ణాశ్రమములకు తగిన

రీతిగా - భోజన భాజనాదుల నార్జించుకొని, భగవంతునకు నివేదన చేసి, తన తమ శక్తి సామర్థ్యముల ననుసరించి భగవద్భక్తులకు సేవ చేసి, కేవల దేహధారణము భగవదనుగ్రహ మని యెఱింగి భక్షించుచు, తత్త్వజ్ఞానోపదేశమును అనుసంధించుకొనుచు, ప్రాప్య మందు త్వరతో, భగవద్విషయమున ఆర్తియై, ఆత్మ రక్షణ యందు అశక్తుడ నని, భగవంతునిపై భార ముంచి, ఉపకార విషయముగా - జ్ఞానానుష్ఠానములతో కూడుకొని యుండువాడు - సర్వేశ్వరునకు లక్ష్మి కంటెను, నిత్య ముక్తుల కంటెను అత్యంత ప్రీతిపాత్రుడు కాగలడు.

## అర్చిరాది

అర్చిరాది రహస్య గ్రంథమునందు - నాలుగు ప్రకరణములు గలవు. భక్తి ప్రపత్తులచే భగవంతుని ప్రసన్నుని చేసికొనిన జీవుడు - పరమ పురుషుని పొందు విధానము దీనియందు తెలుపబడినది. రామాయణ, భారత, పురాణ, ఉపనిషద్గ్రంథ వాక్యములు, దివ్య ప్రబంధ వచనములుగా పేర్కొనబడినవి.

**ప్రథమ ప్రకరణము :-**

శ్రియఃపతియైన సర్వేశ్వరునకు విభూతి ద్వయము శేషమై యుండును. అందు భోగ విభూతియం దున్నవారు - సర్వేశ్వరుని యాజ్ఞానుసారము వర్తించుచు, అభిమాన పాత్రులై యుందురు. లీలా విభూతియం దున్నవారు - నిత్యసూరుల వలె 'నమః' అని యుండక, స్వతంత్రులై, 'ననమేయం' 'నేనొకరికి లొంగువాడను కాను

'ఈశ్వరోఽహమ్' ఈశ్వరుడనని అనుచు, జ్ఞాన హీనులై, ప్రాకృత శరీరముతో నుండి, లోకమునందలి సామాన్యులను నుతించుచు, సర్వేశ్వరునకు కాక, కాముకులై, సుందరీమణులకు దాస్యము చేయుచు, భగవద్గుణామృత పానము చేయక, శ్రీ యథా మృతమును గోలుచు, అనర్థ విషయాసక్తు లగుచుందురు. ఇట్లున్న సంసార చేతనుల నీచతను గాంచి, వారికి తనకు గల స్వాభావిక సంబంధము వలన, వారిని సంస్కరింపదలచి, సర్వ భూత దయా మయుడైన పరమాత్మ - సదాచార్య సమాశ్రయణముచేసి భగవ త్ప్రీతికర వ్యాపారములను చేయుచును

వైరాగ్యము కలిగినది మొదలు, 'శ్రియఃపతీ !' నాకు దిక్కెవరును లేరు. నీవే రక్షకుడవు' అని ప్రార్థించుచు, భగవ ద్విరహమును భరింపజాలక పరమ పదము నందుటకు త్వరపడును. బాహ్యేంద్రియములు అంతఃకరణముతోడను, అంతః కరణము ప్రాణముతోడను, ప్రాణము సంభూత సూక్ష్మాంశముల ద్వారా జీవాత్మ యందును, అతడు సూక్ష్మ శరీర ధారియై, అర్చిరాది మార్గ మున పరమాత్మ సన్నిధిని జేరును. విరజా నదీ తీరము, తిల్య వృక్షము, ఐరమ్మది సరస్తీరము విశ్రమ స్థలములుగా నుండును. తిరుమామణి మండపమే ప్రవేశ స్థలముగా నుండును. అర్చిరాది మార్గమును చూపువారే సల్లాపమునకు తోడుగా నుందురు. మేఘముల ధ్వనియే ప్రయాణ పటహ ధ్వని. సూర్య రశ్మి ననుసరించగా - మనస్సు ప్రణవ మను రథమునకు సారథ్యము చేయును.

ద్వితీయ ప్రకరణము :-

అర్చిరాదులలో - ముందుగా అర్చిః పురుషుని సమీపించి, అనంతరము పురుషుని, శుక్లపక్షాభిమానిని, ఉత్తరాయణాభిమానిని

వాయువును సమీపించి, వాని దారి చూపగా - సూర్యుని జేరి, వాని తేజస్సుతో ఆ మండలమును భేదించుకొని, చంద్రుని సమీపించి, అతని సత్కారానంతరము అమానవుని చేరును. అతని మార్గదర్శకత్వములో - వరుణ, దేవేంద్ర, ప్రజాపతులచే ఆదరింపబడి, బ్రహ్మాండమును, మూల ప్రకృతిని దాటి, తాపత్రయము తీరగా - వైతరణికి ప్రతికోటి యగు విరజా నదిని చేరును. దాని స్పర్శచే సూక్ష్మ శరీరమును సైతము వీడి, సహస్రాధికమైన సూర్య తేజస్సును పొందును అమానవుని స్పర్శతో - శుద్ధ సత్త్వ మయమై, భగవదనుభవైక శరీరమును పొందును. దివ్య దేశమును సందర్శించి నమస్కరించును. నిత్యముక్తానందముతో, నిత్యసూరులచే బ్రహ్మాలంకారములను పొంది, దివ్య విమానము నధిరోహించి, భగవంతుని నుతించును. వైకుంఠనాథుని దాసునిగ నిరతిశయానందముతో - తిరుమామణి మంటపమును చేరును. 'నా నీచత్వమును పరిగణింపక, నా మనస్సు నందు కలిసిన నీ సౌశీల్యమును ఏ మని వర్ణింపగలను ?' 'ఓం నమో నారాయణా య' అని నిర్విరామముగ తిరుమంత్రము ననుసంధించుచు, ఆత్మ సమర్పణము చేయును.

**తృతీయ ప్రకరణము :-**

ఉభయ విభూతులును చిత్రరువులుగా నేర్పఱచబడి, సర్వాశ్చర్యకరమైన శిల్పములుగల శ్లాఘ్యమైన సింహాసన మొకటి యుండును దానిపై పండ్రెండు రేకుల దివ్య కమల ముండును. దాని దివ్య కర్ణిక యందు దివ్య యోగ పర్యంక ముండును. దానిపై అనేక వేల చంద్రుల సమూహముగ, చల్లని కాంతి గల అనంత కళ్యాణ గుణాత్మకుడుగా, కైంకర్య పరులకు ఉపమానముగా అనంతు డనబడు ఆదిశేషు డుండును. విజ్ఞాన, బల, శైత్య, మార్దవ, సౌరభ్యాది

గుణములకు ఆశ్రయుడగును. ఆతని పదకయందు పరిమళమునకు సహితము పరిమళము నొసంగు కేశపాశముతో, అనుపమాన మైన దివ్యసౌందర్యములతో, పుండరీకాక్షుని సహితము ఉక్కిరి బిక్కిరి చేసి, తన వైపు మరల్చు కొనగల విశాలాక్షీ, సుకుమారి, పద్మవాసిని యగు లక్ష్మీదేవి - శ్రీ మన్నారాయణుని విశ్వరూపమును సహితము సంకోచింప జేయగల మహిమతో, ఆ స్వామి పాద పద్మముల సన్నిధానమున సేవచేసియుండును. ఆ శ్రియఃపతి - నల్లని యుంగరములవంటి కేశ సౌందర్యముతో, అష్టమీ చంద్రుని వంటి పుండ్రమును ఫాల భాగమున ధరించి, తుమ్మెద పంక్తుల వంటి కనుబొమలు గల అరవింద లోచనుడు - దంత కాంతిని ప్రసరింపచేయు మందహాసముతో, దిగంతములకు వ్యాపించు కాంతు లీనుచున్న మణిఖచిత మకర కుండలములతో, శంఖము వంటి కంఠముతో ఉభయ విభూతుల వంటి భుజ ద్వయముతో, శ్రీవత్స వనమాలా విరాజితమై, అమూల్య మణిహార మౌక్తిక కౌస్తుభములకు ఆకరమై ప్రకాశించుచున్న వక్షః స్థలముతో, నిత్య ముక్తుల హృదయ కమలమునందు సౌందర్య సాగరముగా నుండును. మనసును సుడిలో పడవేయు నాభియు, శంఖ చక్ర గదా శార్ఙ్గాదులు, పీతాంబరము, కదళీ స్తంభములవంటి తొడల ద్వయము, తామర కాడలవంటి పిక్కలతో, లావణ్య సాగరమునకు రూపము నటుల, చూచినంతనే తాపములను శమింపజేయు చుండును. నల్లని, చల్లని మనోనేత్రములతో, ఆకర్షించును, వేదాంత వాక్యములకు సర్వస్వమై యుండును. శ్రీ వైకుంఠము నంతను ఒక్క రీతిగా పరిపాలింపజేయుచు, కటాక్షామృత వర్షముచే నిత్య ముక్త దివ్య సూరులను - ఎల్లపుడు, కుసుమితముగా నొనర్చుచుండును.

చతుర్థ ప్రకరణము .-

శ్రీ వైకుంఠ నాథుని కనులార గాంచి, 'సమస్త పరివారాయ

శ్రీమతే నారాయణాయ నమః' అని సాష్టాంగ ప్రణామ మాచరించి, ఆనంద పరవశుడై, నిరతిశయ ప్రీతితో నేగి, దివ్య సింహాసనమును, అధిరోహించును. చంద్రుని జూచిన సముద్రము వలె పొంగి, దగ్గఱకు చేర్చుకొని, శ్రియఃపతి ఇట్లు సంభాషించును :-

శ్రియఃపతి :- నీ వెవఁడు ?

ముక్తుడు :- నేను నీకు శరీరమువంటి వాడను శేష మయిన రాజ కుమారుడను.

శ్రియఃపతి :- నీ విన్ని కాల మేమి చేసితివి ?

ముక్తుడు :- ఇంద్రియ భోగ లాలసుడనై యుంటిని.

శ్రియఃపతి :- నీకు దానివలన కలిగిన ఫల మేమి ?

ముక్తుడు :- ఘోర మైన నరకమున క్లేశానుభవము.

శ్రియఃపతి :- అనంతర మేమి చేసితివి ?

ముక్తుడు :- ఇదిగో - నీ దరి చేరితిని.

శ్రియఃపతి :- దీనికి నీవు ఏ ఉపాయ మాలోచించితివి ?

ముక్తుడు :- సర్వ రక్షకుడవు, పుణ్య స్వరూపుడవు నగు నిన్నే.

శ్రియఃపతి :- నన్ను సమీపించి, నీవు పొందిన ప్రయోజన మేమి ?

ముక్తుడు :- నా క్రూరమైన పాపములను పోగొట్టుకొంటిని. అంతులేని యానందము నందితిని - అని వాకొనును

అంతట - శ్రియఃపతి - ఆ ముక్తపురుషుని కటాక్షించును. తత్ఫలముగా - శ్రియఃపతి పలికిన మనోహరములైన

వాక్యములు - ముక్త పురుషుని వల్లబడినను ఆ ముక్త పురుషుని మనోరథమును శ్రియఃపతి సఫలము గావించును శ్రీమన్నారాయణు డనుగ్రహించిన విభూత్యైశ్వర్యమును పొందిన ముక్త పురుషుడు ఆనందానుభవము గలవాడై, అంజలి ఘటించి, అహో! అని నామగానము గావించును. నిత్యసూరులతో గూడి, నిత్య మంగళాశాసనము గావించుచుండును. అమృత సాగరాంతర్నిమగ్నమైన సమస్తావయవములు గలవా డగుచు, ఉత్తరానందము నందుచుండును.

## ప్రపన్న పరిత్రాణము

సర్వేశ్వరు డొక్కడే రక్షకు డనియు, ఇతరులు రక్షకులు కారనియు ఈ రహస్య గ్రంథము ప్రధానముగ తెలియచేయుచున్నది. తల్లి దండ్రులు రక్షకులు కారు అందుకు నిదర్శనము - కైకేయి, హిరణ్యకశిపుడు నంటివారు. భరతునకు అభీష్టమైన శ్రీరాముని సహా కైంకర్యమును భరతునకు లభింపనీయక, రాముని అరణ్యవాసమునకు బంపి, భరతునకు రాజ్య పట్టాభిషేకము చేసినదిగదా కైకేయి! కనక కశిపుడు - కుమారు డగు ప్రహ్లాదుని - నారాయణ నామ స్మరణము చేయువల దని హింసించెను గదా! అన్నలు, అన్నదమ్ములును రక్షకులు కా రనుటకు నిదర్శనము రావణాదులు. భర్త రక్షకుడు కాడనుటకు నిదర్శనము - ద్రౌపది వంటి వారు. ఐదుగురు భర్తలు చూచుచుండగా - దుశ్శాసనుడు ద్రౌపదీ వస్త్రాపహారణ మొనర్చెను గదా? పుత్రులు రక్షకులు కారు. అందుకు నిదర్శనము రుద్రుడు. తండ్రి యైన బ్రహ్మ యొక్క శిరస్సును ఛేదించి వేసినాడు గదా! స్వతంత్రముగ సంచరించలేనివారు - సర్వేశ్వరుని యాజ్ఞానుసారము ప్రవర్తించువా రగుచున్న సూర్యచంద్రాదులు రక్షకులు కారు. వీరును రాహు కేతువులచే పీడింపబడిరి గదా! హిరణ్యకశిపు,

రావణుల వంటి రాక్షసుల చేతిలో కీలు బొమ్మలై, వారికి సేవ చేసి, ప్రాణములు రక్షించుకొనిన ఇతర దేవతలెవ్వరును రక్షకులు కారు. తమ పదవులు పోవునను భీతిచే, ఎల్లప్పుడు భయముతో దాసిచే అంటిపెట్టుకొని యుండు ఇంద్రుడును రక్షకుడు కాడు. పుణ్యము క్షీణించిన యనంతరము అతని పదవియు పోవును గదా! అట్లే, అశాశ్వతమైన పదవులందు గల బ్రహ్మాదులును రక్షకులు కారు. మకరి పీడితుడై కరిరాజు దైన్యముగ ప్రార్థన చేయగా - ఆర్తత్రాణ పరాయణునిగా తాను గాని దేవు లెవరును రక్షకులు కారు.

నారాయణత్వముతో గల సంబంధముచేత అందరియందును అంతర్యామిగా నుండి, అందరిని ప్రవర్తింపచేయు సర్వకారణ కర్త యగు శ్రీమన్నారాయణుడే ఎల్లరకును రక్షకుడని నిర్ణయింపబడినది. 'ఇతరు లెవ్వరును రక్షకులు కారు. నీవే నిజమైన రక్షకుడవు' అను విశ్వాసముతో ప్రవర్తించుటయే ప్రపన్నుని ముఖ్య లక్షణము. ఈ విధముగా గృహాధ్యవసాయముతో ఆశ్రయించినవారే నిజమైన ప్రపన్నులు. గుహుడు, శబరి, జటాయువు, సుగ్రీవుడు, విభీషణుడు, అర్జునుడు, సుదాముడు మున్నగువారు ప్రపన్నులుగా ప్రసిద్ధులు.

## పరిమేయ శేఖరము

ఈ రహస్య గ్రంథమున - ఏబది మూడవది కారికలయందుగా - హృదయగుహా నిర్గమన క్రమము, దివ్య దేహప్రాప్తి, సహస్రకి రణ్యేశ్వర సందర్శనము, కైంకర్యానుభవ ప్రకారము వివరింపబడినవి. నిత్య కైంకర్యములు అనుష్ఠింపవలసిన ఒక విలక్షణ మగు జ్ఞానస్థానము, కైవల్యము - అను అతి గంభీరముగ వివరింపబడినది.

నిర్హేతుకమైన భగవత్కటాక్షము వలన, అద్వేష మను సుకృతము లభించును. దాని వలన అద్వేషము కలుగును. దానివలన, భగవద్భాగవత విషయకాభిముఖ్య మేర్పడును. దానివలన, త్యాజ్యోపాయ విభాగ జ్ఞాన కౌతూహలము కలుగును. దాని వలన, సాత్త్విక సంభాషణము లభించును. దానివలన, సదాచార్య సమాశ్రయణము లభించును. దానివలన, త్యాజ్యోపాయ నిశ్చయము కల్గును. దానివలన, ప్రాప్యంతర వైరాగ్యము కల్గును. దానివలన, పరమ ప్రాప్యాభినివేశము కల్గును. దానివలన, సిద్ధోపాయ స్వీకారము కుదురును దానివలన, భగవత్ప్రాప్తికై త్వరత కల్గును. దానివలన, సర్వేశ్వర స్మృతి విషయము కల్గును. దానివలన హార్దానుగ్రహ నిరూపిత మార్గ విశేష ప్రకాశము కల్గును. దానివలన, మూర్ధన్య నాడీ నిష్క్రమణము కల్గును. దానివలన, అర్చిరాది మార్గ గమనము సిద్ధించును. దానివలన, ఆది వాహక సత్కారము సిద్ధించును. ఆవర ణాతిక్రమణము కల్గును దాని వలన, ప్రకృత్యవిలంఘనము కుదురును. దాని వలన, విరజా నదీ స్నానము సంభవించును. దాని వలన, శరీర విశ్లేషణము కలిగి, అపహత పాప్మత్వాది గుణ గణ ప్రాదుర్భావము జరుగును దానివలన, అమానవ కర స్పర్శము లభించును. దాని వలన, అకాల కాల్య దివ్య దేశము ప్రాప్తించును. దానివలన, ఆరం ప్రాదతట స్నానము సంభవించును. దానివలన, దివ్యాలంకారములచే భూషితు డగును. దానివలన, దివ్యవిమానారోహణము జరుగును దానివలన, తిల్య కాంతారమున ప్రవేశించును. దానివలన, దివ్యాప్స రసలచే సత్కారము లభించును దానివలన, తిల్య గంధ ప్రవేశము కల్గును. దానివలన, బ్రహ్మగంధ ప్రవేశము కలుగును. దానివలన, అప్రాకృత గోపుర ప్రాప్తి కల్గును. దానివలన, దివ్యనగర ప్రాప్తి

కలుగును దాని వలన, సూరి పరిషత్ ప్రత్యుద్గమ మేర్పడును. రాజమార్గ గమనము జరుగును. దానివలన, దివ్య గోపుర ప్రాప్తియు దానివలన బ్రహ్మవేశ్మ ప్రవేశము జరుగును. దానివలన దివ్య మంటప ప్రాప్తియు. దానివలన దివ్యపారిష ప్రాప్తియు కలుగును. దానివలన, సపత్నీక సర్వేశ్వర దర్శనము లభించును దానివలన, పరమాత్మ సమీప ప్రాప్తియు, పాదపీఠ పర్యంకారోహణముచే భగవత్సంగ సంగమమును సంప్రాప్తించును. దానివలన, స్వరూప రూప గుణ విగ్రహా ద్యనుభవ మేర్పడును. అనంతరము అనుభవ జనిత ప్రీతి ప్రకర్షము కల్గును. నానావిధ విగ్రహ పరిగ్రహ మేర్పడును. సర్వదేశ - సర్వకాల - సర్వావస్థోచిత కైంకర్యము లభించును ఇట్లు ఒక దానివలన, మరొకటి లభించు నని, ముముక్షువుని మోక్షమార్గము, తదనుభవము - బాగుగా వివరింపబడినవి.

## నవ విధ సంబంధము

ఈ లోకములో ప్రతి మానవుడు గొప్పవానితో తన కే దేని యొక్క సంబంధము కల్గినంత మాత్రముననే మిగుల సంతసించు చున్నాడు. కాని, విచారించి చూచినచో - అవి యన్నియు కల్పితములు. మరియు - అశాశ్వతములై, విరోధాస్పదములుగాను, భోగ్యములుగను కన్పట్టుచున్నవి. అట్లుగాక, చేతనునకు సకల జగత్కారణుడును, సర్వాంతర్యామియు నగు శ్రీమన్నారాయణునితో సంబంధము నిత్యమై, నిరుపాధికమై, ఎడబాయనిదై, తొమ్మిది విధములుగా నున్నది అదెట్లనగా -

"పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః
స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్య మనూదితః."

అని. ఈ శ్లోక తాత్పర్య మేమనగా - తిరుమంత్రము నందలి ప్రణవా ద్యక్షర మగు అకారముచేత పితా పుత్ర సంబంధము (విశేషణ విశేష్య సంబంధము), 'అవ రక్షణె' అను ధాతువుచే 'రక్ష్య రక్షక సంబంధము' లుప్త చతుర్థి వలన - శేష శేషి సంబంధము, ప్రణవములో రెండవ యక్షర మగు 'ఉ'కారముచేత భర్తృ భార్యా సంబంధము, ప్రణవములో మూడవ యక్షర మగు 'మ'కారముచే జ్ఞాతృ జ్ఞేయ సంబంధము, రెండవ పద మగు 'నారాయణాయ' అను దానిలోని 'నార' పదముచే శరీర శరీరి సంబంధము, 'అయన' పదముచే ఆధారాధేయము (ధార్య ధారక) సంబంధము, 'ఆయ' యను వ్యక్త చతుర్థీ విభక్తిచేత - 'భోక్తృ భోగ్య సంబంధము' అను తొమ్మిది సంబంధములున్నట్లు తిరుమంత్రమువలన తెలియుచున్నది.

**౧. పితా పుత్ర సంబంధము :-**

ఈ సంబంధము ప్రకృత్యర్థ శంకా నివర్తనమై, ఆశ్రయాశ్రయియై, వ్యావర్త వ్యావర్తకమై యుండును. ప్రకృత్యర్థ శంకా నివర్తన మగుట యనగా - వర్ణ సమామ్నాయమున కంతటికిని అందు ప్రథమాక్షర మగు అకార మెట్లు కారణ మగుచున్నదో, అట్లే, అకారవాచ్యు డగు శ్రీమన్నారాయణుడు తదితర పదవాచ్యములగు చిదచిత్తులకు కారణ మగుచున్నాడు అనగా - పరమాత్మ కారణము, చిదచిత్తులు కార్యములు అని స్పష్టమగుచున్నది. కార్యము లనిత్యములు గదా యన్నచో - పరమాత్మ చిదచిద్విశిష్టుడు గావున, విశేష్య మగు పరమ పురుషుడు నిత్యుడు గావున, అతని విశేషణము లగు చిదచిత్తులును నిత్యములే యని తెలుపబడుచున్నది. ఆశ్రయాశ్రయి యగుట యనగా - లోకములో విశేషము నాశ్రయించక, విశేషణము లుండనటుల, భగవ దాశ్రయములు కాక, చిదచిత్తులు

సత్తావంతియులు కావు. ఎఱ్ఱ కలువ యందు విశేష్య మగు కలువ నాశ్రయింపక, విశేషణమైన ఎఱుపు వుండదు గదా! వ్యావర్తి వ్యావర్తక మగుట యనగా - భగవ త్సంబంధము లేక, చిదచిత్తు లెట్లు ప్రకాశింపవో, అట్లే - వాని సంబంధము ప్రకాశింపదు. అనగా - పరమాత్మ చిదచిద్రూపము లోనికి భాసించును. అందు వలన, సర్వ కారణము నగు పరమాత్మతో సంబంధము మిగిలిన జీవకోటి యందుంచియు అతని సంకల్ప మని భావము.

## ౨. రక్ష్య రక్షక సంబంధము :-

ఈ సంబంధము నిర్విషయము గాక, సవిషయము. మరియు పరాశ్రయము కూడ కాదు. అనగా - 'రక్షణ' యనునది - రక్షింపబడువాడును, రక్షించువాడును ఉండినగాని సంభవింపదు. శక్తిగల వాడు రక్షకుడును, శక్తిలేనివాడు రక్షింపబడువాడుగను ఉండ వలెను. కనుక, పరమాత్మ రక్షకుడనియు, జీవులు రక్షింపబడువా రనియు దీని తాత్పర్యము.

## 3. శేషి శేష సంబంధము :-

ఇందు శేషి భగవంతుడు. శేషము జీవుడు. శేషత్వ మనగా - స్వేచ్ఛగా నుపయుక్తము గావించుకొనుటకు తగియుండుట. భార్య భర్తకు శేషమైనటుల, భగవంతునకు ఎల్లరును శేషభూతులు. ఒకవేళ, శేష వృత్తిని భగవంతు డాశ్రయించినను - జీవుడు తాను శేషి నని భావింపరాదు. పరుని కనుకూలముగ - ఏమియు మాటాడ కుండవలెను. అట్లుండుటే శేషత్వము.

౫. భర్తృభార్యా సంబంధము :-

భర్త యనగా భరించువాడు. భార్యయనగా - భరింపబడునది. కనుక, సకల జీవకోటిని సకల విధముల భరించి, రక్షించువాడు శ్రీమన్నారాయణుడు. అతడే అందరికిని భర్త. తనను రక్షించువాడనుటకు - భగవత్సంబంధము లేక, స్వతంత్రుడై యుండుటకు - జీవునకు సామర్థ్యము లేదు కావున, జీవులు పరమాత్మకు భార్యలు.

౬. జ్ఞాతృ జ్ఞేయ సంబంధము :-

ఈ సంబంధములో - జ్ఞాత జీవుడు. జ్ఞేయము (తెలిసికొనబడునది) పరమాత్మ. సమస్తమందు వ్యాపించి, సర్వశక్తుడగు శ్రీమన్నారాయణునే చేతనుడు తెలిసికొనవలెనని ఈ సంబంధము వలన తెలియుచున్నది.

౭. స్వస్వామి భావ సంబంధము :-

అనగా - చేతనుడు సొత్తు. భగవంతుడతనికి స్వామి. అనగా - 'యజమాని' యని యర్థము. దీనివలన, జీవుడు భగవత్కైంకర్యము చేయుచునుండవలెను. స్వరక్షణ ప్రయత్నమును విరమింపవలెను. స్వామి యజమాని తన గృహోపకరణములలో నేదేని చెడినచో - దానిని తానే సరిచేసికొనును గదా! అట్లే, జీవుడును అచిత్ప్రాయుడై యుండవలెను.

౮. శరీర శరీరి సంబంధము :-

జీవులందఱును భగవంతునకు శరీరమువంటివారు. భగవంతుడు శరీరి. సమస్త బ్రహ్మాండమందును వ్యాపించి, సర్వాంత

ర్యామియై యుండుట - చేతనాచేతనముల తత్త్వము లన్నియు ఆతనికి శరీరములు. అట్టి శరీరములు గలవాడు భగవానుడు. ఇదియే విశిష్టాద్వైత బోధకము

౮ ఆధారధేయ సంబంధము :-

ఈ సంబంధము - ధార్య ధారక సంబంధ మనియు న్యవహారి ంచుదురు సర్వమునకు ను భగవంతుడే ఆధారము. మిగిలిన చేతనాచేతనములు ఆధేయములు. ధరించువాడు భగవంతుడు. ధరింపబడువాడు జీవుడు అని యర్థము

౯. భోక్తృ భోగ్య సంబంధము ..

అనగా - మానవునకు చందన, తాంబూల, వనితాదు లెట్లు భోగ్యములో, అట్లే, శ్రీమన్నారాయణునకు జీవులందఱును భోగ్యములే. అన్నియు ననుభవించువాడు పరమాత్మయే. కావున, భోక్తయును అతడే యగుచున్నాడు. ఇందువలన, ఈ సంబంధాను సంధానము చేసి, మానవుడు కల్పిత సంబంధములను పరిత్యజించి, నిలుపుకొనుటకు యత్నించుట ప్రయోజనకరము

## నవరత్న మాల

రత్నముల వంటి అమూల్య రహస్యములను తొమ్మిదింటిని గూర్చి తెలియజేయునది గనుక, ఈ గ్రంథము - 'నవరత్నమాల' యనబడుచున్నది. నవరత్నముల తేజస్సువలన ప్రకాశించు హారము వలె, జీవుడును నవ రహస్యముల తత్త్వ మెఱిగిన జ్ఞానముచే

ప్రకాశించును. ఆ నవ రత్నము లేవి యనగా - 1. ఆత్మ 2. దేహము 3. బంధువులు 4. సంసారులు 5. ఇతర దేవతలు 6. శ్రీవైష్ణవులు 7. ఆచార్యులు 8. శ్రీ 9. శ్రియఃపతి - వీనిని తలంచవలసిన విధానము ఈ రహస్య గ్రంథమున తెలుపబడినది.

1. ఆత్మ యనగా - కైంకర్యమే ఫలముగా గలవా డని తెలిసి కొనవలెను.

2. దేహ మనగా - ప్రకృతి వైపరీత్యము చేత, దేహమే ఆత్మ యను అభిమానము గల్గును గావున, జ్ఞాన విరోధమైన దేహమును బార్చి తెలిసికొనవలెను.

3. దేహమును బట్టి వచ్చినవా రని, అనర్థములు గల్గించి, పాపములను చేయించువార లని బంధువులను తెలిసికొనవలెను.

4. భగవత్ కైంకర్యమునకు విరోధులై, ఐహిక సుఖ వర్ధకులై యుండువారలు సంసారులు - అని తెలిసికొనవలెను.

5. ఇతర దేవత లనగా - ఏవియో కొన్ని శక్తులను మాత్రము కలిగియుండి, అవియును సంపూర్ణముగ, నిత్యమూ నివారు ఇంద్ర రుద్రాదులు, కైంకర్యమునకు సంతృప్తులై, మోక్షము కొసగలేనివారు గావున, ఈ యితర దేవతలను విడచి, పరమాత్మ యగు శ్రీమన్నారాయణుని సేవింపవలెను.

6. శ్రీవైష్ణవు లనగా - భగవద్భక్తి వర్ధకులై, ప్రభువులై, భగవన్ముఖ వికాసమునకు కైంకర్యమే చివరిదియై యుండువా రని తెలిసికొనవలయును.

7. ఆచార్యు లనగా - సర్వేశ్వరుడు పరిగ్రహించుటకు తగినవా రుగా చేసిన మహోపకారకులు - అని తెలిసి కొనవలయును.

8. శ్రీ యనగా - లక్ష్మీదేవి. ఆమె పతి - శ్రీమన్నారాయణుడు అనుగ్రహింపకున్నను, ఆగ్రహించినను, జీవులను తన బిడ్డలుగా దలచి, సౌందర్య కటాక్షములచే పరమాత్మను వశ్యుని గావించుకొని, అపరాధులను క్షమించి, అనుగ్రహింపజేయునది శ్రీదేవి పరమాత్మను నిరంతరము వీడక యుండుటచే ఆమెను నిత్యానపాయిని అని యెరుగవలెను

9. శ్రియఃపతి యనగా - లక్ష్మీపతి - పరమాత్మ యనగా శ్రీమన్నారాయణుడు. ఆచార్యులయినను, శ్రీవైష్ణవులయినను, లక్ష్మి యయినను పరమాత్మ చేతనే మోక్షమిప్పింపగలరు జీవుడు, ప్రకృతి, సర్వమును పరమాత్మాధీనము - జగత్తు - పరమాత్మ వలన సృష్టింపబడి, తరువాత కల్గు పరమాత్మ యందే ఐక్యమగును. పరమాత్మకు, వానికి గల ఐక్యము - విశిష్టైక్యము. విడదీయుటకు వీలుగాని ఐక్యము గనుక. సర్వమును తనతో కూడి యున్నవాడు శ్రియఃపతి యని తెలియవలెను

## సంసార సామ్రాజ్యము

దుఃఖ సాగర రూపమైనది, అంధకార బంధురమైనది సంసార సాగరము. సంసారమున నిమగ్నమైన ఈ దేహము నవరంధ్రములు గల నవద్వార పురమనబడును. పంచభూతముల వలన సిద్ధించినది. ఈ నవద్వార పురమున గమనాగమన మార్గమును తెలిసికొనజాలక సతమత మగు మానవునకు క్లేశమేదియో - అదియే సంసారము. దాని యందు అనంత క్లేశము లిమిడి యున్నవి ఆ సంసార సాగరమున - 'అవిద్య' అను నౌక రథము కలదు. అవిద్యా సప్తకము దాని

చక్రములు. రాగ ద్వేషాదులు - అశ్వములుగా కూర్చబడియున్నవి. గుణ త్రయ రూప కర్మ మను సింహాసనము స్థాపింపబడియున్నది. 'రుచి' యను వస్త్రము పఱుపబడి యున్నది. అవశ్య మనుభవింపవలె ననునట్లు - భార్యావర్గము సమీపమున నుండగా - అంధకార రూపమగు దీపమును వెలిగించి, అస్తు రూపమైన దాస వర్గము, పరద్వేషము పరహింస, పరానువర్తనము - అను అప్రకాశిత మైన స్వరూప స్వభావములు గల 'వాసన' యను వీర్యము సృజింపబడును. తాపత్రయ మను ఛత్రము క్రింద పంచ వృత్తి ప్రాణములతో నుండి, ఖ్యాతి ప్రాజ్ఞులను పొంది, పుణ్య పాపములను చామరములు వీచుచుండగా - అనేక విధము లగు దుఃఖ పరంపరా రూపమైన అహంకార మమకారములు కలుగును. దుఃఖకరము లైన అస్మృతి, విషయాంతర రుచియు కలుగును. వాత పిత్త శ్లేష్మాదులు అమాత్యులుగా - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను రాజులను సేవించును. సర్వాధార భూతుడగు సర్వేశ్వరుడు విస్మరింపబడును. పాతకములతో కాలయాపన చేయును

భగవంతుని కరుణచే ఒకానొకప్పుడు చేతనుడు తన స్వరూపము నెఱింగి, బహు జన్మములందు పాపములను చేసితి నని పశ్చాత్తాపము చెంది, భగవత్కైంకర్యమునకు గాను - ముందుగా ఆచార్యాసక్తుడై, కైంకర్యము చేయు విధాన మెఱింగి, విరోధి వర్గమును త్యజించి, శ్రియఃపతి వినా అన్యులు రక్షింపలే రని యెఱింగి, లక్ష్మీ పురుషకారము ద్వారా భగవంతుని ప్రసన్నునిగ గావించినచో, ఆతని దయాపాత్రు డగును. ఈ విధముగా - సంసారము నుండి విముక్తుడై తుదకు మోక్షము నందును.

## శ్రీవచన భూషణము

శ్రీవచన భూషణము నందు - నాల్గు ప్రకరణములు గలవు. అవి - ఉపాయ ప్రకరణము, ప్రాపకాంతర పరిత్యాగ ప్రకరణము, మంగళాశాసన ప్రకరణము, త్రిపా ద్విభూతి ప్రకరణము - అనునవి.

౧ **ఉపాయ ప్రకరణ సారము .-**

తత్త్వ జ్ఞానము చే ముక్తి లభించును గావున, త న్నిర్మలమైన వేదార్థము నెఱుగవలెను. కర్మకాండ, బ్రహ్మకాండ - అని వేదము రెండు భాగములు స్మృతీతిహాస పురాణములచేత పదార్థమును నిర్ణయించవలెను యాజ్ఞవల్క్యాది స్మృతులు కర్మకాండను వివరించును ఇతిహాస పురాణములు బ్రహ్మకాండను వివరించును. పురాణముల కంటెను ఇతిహాసములు శ్రేష్ఠములు. ఇతిహాసములలో - భారతము కంటెను, రామాయణము శ్రేష్ఠము చెఱలోని దేవతా స్త్రీలను విడిపించుటకై తాను చెఱలో నున్న - కృపా పరవశ యగు సీతామాత యతిశయమును వివరించి బోధించునది శ్రీమద్రామాయణము సజ్జనుల కొఱకు సర్వ భారమును వహించి, దూతగా నేగిన ఆశ్రిత పరతంత్రుడైన శ్రీకృష్ణ పరమాత్మ యొక్క అతిశయమును తెలియజేయునది మహా భారతము.

ఈ రామాయణ, భారతముల రెంటిలో - పురుషకార వైభవములు వివరింపబడినవి. పురుషకారమునకు - కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము - అను మూడు గుణములు ఆవశ్యకములు ఇతరులు పొందు దుఃఖమును సహింపకుండుటచే కృప. పరమ పురుషు

నకు వశ్యముగా నుండుట పారతంత్ర్యము. పరమాత్మకు గాక, ఇతరులకు వశ పడకుండుటయే అనన్యార్హత్వము పురుషకారభూతురాలైన లక్ష్మీదేవి - జానకిగా ఆవిర్భవించి, మూడు మారులు భగవంతుని వీడి, మూడు గుణములను ప్రకాశింపచేసెను. ఇట్టి గుణములతో కూడిన లక్ష్మీ పురుషకారము పరమాత్మతో కూడియుండు దశలో, విశ్లేషించియుండు దశలో కానవచ్చును. సంశ్లేష దశలో కల్గిన పురుషకారత్వము - కాకాసుర వృత్తాంతములో స్పష్ట మగును. సంశ్లేష దశలో - పరమాత్మను ప్రార్థించును. విశ్లేష దశలో - చేతనుని సరిదిద్దును. తనను వచ్చి ఆశ్రయించువానికి - తానే సర్వము వహించుట ఉపాయము. దోషమును, గుణహానిని ఉపహారములుగా స్వీకరించి, వాత్సల్య గుణమును ప్రకాశింపచేసి అంగీకరించుటయే లక్ష్మీ వైభవము.

పార్థునకు పరమ రహస్యోపదేశము చేయుట, రాయబారమేగుట, సారథ్యము వహించుట, శత్రునాశ మొందించుట - అను శ్రీకృష్ణుని చర్యలకు ప్రబల కారణము - ద్రౌపది ప్రపత్తి చేయుట వలననే, ప్రపత్తికి - దేశ, కాల నియమములు లేవు ద్వయ మంత్రమునందు ఈ యంశము స్పష్టముగా చెప్పబడినది. ప్రకార నియమము లేదు. ప్రపత్తి చేయు కాలమున - శుద్ధులైనను, అశుద్ధులైనను అభ్యంతరము లేదు. దీనికి ప్రమాణము ద్రౌపదియే ప్రపత్తి చేయుట కెల్లఱకును అధికారము కలదు ప్రపత్తికి ఫల విషయములో నియమము లేదు. ప్రపత్తికి విషయ నియమము మాత్రము కలదు. పరత్వాదులైదింటిలో - గుణములు పూర్ణముగా నుండు తావే విషయము. అర్చావతారమునందే అది ప్రసిద్ధము. సౌలభ్యాది గుణ పూర్తిచే ప్రపత్తికి నియత విషయమైన ఈ అర్చావతారము నందు ప్రపత్తిచేయు అధికారులు మూడు పక్షములు సాధనానుష్ఠా

నను చేయుటకు కావలసిన జ్ఞానము లేనివారు, ఉపాయాంతరములు స్వరూప విరుద్ధము లని, వానిని విడచివేయుటకు దగిన జ్ఞానాధిక్యము గలవారు, దేనినైనను క్రమముగా అనుష్ఠింపజాలక, పరమాత్మ యందు అధిక ప్రేమచే శిథిలమైన కరణములు గల భక్తి పరవశులు.

అస్మదాదులు మొదటి వర్గము. నాథ, యామున, యతివరాది పూర్వాచార్యులు ద్వితీయ వర్గము. ఆళ్వారాదులు తృతీయ వర్గము లు. తత్త్వమును బట్టి, అజ్ఞాన మేర్పడును. ఆత్మ తత్త్వమును బట్టి, జ్ఞానాధిక్యము కల్గును. భక్తి పారవశ్యము భగవ త్తత్త్వమును బట్టి లభించును ఈ మూడింటిలో - భక్తి పారవశ్యమే ప్రపత్తికి ముఖ్య హేతువు. ప్రాప్య ప్రాపకములు రెండును శ్రీమన్నారాయణుడే. అనుభవింపబడు విషయము ఒకే విధముగా నుండినను, దాని ననుభవించువారికి - ధారకము గాను, భోగ్యముగాను తోచుట యను స్వభావ విశేషములు కల్యాణ గుణము లందును, శరీరము లందును, తిరునామము లందును, వేణునాదము నందును స్పష్టముగా గన్పట్టును. సర్వావస్థలందును తనను రక్షించుచున్న తండ్రితో, పుత్రుడు - 'నన్ను నీవు రక్షింపవలయును' అని పత్రము వ్రాసి తీసికొనుట వలన, బంధుత్వమున కెట్లు భంగమో, అట్లే, ప్రపత్తికిని భంగము కలుగును. అయినచో - ఈ ప్రపత్తికి అసాధారణమైన ఆకార మేది యనగా - ఉపాయ వరణ స్వరూపమైన తనను ఉపాయ మని, ఉపాయ స్వీకార రూపమైన తనను తప్ప, ఇతర చేతన ప్రయత్నములను సహింపకుండుట - దీని కంగ మగును పరమాత్మకు శేషభూతుడ నని, అతని రక్షణమునకే ప్రాప్తుడ నని స్వస్వరూపము తెలిసికొనుట - అతడు చేయు రక్షణమును తొలగించుకొనకుండుటయే ఫల సిద్ధికి సాధనము. స్వయత్నము లేని వో-

భగవానుడు తానే రక్షించును. చేతనుడు స్వరక్షణ చింతను వీడ వలెను. పారతంత్ర్యము, శేషత్వము - అను ఆత్మ స్వరూపము నెఱిగిన వెంటనే - స్వయత్నము, స్వప్రయోజనములు తమంతట తామె తొలగిపోవును స్వాతంత్ర్యము, అనునది అవిద్యచే గల్గును కావున, ఇట్టి స్వాతంత్ర్య రూపమైన అహంకారమును సదాచార్యుని ఉపదేశముచే తొలగించుకొనవలయును. ఉపాయమునకు అధికారి యగు నపుడు - లక్ష్మణ, జటాయువుల వలె వర్తింపవలెను తనను తానే రక్షించుకొనుటకు తగిన శక్తిని సీత వలె విడువవలెను. తన ఉపాయమునకు విరోధములైనవానిని విడచునపుడు - అపహాస్యము చేయుదు రను లజ్జా భయములను ద్రౌపది వలె విడువవలెను. శేషి నెడబాయక, సకల కార్యములను అతడు పురికొల్పినట్లు చేయవలె నను ప్రీతి - లక్ష్మణునకు వలె కలుగవలెను. భగవద్విషయమందు ప్రావణ్యమధికము కాగా, ఆత్మగుణములు వృద్ధి యగును. పరమాత్మయందు భక్తి భావము కల్గియున్నవాడు - త దితరములందు భ్రాంతిలేనివాడై యుండును. ఆత్మగుణము లన్నింటిలో - శమము, దమము - అనునవి రెండును ముఖ్యములైనవి ఈ రెండును అలవడినవో - సంతుష్టుడైన ఆచార్యుడు - సంసార నివర్తక మగు తిరుమంత్రమును అర్థ సహితముగా నుపదేశించును. మనస్సున కది వశమగును. తిరుమంత్రమునకధీనమైన భగవంతుడు మోక్షము నిచ్చును. ఈ విధముగా ఉపాయముచే ఉపేయము సిద్ధించును. అట్టి ఉపాయము ఆచార్యుని వలన లభించును. ఆత్మ గుణములు ఆచార్యుని లభింపచేయును ఐశ్వర్య కాములకును, ఉపాసకులకును, ప్రపన్నులకును - ఈ శమ దమములు అత్యావశ్యకములు. ప్రపన్నునకు అనన్య భోగ్యత్వ మను ఒక స్వరూపము కలదు జ్ఞానాధిక్యముచేత ప్రపన్నులకు విషయ ప్రావణ్యము తెగి పోవును. భగవ ద్విషయములో స్వప్రవృత్తి కలుగుటకు కార

ణము - ఆ విషయ మందలి ప్రావణ్యమునకు కారణము - శేష శేషీ భావ సంబంధము. ఆ సంబంధము ఆత్మ యొక్క సత్త ననుసరించి యుండును కావున, సత్తా ప్రయుక్తము సంబంధము సంబంధ ప్రయుక్తము ప్రావణ్యము. ప్రావణ్యము యొక్క ఫలము భగవ దనుభవము. కనుక, భగవ ద్విషయమందు స్వప్రవృత్తి స్వరూపానుకూలమే ముఖ్య మని స్పష్టము.

-౨ ప్రాపకాంతర పరిత్యాగ ప్రకరణ సారము :-

ప్రపత్తి కంటెను ఇతరము లగు కర్మ జ్ఞానాదులు ఉపాయాంతరములు. ఈ ఉపాయాంతరములను విడచివేయుటకు కారణము - జ్ఞాన శక్త్యభావము కాదు. భగవంతునకు అత్యంత పరతంత్రముగా నుండుట - స్వరూప విరోధ మను కారణము స్వస్వరూప జ్ఞానము నెఱుగనివాని కది అపాయకరములు ఏల ననగా - అత్యంత పారతంత్ర్య మనెడు స్వరూపమునకు స్వప్రయత్న రూపమైన ఉపాయాంతరము బాధక మగును. కనుక, నిషిద్ధము.

ఉపాసనము ఉపాయము కాదు దానిలో గలిసిన భగవంతుడే ఉపాయము. ఉపాసనము శాస్త్ర విహిత మగుటచే భగవ త్పారతంత్ర్య స్వరూపానుగుణము కాజాలదు. ఉపాయాంతరములకు స్వరూప నాశకత్వము, అపాయకరత్వము, భయ జనకత్వము, శోక జనకత్వము, దుష్కరత్వము మొదలగు దోషములు కలవు ప్రపత్తికి అట్టి దోషములు లేవు. స్వతః పరిపూర్ణుడైన పరమాత్మ - మన మేమొసంగినను సంతసించును. అతడు అల్ప సంతుష్టుడు అందులకు ప్రమాణములు కలవు ఉపేయమైన వస్తువు - తానే ఉపాయముగ నుండుటచే, ఆ ఉపాయ వివరణ రూపమైన ఈ ప్రపత్తి చేయుటకు

సుఖముగా నుండును. పూర్వవృత్తము ననుసంధించి ప్రపత్తి చేసినచో - అది అపరాధ కోటిలో జేరును. చేతనుడు స్వయముగా చేయు ప్రపత్తి - ఉపాయము కాదు. ఇకను భగవంతుడు స్వయముగా చేయు అంగీకారమే ఉపాయము స్వతంత్రుడైన భగవంతునకు దాసులయందు పారతంత్ర్యము కలదు. చేతనులకు భాగవతుల యెడ నుండు పారతంత్ర్యము - ఔపాధికము. ఆ ఉపాధి నిత్య మగుటచే, తత్ప్రయుక్తమైన ఆశ్రిత పారతంత్ర్యము కూడ నిత్య మగును. తనకు తాను అన్వేషించు శేషత్వ మను శ్రేయస్సు - పాపము వలె ప్రతిబంధకము. పుణ్యము వలె పాపమును పరానుభవరోధకము. సువాసన గల వట్టివేరును విదలించకనే ఉపయోగించునట్లు, భగవంతుడు చేతనుని దేహముతో సహా ప్రేమించును. భగవంతుని విడచి, తనకు తాను మంచి చేసికొనుటకు ప్రయత్నించినచో, వినాశము తప్పదు. అందువలన, తనకు తానే నాశకు డగును. భగవంతుడు కారణము కాదు. సర్వేశ్వరుడు రక్షకుడు. అహంకార యుక్తుడుగ నుండి శబ్దాది విషయముల నపేక్షించుటయే చేతనుడు తనకు తాను వినాశము చేసికొనుట. అహంకారము అగ్ని స్పర్శ వంటిది. అందుకు ప్రమాణములు రామాయణాదులలో ననేకములు గలవు.

ప్రతికూల విషయ స్పర్శ - విషసర్పము వంటిది. అనుకూల విషయ స్పర్శ - విషాన్న భక్షణము వంటిది. వినాశహేతువులైన ఇట్టి విషయములలో ఆసక్తుడగుట - జలమని భ్రమించి, అగ్ని జ్వాలను మ్రింగుట, తాపము శమించుటకు పాము పడగ నీడను చేరుట వంటిది. అజ్ఞానియైన విషయాసక్తుడు పరమ నాస్తికునకు సోదరుడు. జ్ఞానియైన విషయాసక్తుడు - ఆస్తిక - నాస్తికుడు. పరమ నాస్తికుని మార్చగల మేమో గాని, ఆస్తిక నాస్తికుని ఏమాత్రము మార్చ జాలము.

భాగవతాపరాధులు దగ్ధ వస్త్రము వంటి వారు - వారి భక్త పచారులు నానావిధములు. భాగవత జన్మ నిరూపణము చేయుట - అర్చోపాదాన ద్రవ్య నిరూపణమున కంటెను క్రూరము. కనుక, ఆ యపచార మేర్పడిన వెంటనే, చండాలత్వము సిద్ధించును. దీనికి - త్రిశంకువు దృష్టాంతము జన్మతః చండాలుడు తరించు యోగ్యత కలదు కాని, భాగవతాపచారము గావించిన కర్మ చండాలునకు అట్టి యోగ్యతయే లేదు. జ్ఞానానుష్ఠానములు లేకున్నను, భగవంతుని సంబంధముచే ముక్తి లభించును. జ్ఞానానుష్ఠానములందు పరిపూర్ణుడైనను, భాగవతాపచారమును చేసినచో - వినాశమునకు హేతు వగును కావున, భాగవతాపచారము నిషిద్ధము.

జన్మానుష్ఠానముల వైశిష్ట్యము, న్యూనతయు - ఫలమునకు హేతువులు సాధనములు కావు. భగవంతుడే - అర్హుడైన, దాసునిగ నుండు భగవత్సంబంధము ఫలమునకు సాధనము. త దభావము వినాశమునకు సాధనము. శేషత్వమునకు అనుకూలమైన జన్మము ఉత్కృష్టము. శేషత్వమునకు ప్రతికూలమైన జన్మము నికృష్టము. ఎంతటి ఉత్కృష్టుడైనను, భగవద్భక్తి కలవాడు - విప్రుని కంటెను అధికుడు. ఉత్తమబ్రాహ్మణుగ నున్నను - భగవద్భక్తి లేనిచో - చండాలుని కంటెను హీను డగును. విలక్షణుల సంబంధముచే - నికృష్ట జన్మ దోషము హరించిపోవును. తనలో నుండు దోషము తొలగినచో, విలక్షణులతో సంబంధ మేర్పడును. దోష మనగా - అభిజాత్యాదుల చేత కలుగునట్టి అహంకారము. అట్టి విలక్షణులు - ఆచార్య తుల్యులుగను, తన కంటెను - భగవంతుని కంటెను శ్రేష్ఠు లని తెలిసినను భగవ దానుకూల్య మేర్పడినచో, సామాన్యులు చేయు విషయము కాని, భగవంతుడు ప్రేమతో విలంబము లేక నే స్వీకరిం

చును ధర్మవ్యాధుడు, విదురుడు, శబరి మున్నగువారు - ఇందులకు ప్రమాణభూతులు. భగవంతుడు, భాగవతులు - సజాతీయముగా నుండుట, లోక సంరక్షణార్థమే. భగవద్భక్తి లేని వేదాంతి-కుంకుమ పూవును మోయు గార్దభము వంటివాడు. అనన్యార్హ శేషత్వము, అనన్య శరణత్వము, అనన్య భోగ్యత్వము, సంశ్లేషమున సహించి యుండుట, విశ్లేషమున అసహిష్ణుత, తదేక నిర్వాహకత్వము - అను ఈ ప్రకారములచే అవిద్యాది దోషములు నిశ్శేషముగ తొలగి, పూర్ణమైన ఆత్మ స్వరూప జ్ఞానము సిద్ధించును. అహంకార రాహిత్యము చేతనే అవి సిద్ధించును. విషయ ప్రావణ్యమునకు అహంకారము జన్మ స్థానము గావున, దానిని విష సర్పము వలె భావించి విడువవలెను.

### ౩. మంగళా శాసన ప్రకరణ సారము ..

సకల మంగళములకును నివాసుడైన భగవంతుని సేవించి, మన అమంగళములను దూర దూరము జేసికొనుట యుక్తము. వానిచే రక్షణ పొందవలసిన మనము అతనిని రక్షణ కోరుటయే మంగళా శాసనము. భగవంతుడు రక్షకుడు మనము రక్షింపబడవలసిన వారము అని గ్రహించి యనుసంధించి, వాని కేమి వాటిల్లునో యని భావించుట ప్రేమ దశ. ఈ రెంటి యందును - జ్ఞాన దశలో రక్ష్య రక్షక భావము అట్లే యుండును. ప్రేమ దశలో భగవంతుని రక్షించుటకు మార్గము వెదకి, తడబడుటచేత, రక్ష్యత్వము భగవంతుని యందును, రక్షకత్వము తన యందును ఏర్పడును. దశరథ, సీతా, విశ్వామిత్రాదులు - అతి శంకచే పరమాత్మకు మంగళా శాసనము గావించుట - రామాయణమునందు కానవచ్చును.

మంగళాశాసనమున పెరియాళ్వారులు అనబడు విష్ణుచిత్తులు
అతి ముఖ్యులు. ఇతరు లెపుడో ఒకపుడు చేయగా, మంగళాశాసనము
పెరియాళ్వారులకు నిత్యము. భగవద్విషయమునకును, భాగవత
విషయమునకును మంగళాశాసనము గావించుటచేత, ఉభయ శేష
త్వమును వృద్ధి పఱచుటకు కారణమై, స్వరూపమును పల్లవింప
చేసినది. ఎప్పుడును నిద్రలేని నిత్యసూరులను జూచి, కన్ను మూయక,
మంగళాశాసనము చేయవలె నని పెరియాళ్వారులు పలుమారులు
వేడ్కొనియున్నారు. నిరతిశయ ప్రేమ యుక్తులైన ఆళ్వారులు -
మంగళాశాసనము ఆవశ్య కర్తవ్యముగ భాషించినారు ఇట్లు శేష
భూతులందఱకును ఆవశ్యకముగ నుండు ఈ మంగళాశాసనమే స్వరూ
పమునకు అనుగుణము భగవంతుని ప్రాప్తి సమీపించినపుడు - జ్ఞాన,
భక్తి, వైరాగ్యములు స్వయముగనే యుద్భవించును. అనుకూలురైన
సహవాసులచే ఇవి ప్రాప్తించును ఉపేయమైన కైంకర్యమును స్వభో
గ్యముగ తలంచువారు - ప్రతికూలురు. ఉపాయాంతరములలో
అవగాహించిన వారికి దేవతాంతర్యామియైన భగవంతుడు - ఉద్దే
శ్యుడు. కర్మ, జ్ఞాన, భక్తులు - ఉపాయములు. భగవంతుని అను
భవించుట - ఉపేయము. ఉపాయాంతరములను పరిత్యజించి, ప్రపత్తి
గావించిన స్వప్రయోజనపరులకు అర్చావతారమైన సర్వేశ్వరుడు -
ఉద్దేశ్యుడు. అతడే ఉపాయమని యెంచి, తాను చేయు ప్రపత్తి -
ఉపాయము దేహాత్మాభిమానులు, స్వతంత్రులు, అన్య శేషభూతులు
భగవన్నిగ్రహమునకు పాత్రులు. వీరి పుణ్య పాప కర్మములు అను
భవించియే తీర్చదగినవి. ప్రపత్తి నిష్ఠులైన వారికి లక్ష్మీ పురుష
కారముచేత ఇవి నశించును. సద్గుణ స్వభావ విశేషములు సదా

చార్యుని యనుగ్రహముచే పల్లవితమై, వృద్ధి నందును. ప్రపన్నుడు నివసించు ప్రదేశము ఆచార్య సన్నిధి, భగవత్సన్నిధియు. వచింప వలసినది ఆచార్య వైభవమును, స్వనికర్షమును, గురుపరంపరయు, ద్వయము సాధన రహస్యముగ అనుసంధించుకొనవలెను. పూర్వాచార్యుల శ్రీసూక్తులు, తదనుగుణానుష్ఠానము - పరిగ్రాహ్యాములు. అవైష్ణవ సహవాసము పరిత్యాజ్యము. ఆచార్య వచనముచే, శుశ్రూష చేయు విధము నెఱుగవలెను. శాస్త్రములచే, శ్రుతులచే భగవంతునకు చేయు కైంకర్యము నెఱుగవలెను. ఇష్టము చేయుట, అనిష్టమును వర్జించుట యని కైంకర్యము రెండు విధములు. వర్ణాశ్రమములకు, ఆత్మకు అనుగుణముగ ఇష్టాయిష్టము లుండును. ఆత్మస్వరూపమునకు ఉచితమైనవానిని చేయుట ఇష్టము. తద్విరుద్ధాచరణము అయిష్టము. కైంకర్యము భక్తి మూలముగ కలుగవలెను. లేక - శేషత్వమునకు భంగము కల్గునేమో యను భయముచే కలుగవలెను. కైంకర్యము చేయుటే మహాఫల మని యెంచి, ఇతర ఫలముల నపేక్షించకుండుట - కర్తవ్యము. కైంకర్యస్థితి యందు జ్ఞాన దశ, వరణ దశ, ప్రాప్తి దశ, ప్రాప్త్యనుభవ దశ యను నాల్గు దశలు గలవు. ఈ నాల్గు దశలు కల్గిన పిమ్మట, పరమ పురుషార్థమైన కైంకర్య దశ కలుగును. జ్ఞాన దశలో - తత్త్వ హిత పురుషార్థము లందు తనకు గల అజ్ఞానమును పలుమారులు విన్నవింపవలెను. ప్రాప్తి దశలో - ఓర్వజాలని తనమును తెలియజేయవలెను. అనుభవ దశలో - మనకు అనుభవించుటలో గల్గు ఆశను తెలుపవలెను. ఇట్లు చేయుట వలన, ఆయా దశలలో - స్వరూపమును ఉజ్జ్వలముగ చేయించిన ట్లగును. ప్రథమ దశలో - అజ్ఞానము తొలగును. రెండవ దశలో - అకించిన్యము తొలగిపోవును. మూడవ దశలో - ఆర్తి తొలగును. నాల్గవ

దశలో - అధివేశము తొలగును. ఈ నాల్గు దశల వలె శక్తి, అశక్తి, జ్ఞానము, అజ్ఞానము అను నాలుగు గుణములును గలవు.

ఆచార్యుని కల్యాణ గుణములు జ్ఞానమునకు విషయము. ఆచార్యుని ఉల్లాసకరముగ జేయు కైంకర్యము శక్తికి విషయము. శాస్త్ర నిషిద్ధము లగు అకృత్యములు చేయుట - అశక్తికి విషయము. అకృత్యకరణము, భగవ దపచారము, భాగవతాపచారము, అసహ్యా పచారము - అని, నిషిద్ధము నాల్గు విధములు.

అకృత్య కరణ మనగా - ప్రాణులను హింసించుట, అయోగ్యులను ప్రశంసించుట, పరస్త్రీలను పరిగ్రహించుట, పర ద్రవ్యాప హారణము చేయుట, అసత్య భాషణము, అభక్ష్య భక్షణము మొదలగునవి

భగవంతుని దేవతాంతరములతో సమముగ నెంచుట, రామ కృష్ణా ద్యవతారములలో - మనుష్య సజాతీయత్వ బుద్ధి చేయుట, వర్ణాశ్రమములకు తగని విధముగా భగవంతునకు పరిచర్యలు గావించుట, అర్చావతారములో ఉపాదాన ద్రవ్య నిరూపణము చేసి పరిహరించుట, స్వస్వాతంత్ర్య బుద్ధితో నుండుట, భగవంతునకు వ్యాజార్హ ములైన ద్రవ్యముల నపహరించుట - మొదలగునవి భగవ దపచారము లగును

భగవ ద్ద్రవ్యమును తానే సాక్షాత్తుగా నపహరించుట, అప హరించువారికి సహాయ పడుట, వారి నుండి కొంత ద్రవ్యమును యాచించి కాని, యాచింపక కాని, - గ్రహించుట, అహంకారముతో అర్థ కామ మూలముగ శ్రీవైష్ణవులకు చేయు విరోధము భాగవతాపచార మగును.

భగవద్విషయము, భాగవత విషయ మనియు, ఒక కారణము లేకయే అసూయ పొందుట, ఆచార్యుని యెడల అపచారపడుట, ఆచార్య భక్తులైన సబ్రహ్మచారులయందు అసూయ కల్గియుండుటయు - మొదలగునవి అసహ్యాపచారము లగును.

ఇది సంసార నివర్తక మగు ప్రతిపత్తితో - శ్రీమదష్టాక్షర మహామంత్రము నుపదేశించునతడే సాక్షాదాచార్య శబ్ద వాచ్యుడు. సంసార వర్ధక మంత్రము లుపదేశించువానికి ఆచార్య పూర్తి లేదు.

ఇతర ఫలములలో అతృప్తి, మోక్షసాధనాన్వేషణలో అభిరుచి, ఆర్తి, అత్యంతాచార్యాభిమానము, ఇతరుల ఉత్కర్షములో అసూయ లేనివాడు - సచ్ఛిష్యుడుగా పరిగణింపనగును.

మంత్రము, దైవము, ఫలము, తదనుబంధమైన అవిద్యాది నివృత్తి పూర్వక స్వస్వరూపావిర్భావము, ఇహలౌకిక భోగములు - సర్వము ఆచార్యుడే యని యనుసంధించు వాడు - సచ్ఛిష్యుడు కారణము - ఆచార్యుని ఉపకారమును స్మరించుటయే. ఆచార్య స్మృతితో ఆరంభమై, భగవంతుని గూర్చి కృతజ్ఞతా స్మృతితో పూర్తి యగును. సచ్ఛిష్యుడు సదాచార్యునకు, సదాచార్యుడు సచ్ఛిష్యునకును ప్రియ హితములను వర్తింపచేయగలరు. ఏనను, శిష్యుడు శేషభూతుడైనందున, శేషియైన ఆచార్యుని ప్రీతి సంపాదనలో అభినివిష్టుడై యుండును. ఆచార్యుడు పరమ కృపావంతుడైనందున, శిష్యుని ఉజ్జీవింపజేయుటకు ఉద్యుక్తుడైయుండును. కనుక, శిష్యునకు ప్రియకరమును, ఆచార్యునకు హితకరమును ప్రధాన మగును.

భగవంతునకు పరమ భోగ్యముగ నుండు ఆచార్య విగ్రహము నందు శిష్యుడు విశ్వాసముతో నుండుట, భగవంతునకు మిక్కిలి

సుఖోల్లాసకర మగుటచే, ఇది భగవ త్కైంకర్యముగ నుండును. ఆచార్యుని హృదయ సంతుష్టికై శిష్యుడు - భగవ ద్ద్రవ్యాపహారము, భగవ న్నివేదనము సడ్డగించుట, గురు మంత్ర దేవతా పరిభవమును పరిత్యజింపవలెను. సర్వ రక్షకుడైన భగవంతుని రక్షకత్వ క్రమము 'ప్రపన్న పరిత్రాణము' అను గ్రంథమున వివరింపబడినది. జీవించి యున్నంత కాలము శిష్యుడు ఆచార్యుని యందు కృతజ్ఞతానుసంధానమును కలిగి యుండవలెను. ఇతరుల దోషములను ఆచార్యునకు నివేదింపరాదు. దయానుగుణానుసంధానము వలన భయము తొలగును. భగవంతుడు రక్షకుడుగా నుండ, భయపడకుండుట ప్రవేశ కృత్యము. భగవంతుని పాదారవిందముల నాశ్రయించిన వారికి - భగవంతుడు అభయ మొసంగి, ఆయాశ్రితుని రక్షించును.

౯. త్రిపాద్విభూతి ప్రకరణ సారము -

భగవ ద్గుణానుసంధానము అభయ హేతువు. అజ్ఞాత సుకృతముల ద్వారా భగవంతు డనుగ్రహించు నని 'శ్రీవిష్ణుధర్మము అను గ్రంథములోని లలితా చరితమున స్పష్ట మగుచున్నది. భగవ న్నిర్హేతుక విషయీకారమును తెలిసినవారు - నమ్రులై భగవ ద్విషయమున ప్రీతిగలవా రగుదురు. అజ్ఞాత సుకృతము కల్గినను, అది పురుషార్థ హేతువు కాజాలదు. దానిని వ్యాజముగా గొని, యంగీకరించు భగవంతుడే పురుషార్థ హేతువు. భగవంతుడు భక్తుని నిర్హేతుకముగా అనుగ్రహించు నని, పాంచరాత్ర శాస్త్రములలో నొకటి యగు అహిర్బుధ్న్య సంహిత యందు చెప్పబడినది. భగవంతుని అనుగ్రహ శక్తి, తన దరి చేరినంతనే మోక్ష కాముడై, వివేకముతో - శాస్త్ర శ్రద్ధ గలవాడై, సదాచార్యుని జేరి, క్రమముగా సంసారము నుండి విముక్తిని పొంది, పరమ పదము జేరును. చేతనుని సుకృతమే భగవత్కృపకు కారణము. భగవంతుడు తన నుజ్జీవించు నను దృఢ

విశ్వాసము గలవానిని - ఆ స్వామి - తప్పక రక్షించును. అందటి విషయ మందును ఆ జగన్నాథుడు శ్రద్ధగొనును అంగువలన, ఆ భగవంతుడు అంతటను వ్యాపించి యున్నట్లు తెలియవలెను. ఆ పర మాత్మ సర్వ వ్యాపిగా నుండుట, వివిధ అవతారములు ధరించుట - చేతనుల నుజ్జీవింప జేయుటకే యని, జ్ఞానవంతులు గ్రహింపగలరు అది ఆ సర్వేశ్వరుని నిర్హేతుక జాయమాన కృపా కటాక్షము చేతనే గదా !

తామస భూయిష్ఠమైన భూమిపై నివసించునంత వఱకు - కర్మ స్మరణముచే భయము, కృపాస్మరణముచే అభయము కలుగుచుండుట పరిపాటి. అయినవో - ఆచార్యుని (గురువును) ఉపాయముగ స్వీక రించినవో, సదా నిర్భరుడై యుండవచ్చును నమ్మాళ్వారుల చరణ కమలముల నాశ్రయించి, మధుర కవులును, భగవ ద్రామానుజుల పాదారవిందముల నాశ్రయించి కూరత్తాళ్వారులును ధన్యత గాంచిన విషయము - జగద్విదితమే గదా ! కావున చేతనులకు ఆచార్యాభి మానము ఆవశ్యక మనుట స్పష్టము.

## ఉపసంహారం

పరమ కారుణికు లగు పిళ్ళలోకాచార్యుల వారు ఈ రీతిగా - అమూల్యములు, నిగూఢములు నగు తాత్త్విక విషయము లనేకము లను తమ అష్టాదశ రహస్య గ్రంథములలో నిబంధించి, లోకమునకు మహోపకారము గావించియున్నారు. కావున, అట్టి ఉపదేశములను నిరంతరము మననము చేసికొనుచు వాని వలన సత్ఫలములను పొందుట - సహృదయులెల్ల అకుమ పరమ ప్రయోజనకరమైయున్నది.

" శ్రీమత్యాశ్వయుజేమాసే తులాయాం శ్రవణోదితమ్
శ్రీకృష్ణపాదతనయం లోకాచార్య మహం భజే. "



# కవి పండిత పరిచయము

## డాక్టర్ : సముద్రాల రంగ రామానుజాచార్యులు



వీరి జన్మ స్థానము - గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, పెద్దవరము అగ్రహారము. జననము 5-8-1949. విద్యాభ్యాసము 1) హైస్కూలు చదువు S.S.L.C. వరకు ధూళిపూడిలో 2) తిరుపతి ప్రాచ్యకళాశాలలో విద్వాన్ (65-66) 3 కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమునందు - సాహిత్య విద్యా ప్రవీణ మరియు కర్ణాటక సంగీతము (66-71).

విశేష గురువులు సాహిత్యములో - శ్రీయుతులు పేరి శ్రీరామమూర్తి గారు, 'వేదార్థ విశారద' ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారు, కట్టి శ్రీరామమూర్తిశాస్త్రి గారు, శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులుగారు సంగీతములో - సుప్రసిద్ధ వాయులీన విద్వాంసులైన తిరుపతి పొన్నారావుగారు వేదాంత దర్శనమున - శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు

ఉద్యోగములు 1) 1971-72 సంవత్సరములలో - ద్వారకాతిరుమల దేవస్థానమునకు చెందిన హైస్కూలులో సంస్కృత పండిత పదవి 2. కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠము సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా 1973 జనవరినుండి కొనసాగుచున్నది

ఉపాధులు . సాహిత్య విద్యా ప్రవీణ, M.A. (వ్యాకరణము), Ph.D. అలంకార శాస్త్రము, సంగీత సాహిత్యములందును, నాటక రచన యందును, అభి

విషయమునందును అభిరుచి, అభినివేశము. భారతీయ దర్శనములోని విశేషములను గ్రహించుటయందును, విశిష్టాద్వైత వేదాంత వైశిష్ట్యమును ఆకళించుకొనుట యందును విశేష కృషి.

రచనా వ్యాసంగము . 1) సంస్కృత సాహిత్య శాస్త్ర ప్రాముఖ్యమును గురించియు, జైన బౌద్ధాది నాస్తిక దర్శనములలోని యంశములను గురించియు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలోను, మఱి కొన్ని సభలలోను వీరు అనేక పత్రములను సమర్పించిరి. 2) దార్శనిక విషయములకు, వేదాంత విషయములకు సంబంధించిన వీరి వ్యాసము లనేకములు - పత్రికలందును, విశేష సంచికలందును ప్రకటింపబడినవి. 3) భగవద్రామానుజుల వేదార్థ సంగ్రహమునకు ఆంధ్రానువాదమే గాక, త ద్వివరణము కూడ వీరిచే విరచింపబడినది. ఈ గ్రంథము - పశ్చిమ గోదావరి జిల్లా మండపేటలో గల మెహర్ చైతన్య నికేతన్ ట్రస్టు వారు 1990 లో ముద్రించి, ప్రకాశింపజేసిరి. 4) 'హరిభక్తి సుధాకరము' అను నారదీయ పురాణాంతర్గతమైన 20 అధ్యాయముల గ్రంథమునకు వీరు తెలుగు వివరణమును వ్రాయగా, దానిని కొవ్వూరులో గల గౌడీయ మఠమువారు 1991 ఆగష్టులో ముద్రించి, ప్రకటింపజేసిరి 5) విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యసంగ్రహరూపమైన 'వేదాంత కారికావళి' అను సంస్కృత గ్రంథమునకు వీరు ఆంధ్రానువాదము, 'సుజన తోషిణీ' వ్యాఖ్యలు వ్రాయగా, గ్రంథమును మండపేటలో గల చైతన్య నికేతన్ ట్రస్టువారు 1922 జూలైలో ముద్రించి ప్రకాశింపజేసిరి. వీరిచే రచింపబడి, నేటివఱకు అముద్రితములుగా నున్న గ్రంథము లివి. 1) చైతన్య వైభవమ్ (సంస్కృత నాటకము ఇయ్యది - పూరి, మద్రాసు, రాజమండ్రి మొదలగు పట్టణములలో విద్వాంసులచే ప్రదర్శింపబడినది ) 2) శ్రీనాథుని పల్నాటి వీర చరితమునకు - మాత్రాఛందస్సులో సంస్కృతానువాదము. 3) 'వైకుంఠ నాథ విలాసము' అను సంస్కృత శ్లోక ఆంధ్ర గేయ బద్ధమైన ఖండ కావ్యము. 4) భారతీయ వేదాంత పారిభాషిక పద కోశము (సంస్కృతాంధ్రములలో రచింపబడినది.) 5) జైన బౌద్ధాది అవైదిక దర్శన కోశము (సంస్కృతాంధ్రాంగ్లములలో ) 6) వైష్ణవ విశ్వాస ప్రాదుర్భావ వికాసములు (చారిత్రక గవేషణము) తెలుగులో ఇంకను వివిధ విషయములపై వ్రాయబడిన రచనలు మఱికొన్ని రేడియో ప్రసంగములు - ఆకాశవాణి విజయవాడ కేంద్రము ద్వారా వీరిచే అనేక

సంస్కృత ప్రసంగములు చేయబడినవి ప్రస్తుతము సంస్కృత పరిచయ కార్యక్రమము నిర్వహింపబడుచున్నది.

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు



వీరి జననము 1-7 1930. జన్మస్థానము - తిరుపతి. జననీ జనకులు - జానకమ్మ, వేంకట నరసింహాచార్యులు గారలు విద్యాభ్యాసము - నెల్లూరు నందలి వేద సంస్కృత కళాశాలలో ఉభయ వేదాంతాధ్యయనము - పితృపాదుల సన్నిధిలో. డిగ్రీలు - 1) విద్వత్ ప్రవీణ 2) భాషా ప్రవీణ 3) ఎం. ఏ. (సంస్కృతము.)

ఉద్యోగము — నెల్లూరులో - వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిర కాలము పని చేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించిరి.

రచనలు :- (ముద్రితములు) 1) శుక సందేశమ్ (సంస్కృత కావ్యమ్) 2) సంస్కృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) 3) వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) 4) శ్రీమన్మహాశిలగిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము. 5) స్వాగతమ్ (ఖండ కావ్యము) 6) హాహా హూహూ (విశ్వనాథ సత్యనారాయణగారి నవలకు సంస్కృతానువాదము) 7) శ్రీభాష్య సారము - 1, 2 భాగములు 8) శ్రీ భగవద్గీతామృతము - 1, 2, 3 భాగములు 9) శ్రీ గోదా సహస్ర కమలమాలికా (శ్రీ గోదా సహస్ర నామ స్తోత్రము) 10) శిక్షావల్లి (చంద్రికా వ్యాఖ్యానముతో 'భక్తామృతమ్' మేగజైనులో

అముద్రితములు .- 11) రత్నమాలా (డాక్టర్ : బెజవాడ గోపాలరెడ్డిగారి వచన కవితకు సంస్కృతానువాదము) 12) కర్పూరి (ఆకిరి శ్రీరామశర్మగారి ఆంధ్ర

పద్య కావ్యములకు సంస్కృత విద్యాపు వాదము) 13) బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన, సంవాద రూపమున బ్రహ్మ సూత్రార్థ వివరణము వలుపుట) 14) ఉపనిష చ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతి పదార్థ తాత్పర్యములు గలది ఛాందోగ్య, బృహదారణ్యకములు మినహా.)

## శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు



జననీ జనకులు - నాచ్చియా రమ్మ, అప్పలాచార్య దంపతులు జన్మ తేది 16-2-1933 జన్మస్థాన గ్రామము - వేములవాడ (పల్లి) కరీంగర్ జిల్లా. విద్యాభ్యాసము - వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల సీతారాంబాగ్, హైదరాబాద్ చదివిన శాస్త్రములు. 1 వేదాంతము 2 వ్యాకరణము 3 న్యాయము 4 సాహిత్యము శాస్త్రాచార్యులు శ్రీ ఉ వే శ్రీమాన్ కోయిల్ కందాడై అప్పన్ శఠకోప రామానుజాచార్యస్వామి వారు [సీతారాంబాగు సంస్కృత కళాశాలా సంస్థాపకులు, సుప్రసిద్ధ చతుశ్శాస్త్ర పండితులు.] ఉత్తీర్ణత నొందిన పరీక్షలు - 1. నవీన తర్క విద్వాన్ (మైసూరు విద్వన్మహా సభ మైసూరు ప్రభుత్వము) 2 విశిష్టాద్వైత వేదాంత విద్వాన్ (వేద శాస్త్రాగమ విద్వత్ సదస్సు-తిరుమల) 3 సాహిత్య విద్యా ప్రవీణ. (ఆంధ్ర కళా పరిషత్తు - వాల్తేరు.) 4 వ్యాకరణ బి. ఓ. యల్. 5. సాహిత్య రత్న (ప్రయాగ హిందీ విద్యాలయ) 6. తెలుగు బి ఓ. యల్ 7. ఎం. ఏ (తెలుగు) 8. ఎం. ఏ. (సంస్కృతము.) [4, 6, 7, 8 సంఖ్యలు గల డిగ్రీలు హైదరాబాదులో గల ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించినవి.]

సన్మానములు - బిరుదములు 1) మైసూరు విద్వన్మహాసభ వీరిని నవీన తర్క విద్వాంసులుగా పరిగణించి, మహారాజావారి ద్వారా సన్మానము గావించినది. 2) వేదశాస్త్రాగమ వీరిని విశిష్టాద్వైత వేదాంత విద్వాంసులుగా పరిగణించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 3) హైదరాబాదులోని 1. సుర భారతి, 2. సంస్కృత భాషా ప్రచారిణీ సభ - అను సుప్రసిద్ధ సంస్కృత సంస్థలు రెండును వీరిని మహా విద్వాంసులుగా సంభావించి, సన్మానించినవి 4) ఆంధ్ర ప్రదేశ్ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వీరిని గ్రంథ సంపాదకులుగా భావించి సన్మానించినది. 5) విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తక సంఘము విజయవాడ శాఖవారు వీరిని విశిష్ట మహా విద్వాంసులుగా తలంచి సన్మానించినది. 6) నడిగడ్డపాలెమున గల శ్రీమదుభయ వేదాంతాచార్య పీఠము వీరిని మహా విద్వాంసులుగా భావించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 7) వేములవాడ, సిద్దిపేట, యాదగిరి, పాలకొల్లు, నరసాపురము, కోరుకొండ, సింహాచలము, భద్రాచలము మొదలగు పట్టణములలో గల దేవస్థానము లనేకములు వీరిని మహోపన్యాసకులుగా భావించి, సన్మానించినవి. 8) విజయవాడ, ఉయ్యూరు, మచిలీపట్టణము, రాజమండ్రి, గుంటూరు, పాలకొల్లు, పెంటపాడు, విశాఖ పట్టణము, విజయ నగరము మొదలగు అనేక పట్టణములకు సంబంధించిన సాహిత్య ఆధ్యాత్మిక సంస్థ లనేకములు వీరి ఉపన్యాసము లేర్పరచి, 'ప్రవచన వాచస్పతి', 'మధురోపన్యాసక', 'విశద వాక్శిఖామణి' ఇత్యాది బిరుదులతో గూడ వీరిని సన్మానించినవి. 9) హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరములందును ఎల్లప్పుడు ఏదియో యొక సంస్థ పక్షమున, రామాయణ - మహాభారత - భగవద్గీతాదులను, ముముక్షుప్పడి, గీతాభాష్యము, తిరుప్పావై, భగవద్విషయము మొదలగువానికిని సంబంధించిన వీరి ప్రసంగము జరుగుచుండును 10) హైదరాబాదులోని జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు భవనమున - ప్రతి ఆదివారము వీరి భగవద్విషయ ప్రవచనము, శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామివారి నియమనమున జరుగుచున్నది 11) హైదరాబాదు రేడియో కేంద్రమున సుమారు 35 సంవత్సరముల నుండి వీరి సంస్కృత కావ్య గానముకాని, సంస్కృత కావ్య నాటక సంబంధము లగు ప్రసంగములుకాని ప్రసార మగుచున్నవి 11 సంవత్సరములనుండియు వీరి సంస్కృత పాఠములు కూడా ప్రసారము చేయబడుచున్నవి ఇది రేడియోవారి సన్మానము

వృత్తి - హైదరాబాదు నగరమునందలి శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో 1952 నుండి పీఠ - న్యాయ శాస్త్రాచార్యులుగా అధ్యాపనము చేయుచున్నారు

రచనలు :- 1. భాగవత రత్నములు [సురభారతి ప్రచురణ] 2 అలంకార మకరంద [ఆంధ్ర ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగార ప్రచురణ] 3. వివిధ గ్రంథములకు పీఠికలు, కవితా ఖండికలు, వ్యాసములు అనేకములు

డాక్టర్ : చింతాపట్టణం శ్రీరంగాచార్యులు



వీరి జననము 6-10-1935 జన్మ స్థానము - సిరిపురము హుజూర్ నగర్ తాలూకా, నల్లగొండ జిల్లా. జనని జనకులు - తాయారమ్మ వేంకటాచార్యులు గారలు విద్యాభ్యాసము - ప్రాథమిక దశలో వీరు తమ తండ్రిగారి వద్ద శ్రీవైష్ణవ సంప్రదాయము నెరింగిరి ఉన్నత విద్యాభ్యాసము - సూర్యాపేట ప్రభుత్వోన్నత పాఠశాలలో 1955 వ సంవత్సరమున మెట్రిక్యులేషన్ (H.S C) పరీక్షలో ఉత్తీర్ణత. ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఇంటర్ మీడియేట్ 1958లో బి ఏ 1961లో వరంగల్లులో గల ప్రభుత్వ శిక్షణాలయమున - బి. యిడి 1963లో ఉస్మానియా విశ్వవిద్యాలయమున 1966 లో ఎం ఏ అనంతరము ఉద్యోగ నిర్వహణము.

అధ్యాపక వృత్తిలో 16 సంవత్సరములు. జూనియర్ లెక్చరర్‌గా 10 సంవత్సరములు 1-1-81 నుండి 1986 మే వరకు జడ్చర్లలో గల డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా, 1987 జూన్ నుండి 1989 జూన్ వరకు - మహబూబ్ నగరులో గల

ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందు ఆంధ్రోపన్యాసకులుగా పని చేసి, అటనుండి 1989 జూలైలో - నిజామాబాదు జిల్లా ఆర్మూరు నందు గల ప్రభుత్వ ఆర్ట్స్ మరియు సైన్సు కళాశాలలో - 1989 జూలై నుండి ఆంధ్రోపన్యాసకులుగా పని చేయుచున్నారు

పరిశోధనలు - 'గుదిమెళ్ళ రామానుజాచార్యుల ఖండకావ్యములు - సమగ్ర పరిశీలనము' అను అంశముపై వీరు పి.హెచ్.డి. పట్టమునకై పరిశోధన వ్యాసమును రచించి, 1985 ఆగష్టులో ఉస్మానియా విశ్వ విద్యాలయమునకు సమర్పించి, 21-3-1985 తేదీన మౌఖిక పరీక్షనంతరము 'డాక్టరేట్' పట్టమును పొందిరి.

విశేషాంశములు :- ఆంధ్రభూమి, మూసి, జనధర్మ, ఒక్కవాణి, భక్తి నివేదన మున్నగు పత్రికలలో - వివిధాంశములపై వీరి కవితలు వ్యాసములు కొన్ని ప్రచురితములైనవి. వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయ కవితలు అనేకములు - హైదరాబాదు రేడియో కేంద్రమునుండి ప్రసారమైనవి. సంగీత సాహిత్యములందును, భాగవత త్యాగరాజ సంకీర్తనలందును వీరికి ఆసక్తి మెండు

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



వీరి జననము 1914 జన్మస్థానము - జగ్గయ్యపేట ప్రస్తుత నివాసము - విజయవాడ. వీరు సంస్కృతాంధ్ర భాషలలో పండితులు. తర్క, వ్యాకరణ, అలంకార శాస్త్ర వేత్తలు సంగీత విద్యా నిపుణులు. వాసికెక్కిన విద్వాంసులు కవితా ధురంధరులు. ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయన తత్పరులు 'సంగీత సాహిత్య కళానిధి' బిరుదాంచితులు.

త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, విశాల మోక్షము మున్నగు వీరి తెలుగు కావ్యములును, 'నరసింహ తాండవమ్' అనునొక హరికథయు, ఖూ ప్రశంస, చంద్రకళా షోడశకళ్యము, సౌశా చరితమ్, రామాయణ కథాయాం ద్వ్యపదేశాః మొదలగు వీని గ్రంథములును - పండిత ప్రశంసలకు పాత్రములైనవి. క్షేమేంద్రుని కళా విలాసమున కనువాదము, సింహావలోకనము (సంస్కృతము), శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము (హరికథలు), విప్రనారాయణ (యక్షగానము) మున్నగువవి ముద్రణ భాగ్యమును పొందవలసి యున్నవి.

నాట్యకళ, గానకళ మొదలగు పత్రికలలో - వీరి సంగీత సాహిత్య వ్యాసము లనేకములు ప్రకటింపబడినవి. త్యాగరాజు, రామదాసు, గోదాదేవి మొదలగు వీరి హరికథా కాలక్షేపములు శ్రోతలను తన్మయుల గావించుచు, కొనియాడ బడుచున్నవి.

ఫిదేలు వాద్యములో ఆపేటు శిలాచలము పెద్ద పెద్ద నగరములలో వీరి ప్రతిక్రియ వాద్యములు, సోలో కచేరీలు అనేకములు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున వీరు పెక్కు తావులలో సంగీతమును గూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1982 డిసెంబరులో - మద్రాసు మ్యూజిక్ అకాడమీలో - సంగీతోత్సవమున విద్వత్పరిషత్తులో - సంగీతమును గురించి తమిళ భాషలో ప్రసంగించి, శ్రోతల యొన్ననలను బొంది, ఘన సన్మానము నందిరి.

కపలేశ్వర పురము జమీందా రగు శ్రీ S. B P. B. K. సత్యనారాయణ రావుగారి కోరికను పురస్కరించుకొని మాలవికాగ్నిమిత్రామ్, మేఘ సందేశమ్, వాల్మీకి రామాయణమ్ కథలు, రఘువంశానుసారముగా రామ చరితమ్, త్యాగరాజ చరితమ్ - మొదలగు పండ్రెండు హరికథలను వీరు సంస్కృతమున రచించిరి. ఇవి అనితర సాధ్యములు.

## డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు

జననము - 3-6-1959 జన్మ స్థానము - కృష్ణాజిల్లా, చిన శ్రీరంగపురము జననీ జనకులు - వేంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు గారలు విద్యాభ్యాసము .- కృష్ణాజిల్లా - జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో

పదియవ తరగతి వరకు, అనంతరము 1967 వరకు ఉన్నిగూడూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము - సాహిత్య విద్యా ప్రవీణలో ఉత్తీర్ణత. 1981 నుండి 1983 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్వ దర్శన విభాగమున అధ్యయనము, సంస్కృతములో ఎం. ఏ. డిగ్రీ స్వీకరణము.

పరిశోధన వ్యాస రచనలు :- (1) 1984 నుండి తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమునందు విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము. శ్రీవాత్స్య కులు, చతుశ్శాస్త్ర పండితులు - 'తర్క వాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతి బహుమాన గ్రహీతలు నగు శ్రీమాన్ N S రామానుజతాతాచార్యుల వారి పర్యవేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరిశోధన వ్యాసమును రచించి, Ph. D. డిగ్రీ నిమిత్తమై రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠమునందు 9-10-1986 తేదిన సమర్పించిరి (2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు జైపూరునందు - 'ఆత్మ విచారము' అను పరిశోధక వ్యాసమును సమర్పించిరి. (3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో - 'భక్తిః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధక వ్యాసమును సమర్పించిరి.

పరిశోధనము - 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' 'ఆంధ్రుల - విశిష్టాద్వైతము' అను విషయముపై ఇటీవల పరిశోధన చేసిరి

సంపాదకత్వము - శ్రీమాన్ [illegible] కృష్ణమాచార్యులవారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ' మను పేరుతో, టి టి డి వారి ఆర్థిక సహాయముతో 1986 లో ప్రకటించిరి

వ్యాఖ్యానము - శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు వ్యాఖ్యానమును రచించిరి.

అనువాదము - (1) భక్తిసిద్ధాంతః (2) అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్ (3) సవిశేషం బ్రహ్మ (4) లక్ష్మీ పురుషకార వైభవము (5) విశిష్టాద్వైతమ్

(6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాఖ్యానములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి.

సంస్కరణము :- (1) శ్రీనివాస రాఘవ విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సంగ్రహః' (2) శ్రీ వార్ష్ణేయ వరదాచార్య విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సారః' (3) శ్రీకృష్ణ తాతాచార్య విరచిత మగు 'తత్త్వ చంద్రికా' అను సంస్కృత గ్రంథములు వీరిచే సంస్కరింపబడి, ముద్రణకు సిద్ధమై యున్నవి. (4) మదపూరం శ్రీనివాసాచార్యులవారి జ్ఞాన రత్న ప్రకాశికా (5) షష్ఠి దర్పణమ్ అను సంస్కృత గ్రంథములును (6) న్యాయామాత్మా భాష్యమ్ (7) 'శరణాగతి సిద్ధార్థ విచారః' (8) 'ప్రపత్త్యనుపాయత్వ విచారః' అను సంస్కృత ప్రకరణ గ్రంథములును (9) శుద్ధసత్త్వ రామానుజాచార్యులవారి 'రహస్యత్రయ మీమాంసా భాష్యమ్' అను సంస్కృత గ్రంథమును - ఇపుడు వీరిచే సంస్కరింపబడుచున్నవి

ఆంగ్ల వ్యాఖ్యానములు - (1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డ్ (2) గాడ్ అండ్ సోల్ (3) డాక్ట్రిన్ ఆఫ్ విశిష్టాద్వైత - అనునవి వీరి ఆంగ్ల వ్యాఖ్యానములు.

ఉద్యోగము - రాష్ట్రీయ సంస్కృత సంస్థానము - న్యూఢిల్లీ వారిచే నిర్వహింపబడిన ఇంటర్వ్యూలో వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి. ఇపుడీ విద్యా సంస్థ - 'రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠ' మను పేర వ్యవహరింపబడుచు, విశ్వ విద్యాలయ ప్రతిపత్తిని పొందియున్నది.



# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 18 | యనగల | యనంగ |
| 10 | 10 | శుభమంగళలు | శుభమంగళము |
| 12 | 3 | ల్యూహరూపము | వ్యూహరూపము |
| 12 | 21 | భగవాపుదే | భగవానుదే |
| 11 | 10 | అనుఖ్యాతములచే | అనుఖ్యాతముచే |
| 13 | 17 | పద్మములదు | పద్మమందు |
| 13 | 20 | ఈశస్వర్శ | ఈశ్వరస్వర్శ |
| 17 | 15 | క్షీరస్వరూపము | క్షరస్వరూపము |
| 17 | 17 | క్షీరస్వరూపము | క్షరస్వరూపము |
| 20 | 20 | ఎ పాషాణ | ఏ పాషాణ |
| 31 | 15 | శ్రద్టాళువులై | శ్రద్ధాళువులై |
| 38 | 15 | గటుము | గట్టుము |
| 38 | 19 | అందుకొని | అలదుకొని |
| 41 | 6 | క్రీత యే | క్రీతయే |
| 41 | 9 | శెషభూతుదు | శేషభూతుడు |
| 41 | 15 | ఒన్నాను | ఉన్నాడు |
| 42 | 19 | నివృత్త్మనే | నివృత్యాత్మనే |
| 43 | 23 | సిద్దార్థకాదుల | సిద్ధార్థకాదుల |
| 46 | 22 | అనుగ్రహమును | అనుగ్రహము |
| 58 | 2 | తొటికిలాడగా | రొటికిసలాడగా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 58 | (చిపం) | సమర్పించే | సమర్పించి |
| 59 | 4 | ఆనంది ఎజేసి | ఆనందింపజేసి |
| 59 | 20 | భగవదాదాధనోయుక్త | భగవదారాధనోపయుక్త |
| 60 | 7 | పానములను | పాదములను |
| 61 | 16 | ఫలాధ్యాయమున | ఫలాధ్యాయమునకు |
| 61 | 16 | సంబంధించినను | సంబంధించిన |
| 62 | 3 | పేరలు | పేరులు |
| 63 | 25 | తెలిసికొనుట | తెలిసికొనుట. |
| 66 | 9 | విశెషమును | విశేషమును |
| 71 | 10 | యన్నపృథివీ శరీ౦ | యాన్యపృథివీశరీరం |
| 72 | 25 | చేతనా చేతనము | చేతనా చేతనములు |
| 72 | 25 | వారికి | వానికి |
| 76 | 4 | విశెషణముగా | విశేషణముగా |
| 77 | 10 | విశెషములే | విశేషముల్ |
| 78 | 9 | విశెషము | విశేషము |
| 81 | 9 | అవకాశం | అవకాశము |
| 83 | 4 | అప్రీ? | అప్రీతి |
| 84 | 2 | అ ౖ | అన్ని |
| 86 | 3 | యున్నాము. | యున్నాము. |
| 94 | 21 | సమాధానము | సమాధానము. |
| 109 | 14 | రూపమునను | రూపముగను |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 109 | 21 | శెషి | శేషి |
| 111 | 15 | ముక్తిద్వాపి | ముక్తిదాంపి |
| 118 | 20 | విశెష | విశేష |
| 120 | 21 | సందెహా | సందేహా |
| 151 | 6 | జగజ్జన్మ | జగజ్జన్మ |
| 172 | 15 | సంచరించట | సంచరింపను |
| 179 | 6 | స్వర్శనమం | స్పర్శనము |
| 179 | 12 | లేదని | లేవని |
| 186 | 16 | సర్వవ్యాప్తి, | సర్వవ్యాపి. |
| 191 | 13 | విరు | [illegible] |
| 192 | 21 | విరు | [illegible] |
| 193 | 12 | కి శ | క్రీ. శ |
| 194 | 2, 3 | నాయకువిశము | [illegible] |
| 199 | 4, 5 | భగవత త్త్వము | భగవత్తత్త్వము |
| 202 | 14 | ప్రాతిపాదించిన | ప్రతిపాదించిన |
| 209 | 7 | స్వరూపమైని | [illegible] |
| 211 | 14 | కష్టపాదులు | కృష్ణపాదులు |
| 212 | 2 | కొండె | కొంఠ |
| 213 | 11 | నోష్ఠిక | నైష్ఠిక |
| 235 | 22 | రూపమ్మై | రూపమై |
| 237 | 7 | యున్నది. | యున్నవి. |